పో ష కు లు 116 రు



శ్రీ మానేపల్లి సూర్యమాణిక్యంగారు

శ్రీ పొన్నా సత్యనారాయణగారు

భీమవరం

## మహాభారత ప్రచారక సంఘము

కా ర్య ద ర్శి :

జి. సిహెచ్. వెంకటస్వామి

కో శా ధి కా రి :

మాజేటి గోవిందరాజులు

# కృతజ్ఞతలు



## జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి

ఈ దేశమున జన్మించిన ప్రతి ప్రాణికి తన జన్మభూమిపై కన్నతల్లిపై అభిమాన గౌరవము లుండుట సహజము. ఇది ఆర్షభూమి. ఈ ఆర్షభారతములో ఆవిర్భవించిన వారందరూ ఈ గౌరవాభిమానములను ప్రదర్శించుచునే యున్నారు. ఇకముందు కూడ ఈ దేశమున నీ సంప్రదాయము వర్ధిల్లుచునే యుండుననుటకు ఈసంచిక ప్రచురణను తమ తల్లిగారు యేడిద గంగమ్మగారి పేర ప్రకటింపగోరిన శ్రీ యేడిద సత్యనారాయణ యేడిద నరశింహామూర్తి సోదరుల ఉదారదృష్టియే తార్కాణము.

భారతమును గౌరవభావముతో పఠించుటకంటె జన్మభూమిపై గౌరవముంచుపని వేరొకటి లేదు. భారత మహాగ్రంథమే ఈ దేశమునకు భారతదేశమను పేరు తెచ్చినది. ఆ విషయమును గ్రహించిన విజ్ఞులు కనుకనే శ్రీ యేడిద సత్యనారాయణ, యేడిద నరశింహామూర్తి సోదరులు ఆంధ్రమహాభారత పఠనముతో తృప్తిపడక సంచికను తమ మాతృస్మృతిగా ప్రచురింపించి తమ ఆస్తికతతో ఔదార్యమునుకూడ ప్రకటించుకొనిరి. వారి కుటుంబములనూ వారినీ పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్య యశశ్రీ సముపేతులను జేయుగాక.

కార్యదర్శి
మహాభారత ప్రచారక సంఘము

# వి ష య సూ చి



నారాయణం నమస్కృత్య, నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం, తతో జయము దీరయేత్॥

# విరాటపర్వము

కథం విరాటనగరే మమ పూర్వపితామహాః
అజ్ఞాతవాసముషితా దుర్యోధనభయార్దితాః.
పతివ్రతా మహాభాగా సతతం బ్రహ్మవాదినీ
ద్రౌపదీ చ కథం బ్రహ్మన్నజ్ఞాతా దుఃఖితాఽవసత్
యథా విరాటనగరే తవ పూర్వపితామహాః
అజ్ఞాతవాసముషితా స్తచ్ఛృణుష్వ నరాధిప.
తథా స తు వరాంల్లబ్ధ్వా ధర్మో ధర్మభృతాం వరః
గత్వాఽఽశ్రమం బ్రాహ్మణేభ్య ఆచఖ్యౌ సర్వమేవ తత్.
కథయిత్వా తు తత్సర్వం బ్రాహ్మణేభ్యో యుధిష్ఠిరః
అరణీసహితం తస్మై బ్రాహ్మణాయ న్యవేదయత్
తతో యుధిష్ఠిరో రాజా ధర్మపుత్రో మహామనాః
సంనివర్త్యానుజాన్ సర్వానితి హోవాచ భారత.
ద్వాదశేమాని వర్షాణి రాజ్యవిప్రోషితా వయం
త్రయోదశోఽయం సంప్రాప్తః కృచ్ఛ్రాత్ పరమదుర్వసః.
స సాధు కౌంతేయ ఇతో వాసమర్జున రోచయ
సంవత్సరమిమం యత్ర వసేమావిదితాః పరైః.
తస్యైవ వరదానేన ధర్మస్య మనుజాధిప
అజ్ఞాతా విచరిష్యామో నరాణాం భరతర్షభ
తత్ర వాసాయ రాష్ట్రాణి కీర్తయిష్యామి కానిచిత్
రమణీయాని గుప్తాని తేషాం కించిత్ స్మ రోచయ
సంతి రమ్యా జనపదా బహ్వన్నాః పరితః కురూన్
పాంచాలాశ్చేదిమత్స్యాశ్చ శూరసేనాః పటచ్చరాః.
దశార్ణా నవరాష్ట్రశ్చ మల్లాః శాల్వా యుగంధరాః
అకుంతిరాష్ట్రం చ విపులం సురాష్ట్రావంతయస్తథా.
ఏతేషాం కతమో రాజన్ నివాసస్తవ రోచతే
యత్ర వత్స్యామహే రాజన్ సంవత్సరమిమం వయం
శ్రుతమేతన్మహాబాహో యథా స భగవాన్ ప్రభుః
అబ్రవీత్ సర్వభూతేశస్తత్ తథా న తదన్యథా
అవశ్యం త్వేవ వాసార్థం రమణీయం శివం సుఖం
సమ్మంత్ర్య సహితైః సర్వైర్ద్రష్టవ్యమకుతోభయైః

---

పతివ్రతా శిరోమణి ద్రౌపదీ, ప్రపితామహులైన పాండవులూ ప్రచ్ఛన్న వేషాలు ధరించి విరాటనగరంలో ఏవిధంగా గడిపినదీ విన కోరిక ప్రకటించిన జనమేజయునికి వైశంపాయనుడు అజ్ఞాతవాసానికి సంబంధించిన విరాటపర్వం విని పిస్తున్నాడు.

యక్షునివల్ల వరాలు పొంది తిరిగి వచ్చిన ధర్మరాజు ఆ ఆశ్రమాలలోని బ్రహ్మణులందరికీ అరణులు అర్పించి వారికి విషయమంతా చెప్పి సోదరులను పిలిచి - మనం రాజ్యంవదలి పన్నెండేళ్ళు అయింది. ఇక పదమూడవ సంవత్సరం గడపాలి. అజ్ఞాతవాసం సాగించాలి. ఇది పరమ దుఃఖప్రదమైనది - అని అర్జునునివైపు తిరిగి ఈ సంవత్సరకాలంలో ఇతరులకు తెలియకుండా మనం నివసించడానికి యోగ్యమైన ప్రదేశం ఏదో చెప్పమన్నాడు.

మత్స్యో విరాటో బలవానభిరక్షేఽథ పాండవాన్
ధర్మశీలో వదాన్యశ్చ వృద్ధశ్చ సతతం ప్రియః
విరాటనగరే తాత సంవత్సరమిమం వయం
కుర్వంతస్తస్య కర్మాణి విహరిష్యామ భారత.
యాని యాని చ కర్మాణి తస్య వక్ష్యామహే వయం
ఆసాద్య మత్స్యం తత్ కర్మ ప్రబ్రూత కురునందనాః.
నరదేవ కథం తస్య రాష్ట్రే కర్మ కరిష్యసి
విరాటనగరే సాధో రంస్యసే కేన కర్మణా.
మృదుర్వదాన్యో హ్రీమాంశ్చ ధార్మికః సత్యవిక్రమః
రాజంస్త్వమాపదాఽఽకృష్టః కిం కరిష్యసి పాండవ
న దుఃఖముచితం కించిద్రాజన్ వేద యథా జనః
స ఇమామాపదం ప్రాప్య కథం ఘోరాం తరిష్యసి.

శృణుధ్వం యత్కరిష్యామి కర్మవై కురునందనాః
విరాటమనుసంప్రాప్య రాజానం పురుషర్షభాః.
సభాస్తారో భవిష్యామి తస్య రాజ్ఞో మహాత్మనః
కంకో నామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనః.
వైడూర్యాన్ కాంచనాన్ దాంతాన్ ఫలైర్జ్యోతీరసైః సహ
కృష్ణాక్షాన్లోహితవర్ణాంశ్చ నివర్తాస్యామి మనోరమాన్.
విరాటరాజం రమయన్ సామాత్యం సహబాంధవం
న చ మాం వేత్స్యతే కశ్చిత్ తోషయిష్యే చ తం నృపం.
ఆసం యుధిష్ఠిరస్యాహం పురా ప్రాణసమః సఖా
ఇతి వక్ష్యామి రాజానం యది మాం సోఽనుయోక్ష్యతే.
ఇత్యేతద్ వో మయాఽఽఖ్యాతం విహరిష్యామ్యహం యథా

ధర్మదేవుని అనుగ్రహం మనపై ఉండగా మనలను గుర్తించేవారెవరు. మనం ఎక్కడైనా, నిర్భయంగా అజ్ఞాతవాసం సాగించవచ్చు. ఇప్పుడు మనకు తృణ కాష్ఠ జల సమృద్ధమైన ప్రాంతం కావాలి. అటువంటి ప్రాంతాలు కొన్ని చెపుతాను. అందులో నువ్వు మంచిదిగా భావించినచోట గడుపుదాము.

కురుదేశ సమీపంలో పాంచాల, చేది, మత్స్య, శూరసేన, పటచ్చర, దశార్ణ, నవరాష్ట్ర, మల్ల, శాల్వ, యుగంధర, కుంతీరాష్ట్ర, సురాష్ట్ర, అవంతీ దేశాలున్నాయి. ఇవన్నీ సర్వసమృద్ధాలే కాక సుందరదృశ్యభరితాలు. వీనిలో నువ్వు దేనిని నిర్ణయిస్తావు – అన్నాడు అర్జునుడు. అర్జునా ధర్మదేవత ఆజ్ఞను తిరస్కరించడం భావ్యం కాదు. ఆయనమాట ప్రకారమే చరించాలి. మనందరం వసించడానికి యోగ్యమైన రమణీయ ప్రదేశంలోనే మనం నిర్భయంగా ఉండాలి–అని ధర్మరాజు దేశనిర్ణయం చేస్తున్నాడు.

తమ్ముడూ నువ్వు చెప్పిన దేశాలలో మత్స్యదేశాన్ని పాలించే విరాటరాజు పాండవ పక్షపాతి కనక మనం ఆ రాజ్యంలో ఈ సంవత్సరమూ గడపటం మంచి దనిపిస్తోంది. అయితే అక్కడకు చేరేముందు ఎవరెవరు ఏ ఏ కార్యాలు చేస్తూ గడపాలో నిశ్చయించుకోవాలి గనక మీరు మీ మీ అభిమతాలు చెప్పండి అనగా అర్జునుడు – అగ్రజా! ఉదారబుద్ధితో కోమల స్వభావంతో

ఏవం నిర్దిశ్య చాత్మానం భీమసేనమువాచ హ.
భీమసేన కథం కర్మ మాత్స్యరాష్ట్రే కరిష్యసి
హత్వా క్రోధవశాంస్తత్ర పర్వతే గంధమాదనే.
యక్షాన్ క్రోధాభితప్తాంస్తాన్ రాక్షసాంశ్చాపి పౌరుషాత్
ప్రాదాః పాంచాలకన్యాయై పద్మాని సుబహూన్యపి.
బకం రాక్షసరాజానం భీషణం పురుషాదకం
జఘ్నివానసి కౌంతేయ బ్రాహ్మణార్థమరిందమ.
క్షేమా చాభయసంవీతా హ్యేకచక్రా త్వయా కృతా
హిడింబం చ మహావీర్యం కిర్మీరం చైవ రాక్షసం
త్వయా హత్వా మహాబాహో వనం నిష్కంటకం కృతం.
ఆసనం చాపి సంప్రాప్తా ద్రౌపదీ చారుహాసిని
జటాసురవధం కృత్వా త్వయా చ పరిమోక్షితా
మత్స్యరాజాంతికే తాత వీర్యపూర్ణోఽత్యమర్షణః
వృకోదర విరాటే త్వం రంస్యసే కేన హేతునా.

---

## రెండవ అధ్యాయం

పౌరోగవో బ్రువాణోఽహం బల్లవో నామ భారత
ఉపస్థాస్యామి రాజానం విరాటమితి మే మతిః.
సూపానస్య కరిష్యామి కుశలోఽస్మి మహానసే
కృతపూర్వాణి యాన్యస్య వ్యంజనాని సుశిక్షితైః
తాన్యప్యభిభవిష్యామి ప్రీతిం సంజనయన్నహం
ఆహరిష్యామి దారూణాం నిచయాన్ మహతోఽపి చ.
యత్ప్రేక్ష్య విపులం కర్మ రాజా సంయోక్ష్యతే స మాం
అమానుషాణి కుర్వాణస్తాని కర్మాణి భారత.

---

ధర్మాజ్ఞాశీలంతో ఉండే నీవు విరటుని కొలువులో ఏపని చేయగలవు – అని ప్రశ్నించాడు.

అర్జునా నేను ద్యూతక్రీడానైపుణ్యం కల 'కంక' నామంతో ఆ మహారాజు సభలో స్థానం సంపాదించి ద్యూతక్రీడతో ఆయనను మెప్పిస్తాను. వైడూర్య కాంచన దంతబంగాలతో కృష్ణలోహ తాళాలతో విరటునితో క్రీడ సాగిస్తూ అలరిస్తాను. విరటునికే కాక వాని మంత్రి బాంధవులకు కూడా ఆనందం కలిగిస్తాను. ఒకవేళ విరటుడు నన్ను గూర్చి ప్రశ్నిస్తే నేను ధర్మరాజుకి ప్రాణమిత్రుడనని చెపుతాను – అని ధర్మజుడు తన కార్యక్రమం వివరించి భీమసేనుని వైపు సాభిప్రాయంగా చూస్తూ అతని కార్యక్రమం పృచ్ఛించాడు.

---

## రెండవ అధ్యాయం

వలలుడు :

అగ్రజా! నేను విరటుని కొలువు ప్రవేశించి పాకశాస్త్రంలో నాకు ప్రావీణ్యం ఉన్నదనీ నన్ను వల్లవుడంటారనీ చెప్పి వారి పాకశాలలో ప్రవేశిస్తాను. (తెలుగు భారతంలో భీముడు వలలుడు అనే పేరులో ప్రవేశిస్తాడు. ఇది పాఠభేదం మాత్రమే.) అలా ప్రవేశించి అమృతోపమంగా భక్ష్య భోజ్యాలూ లేహ్య చోష్య పానీయాలూ సమకూరుస్తూ ఉంటాను. పచనానికి అవసరమైన ఇంధన సామగ్రి నేనే తెస్తాను. ఆ విధంగా విరటుని మనసు నలరించి వాని మహానసశాలకు అధ్యక్ష పీఠం స్వీకరిస్తాను. రాజసేవకులందరూ నా మీద

రాజ్ఞస్తస్య పరే ప్రేష్యా మంస్యంతే మాం యథా నృపం
భక్ష్యాన్నరసపానానాం భవిష్యామి తథేశ్వరః.
ద్విపా వా బలినో రాజన్ వృషభా వా మహాబలాః
వినిగ్రాహ్యా యది మయా నిగ్రహీష్యామి తానపి.
యే చ కేచిన్నియోత్స్యంతి సమాజేషు నియోధకాః
తానహం హి నియోత్స్యామి రతిం తస్య వివర్ధయన్.
న త్వేతాన్ యుధ్యమానాన్ వై హనిష్యామి కథంచన
తథైతాన్ పాతయిష్యామి యథా యాస్యంతి న క్షయం.
ఆరాలికో గోవికర్తా సూపకర్తా నియోధకః
ఆసం యుధిష్ఠిరస్యాహమితి వక్ష్యామి పృచ్ఛతః.
ఆత్మానమాత్మనా రక్షంశ్చరిష్యామి విశాంపతే
ఇత్యేతత్ ప్రతిజానామి విహరిష్యామ్యహం యథా
యమగ్నిర్బ్రాహ్మణో భూత్వా సమాగచ్ఛన్నృణాం వరం
దిధక్షుః ఖాండవం దావం దాశార్హసహితం పురా.
మహాబలం మహాబాహుమజితం కురునందనం
సోఽయం కిం కర్మ కౌంతేయః కరిష్యతి ధనంజయః.
యోఽయమాసాద్య తం దావం తర్పయామాస పావకం
విజిత్యైకరథేనేంద్రం హత్వా పన్నగరాక్షసాన్.
వాసుకేః సర్పరాజస్య స్వసారం హృతవాంశ్చ యః
శ్రేష్ఠో యః ప్రతియోధానాం సోఽర్జునః కిం కరిష్యతి.
సూర్యః ప్రతపతాం శ్రేష్ఠో ద్విపదాం బ్రాహ్మణో వరః
ఆశీవిషశ్చ సర్పాణామగ్నిస్తేజస్వినాం వరః.

భక్తితో ఆదరంతో ఉండేటట్లు వారివారి రుచులకు అనుగుణంగా వంటచేస్తాను. మదించిన ఏనుగులనూ వృషభాలనూ శిక్షించి సక్రమమార్గంలో ఉంచుతాను. మల్లయుద్ధవిశారదులు వస్తే వారితో చెయ్యికలిపి చిత్తుచేసి మహారాజుకి తృప్తి కలిగిస్తాను. వారిని చంపుతానని మాత్రం మీరు భావించకండి. ఇవన్నీ చూసికాని వినికాని వారు నా వివరాలు అడిగితే నేను ధర్మజుని కొలువులో గజశిక్షకుడననీ మహావీరుడనే కాక కవినని కూడా చెపుతాను. గద్యపద్యాత్మక కవితలో నిపుణుడనని కూడా చెప్పవచ్చుగదా. పైగా ధర్మజుని మహానసశాలలో వంటలు చేసేవాడినని కూడా చెపుతాను. ఇలాచెప్పి బహుజాగ్రతగా అజ్ఞాతవాస సంవత్సరం గడిపేస్తాను — అన్నాడు.

భీమసేనుని మాటలకు సంతోషించి ధర్మరాజు అర్జునునివైపు తిరిగి — బ్రాహ్మణరూపం ధరించి వచ్చిన అగ్నికి తృప్తికలిగించడం కోసం కృష్ణసమేతుడై వెళ్ళి ఖాండవవన దహనసమయంలో ఇంద్రుని జయించి పన్నగాలను సంహరించి వాసుకి సోదరిని హరించిన ఈ అజేయవీరుడు విరాటుని కొలువులో ఏం చేస్తాడు. ఉష్ణవస్తువులలో సూర్యుడూ, మనుష్యులలో బ్రాహ్మణుడూ, నాగజాతిలో విషసర్పమూ, తేజోమూర్తులలో అగ్ని, ఆయుధాలలో వజ్రమూ, గోజాతిలో వృషభమూ, జలాశయాలలో సముద్రమూ, ఏనుగులలో ధృతరాష్ట్రమూ, దేవగజాలలో ఐరావతమూ, ప్రియంకరులలో పుత్రుడూ శ్రేష్ఠులైనట్లే ధనుర్ధరులలో ఈ అర్జునుడే శ్రేష్ఠుడు. శ్రీకృష్ణునితో సమానమైన కాంతికలిగి శ్వేతాశ్వాలు పూన్చిన రథంమీద సాగే ఈ మహాశూరుడు

ఆయుధానాం వరం వజ్రం కకుద్మీ చ గవాం వరః
హ్రదానాముదధిః శ్రేష్ఠః పర్జన్యో వర్షతాం వరః.
ధృతరాష్ట్రశ్చ నాగానాం హస్తిష్వైరావణో వరః
(ఐరావతో)
పుత్రః ప్రియాణామధికో భార్యా చ సుహృదాం వరా.

గిరీణాం ప్రవరో మేరుర్దేవానాం మధుసూదనః
గ్రహాణాం ప్రవరశ్చంద్రః సరసాం మానసం వరం.
యథైతాని విశిష్టాని జాత్యాం జాత్యాం వృకోదర
ఏవం యువా గుడాకేశః శ్రేష్ఠః సర్వధనుష్మతాం.
సోఽయమింద్రాదనవరో వాసుదేవాన్మహాద్యుతిః
గాండీవధన్వా బీభత్సుః శ్వేతాశ్వః కిం కరిష్యతి.
ఉషిత్వా పంచవర్షాణి సహస్రాక్షస్య వేశ్మని
అస్త్రయోగం సమాసాద్య స్వవీర్యాన్మానుషాద్భుతం.
దివ్యాన్యస్త్రాణి చాప్తాని దేవరూపేణ భాస్వతా
యం మన్యే ద్వాదశం రుద్రమాదిత్యానాం త్రయోదశం

వసూనాం నవమం మన్యే గ్రహాణాం దశమం తథా
యస్య బాహూ సమౌ దీర్ఘౌ జ్యాఘాతకఠినత్వచౌ
దక్షిణే చైవ సవ్యే చ గవామివ వహః కృతః.
హిమవానివ శైలానాం సముద్రః సరితామివ
త్రిదశానాం యథా శక్రో వసూనామివ హవ్యవాట్.
మృగాణామివ శార్దూలో గరుడః పతతామివ
(పతగా)
వరః సంనహ్యమానానాం సోఽర్జునః కిం కరిష్యతి.
ప్రతిజ్ఞాం షండకోఽస్మీతి కరిష్యామి మహీపతే
జ్యాఘాతౌ హి మహాంతౌ మే సంవర్తుం నృప దుష్కరౌ.
వలయైశ్ఛాదయిష్యామి బాహూ కిణకృతావిమౌ
కర్ణయోః ప్రతిముచ్యాహం కుండలే జ్వలనప్రభే.
పినద్ధకంబుః పాణిభ్యాం తృతీయాం ప్రకృతిం గతః
వేణీకృతశిరా రాజన్ నామ్నా చైవ బృహన్నలా.
పఠన్నాఖ్యాయికాశ్చైవ స్త్రీభావేన పునః పునః
రమయిష్యే మహీపాల మన్యాంశ్చాంతఃపురే జనాన్.

---

అయిదు సంవత్సరాలు ఇంద్రలోకంలో వసించి లోకాన్నే విస్మయచకితం చేసే.రీతిగా అస్త్రవిద్య అభ్యసించాడే. పాశుపతాది దివ్యాస్త్రాలు సాధించాడే.

పన్నెండవ రుద్రునిగా, పదమూడవ సూర్యునిగా, తొమ్మిదవ వసువుగా, పదవగ్రహముగా నేను వీనిని భావిస్తున్నానే. వీడి భుజపరాక్రమం అస్త్రవిద్యలో అసమానమైనదే! పర్వతాలలో హిమాలయమూ, దేవతలలో ఇంద్రుడూ, జంతువులలో సింహమూ, పక్షులలో గరుడపక్షీ ఉత్కృష్టములైనట్లే యోధులలో అర్జునుడు మహాయోధుడే. ఇటువంటివాడు ప్రచ్ఛన్నరూపంలో విరాటుని కొలువులో ఉండి ఏంచేయగలడు- అని చింతించగా అర్జునుడు అగ్రజునికి తనకార్యక్రమం వివరించి ఆయనకు సంతోషం కలిగించడానికి యత్నిస్తున్నాడు.

మహారాజా, నేను వారి కొలువు చేరుతూనే నపుంసకుడనని చెప్పి ప్రవేశిస్తాను. నా భుజాలమీద ధనుస్సు చిహ్నాలు కనిపించకుండా దంతముతో చేసిన అలంకారాలు ధరిస్తాను. రెండు కుండలాలు చెవులకు తగిలించుకుంటాను. శంఖాలు చేతులకు అలంకరించి జడవేసి బృహన్నలా నామంతో ప్రవేశించి వారి రాణివాసంలో చేరి అక్కడ స్త్రీలకు ప్రాచీన చక్రవర్తులగాథలు రమ్య

గీతం నృత్యం విచిత్రం చ వాదిత్రం వివిధం తథా
శిక్షయిష్యామ్యహం రాజన్ విరాటస్య పురస్త్రియః.
ప్రజానాం సముదాచారం బహుకర్మకృతం వదన్
ఛాదయిష్యామి కౌంతేయ మాయయాఽఽత్మాన మాత్మనా.

యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా
ఉషితాస్మీతి వక్ష్యామి పృష్టో రాజ్ఞా చ పాండవ.
ఏతేన విధినా చ్ఛన్నః కృతకేన యథానలః
విహరిష్యామి రాజేంద్ర విరాటభవనే సుఖం.

## మూడవ అధ్యాయం

ఇత్యేవముక్త్వా పురుషప్రవీర
స్తథార్జునో ధర్మభృతాం వరిష్ఠః
వాక్యం తథాసౌ విరరామ భూయో
నృపోఽపరం భ్రాతరమాబభాషే.
కిం త్వం నకుల కుర్వాణ స్తత్ర తాత చరిష్యసి
కర్మ తత్ త్వం సమాచక్ష్వ రాజ్యే తస్య మహీపతేః
సుకుమారశ్చ శూరశ్చ దర్శనీయః సుఖోచితః.

అశ్వబంధో భవిష్యామి విరాటనృపతేరహం
సర్వథా జ్ఞానసంపన్నః కుశలః పరిరక్షణే.
గ్రంథికో నామ నామ్నాహం కర్మైతత్సుప్రియం మమ
కుశలోఽస్మ్యశ్వశిక్షాయాం తథైవాశ్వచికిత్సనే
ప్రియాశ్చ సతతం మేఽశ్వాః కురురాజ యథాతవ.
యే మామామంత్రయిష్యంతి విరాటనగరే జనాః
తేభ్య ఏవం ప్రవక్ష్యామి విహరిష్యామ్యహంయథా

---

మనోహరంగా వినిపిస్తాను. విరటు రాణివాసమ్మునకు విచిత్ర నృత్యగీతాలూ వాయిద్యాలూ నేర్పుతూ, ఆ నగరప్రజలుచేసే ఉదార కార్యకలాపాలు ప్రశంసిస్తూ ఉంటాను. ఒకవేళ విరటుడు నన్ను వివరాలడిగితే నేను ధర్మజుని ఆస్థానంలో ద్రౌపదీదేవికి పరిచారికనని చెప్పి వారికి నమ్మిక కలిగించి సంవత్సరమూ గడిపేస్తాను — అన్నాడు.

## మూడవ అధ్యాయం

అజ్ఞాతవాసకాలంలో భీమార్జునులు ఏ విధంగా చరించేదీ తెలిసికొన్న అనంతరం ధర్మరాజు నకులునివైపు తిరిగి—సోదరా, నువ్వు శూరుడవు, నీ సౌందర్యం సర్వజనసమాకర్షణ సమర్థమైనది. అటువంటి నువ్వు విరటరాజు కొలువులో సంవత్సరకాలం అజ్ఞాతవాసం ఏ ప్రకారంగా గడుపుతావు—అని పృచ్ఛించగా నకులుడు సమాధాన మిస్తున్నాడు. ధర్మనందనా, నాకు అశ్వశిక్షణలో అద్భుత నైపుణ్యం ఉన్నది. శిక్షణలోనే కాక అశ్వచికిత్సాశాస్త్రం కూడా నే నెరుగుదును. ఈ రెంటింటికీ తోడు నాకు గుర్రాలంటే అపారమైన ప్రేమ ఉన్నది. ఈ విషయాలన్నీ చెప్పి నేను గ్రంథికనామంతో విరటుని కొలువులో చేరుతాను. అశ్వపాలకుడుగా ఉంటాను. ఎవరయినా నన్ను గురించి వివరాలడిగితే నేను పాండవులవద్ద అశ్వశాఖాధ్యక్షుడుగా ఉండేవాడినని చెపుతాను—అని పలికిన నకులునివైపు సంతృప్తిగా చూచి ధర్మరాజు సహదేవునివైపు తిరిగి—నాయనా నీ కార్యక్రమ మేమిటి—అన్నాడు.

అగ్రజా, నాకు గోవుల పాలన పోషణాదు

పాండవేన పురా తాత అశ్వేష్వధికృతః పురా
విరాటనగరే ఛన్నశ్చరిష్యామి మహీపతే.
సహదేవ కథం తస్య సమీపే విహరిష్యసి
కిం వా త్వం కర్మ కుర్వాణః ప్రచ్ఛన్నో విహరిష్యసి.
గోసంఖ్యాతా భవిష్యామి విరాటస్య మహీపతేః
ప్రతిషేద్ధా చ దోగ్ధా చ సంఖ్యానే కుశలో గవాం.
తంతిపాల ఇతి ఖ్యాతో నామ్నాహం విదితస్త్వథ
నిపుణం చ చరిష్యామి వ్యేతు తే మానసో జ్వరః.
అగోగా బహుళాః పుష్టాః క్షీరవత్యో బహుప్రజాః
నిష్పన్నసత్వాః సుభృతా వ్యపేతజ్వరకిల్బిషాః.
నష్టచోరభయా నిత్యం వ్యాధివ్యాఘ్రవివర్జితాః
గావశ్చ సుసుఖా రాజన్ నిరుద్విగ్నా నిరామయాః.
భవిష్యంతి మయా గుప్తా విరాటపశవో నృప
అహం హి సతతం గోషు భవతా ప్రహితః పురా
తత్ర మే కౌశలం సర్వమవబుద్ధం విశాంపతే.
లక్షణం చరితం చాపి గవాం యచ్చాపి మంగళం
తత్సర్వం మే సువిదితమన్యచ్చాపి మహీపతే.
వృషభానపి జానామి రాజన్ పూజితలక్షణాన్
యేషాం మూత్రముపాఘ్రాయ అపి వంధ్యా ప్రసూయతే.
సోఽహమేవం చరిష్యామి ప్రీతిరత్ర హి మే సదా
న చ మాం వేత్స్యతే కశ్చిత్ తోషయిష్యే చ పార్థివం.
ఇయం హి నః ప్రియా భార్యా ప్రాణేభ్యోఽపి గరీయసీ
మాతేవ పరిపాల్యా చ పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా.
కేన స్మ ద్రౌపదీ కృష్ణా కర్మణా విచరిష్యతి
న హి కించిద్విజానాతి కర్మ కర్తుం యథా స్త్రియః.
సుకుమారీ చ బాలా చ రాజపుత్రీ యశస్వినీ

---

లన్నీ బాగా తెలుసు. ఎటువంటి గోవునయినా సక్రమ మార్గంలో నడిపే నేర్పు నాకున్నది. కనక ఈ విషయమే చెప్పి విరటుని కొలువులో ప్రవేశిస్తాను. అక్కడ ఉన్నంతకాలమూ తంతిపాలు డనే పేరుతో వ్యవహరింపబడతాను. ఆదిలో మీరు నన్ను గోశాలకు అధ్యక్షునిగా నియోగించారు. ఆ సమయంలో నేను గోవుల శుభాశుభలక్షణాలూ వాని సాంకర్యవివరాలూ సమగ్రంగా గ్రహించాను. వృషభాల విషయం కూడా నాకు బాగా తెలుసు. ఏ వృషభ మూత్రం వాసన చూపిస్తే గొడ్రాలికి గర్భం నిలుస్తుందో నేనెరుగుదును. నాకు గోజాతియందు ఇష్టమూ దయా కూడా ఉన్నాయి. నేను గోపాలక వేషంతోనే విరటుని ఆస్థానంలో అడుగుపెట్టి వారి అభిమానంతో అజ్ఞాతవాసవర్షం గడిపేస్తాను—అని సహదేవుడు పలకగా ధర్మరాజు ద్రౌపదీ విషయమై ప్రస్తావించబోతున్నాడు.

సోదరులారా, ఈ ద్రౌపది మనకు ప్రాణం కంటె ప్రియమైనది. ఈమెను మనతల్లివలె పూజించాలి. అక్కవలె ఆదరించి పూజించాలి. ఈమె సామాన్య స్త్రీలవలె ఆపనీ ఈపనీ చేస్తూ గడప లేదు. వయస్సా? అంతగా లేదు. శరీరమా? సుకుమారమైనది. పరమపతివ్రత. మహాభాగ్యశాలిని. ఈ ఆగర్భశ్రీమంత సీమంతిని ఆబాల్యం సుమ చందన సువర్ణభూషణాలంకారాలతో భాసించేది. అటువంటి ఈమె విరటుని కొలువులో ఎలా అజ్ఞాతవాసం చేయగలదు — అని వితర్కిస్తూండగా ద్రౌపది గొంతువిప్పి — మహారాజా, ఈ లోకంలో ఒక విధమైన దాసీజాతి ఉన్నది. వారికి స్వాతంత్ర్య ప్రతిపత్తి ఉన్నది. వీరిని సైరంధ్రీ నామంతో

పతివ్రతా మహాభాగా కథం ను విచరిష్యతి.
మాల్యగంధానలంకారాన్ వస్త్రాణి వివిధాని చ
ఏతాన్యేవాభిజానాతి యతో జాతా హి భామినీ.
సైరంధ్ర్యో రక్షితా లోకే భుజిష్యాః సంతి భారత
నైవమన్యాః స్త్రియో యాంతి ఇతి లోకస్య నిశ్చయః
సాహం బ్రువాణా సైరంధ్రీ కుశలా కేశకర్మణి
యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా
ఉషితాస్మీతి వక్ష్యామి పృష్టా రాజ్ఞా చ భారత.
ఆత్మగుప్తా చరిష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి

సుదేష్ణాం ప్రత్యుపస్థాస్యే రాజభార్యాం యశస్వినీం
సా రక్షిష్యతి మాం ప్రాప్తాం మా భూత్ తే దుఃఖమీదృశం
కల్యాణం భాషసే కృష్ణే కులే జాతాసి భామిని
న పాపమభిజానాసి సాధ్వీ సాధువ్రతే స్థితా.
యథా న దుర్హృదః పాపా భవంతి సుఖినః పునః
కుర్యాస్తత్ త్వం హి కల్యాణి లక్షయేయుర్న తే తథా..



నాలుగవ అధ్యాయం

కర్మాణ్యుక్తాని యుష్మాభిర్యాని యాని కరిష్యథ
మమ చాపి యథా బుద్ధిరుచితా విధినిశ్చయాత్.
పురోహితోఽయ మస్మాకమగ్నిహోత్రాణి రక్షతు
సూదపౌరోగవైః సార్ధం ద్రుపదస్య నివేశనే.

ఇంద్రసేనముఖాశ్చేమే రథానాదాయ కేవలాన్
యాంతు ద్వారవతీం శీఘ్రమితి మే వర్తతే మతిః
ఇమాశ్చ నార్యో ద్రౌపద్యాః సర్వాశ్చ పరిచారికాః
పాంచాలానేవ గచ్ఛంతు సూదపౌరోగవైః సహ

---

వ్యవహరిస్తారు. ఈ వృత్తికి ఉన్నతవంశ స్త్రీలే అర్హులని విన్నాను–కనక నేను సైరంధ్రి అనే పేరుతో విరటుని కొలువులో ప్రవేశించి ఆయనతో ఇలా చెపుతాను: విరటరాజా! నేను జడల్లడంలో కేశాలంకరణలో పూలు ముడువటంలో నేర్పుగలదానిని. ద్రౌపదీదేవిదగ్గర ఉండేదానిని–అలా ప్రవేశం సాధించి విరటుని రాణియైన సుదేష్ణను అలరిస్తాను. ఆమె ఆదరాభిమానాలు సాధిస్తాను – అన్నది.

ధర్మరాజు ప్రహర్షపరిప్లుత హృదయుడై – కళ్యాణీ, ఉత్తమవంశంలో జన్మించి సదాచార సంపత్తితో సాగే నీకు యోగ్యమైన కార్యమే నువ్వు ఎన్నుకున్నావు. ఏ దురాచారానికీ నువ్వు ఒడిగట్టవని నాకు తెలుసు. అయితే ఈ అజ్ఞాతవాస వర్షంలో ఎలాగయినా మనలను గుర్తుపట్టాలని ఆ దుష్టులు యత్నిస్తూనే ఉంటారు. కనక నువ్వు బహుజాగ్రత్తగా ఉండాలి–అని హెచ్చరించాడు.



నాలుగవ అధ్యాయం

దైవప్రేరణానుసారం మనం ఏ ఏ పనులలో ప్రవర్తిస్తూ అజ్ఞాతవాస సంవత్సరం గడపాలో నిశ్చయమైంది. ఇప్పుడింక వీరందరినీ ద్రుపదనరపాలుని ఆస్థానానికి పంపాలి–అని ధర్మరాజు–పురోహిత పరిజనుల వైపుచూస్తూ–మన అగ్నిహోత్రాలను పరిరక్షించే ధౌమ్యుల వారు కూడా ద్రుపదరాజు దగ్గరకు వెడతారు. ఇంద్రసేనాది ప్రముఖులు రథాలతో ద్వారక వెళ్ళాలి. మిగిలిన సారథుల వెంట ద్రౌపదీ పరిచారికలూ అన్యస్త్రీలూ వెడతారు. అక్కడ వీరిని చేరి ఎవరయినా పాండవులను

సర్వైరపి చ వక్తవ్యం న ప్రాజ్ఞాయంత పాండవాః
గతా హ్యస్మానపాహాయ సర్వే ద్వైతవనా దితి.
ఏవం తేఽన్యోన్యమామంత్ర్య కర్మాణ్యుక్త్వా
పృథక్ పృథక్
ధౌమ్యమామంత్రయామాసుః స చ తాన్
మంత్రమబ్రవీత్.
విహితం పాండవాః సర్వం బ్రాహ్మణేషు
సుహృత్సు చ
యానే ప్రహరణే చైవ తథైవాగ్నిషు భారత.
త్వయా రక్షా విధాతవ్యా కష్ణాయాః ఫాల్గునేన చ
విదితం వో యథా సర్వం లోకవృత్తమిదం తవ.
విదితే చాపి వక్తవ్యం సుహృద్భిరనురాగతః
ఏష ధర్మశ్చ కామశ్చ అర్థశ్చైవ సనాతనః.
అతోఽహమపి వక్ష్యామి హేతుమత్ర నిబోధత
హంతేమాం రాజవసతిం రాజపుత్రా బ్రవీమ్యహం.

యథా రాజకులం ప్రాప్య సర్వాన్ దోషాం స్తరిష్యథ
దుర్వసం చైవ కౌరవ్య జానతా రాజవేశ్మని.
అమానితైర్మానితైర్వా అజ్ఞాతైః పరివత్సరం
తతశ్చతుర్దశేవర్షే చరిష్యథ యథాసుఖం.
దృష్టద్వారో లభేద్ద్రష్టుం రాజస్వేషు న విశ్వసేత్
తదేవాసనమన్విచ్ఛేద్ యత్ర నాభిపతేత్ పరః.
యో న యానం న పర్యంకం న పీఠం న గజం రథం
ఆరోహేత్ సమ్మతోఽస్మీతి స రాజవసతిం వసేత్.
యత్ర యత్రైనమాసీనం శంకేరన్ దుష్టచారిణః
న తత్రోపవిశేద్ యో వై స రాజవసతిం వసేత్.
న చానుశిష్యాద్ రాజానమపృచ్ఛంతం కదాచన
తూష్ణీం త్వేనముపాసీత కాలే సమభిపూజయేత్.
అసూయంతి హి రాజానో జనాననృతవాదినః
తథైవ చావమన్యంతే మంత్రిణం వాదినం
మృషా.

---

గురించి ప్రశ్నిస్తే ద్వైతవనం నుంచి ఎక్కడికి వెళ్ళారో తెలీదని చెప్పాలి- అన్నాడు.

ఈ విధమైన నిశ్చయాలన్నీ పూర్తిచేసి ఆ విషయాలన్నీ ధౌమ్యులతో నివేదించి ఆయన అభిప్రాయం అర్థించారు.

ధర్మనందనా నువ్వు బ్రాహ్మణుల విషయంలో స్నేహితుల విషయంలో వాహనాది కాల విషయంలో సముచితమైన నిర్ణయమే చేశావు. మీకు లౌకికవ్యవహారజ్ఞానం ఉన్నా మిత్ర ధర్మాను సారం నేను చెప్పవలసిన మాటలు చెపుతున్నాను. నువ్వూ అర్జునుడూ నిరంతరం ద్రౌపదిని కంటికి రెప్పలా కాపాడుకుంటూ ఉండాలి. లౌకిక వ్యవహారజ్ఞానమే ధర్మార్థ కామ రక్షణకు ఉపకరిస్తుంది. ఈ వ్యావహారిక పరిజ్ఞానం ఉన్న వారు కూడా రాజాస్థానాలలో అప్పుడప్పుడు సంకటాలలో పడి పోతుంటారు. అందుచేత ఇప్పుడు నేను చెప్పబోయే విషయాలు శ్రద్ధగా ఆలకించి ఆ ప్రకారంగా చరించినట్లయితే మీరు ఏ కష్టాలూ పడకుండా సుఖంగా కాలం గడపగలుగుతారు.

మీకు సమ్మానం జరిగినా అవమానం నెత్తిమీద పడ్డా ఈ సంవత్సరకాలం ఒకేచోట అజ్ఞాతంగా గడిపినట్లయితే అనంతరం సుఖదినాలే లభిస్తాయి.

రాజాస్థానలలో రాజసమ్ముఖంలో ఏ విధంగా చరించి ప్రవర్తించాలో ధౌమ్యులు ధర్మ రాజాదులకు సమగ్రంగా వివరిస్తున్నారు.

చక్రవర్తిని దర్శించాలని ఉన్నప్పుడు ముందుగా ద్వారపాలుని ద్వారా కబురుచేసి కాని వెళ్ళకూడదు. ఏ సమయంలోనూ చక్రవర్తిమీద పరమవిశ్వాసం ఉంచి చరించకూడదు. ఆ సభా

నైషాం దారేషు కుర్వీత మైత్రీం ప్రాజ్ఞః కదాచన
అంతఃపురచరా యే చ ద్వేష్టియానహితాశ్చ యే.
విదితే చాస్య కుర్వీత కార్యాణి సులఘూన్యపి
ఏవం విచరతో రాజ్ఞి న క్షతిర్జాయతే క్వచిత్.
గచ్ఛన్నపి పరాం భూమిమపృష్టో హ్యనియోజితః
జాత్యంధ ఇవ మన్యేత మర్యాదామనుచింతయన్.
న హి పుత్రం న నప్తారం న భ్రాతరమరిందమాః
సముత్క్రాంతమర్యాదం పూజయంతి నరాధిపాః.
యత్నాచ్చోపచరేదేనమగ్నివద్ దేవవత్ త్విహ
అనృతేనోపచీర్ణో హి హన్యాదేవ న సంశయః.
యద్ యద్ భర్తానుయుంజీత తత్ తదేవాను వర్తయేత్
ప్రమాదమవలేపం చ కోపం చ పరివర్జయేత్.
సమర్థనాసు సర్వాసు హితం చ ప్రియమేవ చ
సంవర్ణయేత్ తదేవాస్య ప్రియాదపి హితం భవేత్
అనుకూలో భవేచ్చాస్య సర్వార్థేషు కథాసు చ
అప్రియం చాహితం యత్ స్యాత్ తదస్మై నాను వర్ణయేత్.
నాహమస్య ప్రియోఽస్మీతి మత్వా సేవేత పండితః
అప్రమత్తశ్చ సతతం హితం కుర్యాత్ ప్రియం చ యత్.
నాస్యానిష్టాని సేవేత నాహితైః సహ సంవదేత్
స్వస్థానాన్న వికంపేత స రాజవసతిం వసేత్.
దక్షిణం చాథ వామం వా పార్శ్వమాసీత పండితః
రక్షిణాం హ్యాత్తశస్త్రాణాం స్థానం పశ్చాద్ విధీయతే
నిత్యం హి ప్రతిషిద్ధం తు పురస్తాదాసనం మహత్
న చ సందర్శనే కించిత్ ప్రవృత్తమపి సంజయేత్.
అపి హ్యేతద్ దరిద్రాణాం వ్యలీకస్థానముత్తమం
న మృషాభిహితం రాజ్ఞాం మనుష్యేషు ప్రకాశయేత్.

---

స్థలంలో ప్రతిష్ఠగల పురుషులు ఆసీనులయే ఆసనాల మీద మనం కూర్చోవడానికి ప్రయత్నించ కూడదు. మనం కూర్చున్న స్థలంనుంచి ఎవరూ మనలను లేపకుండా ఉండే స్థానమే చూచుకోవాలి. చక్రవర్తి గౌరవం లభించిందికదా అనే గర్వంతో మహారాజు అధిరోహించే రథగజాదివాహనాలు అధిరోహించటం కాని ఆయన కూర్చునే ఆసనాలు స్వీకరించటం కానీ ఎంత మాత్రం తగదు.

మనం ఎక్కడ కూర్చుంటే రాజదూతలు శంకించరో అక్కడే కూర్చుంటూ ఉండాలి చక్రవర్తి ఆజ్ఞకోశం నిరీక్షిస్తూ కూర్చోక కొన్నికొన్ని పనులు మనమే నిర్వర్తిస్తూ అవసరానుసారం సాహసపరాక్రమాలు ప్రదర్శిస్తూ రాజసమ్మానానికి పాత్రులవుతూండాలి. అబద్ధ మాడే అమాత్యునికికూడా చక్రవర్తినుండి తిరస్కారమే లభిస్తుంది. కనక అసత్యభాషణమే సాగించరాదు.

ఇంతవరకూ రాజసమ్ముఖంలో రాజసభాస్థలిలో ప్రవర్తించవలసిన విధానాలను చెప్పి ధౌమ్యులు మరికొన్ని ముఖ్యాంశాలు చెపుతున్నారు.

ధర్మనందనా, ప్రాజ్ఞుడైన వాడు ఎన్నడూ రాణివాసం వారితో ఏవిధమైన పరిచయాన్నీ పెంచుకోకూడదు. వారితో మైత్రి అనేది యెంత మాత్రమూ కూడదు. రాణివాసంలోని నారీజనంతోనే కాదు ఆ అంతఃపురంతో సంబంధం కల వారితోనూ అతిగా చరించకూడదు. చక్రవర్తితో శత్రుత్వం ఉన్న వారితో కానీ, చక్రవర్తి మీద విద్వేషాభిప్రాయం ఉన్న వారితో కానీ ఏ విధమైన సఖ్యమూ పనికిరాదు.

అసూయంతి హి రాజానో నరానానృతవాదినః
తథైవ చావమన్యంతే నరాణ్ పండితమానినః.
శూరోఽస్మీతి న దృప్తః స్యాద్ బుద్ధిమానితి వా పునః
ప్రియమేవాచరన్ రాజ్ఞః ప్రియో భవతి భోగవాన్.
ఐశ్వర్యం ప్రాప్య దుష్ప్రాపం ప్రియం ప్రాప్య చ రాజతః
అప్రమత్తో భవేద్రాజ్ఞః ప్రియేషు చ హితేషు చ.
యస్య కోపో మహాశాధః ప్రసాదశ్చ మహాఫలః
కస్తస్య మనసాపీచ్ఛేదనర్థం ప్రాజ్ఞసమ్మతః
న చోష్ఠౌ న భుజౌ జానూ న చ వాక్యం సమాక్షిపేత్
సదా వాతం చ వాచం చ ష్ఠీవనం చాచరే చ్ఛనైః.
హాస్యవస్తుషు చాన్యస్య వర్తమానేషు కేషుచిత్
నాతిగాఢం ప్రహృష్యేత న చాప్యున్మత్తవద్ధసేత్
న చాతిధైర్యేణ చరేద్ గురుతాం హి వ్రజేత్ తతః
స్మితం తు మృదుపూర్వేణ దర్శయేత ప్రసాదజం.
లాభే న హర్షయేద్ యస్తు న వ్యథేద్ యోఽవమానితః
అసమ్మూఢశ్చ యో నిత్యం స రాజవసతిం వసేత్
రాజానం రాజపుత్రం వా సంవర్ణయతి యః సదా
అమాత్యః పండితో భూత్వా స చిరం తిష్ఠతే ప్రియః.

---

ఇకపోతే –

ఏ పాటి చిన్నపని అయినా మహారాజుకి నివేదించకుండా చెయ్యకూడదు. మహారాజు ఏ స్థితిలో ఏ దశలో ఉన్నా ఆయన అడగనిదే ఏమీ చెప్పకూడదు, ఆయన చూడనిదే అటు చూచి కూడా చూడనట్లే ఉండాలి.

యుద్ధ సమయంలో మహారాజు నిన్ను అవమాన పూర్వకంగా చూచినా అది మనసులో ఉంచుకోకుండా నిష్కపటంగానే అగ్నినీ దేవతలనూ అర్చించేటట్లు ఆయనను అర్చించాలి. అంతేకాని తద్వ్యతిరిక్తంగా చరిస్తే మరణశిక్ష మాత్రమే లభిస్తుంది

మనకు చక్రవర్తి ఏపని నియోగిస్తే అదే చెయ్యాలి ఆయన ఏ ప్రశ్న అడిగితే దానికే జవాబు చెప్పాలి. గర్వం కోపం అనేవి మనకు పనికిరావు. రాజసభలో ఉండ దలచిన వాడు ఏ మాత్రమూ ప్రమత్తుడుగా చరించకూడదు.

కార్యారంభ సమయంలోనూ అవసాన వేళలోనూ మంగళమైన శబ్దాలే వినాలి. హితవు పలకాలే కాని ప్రియవాక్యాలతో గడపకూడదు. ఏది మాట్లాడినా అది చక్రవర్తికి సర్వవిధాలా అనుకూలించేదిగానే ఉండాలి. రాజుకు ప్రియంగా ఉంటుందని అహితవు చెప్పకూడదు. అటువంటి విషయం వచ్చినప్పుడు మౌనం వహించడం చాలా తెలివైనపని. ధీచాతుర్యం గలవాడు అతి జాగ్రతతో రాజసేవ చేస్తాడు ఏవ్యక్తి రాజుకు అనిష్టం కలిగించకుండా ప్రవర్తిస్తాడో ఏవ్యక్తి రాజశత్రువులతో భాషించకుండా ఉంటాడో రాజాజ్ఞానుసారియై ప్రవర్తిస్తాడో వాడు చక్రవర్తికి పార్శ్వంలోనే ఉంటూంటాడు. శస్త్రధారియైన అంగరక్షకుడు వెనుక భాగంలో ఉంటాడు ఎంతటి శూరుడైనా మహావీరుడైనా పండితుడైనా రాజసింహాసనాన్ని అధఃకరించే ఆసనం అధిష్టించకూడదు. రహస్య విషయాలు సభామధ్యంలో పలకకూడదు. అవి ఒక్కొక్కప్పుడు రాజుకే అవమానకరాలవుతాయి. చక్రవర్తి అప్రియం

ప్రగృహీతశ్చ యోఽమాత్యో నిగృహీతస్త్వకారణైః
న నిర్వదతి రాజానం లభతే సంపదం పునః.
ప్రత్యక్షం చ పరోక్షంచ గుణవాదీ విచక్షణః
ఉపజీవీ భవేద్రాజ్ఞో విషయే యోఽపి వా భవేత్
అమాత్యో హి బలాద్ భోక్తుం రాజానం ప్రార్థయేత యః
న స తిష్ఠేచ్చిరంస్థానం గచ్ఛేచ్చ ప్రాణసంశయం.
శ్రేయః సదాఽఽత్మనో దృష్ట్వా పరం రాజ్ఞా న సంవదేత్
విశేషయేచ్చ రాజానం యోగ్యభూమిషు సర్వదా
అమ్లానో బలవాన్ఛూరశ్ఛాయేవానుగతః సదా
సత్యవాదీ మృదుర్దాంతః స రాజవసతిం వసేత్.

అన్యస్మిన్ ప్రేష్యమాణే తు పురస్తాద్ యః సముత్పతేత్
అహం కిం కరవాణీతి స రాజవసతిం వసేత్.
ఆంతరే చైవ బాహ్యే చ రాజ్ఞాయశ్చాథ సర్వదా
ఆదిష్టో నైవ కంపేత స రాజవసతిం వసేత్.
యో వై గృహేభ్యః ప్రవసన్ ప్రియాణాం నానుసంస్మరేత్
దుఃఖేన సుఖమన్విచ్ఛేత్ స రాజవసతిం వసేత్.
సమవేషం న కుర్వీత నోచ్చైః సంనిహితో వసేత్
న మంత్రం బహుధా కుర్యాదేవం రాజ్ఞః ప్రియో భవేత్.
న కర్మణి నియుక్తః సన్ ధనం కించిదపి స్పృశేత్
ప్రాప్నోతి హి హరన్ ద్రవ్యం బంధనం యది వా వధం

---

భాషించినా అది మరోచోట చెప్పకూడదు. ప్రపంచంలో కొందరు పూజ్యస్థానీయులైన పెద్దలను అవమానించడానికి ప్రయత్నిస్తూంటారు. అటువంటి వాటికి సావకాశం ఇవ్వకూడదు.

రాజసభా మధ్యంలో మన ఘనతను ప్రశంసించుకుంటూ అహంకారంతో భాషించకూడదు. చక్రవర్తి మనస్సు సదా అలరిస్తూనే భాషించాలి. ఆ విధంగా రాజభోగాల ననుభవించడానికి ప్రయత్నించాలి. మహారాజువల్ల ఐశ్వర్యాలు పొందిన వాడు సదా ఆయన హితవునే కోరుతూండాలి. రాజు అనుగ్రహిస్తే అష్టైశ్వర్యాలూ లభిస్తాయి. ఆగ్రహిస్తే దుఃఖ పరంపరలే ప్రాప్తిస్తాయి – అని పలికి ధౌమ్యుడు రాజ సమ్ముఖంలో నిలబడవలసిన విధానాన్ని కూడా చెపుతున్నాడు.

ధర్మనందనా! రాజు ఎదుట చేతులూ కాళ్లూ కదపకుండా పెదవులు విప్పకుండా భుజాలనూ మోకాళ్లనూ స్వాధీనంలో ఉంచుకొని నిలబడాలి. రాజు ఎదురుగా ఉమ్మటం ఆవులించడం ఆదిగాగల పనులు చెయ్యకూడదు. పళ్లు కనపడేలా నవ్వకూడదు. హాస్యప్రసంగాలు నడుస్తూ ఉన్నప్పుడు వెకిలినవ్వులు నవ్వకూడదు – అని చెప్పి మౌనంగా ఉండకూడదు. మందహాసంతో ఆ సందర్భాని గడపాలి. అనుగ్రహానికి పొంగిపోతూ ఆగ్రహానికి లొంగిపోతూ ప్రవర్తించే వాడు రాజసేవకు పనికిరాడు. రాజునూ రాజపుత్రులనూ అభినందనలతో మెప్పించేవాడు వారికి అభిమానపాత్రుడౌతాడు. ఒకప్పుడు మంత్రిపదవి నలంకరించి అకారణంగా పదవీచ్యుతుడై నప్పటికీ చక్రవర్తిని నిందించనివాడే తిరిగి ఉన్నతస్థితి పొందగలుగుతాడు. ప్రత్యక్షంలోనూ పరోక్షంలోనూ చక్రవర్తిని అభినందించేవాడు కార్యకుశలుడనిపించుకుండాడు. చక్రవర్తిని తన అధీనంలో ఉంచుకోవాలని అడిగిన ప్రశ్నకు సమాధానం ఇవ్వకుండా శాఖా చంక్రమణం చేస్తూ విషయాంతరాలకు

యానం వస్త్రమలంకారం యచ్చాన్యత్ సంప్రయచ్ఛతి
తదేవ ధారయేన్నిత్యమేవం ప్రియతరో భవేత్.
ఏవం సంయమ్య చిత్తాని యత్నతః పాండునందనాః
సంవత్సరమిమం తాత తథాశీలా బుభూషత
అథ స్వవిషయం ప్రాప్య యథాకామం కరిష్యథ.
అనుశిష్టాఃస్మ భద్రం తే నైతద్ వక్తాస్తి కశ్చన
కుంతీమృతే మాతరం నో విదురం వా మహామతిం
యదేవానంతరం కార్యం తద్ భవాన్ కర్తుమర్హతి
తారణాయాస్య దుఃఖస్య ప్రస్థానాయ జనాయ చ

ఏవముక్తస్తతో రాజ్ఞా ధౌమ్యోఽథ ద్విజసత్తమః
అకరోద్ విధివత్ సర్వం ప్రస్థానే యద్ విధీయతే
తేషాం సమిధ్య తానగ్నీన్ మంత్రవచ్చ జుహావ సః
సమృద్ధివృద్ధిలాభాయ పృథివీవిజయాయ చ.
అగ్నీన్ ప్రదక్షిణీకృత్య బ్రాహ్మణాంశ్చ తపోధనాన్
యాజ్ఞసేనీం పురస్కృత్య షడేవాథ ప్రవవ్రజుః.
గతేషు తేషు వీరేషు ధౌమ్యోఽథ జపతాం వరః
అగ్నిహోత్రాణ్యుపాదాయ పాంచాలానభ్యగచ్ఛత
ఇంద్రసేనాదయశ్చైవ యథోక్తాః ప్రాప్య యాదవాన్
రథానశ్వాంశ్చ రక్షంతః సుఖమూషుః సుసంవృతాః

---

పోయేవాడు ఎంతో కాలం మంత్రిపీఠంమీద ఉండలేడు. వాడికి జీవితం కూడా చాలా క్లిష్టంగానే సాగుతుంది. స్వలాభార్థం శత్రువులతో విగ్రహం కాని సంధి కాని చెయ్యకూడదు. ఉత్సాహంతో శూరత్వంతో సత్యభాషణతో శాంతస్వభావంతో జితేంద్రియుడై చక్రవర్తి వెనుక నీడలా చరించేవాడు రాజభవనంలో ఉండడానికి అర్హుడవుతాడు.

సేవకులకు ఆజ్ఞలు ఇచ్చేటప్పుడు తనపని తానే అడిగేవాడు కూడా రాజసౌధంలో ఉండటానికి అర్హుడే. చక్రవర్తి స్వీయరక్షణార్థం కాని అంతఃపురరక్షణార్థం కాని సామంతరాజులను ఓడించమనికాని నియోగించినప్పుడు ఎవడు నిర్భయంగా నిలబడతాడో వాడికి కూడా రాజసౌధంలో నివసించేందుకు సావకాశం ఉంది. దేశాంతరాలు వెళ్లవలసి వచ్చినప్పుడు మిత్ర పుత్ర పత్నీవియోగాలను సహించగలవాడుకూడా రాజసేవకు అర్హుడే. అతిగా నవ్వనివాడూ అన్యులతో దీర్ఘప్రసంగాలు రహస్యంగా సాగించనివాడూ లంచగొండి కానివాడూ రాజు బహూకరించిన వస్తువులను సదా ధరించేవాడూ ఆయనకు ప్రియులౌతారు.

పాండునందనులారా! ఈ విషయాలన్నీ మీరు మనసులో ఉంచుకొని ఈ పదమూడవ సంవత్సరం అతిరహస్యంగా గడపండి. ఆతరువాయి మీ రాజ్యభోగాలు మీకు లభిస్తాయి–అని ధౌమ్యుడు మౌనం వహించగా ధర్మరాజు – మహానుభావా! ధీశాలియైన విదురుడూ మాతృదేవియైన కుంతీ తప్ప మాకిటువంటి సందేశం ఇచ్చినవారు లేరు. ఈ దుఃఖ విమోచనార్థం మే మేమి చెయ్యాలో చెప్పవలసిన దని కోరాడు.

ధౌమ్యుడు పాండవ ఐశ్వర్యాభివృద్ధికి అగ్నిని సంతృప్తిపరిచే సంకల్పంతో ప్రజ్వలింపజేసి హోమం చేసి ద్రౌపదితో సహా పాండవుల చేత ప్రదక్షిణ చేయించి ఆశీర్వదించాడు.

అక్కడి నుండి అజ్ఞాతవాసదీక్షతో పాండవులు బయలు దేరారు. అగ్నిహోత్రాలు వెంట బెట్టుకొని ధౌమ్యుడు పాంచాల దేశంవైపు వెళ్లాడు. ఇంద్రసేనాదులు ద్వారకవైపు రథాలు నడిపించారు.

## ఐదవ అధ్యాయం

తే వీరా బద్ధనిస్త్రింశా స్తథా బద్ధకలాపినః
బద్ధగోధాంగుళిత్రాణాః కాళిందీమభితో యయుః
తత స్తే దక్షిణం తీరమన్వగచ్ఛన్ పదాతయః
నివృత్తవనవాసా హి స్వరాష్ట్రం ప్రేప్సవ స్తదా
వసంతో గిరిదుర్గేషు వనదుర్గేషు ధన్వినః.
విధ్యంతో మృగజాతాని మహేష్వాసామహాబలాః
ఉత్తరేణ దశార్ణాం స్తే పంచాలాన్ దక్షిణేన చ.
అంతరేణ యకృల్లోమాన్ శూరసేనాంశ్చ పాండవాః
లుబ్ధా బ్రువాణా మత్స్యస్య విషయం ప్రావిశన్ వనాత్.
ధన్వినో బద్ధనిస్త్రింశా వివర్ణాః శ్మశ్రుధారిణః
తతో జనపదం ప్రాప్య కృష్ణా రాజానమబ్రవీత్.

పశ్యైకపద్యో దృశ్యంతే క్షేత్రాణి వివిధాని చ
వ్యక్తం దూరే విరాటస్య రాజధానీ భవిష్యతి
వసా మేహాపరాం రాత్రిం బలవాన్ మే పరిశ్రమః.
ధనంజయ సముద్యమ్య పాంచాలీం వహ భారత
రాజధాన్యాం నివత్స్యామో విముక్తాశ్చ వనాదితః
తామాదాయార్జునస్తూర్ణం ద్రౌపదీం గజరాడివ
సంప్రాప్య నగరాభ్యాశమవతారయదర్జునః.
స రాజధానీం సంప్రాప్య కౌంతేయోఽర్జునమబ్రవీత్
క్వాయుధాని సమాసజ్య ప్రవేక్ష్యామః పురంవయం
సాయుధాశ్చ ప్రవేక్ష్యామో వయం తాత పురం యది
సముద్వేగం జనస్యాస్య కరిష్యామో న సంశయః
గాండీవం చ మహద్గాఢం లోకే చ విదితం నృణాం
తచ్చేదాయుధమాదాయ గచ్ఛామో నగరం వయం

---

## ఐదవ అధ్యాయం

పాండవవీరులు ధనుర్బాణ తూణీరధారులై అంగుళిత్రాణధరులై క్రమంగా సాగిసాగి యమునా నదిని సమీపించారు దాని దక్షిణతీరం వెంట ప్రయాణం సాగిస్తూ వనవాసక్లేశాలు తమ కింక లేవనీ అత్యల్పకాలంలో మహారాజభోగా లనుభవించ వచ్చుననీ ఆనంద హృదయాలతో అడుగులు వేస్తున్నారు. వనమర్గాలలో పర్వతదుర్గాలలో నివసిస్తూ నెమ్మది నెమ్మదిగా ముందుకు పోయి దశార్ణదేశానికి ఉత్తరంగా పాంచాలానికి దక్షిణంగా యకృల్లోమ శూరసేన దేశాలకు మధ్యగా వారి ప్రయాణం సాగుతోంది. వారి ఒరలలో కత్తు లున్నాయి. చేతులలో ధనుస్సు లున్నాయి. మీసాలూ గడ్డాలూ పెరిగిపోయాయి. శరీరాలు మలినంగా ఉన్నాయి. దారిలో ఎవరైనా వారినిగురించి ప్రశ్నిస్తే మత్స్యదేశంలో నివసించడానికి పోతున్నామని సమాధానం చెపుతున్నారు.

అలా ప్రయాణం చేస్తూచేస్తూ ఒకజనపదం ప్రవేశించారు. అక్కడ ద్రౌపది ధర్మరాజు నుద్దేశించి—మహారాజా సస్యశ్యామలమైన భూములు నాకు కనిపిస్తున్నాయి. ఇక్కడనుంచి సుఖంగా ప్రయాణం చేయటానికి దారులు గోచరిస్తున్నాయి. ఆలోచించిచూస్తే విరాటనగరం చాలా దూరంగా ఉండేమో ననిపిస్తోంది. ఇంతవరకూ జరిగిన ప్రయాణంతో నేను చాలా అలసిపోయాను. ఇంక అడుగు వెయ్యలేను. ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసికోవడం మంచిది — అన్నది.

క్షిప్రమస్మాన్ విజానీయుర్మనుష్యా నాత్ర సంశయః
తతో ద్వాదశ వర్షాణి ప్రవేష్టవ్యం వనే పునః
ఏకస్మిన్నపి విజ్ఞాతే ప్రతిజ్ఞాతం హి నస్తథా.
ఇయం కూటే మనుష్యేంద్ర గహనా మహతీ శమీ
భీమశాఖా దురారోహా శ్మశానస్య సమీపతః.
న చాపి విద్యతే కశ్చిన్మనుష్య ఇతి మే మతిః
యోఽస్మాన్ నిదధతో ద్రష్టా భవేచ్ఛస్త్రాణి పాండవాః.
ఉత్పథే హి వనే జాతా మృగవ్యాళనిషేవితే
సమీపే చ స్మశానస్య గహనస్య విశేషతః.
సమాధాయాయుధం శమ్యాం గచ్ఛామో నగరం ప్రతి
ఏవమత్ర యథా యోగం విహరిష్యామ భారత
ఏవముక్త్వా స రాజానం ధర్మరాజం యుధిష్ఠిరం
ప్రచక్రమే నిధానాయ శస్త్రాణాం భరతర్షభ.
యేన దేవాన్ మనుష్యాంశ్చ సర్వాంశ్చైకరథోఽజయత్
స్ఫీతాంజనపదాంశ్చాన్యాన జయత్ కురుపుంగవః
తదుదారం మహాఘోషం సంపన్నబలసూదనం
అపజ్యమకరోత్ పార్థో గాండీవం సుభయంకరం.
యేన వీరః కురుక్షేత్రమభ్యరక్షత్ పరంతపః
అముంచద్ ధనుషస్తస్య జ్యామక్షయ్యాం యుధిష్ఠిరః.
పాంచాలాన్ యేన సంగ్రామే భీమసేనోఽజయత్ప్రభుః
ప్రత్యషేధద్ బహూనేకః సపత్నాంశ్చైవ దిగ్జయే
నిశమ్య యస్య విస్ఫారం వ్యద్రవంత రణాత్ పరే
పర్వతస్యేవ దీర్ణస్య విస్ఫోటమశనేరివ.
సైంధవం యేన రాజానం పర్యామృషిత వానఘ
జ్యాపాశం ధనుషస్తస్య భీమసేనోఽవతారయత్.

---

ఆమె మాటలువిని ధర్మరాజు ఆ రోజుతోనే వనవాసం ముగించి అజ్ఞానవాసం ఆరంభించాలికనుక వనం విడిచిపెట్టి వేయాలని అర్జునునితో చెపుతూ ఆమెను అతని భుజస్కంధాలమీద వహించమన్నాడు. గజరాజ సదృశ బలిష్ఠుడైన విజయుడు అగ్రజుని ఆజ్ఞానుసారం ద్రౌపదిని తన భుజాలపై కెత్తుకుని విరాటనగరపర్యంతం తీసుకొని వచ్చి సరిహద్దులు సమీపిస్తూండగా ఆమెను క్రిందికి దించాడు.

ధర్మరాజు అర్జునునివైపు తిరిగి పార్థా! మన ఆయుధాలతో ఈ నగరప్రవేశం చేసినట్లయితే ఈ పౌరులందరూ మనలను చూచి భయపడి తీరతారు. పైగా నీ గాండీవం ఉన్నదే అది లోక విఖ్యాతమైనది. దాని నెరుగనివారు లేరు. కనుక ఈ ఆయుధాలను ఎక్కడో ఒకచోట రహస్యంగా ఉంచి వెళ్ళాలి. మనలో ఏ ఒకరిని ఎవరు గుర్తించినా తిరిగి పన్నెండు సంవత్సరాలూ అరణ్యవాసం తప్పదు—అన్నాడు.

మహారాజా! ఈ శ్మశాన సమీపంలో అరణ్యంవలె ఉన్న అవృక్షాలమధ్య కనిపించే జమ్మిచెట్టు చూడండి. విశాల శాఖలతో నిండిన ఆ మహావృక్షం వైపు ఎవరూ వెళ్ళడానికి సాహసించరు. ఇప్పుడు ఈ చుట్టుప్రక్కల మనుష్యులు కూడా ఎవరూ లేరు. ఆ చెట్టు బాటకు చాలా దూరంగా ఉంది. దానిపరిసరాలలో సింహవ్యాఘ్ర భల్లూకాలు విచ్చలవిడిగా చరిస్తున్నాయి. వల్లకాటికి సమీపంలో ఉండటంవల్ల ఈ వైపు జనం రాకపోకలు సాగించే అవకాశం లేదు. ఒకవేళ వచ్చినా ఆ చెట్టు ఎక్కవలసిన అగత్యమూ లేదు. అందుచేత ఈ ఆయుధాలను ఆ శమీవృక్షం మీద

అజయత్ పశ్చిమామాశాం ధనుషా యేనపాండవః
మాద్రీపుత్రో మహాబాహుస్తామ్రాస్యోమితభాషితా
తస్య మౌర్వీమపాకర్షచ్ఛూరః సంక్రందనో యుధి
కులే నాస్తి సమో రూపే యస్యేతి నకులః స్మృతః
దక్షిణాం దక్షిణాచారో దిశం యేనాజయత్ ప్రభుః
అపజ్యమకరోద్వీరః సహదేవస్తదాయుధం.
ఖడ్గాంశ్చ దీప్తాన్ దీర్ఘాంశ్చ కలాపాంశ్చ మహాధనాన్
విపాఠాన్ క్షురధారాంశ్చ ధనుర్భిర్నిదధుః సహ.
అథాన్వశాసన్నకులం కుంతీపుత్రో యుధిష్ఠిరః
ఆరుహ్యేమాం శమీం వీరధనూంష్యేతాని నిక్షిప
తాముపారుహ్య నకులో ధనూంషి నిదధే స్వయం
యాని తస్యావకాశాని దివ్యరూపాణ్యమన్యత.
యత్ర చాపశ్యత స వై తిరోవర్షాణి వర్షతి
తత్ర తాని దృఢైః పాశైః సుగాఢం పర్యబంధత
శరీరం చ మృతస్యైకం సమబధ్నంత పాండవాః
వివర్జయిష్యంతి నరా దూరాదేవ శమీమిమాం.
ఆబద్ధం శవమత్రేతి గంధమాఘ్రాయ పూతికం
అశీతిశతవర్షేయం మాతా న ఇతి వాదినః.
కులధర్మోఽయమస్మాకం పూర్వైరాచరితోఽపి వా
సమాసజ్జ్యాథ వృక్షేఽస్మిన్నితి వై వ్యాహరంతి తే
ఆగోపాలావిపాలేభ్య ఆచక్షాణాః పరంతపాః
ఆజగ్ముర్నగరాభ్యాశం పార్థాః శత్రునిబర్హణాః.
జయో జయంతో విజయో జయత్సేనో జయద్బలః

---

గుప్తపరచి నగరప్రవేశం చేసి ఈ సంవత్సరమూ గడుపుదాం—అన్నాడు అర్జునుడు.

దేవదానవమానవులను అవలీలగా జయించగల గాండీవం యొక్క నారిని అర్జునుడు విసంధించాడు. ధర్మరాజు కూడా తన ధనస్సుయొక్క నారిని మెక్కుడించాడు. దిగ్విజయయాత్రలో అనేకవీరులను పరాజితులను చేసిన, అరణ్యవాస సమయంలో సైంధవుని పరాభూతుని చేసిన ధనుస్సుయొక్క అల్లెత్రాటిని భీమసేనుడు విముక్తం చేశాడు. కురువంశంలో అంతటిసౌందర్యశాలి లేడని పేరుపడ్డ నకులుడు అన్నలను అనుసరించాడు. సదాచార సంపన్నుడూ శాస్త్రజ్ఞానకుశలుడూ దక్షిణదిగ్విజేత అయిన సహదేవుడు కూడా అన్నలనే అనుకరించాడు. తూణీరఖడ్గ విపాఠాది ఆయుధాలతో పాటు పరశు పట్టిస శూల ముద్గర ప్రముఖాయుధాలు అన్నీ ఒక చోటకు చేర్చారు.

అప్పుడు ధర్మరాజు నకులుని పిలిచి ఈ ఆయుధాలన్నీ ఆ శమీవృక్షం మీద భద్రపరచమని చెప్పగా నకులుడు ఆ చెట్టు నెక్కి అతిగుప్తమైన ప్రదేశంలో వాటిని ఉంచాడు. ఏ విధంగా వర్షం కురిసినా ఆ ఆయుధాలకు సోకని ప్రాంతంలో వాటిని భద్రపరచి దృఢపాశాలతో బంధించి ఆ సమీపంలోనే ఉన్న ఒక వృద్ధవనితాశవం ఆ చెట్టుకు వ్రేలాడదీశారు. అది చూసిన కొందరు గోపాలురు అదేమని ప్రశ్నించగా ఆమె తమతల్లి అనీ నూటఎనభై సంవత్సరాలు జీవించిన వారిని తమ వంశాచారానుసారం మరణానంతరం ఆవిధంగా బంధిస్తారనీ సమాధానం చెప్పారు. (అయితే ఇక్కడ అసత్యదోషం లేదా? అనే శంక రావచ్చు. సర్వశాస్త్రవిదుడైన ధర్మరాజు అస్త్రసంరక్షరూపమైన మాతృత్వమును దానియం దారోపించాడు. అస్త్రబంధనమే శవబంధనమని ధర్మజుని ఉక్తిలోని అంతరార్థం).

అక్కడనుండి విరాటనగరం పోతూ వారు తమ పేరులకు సంకేతంగా జయ, జయంత, విజయ. జయత్సేన, జయద్బల అని వ్యవహరించుకోవాలని

ఇతి గుహ్యాని నామాని చక్రే తేషాం యుధిష్ఠిరః
తతో యథాప్రతిజ్ఞాభిః ప్రావిశ న్నగరం మహత్
అజ్ఞాతచర్యాం వత్స్యంతో రాష్ట్రే వర్షం త్రయోదశం,

## ఆఱవ అధ్యాయం

విరాటనగరం రమ్యం గచ్ఛమానో యుధిష్ఠిరః
అస్తువన్మనసా దేవీం దుర్గాం త్రిభువనేశ్వరీం.
యశోదగర్భసంభూతాం నారాయణవరప్రియాం
నందగోపకులేజాతాం మంగళ్యాం కులవర్ధినీం.
కంసవిద్రావణకరీ మసురాణాం క్షయంకరీం
శిలాతటవినిక్షిప్తా మాకాశం ప్రతి గామినీం.
వాసుదేవస్య భగినీం దివ్యమాల్యావిభూషితాం
దివ్యాంబరధరాం దేవీం ఖడ్గఖేటకధారిణీం.
భారావతరణే పుణ్యే యే స్మరంతి సదాశివాం
తాన్ వై తారయసే పాపాత్ పంకే గామివ దుర్బలాం.
స్తోతుం ప్రచక్రమే భూయో వివిధైః స్తోత్రసంభవైః
ఆమంత్ర్య దర్శనాకాంక్షీ రాజా దేవీం సహానుజః
నమోస్తు వరదే కృష్ణే. కుమారి బ్రహ్మచారిణి
బాలార్కసదృశాకారే పూర్ణచంద్రనిభాననే.
చతుర్భుజే చతుర్వక్త్రే పీనశ్రోణిపయోధరే
మయూరపింఛవలయే కేయూరాంగదధారిణి
భాసి దేవి యథా పద్మా నారాయణపరిగ్రహః
స్వరూపం బ్రహ్మచర్యం చ విశదం గగనేశ్వరి
కృష్ణచ్ఛవిసమా కృష్ణా సంకర్షణసమాననా.
బిభ్రతీ విపులా బాహూ శక్రధ్వజసముచ్ఛ్రయా
పాత్రీ చ పంకజీ ఘంటీ స్త్రీవిశుద్ధా చ యా భువి

ఆ వ్యవహారం తమలో తాము మాట్లాడుకునేటప్పుడే ఉండాలనీ ధర్మరాజు చెప్పాడు. అనంతరం అజ్ఞాతవాసదీక్షా ప్రతిజ్ఞులై నగరంలో ప్రవేశించారు.

## ఆఱవ అధ్యాయం

రమణీయమైన విరాట నగరంలో అడుగు పెట్టబోతూ ధర్మరాజు సర్వలోకేశ్వరియైన దుర్గను ప్రార్థిస్తున్నాడు.

నారాయణునకు అత్యంతప్రియమైన మాతృదేవీ! నీకు నమస్కారము. నందగోపకులంలో యశోదాగర్భాన అవతరించినదానవు. సర్వజీవకోటికీ సుఖ, శుభాలు కలిగించే దానివి. కంసునికి సదా భయం కలిగించేదానివి. వానిచేత రాతిపై విసరబడి గగనతలానికి ఎగిరిపోయినదానివి. గంధమాల్యానులేపన శోభనాంగివి. సర్వాభరణభూషితురాలవు. చీనిచీనాంబర ధారిణివి. గదాఖడ్గశూల తోమర భిందివాల పరశు ముద్గర పరిఘాది సర్వ ఆయుధధారిణివి. శ్రీకృష్ణుని సహోదరివి. స్మరణమాత్రంచేత సమస్త క్లేశాలనూ హరించి సుఖపరంపరలను చేకూర్చేదానవు. బక్కచిక్కిన ఆవు బురదలో కూరుకుపోతే దానిని పైకితీసి రక్షించే పురుషునివలె నువ్వు నిన్ను అర్చించే భక్తులకు దుఃఖాలు నివారిస్తావు. నీకు నమస్కారము.

ఈ విధంగా ధర్మరాజు తన సోదరుల చేత కూడా దుర్గాస్తవం చేయించి ఆ జగత్కళ్యాణ

పాశం ధనుర్మహాచక్రం వివిధాన్యాయుధాని చ
కుండలాభ్యాం సుపూర్ణాభ్యాం కర్ణాభ్యాం చ విభూషితా.
చంద్రవిస్పర్ధినా దేవి ముఖేన త్వం విరాజసే
ముకుటేన విచిత్రేణ కేశబంధేన శోభినా.
భుజంగభోగవాసేన శ్రోణిసూత్రేణ రాజతా
విభ్రాజసే చావబద్ధేన భోగేనేవేహ మందరః
ధ్వజేన శిఖిపింఛానాముచ్ఛ్రితేన విరాజసే
కౌమారం వ్రతమాస్థాయ త్రిదివం పావితం త్వయా
తేన త్వం స్తూయసే దేవి త్రిదశైః పూజ్యసేఽపి చ
త్రైలోక్యరక్షణార్థాయ మహిషాసురనాశిని
ప్రసన్నా మే సురశ్రేష్ఠే దయాం కురు శివా భవ
జయా త్వం విజయా చైవ సంగ్రామే చ జయప్రదా
మమాపి విజయం దేహి వరదా త్వం చ సాంప్రతం
వింధ్యే చైవ నగశ్రేష్ఠే తవస్థానం హి శాశ్వతం
కాళి కాళి మహాకాళి ఖడ్గఖట్వాంగ ధారిణి.
కృతానుయాత్రా భూతైస్త్వం వరదా కామచారిణి
భారావతారే యే చ త్వాం సంస్మరిష్యంతి మానవాః.
ప్రణమంతి చ యే త్వాం హి ప్రభాతే తు నరాభువి
న తేషాం దుర్లభం కించిత్ పుత్రతో ధనతోఽపి వా
దుర్గాత్ తారయసే దుర్గే తత్ త్వం దుర్గా స్మృతా జనైః
కాంతారేష్వవసన్నానాం మగ్నానాం చ మహార్ణవే.
దస్యుభిర్వా నిరుద్ధానాం త్వంగతిః పరమా నృణాం
జలప్రతరణే చైవ కాంతారేష్వటవీషు చ.
యే స్మరంతి మహాదేవి న చ సీదంతి తే నరాః

---

రూపిణిని మనసుదీర ప్రస్తుతిస్తున్నాడు.

నీవు కుమారివి. బ్రహ్మచారిణివి. బాలార్కుని వలె అరుణవర్ణ దేహము కలదానివి. చతుర్భుజ యుతుడైన విష్ణు స్వరూపురాలవు చతుర్ముఖ బ్రహ్మరూపిణివి నువ్వే. శరదిందుబింబ సదృశ వదనవు. సైకత శ్రోణివి. కఠినోత్తుంగ వక్షోజమండలివి. మయూరపింఛ ధారిణివి. అంగద కేయూర కటకాది సర్వభూషణ భూషితాంగివి. నారాయణుని అర్థాంగియైన శ్రీదేవితో సమమైన శోభ గలదానివి. కృష్ణునితో సమమైన దేహచ్ఛాయ గలదానవు. గగనచారిణీ! నీ రూప బ్రహ్మచర్యాలు అసమానమైనవి. సంకర్షణ ముఖ మండలంతో నీవదనాన్ని పోలుస్తున్నారు. వరద అభయాది ముద్రలు ధరించే నీ బాహువులు ఇంద్రధ్వజ సమోన్నతాలు, నీ మూడవ హస్తంలో పాత్ర ఉన్నది. నాల్గవదానిలో కమలం ఉన్నది. మిగిలిన హస్తాలలో ఘంట, పాశము, ధనుస్సు, అసుర భీకరమైన చక్రమూ విరాజిల్లుతున్నాయి. ఈ విశ్వంలో నీకంటె భిన్నమైన విశుద్ధ స్త్రీ స్వరూపం లేదు. మణి కుండలాలతో నీ కర్ణయుగళమే కాక ముఖసీమకూడా ప్రకాశిస్తోంది. చిత్రాతిచిత్ర కిరీట ధారిణివై చంద్రుని పరిహసించే ముఖకాంతితో ప్రకాశించే నీ వినీల కేశపాశం తుమ్మెద రెక్కలను అదఃకరిస్తూ నల్లత్రాచువలె నిగనిగ లాడుతోంది. వాసుకిచే పరివృతమైన మందరాచలంవలె నీశ్రోణి స్థలం సూత్రబంధంతో శోభిస్తోంది. మయూర పింఛ లాంఛితమైన నీ పతాకం ఉన్నతాకాశవీథిలో విచిత్ర కాంతు లీనుతోంది.

బ్రహ్మచర్య నియమంతో ముల్లోకాలనూ పవిత్రం చేసే నిన్ను దేవతాగణాలన్నీ అర్చిస్తున్నాయి. లోకసంరక్షణార్థం మహిషాసురుని మర్దించిన ఓ ఈశ్వరీ! మాపై అనుగ్రహముంచి నీదర్శన

త్వం కీర్తిః శ్రీర్ధృతిః సిద్ధిర్హ్రీర్విద్యా సంతతిర్మతిః
సంధ్యా రాత్రిః ప్రభా నిద్రా జ్యోత్స్నా కాంతిః క్షమా దయా
నృణాం చ బంధనం మోహం పుత్రనాశం ధనక్షయం.
వ్యాధిం మృత్యుం భయం చైవ పూజితా నాశయిష్యసి
సోఽహం రాజ్యాత్ పరిభ్రష్టః శరణం త్వాం ప్రపన్నవాన్.
ప్రణతశ్చ యథా మూర్ధ్నా తవ దేవి సురేశ్వరి
త్రాహిమాం పద్మపత్రాక్షి సత్యే సత్యా భవస్వ నః.
శరణం భవ మే దుర్గే శరణ్యే భక్తవత్సలే
ఏవంస్తుతా హి సా దేవీ దర్శయామాస పాండవం
ఉపగమ్య తు రాజానమిదం వచనమబ్రవీత్
శ్రుణు రాజన్ మహాబాహో మదీయం వచనం ప్రభో
భవిష్యత్యచిరాదేవ సంగ్రామే విజయస్తవ
మమ ప్రసాదాన్నిర్జిత్య హత్వా కౌరవవాహినీం.
రాజ్యం నిష్కంటకం కృత్వా భోక్ష్యసే మేదినీం పునః
భ్రాతృభిః సహితో రాజన్ ప్రీతిం ప్రాప్స్యసి పుష్కలాం.
మత్ప్రసాదాచ్చ తే సౌఖ్యమారోగ్యంచ భవిష్యతి
యే చ సంకీర్తయిష్యంతి లోకే విగతకల్మషాః.
తేషాం తుష్టా ప్రదాస్యామి రాజ్యమాయుర్వపుః సుతం
ప్రవాసే నగరే చాపి సంగ్రామే శత్రుసంకటే,
అటవ్యాం దుర్గకాంతారే సాగరే గహనే గిరౌ

---

భాగ్యం లభింపజేసి సుఖ సంతోషాలు కలిగించు. జయ విజయ రూపిణీ! మా యందు ప్రసన్నురాలవై మాకు విజయం ప్రసాదించు. పర్వత శ్రేష్ఠమైన వింధ్యాచలం నీ నివాసస్థానం. మహాకాళీ! ఖడ్గ ఖట్వాంగ ధారిణివైన నిన్ను ప్రార్థించే భక్తుల కోరికలీడేరుస్తావని ప్రాజ్ఞులు చెపుతున్నారు. సర్వ క్లేశ నివారణార్థం అనుదినం ఉషఃకాలంలో నిన్ను సేవించే వారికి ధనధాన్యపుత్రసంపదలు లభించడం పరమ సులభం. దుఃఖాలనుండి తరింపజేసే మహాశక్తివి గనుకనే నిన్ను "దుర్గా" అని పిలుస్తున్నారు. మహాక్లేశాలలో పడిపోయిన వారికీ అగాధ సాగరాలలో మునిగిపోయేవారికీ చోరులచేత పీడింపబడేవారికీ నువ్వే గతి. అరణ్యాలలో దుర్గమ ప్రాంతలలో చరించేవారు నిన్ను స్మరించిన ఉత్తర క్షణంలో ఏ క్లేశమూ లేకుండా సుఖంగా ఉండకలరు.

కీర్తి శ్రీ హ్రీ ధృతి మతి సిద్ధి విద్యా సంతతి సంధ్య రాత్రి ప్రభ నిద్ర జోత్స్న కాంతీ క్షమా దయాది రూపాలన్నీ నువ్వే. నిన్ను అర్చించి ఆరాధించే వారికి బంధనమోహాలూ ధన పుత్రక్షయాలూ వ్యాధి మృత్యుభయాలూ ఉండవు. నేను రాజ్యభ్రష్టుడనై నిన్ను శరణు వేడుతున్నాను. కమలదళనయనా! దేవదేవేశ్వరీ! నీపద పద్మాలకు నమస్కరిస్తున్నాను. నీసత్య స్వరూపంతో సాక్షాత్కరించి మమ్ము సంరక్షించు. శరణాగతత్రాణ బిరుద లాంఛనీ! హైమవతీ! మమ్ము అనుగ్రహించు – అని ధర్మరాజు ప్రార్థించగా ప్రసన్నురాలై దుర్గ స్వస్వరూపంతో సాక్షాత్కరించి ఇలా అంటున్నది.

మహారాజా! రానున్న సంగ్రామంలో నీకు విజయం లభిస్తుంది. నా అనుగ్రహంతో కౌరవ సేనను హతమార్చి నిష్కంటకంగా రాజ్యంపాలిస్తూ సోదర సహితుడవై సర్వసుఖాలూ అనుభవిస్తావు. మీకు ఆయురారోగ్యాలు ప్రసాదిస్తున్నాను.

ధర్మ నందనా! నువ్వు చేసిన ఈ స్తోత్రంతో

యే స్మరిష్యంతి మాం, రాజన్ యథాహం భవతా స్మృతా.
న తేషాం దుర్లభం కించిదస్మిన్లోకే భవిష్యతి
ఇదం స్తోత్రవరం భక్త్యా శృణుయాద్ వా పఠేత్ వా
తస్య సర్వాణి కార్యాణి సిద్ధిం యాస్యంతి పాండవాః
మత్ప్రసాదాచ్చ వః సర్వాన్ విరాటనగరే స్థితాన్
న ప్రజ్ఞాస్యంతి కురవో నరా వా తన్నివాసినః
ఇత్యుక్త్వా వరదా దేవీ యుధిష్ఠిరమరిందమం.
రక్షాం కృత్వా చ పాండూనాం తత్రైవాంతరధీయత.

## ఏడవ అధ్యాయం

తతస్తు తే పుణ్యతమాం శివాం శుభాం
మహర్షి గంధర్వ నిషేవితోదకాం
త్రిలోకకాంతా మవతీర్య జాహ్నవీ
మృషీంశ్చ దేవాంశ్చ పితౄనతర్పయన్.
వరప్రదానం హ్యనుచింత్య పార్థివో
హుతాగ్నిహోత్రః కృతజప్యమంగళః
దిశం త్వథైంద్రీమభితః ప్రపేదివాన్
కృతాంజలిర్ధర్మముపాహ్వయచ్ఛనైః.
వరప్రదానం మమ దత్తవాన్ పితా
ప్రసన్నచేతా వరదః ప్రజాపతిః
జలార్థినో మే తృషితస్య సోదరా
మయా ప్రయుక్తా విపినస్థజలాశయం.
నిపాతితా యక్షవరేణ తే వనే
మహాహవే వజ్రభృతేవ దానవాః
మయా చ గత్వా వరగోఽభితోషితో
వివక్షతా ప్రశ్నసముచ్చయం గురుః.

నన్ను స్తుతించే వారికి సర్వపాపాలూ నాశనమవుతాయి. రాజ్య భోగాలూ రోగరహితమైన ఆయుర్దాయమూ పుత్రపౌత్రాభివృద్ధీ ప్రాప్తిస్తాయి. పరదేశాలలో ఉన్నవాడు కాని స్వదేశంలోనే సంగ్రామం సాగించే వాడు కాని శత్రుపీడితుడు కాని ఘోరారణ్యవాసి కాని దుర్గమప్రదేశచారి కాని సముద్రమధ్యగామి కాని పర్వతప్రాంత సంచారి కాని ఈ విధంగా నన్ను స్తుతించిన మరు క్షణంలో సర్వక్లేశ విముక్తుడై పరమసుఖా లనుభవిస్తాడు. దీనిని భక్తితో చదివినా విన్నా సర్వకార్యాలూ సిద్ధిస్తాయి.

విరాట నగరంలో మీరు నివసించే సంవత్సర కాలమూ ఆ నగరవాసులు గాని కౌరవులు కాని మిమ్ము గుర్తుపట్టకుండా ఉంచే భారం నాది- అని వరం అనుగ్రహించి దుర్గ అదృశ్యురాలయింది.

## ఏడవ అధ్యాయం

మహర్షి దేవతా సేవితమైన పవిత్ర గంగానదిలో స్నానం చేసి దేవతలకూ ఋషులకూ పితృదేవతలకూ తర్పణాలిచ్చి అగ్నిహోత్రం జపం పూర్తిచేసికొని మంగళమయస్తోత్రాలు పఠించి ధర్మదేవతను స్తుతించి ఆ దేవత ప్రసాదించిన వరాలు స్మరించి ఈ విధంగా ప్రస్తుతించసాగాడు.

నాతండ్రియైనధర్మదేవుడు సర్వవరప్రదాత. అయనే ప్రజాపతి. ఆ మహాపురుషుడు ప్రసన్నుడై నాకు వరాలు అనుగ్రహించాడు. దాహపీడితుడనై నీరుతెమ్మని నా సోదరులకు ఆజ్ఞాపించగా వారు వెళ్లినప్పుడు యక్షరూపంలోవచ్చి వారిని భూపతితులను చేశాడు. అప్పుడు నేనువెళ్లి ఆ ధర్మమూర్తి

స మే ప్రసన్నో భగవాన్ వరం దదౌ
పరిష్వజంశ్చాహ తథైవ సౌహృదాత్
వృణీష్వ యద్ వాంఛసి పాండునందన
స్థితోఽంతరిక్షే వరదోఽస్మి పశ్యతాం.
స వై మయోక్తో వరదః పితా ప్రభుః
సదైవ మే ధర్మరతా మతిర్భవేత్
ఇమే చ జీవంతు మమానుజాః ప్రభో
వపుశ్చ రూపం చ బలం తథాప్నుయుః.
క్షమా చ కీర్తిశ్చ యథేష్టతో భవేద్
వ్రతం చ సత్యం చ సమాప్తిరేవ చ
వరో మమైషోఽస్తు యథానుకీర్తితో
న తన్మృషా దేవవరో యథాబ్రవీత్.
ఇత్యేవముక్త్వాథ ధర్మాత్మా ధర్మమేవానుచింతయన్
తదైవ తత్ప్రసాదేన రూపమేవాభజత్ స్వకం.
స వై ద్విజాతిస్తరుణస్త్రిదండధృక్
కమండలూష్ణీషధరోఽన్వజాయత
సురక్తమాంజిష్ఠవరాంబరః శిఖీ
పవిత్రపాణిర్దదృశే తదద్భుతం.
తథైవ తేషామపి ధర్మచారిణాం
యథేప్సితా హ్యాభరణాంబరస్రజః
క్షణేన రాజన్నభవన్మహాత్మనాం
ప్రశస్తధర్మాగ్ర్యఫలాభికాంక్షిణాం.
తతో విరాటం ప్రథమం యుధిష్ఠిరో
రాజా సభాయాముపవిష్టమావ్రజత్
వైదూర్యరూపాన్ ప్రతిముచ్య కాంచనా
నక్షాన్ స కక్షే పరిగృహ్య వాససా.
నరాధిపో రాష్ట్రపతిం యశస్విన
మహాయశాః కౌరవవంశవర్ధనః
మహానుభావో నరరాజసత్కృతో
దురాసదస్తీక్ష్ణవిషో యథోరగః.

---

ప్రశ్నలకు సమాధానాలు చెప్పి సంతృప్తి కలిగించాను. అప్పుడాయన ఆనందపరవశుడై నన్ను కౌగలించుకుని వరాలు కోరుకోమన్నాడు. ఆకాశ వీధిలోనుండి మేఘగంభీరస్వరంతో పలికే ఆయన మాటలు విని నేను చేతులు జోడించి మహాప్రభూ! నాబుద్ధి ఎల్లవేళల ధర్మమార్గంలోనే చరించేటట్లు చెయ్యి. నా కనిష్ఠ సోదరుడైన సహదేవుని పునర్జీవితుని చేసి వాని సౌందర్య తేజోబలాదులతో బాటు ఓజస్సుకూడా అనుగ్రహించు. క్షమా కీర్తి మాకు ప్రసాదించు. సదా సత్యవ్రతనిష్ఠులమై మెలగేటట్లు చూడు, అని నేను కోరగా ఆయన సంతోషంతో అనుమతించాడు. అటువంటి ధర్మప్రభువుకు అభివాదాలు – అని ధర్మరాజు ధర్మదేవతనే స్మరిస్తూ నిలబడగా అజ్ఞాతవాసయోగ్యమైన ఆకారం అతనికి కలిగింది. ఒకచేత కమండలం రెండవచేత త్రిదండం శిరస్సున ఉష్ణీషముతో తరుణ బ్రాహ్మణుడై కాషాయాంబరాలతో శిఖాకుశలతో ధర్మరాజురూపం ఎరిగినవారు కూడా గుర్తుపట్టలేనంతగా మారిపోయింది.

అదేవిధంగా భీమార్జునాదులకు కూడా అజ్ఞాతవాసార్హ రూపాలు ఏర్పడ్డాయి. సత్యప్రతిజ్ఞులూ, ధర్మపరాయణులూ కావటం మూలానే పాండవులకు ధర్మదేవుని అనుగ్రహంవల్ల ఇతరులు గుర్తుపట్టలేని రూపురేఖలూ వేష భూషణాలూ ప్రాప్తించాయి. వైడూర్య మాణిక్య సువర్ణ వర్ణాలుగల పాచికలు మూటగట్టి చంకబెట్టుకుని ధర్మరాజు విరటుడు సింహాసనాసీనుడై ఉండగా ఆ సభాస్థలివైపు వెళ్లాడు.

మత్స్యదేశాధీశుడైన విరటుడు కురువంశీయుడైన ధర్మజునివలెనే విఖ్యాత కీర్తివంతుడు.

బలేన రూపేణ నరర్షభో మహా
నపూర్వరూపేణ యథామర స్తథా
మహాభ్రజాలైరివ సంవృతో రవి
ర్యథానలో భస్మవృత్తశ్చ వీర్యవాన్
తమాపతంతం ప్రసమీక్ష్య పాండవం
విరాటరాడిందుమివాభ్రసంవృతం
సమాగతం పూర్ణశశిప్రభాననం
మహానుభావం న చిరేణ దృష్టవాన్.
మంత్రిద్విజాన్ సూతముఖాన్ విశ స్తథా
యే చాపి కేచిత్ పరితః సమాసతే
పప్రచ్ఛ కోఽయం ప్రథమం సమేయివాన్
నృపోపమోఽయం సమవేక్షతే సభాం.
న తు ద్విజోఽయం భవితా నరోత్తమః
పతిః పృథివ్యా ఇతి మే మనోగతం
న చాస్య దాసో న రథో న కుంజరః
సమీపతో భ్రాజతి చాయమింద్రవత్
శరీరలింగై రుపసూచితో హ్యయం
మూర్ధాభిషిక్త ఇతి మే మనోగతం
సమీపమాయాతి చ మే గతవ్యథో
యథా గజస్తామరసీం మదోత్కటః.
వితర్కయంతం తు నరర్షభ స్తథా
యుధిష్ఠిరోఽభ్యేత్య విరాటమబ్రవీత్
సమ్రాడ్విజానాత్వి హ జీవనార్థినం
వినష్టసర్వస్వముపాగతం ద్విజం.
ఇహాహమిచ్ఛామి తవానఘాంతికే
వస్తుం యథా కామచర స్తథా విభో
తమబ్రవీత్ స్వాగతమిత్యనంతరం
రాజా ప్రహృష్టః ప్రతిసంగృహాణ చ.
తం రాజసింహం ప్రతిగృహ్య రాజా
ప్రీత్యాఽఽత్మనా చైనమిదం బభాషే

ధర్మరాజు స్వరరాజన్యులచేత సమ్మానాలు పొందినవాడు. విషసర్పంవలె దుర్ధర్షుడు. దివ్యస్వరూపుడు. రూపబలాకారాలలో మానవాతీతుడైన ఆ ధర్మరాజు మేఘచ్ఛన్నుడైన సూర్యునివలె నివురుగప్పిన నిప్పువలె వస్త్రభూషణాచ్ఛాదనలతో మరుగుపడి ఉన్నాడు. అతని పరాక్రమం యుధిష్ఠిరనామంలోనే వ్యక్తమౌతుంది. మేఘావృతమైన పూర్ణిమచంద్రునివలె ప్రకాశించే ముఖశోభతో వచ్చే ధర్మరాజు సభాభవనంలో అడుగుపెట్టిన క్షణంలోనే విరటుని దృష్టి అతనిపై కేంద్రీకృతమైంది.

ఉత్తరక్షణంలో విరాటనృపతి మంత్రి ద్విజ సూతమాగధ వైశ్యులనూ, తన పార్శ్వవర్తులనూ ఉద్దేశించి - ఓ సభ్యులారా ! మన సభాభవనానికి వచ్చే ఈ నూతన పురుషుని మీరెవరైనా ఎరుగుదురా? మనిషిని చూస్తే మహారాజులా ఉన్నాడు. వేషమేమో బ్రహ్మణవేషం. అంతమాత్రం చేత బ్రాహ్మణుడని నేను నమ్మలేక పోతున్నాను. పోనీ మహారాజందామా చతురంగ బలాలూ లేవు దాసదాసీజనమూ లేరు. అనుశీలించి చూస్తే అమరాధీశుడులా ఉన్నాడు. శరీరలక్షణాలు చూస్తే మూర్ధాభిషిక్తుడైన సమ్రాట్టులా ఉన్నాడు. వీని ప్రవేశం చూద్దామా అంటే కమల సరోవరంలో ప్రవేశించే మత్తేభంలా నిర్భయంగా మన సభలో ప్రవేశిస్తున్నాడు-అని అంటూండగానే ధర్మరాజు ఆ నరపాలుని సమీపించి మహారాజా ! నేను బ్రాహ్మణుడను. నా సర్వసంపదలూ కోలుపోయి జీవయాత్ర సాగించే కోరికతో నీవద్దకు వచ్చాను. నీ ఆజ్ఞానుసారం ప్రవర్తిస్తాను - అన్నాడు.

ఆ మాటలు విని ఓ భూసురవర్యా ! నీకు

కామేన తాతాభివదామ్యహం త్వాం
కస్యాసి రాజ్ఞో విషయాదిహాగతః.
గోత్రం చ నామాపి చ శంస తత్త్వతః
కిం చాపి శిల్పం తవ విద్యతే కృతం.
యుధిష్ఠిరస్యాసమహం పురా సఖా
వైయాఘ్రపద్యః పునరస్మి విప్రః
అక్షాన్ ప్రయోక్తుం కుశలోఽస్మి దేవినాం
కంకేతి నామ్నాస్మి విరాట విశ్రుతః.
వదామి తే హంత వరం యమిచ్ఛసి
ప్రశాధి మత్స్యాన్ వశగో హ్యహం తవ
ప్రియాశ్చ ధూర్తా మమ దేవినః సదా
భవాంశ్చ దేవోపమ రాజ్యమర్హతి.
ప్రాప్తో వివాదః ప్రథమం విశాంపతే
న విద్యతే కం చ న మత్స్య హీనతః
న మే జితః కశ్చన ధారయేద్ ధనం
వరో మమైషోఽస్తు తవ ప్రసాదజః.
హన్యామవశ్యం యది తేఽప్రియం చరేత్
ప్రవ్రాజయేయుం విషయాద్ ద్విజాంస్తథా
శృణ్వంతు మే జానపదాః సమాగతాః
కంకో యథాహం విషయే ప్రభుస్తథా
సమానయానో భవితాసి మే సఖా
ప్రభూతవస్త్రో బహుపానభోజనః
పశ్యేస్త్వమంతశ్చ బహిశ్చ సర్వదా
కృతం చ తే ద్వారమపావృతం మయా.
యే త్వానువాదేఽయురవృత్తి కర్శితా
బ్రూయాశ్చ తేషాం వచనేన మాం సదా
దాస్యామి సర్వం తదహం న సంశయో
న తే భయం విద్యపి సంనిధౌ మమ.
ఏవం తు రాజ్ఞః ప్రథమః సమాగమో
బభూవ మాత్స్యస్య యుధిష్ఠిరస్య చ

---

స్వాగతము. అని పలికి విరటరాజు యథావిధిగా స్వాగత సత్కారాలు జరిపి ఉచితాసన మిచ్చి ఓ మహాపురుషా! తమ రేప్రాంతంవారు? తమ గోత్ర నామా లేమిటి? ఏ రాజ్యం నుండి వస్తున్నారు? ఏ విద్యలో మీకు అభినివేశం ఉన్నది? అని రాజ్యాంగ తంత్రానుసారం ప్రశ్నించాడు.

మహారాజా! నేను వైయాఘ్రపదగోత్రీకుడను, బ్రహ్మణుడను, నన్ను లోకులు కంకభట్టు అని పిలుస్తారు. ధర్మరాజుకు ప్రియమిత్రుడను. ఆయన నన్ను ఎంతో ప్రేమతో చూసేవాడు. ద్యూతవిద్యాకుశలుడను - అని ధర్మరాజు సమాధానం చెప్పగా మాత్స్యుడు-ఓ బ్రహ్మణోత్తమా! నువ్వు ఏమికోరినా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను. ఈ రాజ్యానికి నిన్ను అధిపతిగా చెయ్యడానికి కూడా నాకభ్యంతము లేదు. దేవసముడవైన నువ్వు రాజ్యపాలనకే అర్హుడవు. నాకు అక్షవిద్యాకుశలురంటే పరమప్రీతి - అన్నాడు.

మహారాజా! నాకు నీచవర్ణపువారితో వివాదం ఏప్పుడూ రాకూడదు. నాతో జూదమాడి ఓడినవాడు ఒడ్డిన పందెపుధనం నాకిచ్చితీరాలే కాని తన దగ్గరే ఉంచుకోకూడదు. ఈ రెండింటికీ నువ్వు అంగీకరిస్తే నేను నీ దగ్గర పనిచేస్తాను. అనగా ఓ బ్రాహ్మణోత్తమా! బ్రాహ్మణేతరు డెవడైనా నీ పట్ల విపరీతంగా ప్రవర్తిస్తే మరణదండన విధిస్తాను. బ్రాహ్మణుడే అయితే నా దేశంనుండి బహిష్కరిస్తాను. అని పలికి ప్రజలవైపు తిరిగి ఓ సభాసదులారా! ఈ మత్స్యదేశానికి నావలెనే ఈ కంకభట్టు కూడా అధిపతి. అని ధర్మజునివైపు తిరిగి ఓ కంకభట్టూ! నేటి నుండి నువ్వు నాకు ప్రాణమిత్రుడవు. నావాహనాలు నువ్వువాడుకోవచ్చును.

విరాటరాజస్య హి తేన సంగమో
బభూవ విష్ణోరివ వజ్రపాణినా.
తమాసనస్థం ప్రియరూపదర్శనం
నిరీక్షమాణో న తతర్ప భూమిపః
సభాం చ తాం ప్రజ్వలయన్ యుధిష్ఠిరః
శ్రియా యథా శక్ర ఇవ త్రివిష్టపం
ఏవం స లబ్ధ్వా తు వరం సమాగమం
విరాటరాజేన నరర్షభ స్తదా
ఉవాస ధీరః పరమార్చితః సుఖీ
న చాపి కశ్చిచ్చరితం బుబోధ తత్.

ఎనిమిదవ అధ్యాయం

యథాపరో భీమబలః శ్రియా జ్వల
న్నుపాయయా సింహవిలాసవిక్రమః
ఖజాం చ దర్వీం చ కరేణ ధారయ
న్నసిం చ కాలంగమకోశమవ్రణం.
స సూదరూపః పరమేణ వర్చసా
రవిర్యథా లోకమిమం ప్రకాశయన్
స కృష్ణవాసా గిరిరాజసారవాం
స్తం మత్స్యరాజం సముపేత్య తస్థివాన్.
తం ప్రేక్ష్య రాజా వరయన్నుపాగతం
తతోఽబ్రవీజ్జానపదాన్ సమాగతాన్
సింహోన్నతాంసోఽయమతీవ రూపవాన్
ప్రదృశ్యతే కో ను నరర్షభో యువా.

భోజన భాజన వస్త్రాభరణాలు నావలెనే నీకూ లభిస్తాయి. ఉద్యానవనాలూ కోశాగారమూ రాజ్యమూ ధన దారాది సర్వవిషయాలూ నువ్వు పరిశీలిస్తూ ఉండాలి. రాజద్వారం నీ కోసం ఎప్పుడూ తెరువబడి ఉంటుంది. నువ్వు స్వేచ్ఛగా చరించవచ్చు. ఈ దేశంలోని ప్రజలలో ఏ వృత్తీ లేనివారూ జీవనాధారం కోసం అల్లల్లాడే వారూ నిన్ను కలుసుకొనేటట్లు ఆజ్ఞాపిస్తాను. వారి కష్టాలు విని వారికి జీవనాధారంగా నువ్వు ఏది నిర్దేశిస్తే అది నేను చేస్తాను–అని ఆదరపూర్వకంగా గౌరవస్థాన మిచ్చాడు.

భగవానుడైన నారాయణుడు దేవేంద్రునితో కలిసినట్లు ధర్మరాజు విరాటరాజుతో కలిశాడు. ఇంద్రుడు స్వర్గాన్ని ప్రకాశింప జేసేటట్లు పాండవాగ్రజుడు మత్స్య సభాభవనాన్ని శోభామయం చేస్తున్నాడు. ఆ నరపాలుని ఆదరసత్కారాలతో ధర్మరాజు ఆ నగరంలో సుఖంగా గడుపుతున్నాడు.

ఎనిమిదవ అధ్యాయం

వల్లవుడు

ధర్మరాజు కంకభట్టు నామంతో విరాట రాజు ఆస్థానంలో ప్రవేశించాడని విన్నావు గదా జనమేజయ మహారాజా! ఇక భీమసేనాదుల ప్రవేశ విధానము విను–అని వైశంపాయనుడు కథాభాగం సమగ్రంగా వివరిస్తున్నాడు.

భీమసేనుడు గరిటెనూ కూరలు తరిగేక త్తినీ చేత బట్టుకుని ఆ చక్రవర్తియొక్క ఆస్థానంలోకి ప్రవేశించాడు. నల్లని వస్త్రాలు ధరించి వంటలవాని వేషంలో ఉన్న అతని శరీరము సూర్యునివలె ప్రకాశిస్తూనే ఉంది. మేరు శిఖరంలా ఉన్న ఆ విశాలదేహుని చూస్తూనే విరాటరాజు సభాసదుల

అదృష్టపూర్వః పురుషో రవిర్యథా
వితర్కయన్ నాస్య లభామి నిశ్చయం
తథాస్య చిత్తం హ్యపి సంవితర్కయన్
నరర్షభస్యాస్య న యామి తత్త్వతః.

దృష్ట్వైవ చైనం తు విచారయామ్యహం
గంధర్వరాజో యది వా పురందరః
జానీత కోఽయం మమ దర్శనే స్థితో
యదీప్సితం తల్లభతాం చ మా చిరం.

విరాటవాక్యేన చ తేన చోదితా
నరా విరాటస్య సుశీఘ్రగామినః
ఉపేత్య కౌంతేయమథాబ్రువం స్తదా
యథా స రాజావదతాచ్యుతానుజం

తతో విరాటం సముపేత్య పాండవ
స్త్వదీనరూపం వచనం మహామనాః
ఉవాచ సూదోఽస్మి నరేంద్ర బల్లవో
భజస్వ మాం వ్యంజనకారముత్తమం.

న సూదతాం బల్లవ శ్రద్దధామి తే
సహస్రనేత్రప్రతిమో విరాజసే
శ్రియా చ రూపేణ చ విక్రమేణ చ
ప్రభాససే త్వం నృవరో నరేష్వివ.

నరేంద్ర సూదః పరిచారకోఽస్మి తే
జానామి సూపం ప్రథమం చ కేవలాన్
ఆస్వాదితా యే నృపతే పురాభవన్
యుధిష్ఠిరేణాపి నృపేణ సర్వశః.

బలేన తుల్యశ్చ న విద్యతే మయా
నియుద్ధశీలశ్చ సదైవ పార్థివ
గజైశ్చ సింహైశ్చ సమేయివానహం
సదా కరిష్యామి తవానఘ ప్రియం.

వైపు తిరిగి ఓ సభ్యులారా! మనకు ఎదురుగావచ్చే ఈ రూపవంతుడైన నవయువకుడు సింహసదృశాం సంతో ప్రకాశిస్తున్నాడే వీనిని ఇతఃపూర్వంనేను చూడలేదు. ఎంత ఆలోచించినా వీని అంతు చిక్కటంలేదు. ఏ కారణంతో ఇలా వస్తున్నాడో తెలియదు. గంధర్వుడో దేవేంద్రుడో అయిఉండాలి. వీడు ఏ కోరిక కోరినా నేను నెరవేర్చ దలచుకున్నాను గనుక మీరు పోయి వాని వివరాలు తెలిసికొనిరండి – అన్నాడు.

అప్పుడు ఇద్దరు, సభాసదులు లేచి భీమసేనుని సమీపించి ఆర్యా! తమరెవరు? ఏ కోరికతో ఇలా వచ్చారు? మీరు ఏదికోరినా నెరవేర్చడానికి మా మహారాజు సిద్ధంగా వున్నాడు–అనవిని భీమసేనుడు విరాటరాజును సమీపించి మహారాజా! నేను వంటల వాడిని. ఆ విద్యలో నేను నిపుణుడను. నన్ను సూపకారుడుగా నియోగించండి. నన్ను వల్లవుడని పిలుస్తారు – అన్నాడు.

వల్లవా! వంటలవాడి వంటే నేను నమ్మను. ఇంద్రునితో సమానమైన నీ రూపమూ నీ శోభా పరాక్రమాలు చూస్తూంటే నువ్వొక మహారాజులా కనిపిస్తున్నావు. అని ఆ జనపాలు డనగా– నిస్సంశయంగా నేను వంటలవాడినే. అనేక విధాలయిన పదార్థాలు తయారుచేయడంలో శాకపాకంలో నేను బహునేర్పరిని. ఇదివరలో నేను ధర్మరాజు ఆస్థానంలో నా పనితనం చూపించాను. ఆయన నా యందు పరమప్రీతితో ఉండేవాడు. వంట విషయంలోనే కాదు. శారీరక బలంలో కూడా నా అంతటివాడు లేడు. మల్లయుద్ధాలలో సింహవ్యాఘ్ర మత్తేభాలతో పోరాటంలో నాకు అభినివేశం ఉన్నది. ఈ కార్యాలతో నీకు నేను

దదామి తే హంత వరాన్ మహానసే
తథా చ కుర్యాః కుశలం ప్రభాషసే
న చైవ మన్యే తవ కర్మ యత్ సమం
సముద్రనేమిం పృథివీం త్వమర్హసి.
తథా హి కామో భవత స్తథా కృతం
మహానసే త్వం భవ మే పురస్కృతః

నరాశ్చ యే తత్ర సమాహితాః పురా
భవాంశ్చ తేషామధిపో మయాకృతః.
తథా స భీమో విహితో మహానసే
విరాటరాజ్ఞో దయితోఽభవద్ దృఢం
ఉవాస రాజ్యే న చ తం పృథగ్ జనో
బుబోధ తత్రానుచరాశ్చ కేచన.

## తొమ్మిదవ అధ్యాయం

తతః కేశాన్ సముత్క్షిప్య వేల్లితాగ్రానినిందితాన్
కృష్ణాన్ సూక్ష్మాన్ మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా.
జుగూహే దక్షిణే పార్శ్వే మృదూనసితలోచనా
వాసశ్చ పరిధాయైకం కృష్ణా సుమలినం మహత్.
కృత్వా వేషం సైరంధ్ర్యాస్తతో వ్యచరదార్తవత్

తాం నరాః పరిధావతీం స్త్రియశ్చ సముపాద్రవన్.
అపృచ్ఛంశ్చైవ తాం దృష్ట్వా కా త్వం కిం చ చికీర్షసి
సా తానువాచ రాజేంద్ర సైరంధ్ర్యహమిహాగతా
కర్మ చేచ్ఛామి వై కర్తుం తస్య యో మాం యయుక్షతి

---

సర్వదా ప్రియం కలిగిస్తూ ఉంటాను - అన్నాడు భీముడు.

వల్లవా! నేను పరమ సంతోషంతో నీ కోరిక నెరవేరుస్తున్నాను. వంటలో నువ్వు నిపుణుడనని చెపుతున్నావు కనుక మా పాకశాలలో ప్రవేశించు. దానికి నువ్వే అధ్యక్షుడుగా ఉంటావు. ఇతః పూర్వం ఆ పాకశాలలో ఉండేవా రందరూ నీ శాసనానువర్తులై మెలగేటట్లు ఆజ్ఞాపిస్తాను - అన్నాడు విరటుడు.

ఈ విధంగా భీమసేనుడు విరాటరాజుయొక్క మహానసశాలలో సూపకారునివలె చరిస్తూ కాలం గడుపుతున్నాడు.

## తొమ్మిదవ అధ్యాయం

సైరంధ్రి

సురుచిర విశాలపద్మదళ నేత్రాలతో దరహాసభాసుర కాంత్యుద్దీపితవదనంతో ముడివైచిన దీర్ఘకేశపాశంతో మలినవస్త్రధారిణియై సైరంధ్రీ రూపంతో దుఃఖభాగినివలె విరాట నగరవీథులలో తిరిగే ద్రౌపదిని ఆ నగరవాసులు సమీపించి ఆమె ఎవరో అలా తిరగటానికి కారణం ఏమిటో చెప్పమన్నారు.

ద్రౌపది తాను సైరంధ్రిననీ ఎవరైనా ఆశ్రయమిస్తే వారిని సేవించి జీవిద్దామని వచ్చాననీ సమాధానం చెపుతూన్నది. అంతటి సౌందర్యవతి వచశ్శీలలలితురాలు అన్నవస్త్రాలకు ఆశపడి ద్యాసం చేస్తుందని విశ్వసించలేక పోయారు పురజనులు.

ద్రౌపది రాజవీథికి వచ్చింది. పట్టపురాణి సుధేష్ణాదేవి అదేసమయాన సౌధాగ్ర భాగాన

తస్యా రూపేణ వేషేణ శ్లక్ష్ణయా చ తథా గిరా
న శ్రద్దధత తాం దాసీమన్నహేతోరుపస్థితాం.
విరాటస్య తు కైకేయీ భార్యా పరమసమ్మతా
ఆలోకయంతీ దదృశే ప్రాసాదాత్ ద్రుపదాత్మజాం
సా సమీక్ష్య తథారూపామనాథామేకవాససం
సమాహూయాబ్రవీద్ భద్రే కా త్వం కిం చ చికీర్షసి.
సా తామువాచ రాజేంద్ర సైరంధ్ర్యహముపాగతా
కర్మ చేచ్ఛామ్యహం కర్తుం తస్య యో మాం యుయుక్షతి.
నైవంరూపా భవంత్యేవ యథా వదసి భామిని
ప్రేషయంతీవ వై దాసీర్దాసాంశ్చ వివిధాన్ బహూన్.
నోచ్చగుల్ఫా సంహతోరుస్త్రిగంభీరా షడున్నతా
రక్తా పంచసు రక్తేషు హంసగద్గదభాషిణీ.
సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణిపయోధరా
తేన తేనైవ సంపన్నా కాశ్మీరీవ తురంగమా.
అరాళపక్ష్మనయనా బింబోష్ఠీ తనుమధ్యమా
కంబుగ్రీవా గూఢశిరా పూర్ణచంద్రనిభాననా.
శారదోత్పలపత్రాక్ష్యా శారదోత్పలగంధయా
శారదోత్పలసేవిన్యా రూపేణ సదృశీ శ్రియా.
కా త్వం బ్రూహి యథా భద్రే నాసి దాసీ కథంచన
యక్షీ వా యది వా దేవీ గంధర్వీ యది వాప్సరాః.
దేవకన్యా భుజంగీ వా నగరస్యాథ దేవతా
విద్యాధరీ కిన్నరీ వా యది వా రోహిణీ స్వయం.
అలంబువా మిశ్రకేశీ పుండరీకాథ మాలినీ
ఇంద్రాణీ వారుణీ వా త్వం త్వష్టుర్ధాతుః ప్రజాపతేః
దేవ్యో దేవేషు విఖ్యాతాస్తాసాం త్వం కతమా శుభే
నాస్మి దేవీ న గంధర్వీ నాసురీ న చ రాక్షసీ
సైరంధ్రీ తు భుజిష్యాస్మి సత్యమేతద్బ్రవీమి తే.

---

నిలచి రాజవీధివైపు చూస్తూ మలినవస్త్రాలు ధరించిన ఆ దివ్యసౌందర్యవతిని అవలోకించి తక్షణం తన అంతఃపురానికి రప్పించి—అమ్మా! నువ్వెవరవు? ఎందుకోసం ఇలా తిరుగుతున్నావు?—అని ప్రశ్నించింది.

రాజ్ఞీమతల్లీ! నేను సైరంధ్రిని. అన్నవస్త్రాలిచ్చి పోషించేవారి ఆశ్రయంలో జీవిద్దామని ఈ నగరానికి వచ్చాను—అని ద్రౌపది సమాధానమిచ్చింది.

పౌరులకు వలెనే పట్టపురాణికి కూడా ఆమె మాటలు నమ్మదగినవిగా కనిపించలేదు. —అమ్మాయీ! త్రైలోక్య సుందరివి నువ్వు సైరంధ్రిగా ఉండటం నా మనస్సుకు అంగీకారంగా లేదు. అనేక దాసదాసీజనానికి రాణివిగా ఉండదగ్గ లక్షణాలు నీలో ఎన్నో కనిపిస్తున్నాయి. నీ నాభిదేశం, వాక్కూ, నీశక్తిగభీర గంభీర నిశితాలుగా ఉన్నాయి. నాసికా, కర, నఖ, స్తనాలు సమున్నతంగా ఉన్నాయి. అరచేతులూ పాదాలూ అధరోష్ఠాలూ జిహ్వాలోచనాంతాలూ అరుణకాంతులీనుతున్నాయి. నిసర్గలాలిత్యం నీలో తొణికిసలాడుతోంది. సుదీర్ఘవిసిల కేశపాశం నీ సౌందర్యసుషమకు అలంకారప్రాయంగా ఉంది. నీ కంఠం హంసరుతంలా మధుర మధురంగా ఉంది. నీ కనుబొమ్మలు ధనస్సువలె వంగి కాటుక రేఖ తీర్చినట్లుంది. నీ గళం శంఖ సదృశంగా ఉంది. ఓ తనుమధ్యా! నీ వదనం శరత్పూర్ణిమా చంద్రబింబాన్ని పరిహసిస్తోంది. నీ కోమల శరీరం నుండి పద్మగంధ సౌరభం వ్యాపిస్తోంది. సాక్షాత్తూ లక్ష్మీదేవిలా ఉన్నావు. నువ్వు యక్షకన్యవా! దేవగంధర్వ భామవా? విద్యాధర కిన్నరీకాంతవా?

కేశాన్ జానామ్యహం కర్తుం పింషే సాధువిలేపనం
మల్లికోత్పలపద్మానాం చంపకానాం తథా శుభే.
గ్రథయిష్యే విచిత్రాశ్చ స్రజః పరమశోభనాః
ఆరాధయం సత్యభామాం కృష్ణస్యమహిషీం ప్రియాం.
కృష్ణాం చ భార్యాం పాండూనాం కురూణామేక సుందరీం
తత్ర తత్ర చరామ్యేవం లభమానా సుభోజనం.
వాసాంసి యావంతి లభే తావత్ తావద్ రమేతథా
మాలినీత్యేవ మే నామ స్వయం దేవీ చకార సా
సాహమద్యాగతా దేవి సుదేష్ణే త్వన్నివేశనం.
మూర్ధ్ని త్వాం వాసయేయం వై సంశయో మే న విద్యతే
న చేదిచ్ఛతి రాజా త్వాం గచ్ఛేత్ సర్వేణ చేతసా
స్త్రియోరాజకులే యాశ్చయాశ్చమా మమ వేశ్మని
ప్రసక్తాస్త్వాం నిరీక్షంతే పుమాంసం కం న మోహయేః.
వృక్షాంశ్చావస్థితాన్ పశ్య య ఇమే మమ వేశ్మని
తేఽపి త్వాం సంనమంతీవ పుమాంసం కం న మోహయేః.
రాజా విరాటః సుశ్రోణి దృష్ట్వా వపురమానుషం
విహాయ మాం వరారోహే గచ్ఛేత్ సర్వేణ చేతసా
యం హి త్వమనవద్యాంగి తరళాయతలోచనే
ప్రసక్తమభివీక్షేథాః స కామవశగో భవేత్.
యశ్చ త్వాం సతతం పశ్యేత్ పురుషశ్చారుహాసిని
ఏవం సర్వానవద్యాంగి స చానంగవశో భవేత్.
అధ్యారోహేత్ యథా వృక్షాన్ వధాయైవాత్మనో నరః
రాజవేశ్మని తే సుభ్రు గృహేత్ స్యాత్ తథా మమ

ఈ నగరాధిష్ఠాన దేవతవా? నాతో నిజం చెప్పు. అప్సరో భామలలో అగ్రశ్రేణి నలంకరించిన అలంబుషవో మిశ్రకేశివో మాలినివో ఐ యుండాలి. కాకపోతే వరుణుని అనుగురాణివో దేవేంద్రుని దేవేరివో కావాలి. విశ్వకర్మ ఇల్లాలివో సావిత్రివో ఐ తీరాలి. నువ్వు సామాన్య మానవ స్త్రీవి మాత్రం కాదు. నీలో దివ్యలక్షణా లన్నీ గోచరిస్తూంటే నిన్ను మనుష్యస్త్రీగా నేను విశ్వసించలేక పోతున్నాను. మర్మం విడిచి నాతో సత్యం చెప్పు — అని సుదేష్ణ గుచ్చి గుచ్చి ప్రశ్నించింది.

మహారాణీ! నువ్వు భావించినట్లు నేను సుర గరుడోరగ యక్షగంధర్వ కాంతలలో ఎవతెనూ గాను. రాక్షసస్త్రీనీ గాను. సైరంధ్రీవృత్తిలో జీవించే మానవస్త్రీనే. అగరుచందనాది అంగరాగాలను తయారు చేయండంలో కేశాలంకరణ విధానాలలో నాకు కొంత అభినివేశం ఉంది. మల్లెలూ సంపెంగలూ కలువలూ కమలాలూ మాలలు కట్టడంలో వాని అలంకరించడంలో నేను ప్రవీణురాలిని. ఇతఃపూర్వం నేను సత్యభామనూ ద్రౌపదినీ సేవించాను. ఇంకా ఎన్నెన్నో చోట్ల సేవలుచేస్తూ వారిచ్చిన అన్నవస్త్రాలతో తృప్తి పడుతూ కాలం గడిపేదానిని. పాండవ ధర్మపత్ని ద్రౌపది నను — మాలినీ — అని పిలచేది. నువ్వు నన్ను దాసిగా స్వీకరించి అనుగ్రహించ గలవని విశ్వసిస్తున్నాను—అని ద్రౌపది పలికింది.

సైరంధ్రీ! నిన్ను నాదాసిగా స్వీకరించడానికి నా కేమీ అభ్యంతరం లేదు. కాని నీ అతిలోక సౌందర్యం ఈ అంతఃపుర స్త్రీలనే సమ్మోహిప జేస్తోంది. వీరందరూ నీ వైపు కన్నురెప్ప

యథా చకర్కటీ గర్భమాధత్తే మృత్యుమాత్మనః
తథా విధమహం మన్యే వాసం తవ శుచిస్మితే.
నాస్మి లభ్యా విరాటేన న చాన్యేన కదాచన
గంధర్వాఃపతయోమహ్యాంయువానఃపంచభామిని
పుత్రా గంధర్వరాజస్య మహాసత్వస్య కస్యచిత్
రక్షంతి తేచమాంనిత్యందుఃఖాచారాతథాహ్యహం
యో మేనదద్యాదుచ్ఛిష్టంనచ పాదౌ ప్రధావయేత్
ప్రీణేరం స్తేన వాసేన గంధర్వాః పతయో మమ.
యో హి మాం పురుషో గృధ్యేద్యథాన్యాః
ప్రాకృతాః స్త్రియః

తామేవ నివసేద్ రాత్రిం ప్రవిశ్య చ పరాం తనుం.
న చాప్యహం చాలయితుం శక్యా కేనచిదంగనే
దుఃఖశీలా హి గంధర్వాస్తే చ మే బలినః ప్రియాః.
ప్రచ్ఛన్నాశ్చాపిరక్షంతి తే మాంనిత్యంశుచిస్మితే
ఏవంత్వాంవాసయిష్యామియథాత్వంనందిసీచ్ఛసి.
న చ పాదౌ న చోచ్ఛిష్టం స్ప్రక్ష్యసిత్వం కథంచన
ఏవం కృష్ణా విరాటస్య భార్యయా పరిసాంత్వితా.
ఉవాస నగరే తస్మిన్ పతిధర్మవతీ సతీ
న చైనాం వేద తత్రాన్యస్తత్త్వేన జనమేజయ.

---

వాళ్ళు కుండా చూస్తున్నారు. ఈ స్థితిలో నిన్ను చూసి ఏ పురుషుడు కామవశీభూతుడు కాకుండా ఉంటాడు ? ఈ అంతఃపుర ప్రాంగణంలో నివృక్షాలు కూడా నిన్ను చూచి తలలు వంచుకున్నట్లున్నాయి చూశావా ? నీ లావణ్యం చూసి విరాట మహారాజుకూడా నిన్నే మోహిస్తారు. అప్పుడు మహారాజు దృష్టికి నేను కనపడనే కనపడను. నీ మీన నేత్రాలు ఎటుకదలితే అటే నడుస్తాడు పురుషుడు. నీ చిరునవ్వు పురుషుల నేత్రాలకు రజ్జువులు బిగిస్తుంది. ఒక్కసారి నిన్ను చూసినవాడు. మదనదాహతప్తుడు కాక తప్పదు. ఆత్మహత్యకోసం చెట్టు చిటారికొమ్మ ఎక్కడంతో సమానమైనది నిన్ను నేను నా యింట్లో ఉంచుకోవడం. పీత గర్భం ధరించిందంటే దానికి మరణం అసన్నం అయిందన్నమాటే. నిన్ను నా యింట్లో ఉంచుకోడం కూడా అటువంటిదే—అని పలికింది.

విరాటరాజమహిషీ ! ఐదురుగు గంధర్వ భర్తలుకల నన్ను ఈ మహారాజేకాదు, ఏ పురుషుడూ కూడా కన్నెత్తి చూడలేడు. నా భర్తలు అతులిత శౌర్యబల పరాక్రమోపేతులు. వారు సర్వదా నన్ను రక్షిస్తూనే ఉంటారు. నేనుకూడా అంతశక్తిలేని దానినిగాదు. అందుచేతనే నేను ఉచ్ఛిష్టాన్నం భుజించనని చెపుతున్నాను. పాద ప్రక్షాళనాది నీచకార్యాలలో నన్ను నియోగించకుండా ఉన్నట్లయితే నా భర్తలు నీ రాజవంశాన్ని సదారక్షిస్తూ ఉంటారు. ఏ పురుషుడైనా నన్ను సామాన్యస్త్రీగా భావించి నావైపు మోహదృష్టులు ప్రసరించినట్లయితే ఆ రాత్రే వానికి మరణం ప్రాప్తిస్తుంది. నా సతీత్వానికి భంగం కలిగించడానికి ప్రయత్నించినవాడికి ప్రయాసమాత్రమే మిగులుతుంది. కారణాంతరాలవల్ల నా భర్తలు కొన్నికష్టాలలోబడి దుఃఖభాజనులయారు. అయినా వారు గుప్తరూపంలో నన్ను రక్షిస్తూనే ఉంటారు—అని ద్రౌపది సమాధానం ఇచ్చింది.

అప్పుడు సుధేష్ణ సంతోషించి—సుందరీ ! నువ్వు నా భవనంలో యథేచ్ఛగా చరించవచ్చు పాదప్రక్షాళనకూ ఉచ్ఛిష్టాన్నం అరగించడానికీ నిన్ను నియోగించను—అన్నది.

ద్రౌపది ఇతరు లెవ్వరికీ తన వాస్తవస్థితి తెలియనివ్వకుండా రాచనగరిలో కాలంగడుపుతోంది.

## పదియవ అధ్యాయం

సహదేవోఽపి గోపానాం కృత్వా వేషమనుత్తమం
భాషాం చైషాం సమాస్థాయ విరాటముపయాదథ
గోష్ఠమాసాద్య తిష్ఠంతం భవనస్య సమీపతః
రాజాథ దృష్ట్వా పురుషాన్ ప్రాహిణోజ్జాతవిస్మయః
తమాయాంతమభిప్రేక్ష్య భ్రాజమానం నరర్షభం
సముపస్థాయ వై రాజా పప్రచ్ఛ కురునందనం.
కస్య వా త్వం కుతో వా త్వం కిం వా త్వం తు చికీర్షసి
న హి మే దృష్టపూర్వస్త్వం తత్వం బ్రూహి నరర్షభ.
సంప్రాప్య రాజానమమిత్రతాపనం
తతోఽబ్రవీన్మేఘమహౌఘనిఃస్వనః
వైశ్యోఽస్మి నామ్నాహమరిష్టనేమి
ర్గోసంఖ్య ఆసం కురుపుంగవానాం.
వస్తుం త్వయీచ్ఛామి విశాం వరిష్ఠ
తాన్ రాజసింహాన్ న హి వేద్మి పార్థాన్
న శక్యతే జీవితుమన్యకర్మణా
న చ త్వదన్యో మమ రోచతే నృపః.
త్వం బ్రహ్మణో యది వా క్షత్రియోఽసి
సముద్రనేమీశ్వరరూపవానసి
ఆచక్ష్వ మే తత్వమమిత్రకర్శన
న వైశ్యకర్మ త్వయి విద్యతే క్షమం.
కస్యాసి రాజ్ఞో విషయాదిహాగతః
కిం వాపి శిల్పం తవ విద్యతే కృతం

---

## పదియవ అధ్యాయం

సహదేవుడు

సహదేవుడు గోపరిపాలక వేషంతో విరాట నగరంప్రవేశించి రాజగోశాలలో అడుగుపెట్టాడు. అక్కడ గోవులను పరిశీలిస్తూన్న సహదేవుని రూపురేఖలను చూసి విరటుడు విస్మితుడై భటుని పిలిచి వానిని తీసికొని రమన్నాడు.

సభాస్థలికి వచ్చే సహదేవుని కెదురేగి విరటుడు-ఎవని కుమారుడవు? ఎక్కడ నుండి ఏమి పనిమీద వస్తున్నావు? ఇతః పూర్వం మేము నిన్ను చూచినట్లు తోచదు. నీ వివరాలన్నీ వాస్తవంగా చెప్పు-అన్నాడు.

మహారాజా! నన్ను అరిష్టనేమి అని పిలుస్తారు. నేను వైశ్యుడను. నేను ధర్మరాజు ఆస్థానంలో గోరక్షణచేస్తూ గోపాలకుడుగా ఉండేవాడిని. దైవోపహతులై వారెక్కడ తిరుగుతున్నారో తెలియదు. ఏ కృషీ లేకుండా జీవించడం కష్టంకదా! అందుచేత దేశాధీశులలో అధికమైన గోసంపద కలవాడవనీ, ధర్మాత్ముడవనీ నిన్ను గురించి అందరూ చెబుతూంటే విని నీ సేవలో ఉందామనీ వచ్చాను-అని సహదేవుడు సమాధానంచెప్పగా-నువ్వు బ్రాహ్మణుడవో క్షత్రియుడవో కావాలి నీ రూపరేఖలు చూస్తూంటే భూమండలాధిపతి లక్షణాలు గోచరిస్తున్నాయి. ఎక్కడనుంచి ఇలా వస్తున్నావు. నా దగ్గరస్థిరంగా ఉండగలవా. నీకు వేతన మెంతకావాలి-అని విరటుడు ప్రశ్నించాడు.

మహారాజా! పాండవాగ్రజుడైన ధర్మరాజువద్ద ఎనిమిదిలక్షల గోగణాలు ఉండేవి. ఒక్కొక్క గణంలో నూరేసి గోవులుండేవి. మరొక తరగతివి లక్షగోవులుండేవి. మూడవతర

కథం త్వమస్మాసు నివత్స్యసే సదా
వదస్వ కిం చాపి తవేహ వేతనం.
పంచానాం పాండుపుత్రాణాం జ్యేష్ఠో భ్రాతా యుధిష్ఠిరః
తస్యాష్టశతసాహస్రా గవాం వర్గాః శతం శతం.
అపరే శతసాహస్రా ద్విస్తావంత స్తథా పరే
తేషాం గోసంఖ్య ఆసంవై తంతిపాలేతి మాం విదుః
భూతం భవ్యం భవిష్యం చ యచ్చ సంఖ్యాగతం గవాం
నమేఽ స్త్యవిదితంకించిత్ సమంతాద్ దశయోజనం.
గుణాః సువిదితా హ్యాసన్ మమ తస్య మహాత్మనః
అసకృత్ స మయా తుష్టః కురురాజో యుధిష్ఠిరః
క్షిప్రం చ గావో బహులా భవంతి
న తాసు రోగో భవతీహ కశ్చన
తైస్తైరుపాయైర్విదితం మయైత
దేతాని శిల్పాని మయి స్థితాని.
ఋషభాంశ్చాపి జానామి రాజన్ పూజితలక్షణాన్
యేషాం మూత్రముపాఘ్రాయ అపి వంధ్యా ప్రసూయతే.
శతం సహస్రాణి సమాహితాని
సవర్ణ వర్ణస్య విమిశ్రితాః గుణైః
పసూన్ సపాలాన్ భవతే దదామ్యహం
త్వదాశ్రయా మే పశవో భవంత్విహ.
తథా సరాజ్ఞోఽవిదితో విశాంపతే
రువాస తత్రైవ సుఖం నరోత్తమః
న చైనమన్యేఽపి విదుః కథంచన
ప్రాదాచ్చ తస్మై భరణం యథేప్సితం.

---

గతివి రెండులక్షలు. ఈ గోవులన్నీ నా ఆధీనంలో ఉండేవి. నేనేగవాధ్యక్షుడుగా అక్కడ ఉండే వాడిని. నన్ను వారు తంతీపాలు డని పిలిచేవారు. పదియోజనాల పరిధిమధ్యంలో ఎన్ని గోవులుండేవో అంతకు ముందెన్ని ఉండేవో పదిసంవత్సరాలలో ఆ సంఖ్య ఎంతకు పెరుగుతుందో నేను నిర్ణయించగలను. వాటి భూతభవిష్య ద్వర్తమాన విషయాలన్నీ నాకు తెలుసు. ఈ విషయాలునాకు తెలిసినట్లు ధర్మరాజు మాత్రమే ఎరుగును. అందుచేతనే ఆయన నన్ను సర్వాధికారిగా విడిచాడు. నా మీద ఎంతో ఆదరాభిమానాలు చూపించేవాడు. గోవులకు ఏ విధమైన తెగుళ్లు రాకుండా చూడడంలో వచ్చిన వాటిని నిర్మూలించడంలో నేను సమర్థుడను. ఏ వృషభం యొక్క మూత్రాఘ్రాణ మాత్రంచేత గొడ్డుమాడ కూడా ఈనమోపుకు వస్తుందో నేను నిర్ణయించగలను. నా అధీనంలో ఉంచినట్లయితే గోసంపద పరంపరాభివృద్ధి చెందుతుంది — అని తననుగూర్చి సమగ్రపరిచయం చేసుకున్నాడు. సహదేవుడు.

పరేంగి తావగాహనశక్తి సమర్థుడైన విరటుడు సహదేవుని మాటలలోని వాస్తవం గ్రహించి విశ్వసించి—తంతిపాలా! నా వద్ద లక్ష గోవులున్నాయి. అందులో ఒకగణం ఒకేవర్ణంలో ఉంటుంది. మిగిలినవి మిశ్రవర్ణాలతో భిన్నగుణాలతో ఉన్నాయి. వాటికి గోపాలకులు కూడా ఉన్నారు. ఈ గణాలనూ పాలకులనూ నేటినుండి నీ అధీనంలో ఉంచుతున్నాను—అని పలికాడు.

ఈ విధంగా సహదేవుడు గుప్తంగా విరటుని కొలువులో ప్రవేశించాడు. విరటుడు వానికి అవసరమైన సదుపాయాలన్నీ సమకూర్చడానికి ఆదేశాలిచ్చాడు.

## పదకొండవ అధ్యాయం

అథాపరోఽదృశ్యత రూపసంపదా
స్త్రీణామలంకారధరో బృహత్పుమాన్
ప్రాకారవప్రే ప్రతిముచ్య కుండలే
దీర్ఘే చ కంబూపరి హాటకే శుభే.
బాహూ చ దీర్ఘాన్ ప్రవికీర్య మూర్ధజాన్
మహాభుజో వారణతుల్యవిక్రమః
గతేన భూమిం ప్రతికంపయంస్తదా
విరాటమాసాద్య సభాసమీపతః.
తం ప్రేక్ష్య రాజోపగతం సభాతలే
వ్యాజాత్ ప్రతిచ్ఛన్నమరిప్రమాథినం
విరాజమానం పరమేణ వర్చసా
సుతం మహేంద్రస్య గజేంద్రవిక్రమం.
సర్వానపృచ్ఛచ్చ సభానుచారిణః
కుతోఽయమాయాతి పురా న మే శ్రుతః
న చైనమూచుర్విదితం తదా నరాః
సవిస్మయం వాక్యమిదం నృపోఽబ్రవీత్.
సత్త్వోపపన్నః పురుషోఽమరోపమః
శ్యామో యువా వారణయూథపోపమః
ఆముచ్య కంబూపరి హాటకే శుభే
విముచ్య వేణీమపినహ్య కుండలే.
స్రగ్వీ సుకేశః పరిధాయ చాన్యథా
శుశోభ ధన్వీ కవచీ శరీ యథా
ఆరుహ్య యానం పరిధావతాం భవాన్
సుతైః సమో మే భవ వా మయా సమః.

---

## పదకొండవ అధ్యాయం

### బృహన్నల

జనమేజయ మహారాజా ! సహదేవ ప్రవేశానంతరం అర్జునుడు స్త్రీ రూపం ధరించి తదుచితమైన వేషభూషణాలతో విరటరాజ కొలువులోకి వచ్చాడు. వాని శిరోజాలుసుదీర్ఘాలై చేతులచివర్ల వరకు వ్రేలాడుతున్నాయి. మందమత్తేభ గమనంతో అర్జునుడు ఆ కొలువులో అడుగుపెడుతూంటే సభాస్థలి అంతా ఆశ్చర్యంతో చూడసాగింది.

వచ్చిన వ్యక్తినిచూస్తూ విరాటుడు సభాసదులవైపు తిరిగి—సదస్యులారా ! దివ్యతేజస్సుతో ప్రకాశించే ఈ వ్యక్తి ఎవరు. ఇది వరలో ఇటువంటి వానిని కనినట్లూ వినినట్లూ లేదు. వీని పరిచయం కలవారెవరైనా ఉన్నట్లయితే తక్షణం నాకు చెప్పండి—అని ప్రశ్నించి ప్రత్యుత్తరం లభించక పార్థునివైపు తిరిగి—పూజ్యా ! నీ దేవతా సమలక్షణాలు గోచరిస్తున్నాయి. ధైర్యశక్తులు ఇతోధికంగా కనిపిస్తున్నాయి. తరుణవయస్సులో గజగమనంతో శంఖకంకణాభరణాలతో జుట్టు ముడువని కేశపాశంతో నారీజనోచితమైన భూషణ వస్త్రాలు ధరించికూడా నువ్వు కవచఖడ్గ ధనుర్బాణాలతో మహావీరమూర్తిలా గోచరిస్తున్నావు. ఈ విధంగా నీ వంటి వ్యక్తి పాదచారివై చరించడం నాకిష్టంకాదు. నేను వృద్ధునైపోయాను. రాజ్యచక్ర నిర్వహణశక్తి నాకు సన్నగిల్లింది. నీ ఇష్టమైన వాహనాలు గ్రహించి నా పుత్రులతో సమంగా చరిస్తూ ఈ రాజ్యభారం వహించు. నీ అధీనంలో ఈ దేశం అభ్యుదయం పొందాలి. నువ్వు నపుంసకుడవుగా నాకు కనిపించడం లేదు.

వృద్ధో హ్యహం వై పరిహారకామః
సర్వాన్ మత్స్యాంస్తరసా పాలయస్వ
నైవంవిధాః క్లీబరూపా భవంతి
కథంచనేతి ప్రతిభాతి మే మనః
వేణీం ప్రకుర్యాం రుచిరే చ కుండలే
తథా స్రజః ప్రావరణాని సంహరే
స్నానం చరేయం విమృజే చ దర్పణం
విశేషకేష్వేవ చ కౌశలం మమ.
క్లీబేషు బాలేషు జనేషు నర్తనే
శిక్షాప్రదానేషు చ యోగ్యతా మమ
కరోమి వేణీషు చ పుష్పపూరణం
న మే స్త్రియః కర్మణి కౌశలాధికాః.
తమబ్రవీత్ ప్రాంశుముదీక్ష్య విస్మితో
విరాటరాజోపసృతం మహాయశాః.
నార్హస్తు వేషోఽయమనూర్జితస్తే
నాపుంస్త్వమర్హో నరదేవసింహ
తవైష వేశోఽశుభవేషభూషణై
ర్విభూషితో భూతపతేరివ ప్రభో.
విభాతి భానోరివ రశ్మిమాలినో
ధనావరుద్ధే గగనే ఘనైరివ
ధనుర్హి మన్యే తవ శోభయేద్ భుజౌ
తథా హి పీనావతిమాత్రమాయతౌ.
గాయామి నృత్యామ్యథ వాదయామి
భద్రోఽస్మి నృత్యే కుశలోఽస్మి గీతే
త్వముత్తరాయై ప్రదిశస్వ మాం స్వయం
భవామి దేవ్యా నరదేవ నర్తకః.—
"ఇదం తు రూపం మమ యేన కిం తవ
ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనం
బృహన్నలాం మాం నరదేవ విద్ధి
సుతం సుతాం వా పితృమాతృవర్జితాం."

---

నీ రూపానికీ నపుంసకిత్వానికి ఏ విధమైన సంబంధమూ లేదు-అని పదిమాదరంతో పలికాడు.

మహారాజా! నాకు కేశసంస్కార కౌశలముంది. జడలు వేయడంలో, జుట్టుముడవడంలో అన్నిదేశాల సంప్రదాయాలూ నాకు తెలుసు. పూలమాలలు నిర్మించడంలో కూడా నాకు ప్రవేశం కద్దు. శయనాసనాలు అమర్చడంలో నేర్పరిని. ఘటనిర్మాణమూ దర్పణాలంకారమూ, చందనాదులతో నఖరేఖాచిత్రనిర్మాణమూ నే నెరుగుదును బాల, నంపుసకాదులతోపాటు ఇతరులకు కూడా వారి మనస్తత్వానుసారం నృత్త, గీత, వాద్యాలలో అభినివేశం కలిగించగలను. జడలల్లి పూలు ముడువడంలో ఏ స్త్రీ నన్ను మించలేదు. నారీజన సంబంధమైన కళాకౌశలంగల నేను రాజ్యభార నిర్వహణకు అనర్హుణ్ణి-అని పార్థుడు పలుకుతూ విరాటుని సమీపించాడు.

దగ్గరకువచ్చే కొద్దీ విరటునికి మరింతవిభ్రమం కలిగి-ఓ పురుష సింహుడా! ఓ జస్తేజోబలాలతో అలరారే నువ్వు నపుంసకుడవంటే నేను నమ్మలేను, ఈ వేషం నీకు ఉచితమైనదీ కాదు. పరమేశ్వరుడైన సదాశివుడు చర్మాంబరధారియై సర్పాలంకృతుడై, కపాలహస్తుడై తన రూపాన్ని వికృతంగా ప్రదర్శించేటట్లు నువ్వు కూడా ఈ వేషంతో నీ రూపాన్ని మరుగుపరుస్తున్నావు. మేఘాచ్ఛాదితుడైన సూర్యునివలె నువ్వు వెలుగుతూనే ఉన్నావు. నీ ఆజానుబాహువులు ధనుర్బాణాలను ధరించడానికి యోగ్యంగా ఉన్నాయే గాని, పువ్వులు గుచ్చడానికి, చిక్కు విడదీసి జడ లల్లడానికీ యోగ్యంగా లేవు-అన్నాడు.

ప్రభూ! నేను ఆడగలను. పాడగలను. వీణా

దదామి తే హంత వరం బృహన్నలే
సుతాం చ మే నర్తయ యాశ్చ తాదృశీః
ఇదం తు తే కర్మ సమం న మే మతం
సముద్రనేమిం పృథివీం త్వమర్హసి.
బృహన్నలాం తామభివీక్ష్య మత్స్యరాట్
కళాసు నృత్యేషు తథైవ వాదితే
సమ్మంత్ర్య రాజా వివిధైః స్వమంత్రిభిః
పరీక్ష్యచైనం ప్రమదాభిరాశు వై.
అపుంస్త్వమప్యస్య నిశమ్య చ స్థిరం

తతః కుమారీపురముత్ససర్జ తం
స శిక్షయామాస చ గీతవాదితం
సుతాం విరటస్య ధనంజయః ప్రభుః.
సఖీశ్చ తస్యాః పరిచారికాస్తథా
ప్రియాశ్చ తాసాం స బభూవ పాండవః.
తథా స సత్రేణ ధనంజయో వసన్
ప్రియాణి కుర్వన్ సహ తాభిరాత్మవాన్
తథా చ తం తత్ర న జజ్ఞిరే జనా
బహిశ్చరా వాప్యథ చాంతరేచరాః.

---

వేణు మృదంగాది వాద్య విశేషాలలో, నృత్త గీతాది కళలలో సమర్థుడను, నీ కుమార్తెకు ఈ విద్యలునేర్పే ఉద్యోగంలో నన్ను నియోగించు. అంతేకాని ఈ రూపాన్నిగురించి నా జన్మవిశేషాలను గురించి నువ్వడిగి ప్రయోజనం లేదు. అది చెప్పడంవల్ల నా దుఃఖం అధికమవుతుందే కాని నివారింపబడదు. నన్ను ఒక అనాథునిగాభావించు నీ కొడుకుగానో నీ కూతురుగానో ఎలాగోలాగ చూసుకో. నన్ను బృహన్నలగా గ్రహించు. ఇంతకుమించి చెప్పవలసింది లేదు - అన్నాడు బృహన్నలరూపంలోఉన్న పార్థుడు.

విరటుడు అంగీకరించి తన కుమార్తెకు, సమవయస్కులైన కన్యలకు నృత్త గీతాదులు నేర్పమని నియోగిస్తూ ఇంకా వారి కవసరమైన బృహన్నలకు తెలిసిన కళలు నేర్పమని అంటూ— బృహన్నలా! చతుస్సముద్రముద్రితమైన భూమండలాన్ని పాలించే శక్తిగల నీ వంటివాడు నర్తనశాలలో మువ్వలమ్రోతలు వింటూ ఉండిపోవడం నా కిష్టంలేదు. అయినా నీ అభిమతం ఎలాఉందో అలానే కానియ్యి-అన్నాడు.

అనంతరం బృహన్నలయొక్క కళాకౌశలాన్ని గురించి కొంత పరిశీలించి పరీక్షించి సభాసదులు వానిని కళావిదునిగా గుర్తించారు.

బృహన్నల అంతఃపురంలో ఉండవచ్చునా? కూడదా? అనే విషయం మంత్రులతో ఆలోచించి వయస్సులోఉన్న కామినీజనులచేత పరీక్షింపించి వానిని నపుంసకుడుగా నిర్ణయించి అందరి అనుమతితో బృహన్నలకు కన్యాకాంతఃపుర ప్రవేశానుమతి ఇచ్చాడు.

సర్వసమర్థుడూ విద్వాంసుడూ అయిన పార్థుడు బృహన్నలవేషంతో అంతఃపురంలో అడుగుపెట్టి ఉత్తర ప్రభృతి రాజకన్యలకు నృత్త గీత వాద్యాలు నేర్పుతున్నాడు.

జితేంద్రియుడైన పార్థుడు మనస్సును వశంలో ఉంచుకొని అంతఃపుర నారీజనానికి సర్వకళలలో అభిరుచిని కలిగించి వారి అభినందనలు పొందుతూ తననుగూర్చి ఎవరికీ తెలియకుండా అప్రమత్తుడై కాలం గడుపుతూన్నాడు.

## పంద్రెండవ అధ్యాయం

అథాపరోఽదృశ్యత పాండవః ప్రభు
ర్విరాటరాజం తరసా సమేయివాన్
తమాపతన్తం దదృశే పృథగ్జనో
విముక్తమభ్రాదివ సూర్యమండలం.
స వై హయానైక్షత తాంస్తతస్తతః
సమీక్షమాణం స దదర్శ మత్స్యరాట్
తతోఽబ్రవీత్ తాననుగాన్ నరేశ్వరః
కుతోఽయమాయాతి నరోఽమరోపమః.
స్వయం హయానీక్షతి మామకాన్ దృఢం
ధ్రువం హయజ్ఞో భవితా విచక్షణః
ప్రవేశ్యతామేష సమీపమాశు మే
విభాతి వీరో హి యథామరస్తథా.

అభ్యేత్య రాజానమమిత్రహాఽబ్రవీ
జ్జయోఽస్తు తే పార్థివ భద్రమస్తు వః
హయేషు యుక్తో నృప సమ్మతః సదా
తవాశ్వసూతో నిపుణో భవామ్యహం.
దదామి యానాని ధనం నివేశనం
మమాశ్వసూతో భవితుం త్వమర్హసి
కుతోఽసి కస్యాసి కథం త్వమాగతః
ప్రబ్రూహి శిల్పం తవ విద్యతే చ యత్.
పంచానాం పాండుపుత్రాణాం జ్యేష్ఠో భ్రాతా యుధిష్ఠిరః
తేనాహమశ్వేషు పురా నియుక్తః శత్రుకర్శన.
అశ్వానాం ప్రకృతిం వేద్మి వినయం చాపి సర్వశః

## పంద్రెండవ అధ్యాయం

జనమేజయ మహారాజా! అర్జునుడు బృహన్నల రూపంతో విరటుని కొలువులో ప్రవేశించిన అనంతరం నకులుడు ప్రవేశించాడు. మేఘమండలం నుండి వెలువడే ప్రభాకరునివలె వెలిగే నకులుడు ప్రవేశిస్తూనే గుర్రాలను పరిశీలించసాగాడు. అశ్వపరీక్ష చేసే నకులుని సదస్యులందరూ ఆశ్చర్యచకిత దృక్కులతో చూడసాగారు. విరటుడు కూడా నకులునివైపు దృష్టి మరల్చాడు. మరలుస్తూనే భటులను పిలిచి–ఈ దివ్య పురుషుడెవడో నాతో ఏ విధమయిన ప్రసంగమూ చేయకుండా నా అశ్వాలను పరిశీలిస్తున్నాడు. ఆలోచించి చూస్తే అశ్వవిద్యలో సమర్థునివలె గోచరిస్తున్నాడు. మీరు త్వరగా వెళ్ళి వాని వివరాలు తెలుసుకొని తీసికొనిరండి.

రాజాజ్ఞానుసారులై భటులు నకులుని తీసికొని వెళ్ళారు. నకులుడు విరటుని సమీపిస్తూనే– మహారాజా! విజయోస్తు, కళ్యాణమస్తు. అశ్వశిక్షణలో కౌశలంగల నేను ఎందరో చక్రవర్తుల ఆస్థానాలలో సన్మానాలు పొందాను. నీ దగ్గర అశ్వసారథిగా పనిచేయాలని వచ్చాను. అందులో నన్ను నియోగించ గోరుకున్నాను – అన్నాడు.

ఓ ధీరుడా! నీకు ధన గృహ వాహనాలు ఇస్తాను. నువ్వు సారథిగా ఉండడం నాకంగీకారమే. అయితే నువ్వు ఎక్కడనుంచి వస్తున్నావో నీ వివరాలేమిటో తల్లి దండ్రులెవరో తెలియనిదే నీకు నా ఆస్థానంలో ప్రవేశం ఇవ్వడం ఉచితంగా నాకు తోచడంలేదు–అని విరటుడనగా–

మహారాజా! నా వివరాలు వినండి. పాండవులలో జ్యేష్ఠుడైన ధర్మరాజు తన అశ్వశాలలో అధికారిగా నన్ను నియమించాడు. అశ్వజాతు

దుష్టానాం ప్రతిపత్తించ కృత్స్నం చైవ చికిత్సితం
న కాతరం స్యాన్మమ జాతు వాహనం
న మేఽస్తి దుష్టా వడవా కుతో హయాః
జనస్తు మామాహ స చాపి పాండవో
యుధిష్ఠిరో గ్రంధికమేవ నామతః.
మాతలిరివ దేవపతేర్దశరథనృపతేః సుమంత్ర ఇవ యంతా
సుమహ ఇవ జామదగ్న్యే స్తథైవ తవ శిక్షయామ్యశ్వాన్.
యుధిష్ఠిరస్య రాజేంద్ర నరరాజస్య శాసనాత్
శతసాహస్రకోటీనామశ్వానామస్మి రక్షితా.
యదస్తి కించిన్మమ వాజివాహనం
తదస్తు సర్వం త్వదధీనమద్య వై
యే చాపి కేచిన్మమ వాజియోజకా
స్త్వదాశ్రయాః సారథయశ్చ సంతు మే.
ఇదం తవేష్టం యది వై సురోపమ
బ్రవీహి యత్ తే ప్రసమీక్షితం వసు
న తేఽనురూపం హయకర్మ విద్యతే
ప్రభాసి రాజేవ హి సమ్మతో మమ.
యుధిష్ఠిరస్యేవ హి దర్శనేన మే
సమం తవేదం ప్రియమత్ర దర్శనం
కథం తు భృత్యైః స వినాకృతో వనే
వసత్యనింద్యో రమతే చ పాండవః.
తథా స గంధర్వవరోపమో యువా
విరాటరాజ్ఞా ముదితేన పూజితః
న చైనమన్యేఽపి విదుః కథంచన
ప్రియాభిరామం విచరంతమంతరా.

లలో ఉండే భేదాలన్నీ నే నెరుగుదును. అన్ని రకాల గుర్రాలకూ శిక్షణ ఇవ్వడంలో సమర్థుడను. వాటిలోని దుష్టలక్షణాలను మాపడం నే నెరుగుదును. నా చేతిలో శిక్షణపొందిన గుర్రం ఏ పరిస్థితిలోనూ భయపడదు. వెంకిగా చరించదు. అది చెడదు. ధర్మరాజూ వాని ప్రజలూ నన్ను గ్రంధికుడు అని పిలిచేవారు. ఇంద్రునికి మాతలి వలె దశరథునికి సుమంత్రునివలె, పరశురామునికి సుమహునివలె ధర్మరాజుకు నేను సారథిగా ఉండే వాడిని. ఆయన దగ్గరఉండే నూరుకోట్ల అశ్వాల మీాదా నేనే సర్వాధికారిని అప్రమత్తతతో చరిస్తూ ఆయన ప్రశంసకు పాత్రుడి నయ్యాను. దైవోపహతుడై ఆ మహారాజు వెళ్ళిపోవడంవల్ల నే నిలావచ్చాను. మీా అశ్వశాలాధ్యక్షపదవి నా కిచ్చినట్లయితే దానిని సక్రమంగా నిర్వహించ గలను-అన్నాడు.

గ్రంధికా! నా గుర్రాలూ ఇతర వాహనాలూ ఇది మొదలుగా నీ అధీనంలో ఉంటాయి. నా సారథులూ అశ్వశిక్షకులూ నీ కనుసన్నలలో మెలగుతారు. ఇందరిమీాదా నిన్ను సర్వాధికారిగా నియమిస్తున్నాను. అయితే దేవతా సముడవుగా కనిపించే నీకు ఈ పదవి ఉచితమయినది కాదని నా అభిప్రాయం. నీ ముఖ లక్షణాలు చూస్తుంటే రాజచిహ్నాలు గోచరిస్తున్నాయి. రాజ్యనిర్వాహణ సామర్థ్యం నీలో గోచరిస్తోంది. నిన్ను చూస్తే ధర్మరాజును చూసినట్లే ఉంది. ధర్మజుడు పరిజనాన్ని విడిచి వనవాసం ఎలా చేస్తున్నాడో పాపం: విధివిధానం ఎవరికీ తప్పించరానిది కదా! నీ కింకా ఏమయినా కావలిస్తే అడుగు. ఈ అశ్వశాలాధ్యక్షుడుగానే ఉంటానంటావా! అందుకు వేతన మెంతకావాలో చెప్పు-అని విరటుడు ప్రశ్నించగా నకులుడు ఉచితరీతిని

ఏవం హి మత్స్యే న్యవసంత పాండవా
అజ్ఞాతచర్యాం వ్యచరన్ సమాహితాః
యథాప్రతిజ్ఞాభిరమోఘదర్శనాః
సముద్రనేమీపతయోఽతిదుఃఖితాః.

## పదమూడవ అధ్యాయం

ఏవం తే మత్స్యనగరే ప్రచ్ఛన్నాః కురునందనాః
అత ఊర్ధ్వం మహావీర్యాః కిమకుర్వత వై ద్విజ.
ఏవం మత్స్యస్య నగరే ప్రచ్ఛన్నాః కురునందనాః
ఆరాధయంతో రాజానం యదకుర్వత తచ్ఛృణు.
తృణబిందుప్రసాదాచ్చ ధర్మస్య చ మహాత్మనః
అజ్ఞాతవాసమేవం తు విరాటనగరేఽవసన్.
యుధిష్ఠిరః సభాస్తారో మత్స్యానామభవత్ప్రియః
తథైవ చ విరాటస్య సపుత్రస్య విశాంపతే.
సహ్యాక్షహృదయజ్ఞస్తాన్ క్రీడయామాస పాండవః
అక్షవత్యాం యథాకామం సూత్రబద్ధానివ ద్విజాన్.
అజ్ఞాతం చ విరాటస్య విజిత్య వసు ధర్మరాట్
భ్రాతృభ్యః పురుషవ్యాఘ్రో యథార్హం సంప్రయచ్ఛతి.
భీమసేనోఽపి మాంసాని భక్ష్యాణి వివిధాని చ
అతిసృష్టాని మత్స్యేన విక్రీణీతే యుధిష్ఠిరే.

ప్రసంగించి అశ్వశాలాధ్యక్ష పదవిని స్వీకరించాడు.

తన రూపురేఖలు ఇతరు లెవరూ గుర్తుపట్టకుండా చరిస్తూ కాలం గడుపుతున్నాడు.

ధర్మరాజు ద్రౌపదీ సోదర సహితుడై విరటుని కొలువులో ప్రచ్ఛన్న వేషంతో అజ్ఞాతవాసం సాగిస్తున్నాడు. కాలచోదితులై ఆ మహాపురుషులు ద్రౌపదీ సాధ్వితో పరులపంచను మెలగవలసి వచ్చింది—అన్నాడు వైశంపాయనుడు.

## పదమూడవ అధ్యాయం

జీమూత మల్లుడు :—

వైశంపాయన మహర్షీ ! తేజోమయులైన పాండవులు మత్స్య దేశంలో ప్రవేశించి సాగించిన అజ్ఞాతవాసంలో సాధించిన కార్యాలేమిటో వివరించండి — అని జనమేజయుడు కోరగా వైశంపాయనుడు చెబుతున్నాడు.

రాజర్షియైన తృణబిందుని అనుగ్రహము మహాత్ముడైన ధర్మదేవతకృప కారణంగా పాండవులు విరటనగరంలో ప్రచ్ఛన్నవేషాలతో అజ్ఞాతవాసదీక్ష ప్రారంభించారు. ధర్మరాజు ఆ సభాస్థలిలో ప్రముఖస్థానం ఆక్రమించాడు. మత్స్య దేశ ప్రజలు ధర్మజుని నీతులనే ఆకర్ణిస్తూ ఆయనగాథలే వింటూ అధికంగా వానినే అభిమానిస్తున్నారు. విరాటరాజు పుత్రబాంధవ సహితుడై ధర్మరాజుపై ఆదరగౌరవాలు అభివ్యక్తీకరిస్తున్నాడు. సూత్రబంధితమయిన పక్షిని మనుష్యుడు తన ఇష్టంవచ్చినట్లు విసరగలిగినట్లు ద్యూతశాలలో ప్రవేశించిన ధర్మరాజు తా యిచ్ఛవచ్చినట్లు పాచికలు విసురుతున్నాడు. సుప్రసిద్ధద్యూతంలో ధర్మరాజును ఓడింపగలవాడు లేడు. వాని ద్యూతవిద్యాకౌశలం చూపరులకు ఆశ్చర్యం కలిగిస్తోంది. విరటరాజుతో ద్యూతక్రీడ సాగిస్తూ గెలిచిన

వాసాంసి పరిజీర్ణాని లబ్ధ్వాన్యంతఃపురేఽర్జునః
విక్రీణానశ్చ సర్వేభ్యః పాండవేభ్యః ప్రయచ్ఛతి.
సహదేవోఽపి గోపానాం వేషమాస్థాయ పాండవః
దధి క్షీరం ఘృతం చైవ పాండవేభ్యః ప్రయచ్ఛతి
నకులోఽపి ధనం లబ్ధ్వా కృతే కర్మణి వాజినాం
తుష్టే తస్మిన్ నరపతౌ పాండవేభ్యః ప్రయచ్ఛతి.
కృష్ణా తు సర్వాన్ భర్తౄంస్తాన్ నిరీక్షంతీ తపస్వినీ
యథా పునరవిజ్ఞాతా తథా చరతి భామినీ.
ఏవం సంపాదయంతస్తే తదాన్యోన్యం మహారథాః
విరాటనగరే చేరుః పునర్గర్భధృతా ఇవ.
సాశంకా ధార్తరాష్ట్రస్య భయాత్
పాండుసుతాస్తదా
ప్రేక్షమాణాస్తదా కృష్ణామూషుశ్ఛన్నా నరాధిప
అథ మాసే చతుర్థే తు బ్రహ్మణః సుమహోత్సవః
ఆసీత్ సమృద్ధో మత్స్యేషు పురుషాణాం
సుసమ్మతః.
తత్ర మల్లాః సమాపేతుర్దిగ్భ్యో రాజన్ సహస్రశః
సమాజే బ్రహ్మణో రాజన్ యథా పశుపతేరివ.
మహాకాయా మహావీర్యాః కాలఖంజా ఇవాసురాః
వీర్యోన్మత్తా బలోదగ్రా రాజ్ఞా సమభిపూజితాః.
సింహస్కంధకటిగ్రీవాః స్వవదాతా మనస్వినః
అసకృల్లబ్ధలక్షాస్తే రంగే పార్థివసంనిధౌ.
తేషామేకో మహానాసీత్ సర్వమల్లానథాహ్వయత్
ఆవల్గమానం తం రంగే నోపతిష్ఠతి కశ్చన.
యదా సర్వే విమనసస్తే మల్లా హతచేతసః
అథ సూదేన తం మల్లం యోధయామాస
మత్స్యరాట్.

---

ధనాన్ని సోదరులందరికీ పంచిపెడుతున్నాడు. కాలం గడుస్తున్నా అక్కడి వారెవరూ ధర్మరాజును గుర్తుపట్టలేక పోయారు.

భీముడు అనేకవిధాల భక్ష్య భోజ్య చోష్య లేహ్యాదులు పచనంచేసి పెడుతూ విరటుని మెప్పు పొంది అనుగ్రహంతో ఆ మహారాజు ఇచ్చే ధనాన్ని ధర్మరాజాదులకు అందజేస్తున్నాడు. సహదేవుడు గోసంరక్షణలో మెలగుతూ దధిక్షీర ఘృతాలు సోదరుల కిస్తున్నాడు. అశ్వశిక్షణలో నకులుడు ప్రదర్శించే నైపుణ్యానికి మెచ్చి విరటుడిచ్చే కానుకలు ధర్మరాజాదులకు పంచుతున్నాడు. పాతివ్రత్య నియమంతో త్రైలోక్యసౌందర్యంతో ద్రౌపది సర్వదా భర్తలనే అనుసరిస్తూ గుట్టుగా కాలక్షేపం చేస్తోంది. ఈ విధంగా వారు ఒకరికొకరు సహాయం చేసికొంటూ కన్నతల్లికడుపులో ఉన్నట్టుగా చరిస్తూ దుర్యోధనుడు తమ్ము గుర్తుపట్టకుండా ప్రవర్తిస్తున్నారు.

మూడు మాసాలు గడిచాయి. నాల్గవ మాసం ప్రారంభమయింది. ఆచారానుసారం మత్స్యదేశంలో బ్రహ్మోత్సవానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ దేశీయులందరికీ ఆనందం కలిగించే ఉత్సవం కావడంచేత పౌరజానపదులందరూ ఉత్సాహంతో కృషిచేస్తున్నారు. దేశదేశాలనుండీ మల్లయుద్ధ విశారదులు వస్తున్నారు. ఆ రోజులలో అది సత్యలోకంలోని బ్రహ్మసభవలె కైలాసంలోని రుద్రసభవలె గోచరిస్తోంది. వచ్చిన మల్లు లందరూ కాలఖంజాసురులవలె ఉన్నారు. బలమద గర్వితులూ పరాక్రమోన్మత్తులూ అయిన మల్లులందరినీ విరటుడు ఉచితరీతిని ఆహ్వానించి సత్కరిస్తున్నాడు. వారి శరీరాలు సింహసదృశంగా ఉన్నాయి. అనేక రాజాస్థానాలలో మల్లయుద్ధం ప్రదర్శించి కీర్తిప్రతిష్ఠలు

నోద్యమాన స్తదా భీమో దుఃఖేనై వాకరోన్మతిం
న హి శక్నోతి వివృతే ప్రత్యాఖ్యాతుం నరాధిపం.
తతః స పురుషవ్యాఘ్రః శార్దూలశిథిలశ్చరన్
ప్రవివేశ మహారంగం విరాటమభిపూజయన్.
బబంధ కక్షాం కౌంతేయ స్తతః సంహర్షయంజనం
తతస్తు వృత్రసంకాశం భీమో మల్లం
సమాహ్వయత్.
జీమూతం నామ తం తత్రమల్లం ప్రఖ్యాతవిక్రమం
తావుభౌ సుమహోత్సాహావుభౌ భీమపరాక్రమౌ.
మత్తావివ మహాకాయౌ వారణౌ షష్టిహాయనౌ
తతస్తౌ నరశార్దూలౌ బాహుయుద్ధం సమీయతుః
వీరౌ పరమసంహృష్టావన్యోన్యజయకాంక్షిణౌ
ఆసీత్ సుభీమః సంపాతో వజ్రపర్వతయోరివ.
ఉభౌ పరమసంహృష్టౌ బలేనాతిబలావుభౌ
అన్యోన్యస్యాంతరం ప్రేప్స్యూ పరస్పరజయైషిణౌ.
ఉభౌ పరమసంహృష్టౌ మత్తావివ మహాగజౌ
కృతప్రతికృతైశ్చిత్రైర్బాహుభిశ్చ సుసంకటైః
సంనిపాతావధూతైశ్చ ప్రమాథోన్మథనై స్తథా.
క్షేపణైర్ముష్టిభిశ్చైవ వరాహోద్ధూతనిఃస్వనైః
తలైర్వజ్రనిపాతైశ్చ ప్రసృష్టాభి స్తథైవ చ.
శలాకానఖపాతైశ్చ పాదోద్ధూతైశ్చ దారుణైః
జానుభిశ్చాశ్మనిర్ఘోషైః శిరోభిశ్చావఘట్టనైః.
తద్ యుద్ధమభవద్ ఘోరమశస్త్రం బాహుతేజసా
బలప్రాణేన శూరాణాం సమాజోత్సవసంనిధౌ.
అరజ్యత జనః సర్వః సోత్క్రుష్టనినదోత్థితః
బలినోః సంయుగే రాజన్ వృత్రవాసవయోరివ.
ప్రకర్షణాకర్షణయోరభ్యాకర్షవికర్షణైః
ఆకర్షతురథాన్యోన్యం జానుభిశ్చాపి జఘ్నతుః.
తతః శబ్దేన మహతా భర్త్సయంతే పరస్పరం
వ్యూఢోరస్కౌ దీర్ఘభుజౌ నియుద్ధకుశలావుభౌ

పొందిన ధైర్యసాహసోపేతులందరూ వచ్చారు. వారిలో విశాలకాయుడు ధైర్యస్థైర్య గాంభీర్యుడూ అయిన మల్లుడొకడు వచ్చినవారందరినీ యుద్ధానికి ఆహ్వానిస్తున్నాడు. మేఘ గంభీరగర్జనలతో పిలుస్తూ వాడు గంతులువేస్తూ ఉంటే మిగిలిన మల్లులెవరూ వానిని సమీపించ లేకపోతున్నారు. భయకంపితులై అందరూ పరాజయాన్ని ప్రకటించగా విరటుడు తన మహానసశాలలోని వలలుడు వీనితో యుద్ధం చేయగలడని నిశ్చయించుకొని భీముని రప్పించి ఆ మల్లునితో యుద్ధం చేయమని ఆజ్ఞాపించాడు.

అది భీమునికి చాలా దుఃఖం కలిగించింది. ఈ మల్లయుద్ధ సమయంలో తనను నగరవాసులు కానీ దుర్యోధనుని గూఢచారులు కానీ గుర్తుపట్టరుకదా! అజ్ఞాతవాసం ఆరంభమయి మూడు మాసాలయింది. ఇంకా తొమ్మిది నెలలు గడవాలి. ఇప్పుడు నేను బైటపడిపోతే నా సోదరులనూ ద్రౌపదినీ గుర్తుపడతారు. అరణ్యవాసం మళ్ళీ ఆరంభమవుతుంది కష్టాలు మొదలవుతాయి-అని తనలోతనే అనుకుని రాజాజ్ఞను తిరస్కరించలేక పోయాడు. పయిగా తా నక్కడ ఉండగా పరదేశంనుంచి వచ్చిన మల్లుడు విజయశంఖధ్వానం చేయడం తనకే తలవంపుగా భావించుకొని మల్ల యుద్ధానికి సన్నద్ధుడయాడు.

యుద్ధభూమిలో ప్రవేశించి ఆ జీమూత మల్లుని ఆహ్వానించాడు. భీమజీమూతులిద్దరూ షష్టి పూర్తియైన మత్తేభాలవలె కలియబడ్డారు. ఉత్సాహంతో వారు బాహుయుద్ధం చేస్తూంటే పర్వతమూ వజ్రమూ ఢీకొన్నట్లు పిడుగులు పడుతూ

బాహుభిః సమసజ్జేతామాయసైః పరిఘైరివ.
చకర్ష దోర్భ్యాముత్పాత్య భీమో మల్లమమిత్రహా
వినదంతమభిక్రోశన్ శార్దూల ఇవ వారణం.
సముద్యమ్య మహాబాహుర్భ్రామయామాస వీర్యవాన్
తతో మల్లాశ్చ మత్స్యాశ్చ విస్మయం చక్రిరే పరం.

భ్రామయిత్వా శతగుణం గతసత్త్వమచేతనం
ప్రత్యపింషన్మహాబాహుర్మల్లం భువి వృకోదరః.
తస్మిన్ వినిహతే వీరే జీమూతే లోకవిశ్రుతే
విరాటః పరమం హర్షమగచ్ఛద్ బాంధవైః సహ
ప్రహర్షాత్ ప్రదదౌ విత్తం బహు రాజా మహామనాః
వల్లవాయ మహారంగే యథా వైశ్రవణస్తథా,

ఏవం స సుబహూన్ మల్లాన్ పురుషాంశ్చ మహాబలాన్
వినిఘ్నన్ మత్స్యరాజస్య ప్రీతిమాహరదుత్తమాం
యదాస్య తుల్యః పురుషో న కశ్చిత్ తత్ర విద్యతే
తతో వ్యాఘ్రైశ్చ సింహైశ్చ ద్విరదైశ్చాప్యయోధయత్.

పునరంతఃపురగతః స్త్రీణాం మధ్యే వృకోదరః
యోధ్యతే స విరాటేన సింహైర్మత్తైర్మహాబలైః.
బీభత్సురపి గీతేన స్వనృత్యేన చ పాండవః
విరాటం తోషయామాస సర్వాశ్చాంతఃపురస్త్రియః.

అశ్వైర్వినీతైర్జవనైస్తత్ర తత్ర సమాగతైః
తోషయామాస రాజానం నకులో నృపసత్తమం.

న్నట్లు ధ్వనులు రేగాయి. పరస్పరజయాభిలాషతో బాహుయుద్ధం సాగిస్తూ బలోత్సాహాలతో వెనుకంజ వేయకుండా తీవ్రంగా పోరుతున్నారు. ఒకడు ఒకడి అవయవాన్ని పీడిస్తే రెండవవాడు అదే విధంగా వేధిస్తున్నాడు. చిత్రవిచిత్ర గతులతో ముష్టిప్రహారాలు ప్రారంభమయినాయి. క్రింద పడినవాడు రెండవ వానిని కాళ్ళతో తన్నుతున్నాడు. వాడు తన దేహంతో వీడి దేహాన్ని మర్దిస్తున్నాడు· వనవరాహాలవలె గోండ్రిస్తూ రొమ్ముమీద తలలతో పొడుచుకుంటున్నారు, రెండు చేతులతో పైకెత్తి గిరిగిరిత్రిప్పి భూమికివేసి కొడుతున్నారు. చూపుడువేలూ బొటనవేలూ కలిపి గుద్దుకుంటున్నారు. అరచేతులతో బాదుకుంటున్నారు. గోళ్ళతో గీరుకుంటున్నారు. కాళ్ళతో తన్నుకుంటున్నారు. మోకాళ్ళతో పొడుచుకుంటున్నారు. ఆంబోతులవలె తలలతో గుద్దుకుంటున్నారు. ఆ కుమ్ములాటలో రెండు కర్కశపాషాణాలు సంఘర్షిస్తున్న శబ్దం బయలుదేరుతోంది. తొడలతో మర్దించుకుంటున్నారు. ముందు వెనకలకూ పార్శ్వాలకూ తిరుగుతూ త్రిప్పుతూ అకస్మాత్తుగా గుద్దుకుంటూ ధీశక్తి సంపన్నులయిన బాహుబలాన్వితులు భీమజీమూతమల్లులు శస్త్రాస్త్రాల అవసరం లేకుండా మల్లయుద్ధం చేస్తున్నారు. పళ్లు కొరుకుతూంటే ఉరుములు ఉరుముతూన్నట్లున్నాయి. పదఘట్టనంతో ముష్టిఘాతాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. వారి శరీరాలు వేడెక్కి రక్తకణాలు రాలుతున్నాయి. ప్రేక్షకులలో జయజయధ్వానాలు బయలుదేరాయి. కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. అంతలో ఆ మల్లుల ఉత్సాహం ఇనుమడించింది. అలస్యం లేకుండా కుమ్ముకుంటున్నారు. జయాపజయ నిర్ణయం జరగడంలేదు. పరిఘాకారబాహువులుచాచి

తస్మై ప్రదేయం ప్రాయచ్ఛత్ ప్రీతో రాజా ధనం బహు
వినీతాన్ వృషభాన్ దృష్ట్వా సహదేవస్య చాభితః
ధనం దదౌ బహువిధం విరాటః పురుషర్షభః.
ద్రౌపదీ ప్రేక్ష్య తాన్ సర్వాన్ క్లిశ్యమానాన్ మహారథాన్
నాతిప్రీతమనా రాజన్ నిఃశ్వాసపరమాభవత్
ఏవం తే న్యవసం స్తత్ర ప్రచ్ఛన్నాః పురుషర్షభాః
కర్మాణి తస్య కుర్వాణా విరాటనృపతే స్తదా.



విశాలవక్షస్థలంతో వారు సింహగర్జనలు చేస్తూ చేతులుకలిపారు. కొంతసేపటి వరకూ ఆ రంగస్థలంపై ఒకరున్నారో ఇద్దరున్నారో తెలియలేదు. ప్రేక్షకులు ఆందోళిత మనస్కులౌతూండగా భీమసేనుడు దిక్కులు పిక్కటిల్లేట్లు గర్జించి ఏనుగు మీద కురికే సింహంవలె జీమూతమల్లునిపై కురికి రెండు చేతులతో వానిని పట్టుకొని ఆకాశంలోకి ఎత్తి గిరగిర త్రిప్పడం మొదలుపెట్టాడు. ప్రేక్షకాగారమంతా నిశ్చేష్టతో చిత్రప్రతిమ వలె ఉంది. మల్లయుద్ధవిశారదులు స్థంభించిపోయారు. భీమసేనుడు త్రిప్పుతూంటే జీమూతమల్లుడు ఆ వేగంలో గాలికూడపీల్చుకోలేకపోయాడు. చైతన్యం కోల్పోయాడు. త్రిప్పిత్రిప్పి వానిని నేలకు వేసి కొట్టాడు.

(ప్రమథన, ఉన్మథన, క్షేపణ, ముష్టివరాహోద్ధూత నిస్వన. వజ్ర, ప్రపృష్ట, ప్రకర్షణ ఆకర్షణ సమ్ముఖీకరణ భ్రమణ, వికరణాది చిత్రగతులతో ఆయుధరహితంగా జరిగేయుద్ధం మల్లయుద్ధ మన బడుతుంది.)

వలలుడు జీమూతమల్లుని సంహరించడంతో విరటుడూ వాని బంధువులూ ఎంతో సంతోషించారు. అక్కడే విరాటుడు విశేషధనమిచ్చి వలలుని సత్కరించి అభినందించాడు. ఈ విధంగా భీముడు ఎందరో మల్లులను జయించి విరటుని అభిమానానికి పాత్రుడయాడు. అంతకంతకు విరటుడు వానిని అధికంగా సత్కరిస్తున్నాడు. వలలుని ఖ్యాతి అంతటా వ్యాపించడంతో మత్స్యదేశానికి మల్లుడనేవాడు రావడం మానేశాడు. విరటుడు తన సంతోషంకోసం సింహాలనూ పులులనూ ఏనుగులనూ వదలి భీముని పిలిచి వాటితో యుద్ధం చెయ్యమంటున్నాడు. ఆ ఘాతుకమృగాలనుభీముడు బంతులవలె విసురుతున్నాడు. ఈ విధమైన క్రీడలు అంతఃపుర కాంతలకోసం ప్రత్యేకంగా విరటుడు ఏర్పాడు చేయిస్తున్నాడు. ఆయుధరహితుడై భీముడు క్రూరమృగాలను అవలీలగా ఎత్తిపారేస్తూంటే అంతఃపుర నారీజనం చకిత వీక్షణాలతో భీముని ప్రశంసించేది. ఈ విధంగా వలలుడు విరటునికి వాని పరిజనానికీ వినోదం కలిగిస్తున్నాడు.

నారీజన మధ్యంలో నృత్యంచేస్తూ గీతాలు పాడుతూ వాద్యాలువినిపిస్తూ అర్జునుడు గౌరవంగా కాలం గడుపుతున్నాడు. నకులుడు నానా దేశాల నుండి వచ్చే గుర్రాలకు శిక్షణనిస్తూ చక్రవర్తిని మెప్పించి బహుమతులు పొందుతున్నాడు. సహదేవుడు పశు పోషణపాలనలలో విరటుని అభిమానధనాలు కొల్లగొంటున్నాడు. మహారథికులైన భర్తలు ప్రచ్ఛన్నవేషాలతో కాలం గడుపుతూ ఉంటే ద్రౌపది వేడినిట్టూర్పులు విడుస్తూ రోజులు లెక్కబెడుతూంది. దైవోపహతులైన పాండవులు ఈ విధంగా విరటుని కొలువులో అజ్ఞాతవాసం సాగిస్తున్నారు.

## పదునాల్గవ అధ్యాయం

వసమానేషు పార్థేషు మత్స్యస్య నగరే తదా
మహారథేషు ఛన్నేషు మాసా దశ సమాయయుః
యాజ్ఞసేనీ సుదేష్ణాం తు శుశ్రూషంతీ విశాంపతే
అవసత్ పరిచారార్హా సుదుఃఖం జనమేజయ.
తథా చరంతీ పాంచాలీ సుదేష్ణాయా నివేశనే
తాం దేవీం తోషయామాస తథా చాంతః
పురస్త్రియః.
తస్మిన్ వర్షే గతప్రాయే కీచకస్తు మహాబలః
సేనాపతిర్విరాటస్య దదర్శ ద్రుపదాత్మజాం.
తాం దృష్ట్వా దేవగర్భాభాం చరంతీం
దేవతామివ
కీచకః కామయామాస కామబాణప్రపీడితః.
స తు కామాగ్నిసంతప్తః సుదేష్ణామభిగమ్య వై
ప్రహసన్నివ సేనానీరిదం వచనమబ్రవీత్.
నేయం మయా జాతు పురేహ దృష్టా
రాజ్ఞో విరాటస్య నివేశనే శుభా
రూపేణ చోన్మాదయతీవ మాం భృశం
గంధేన జాతా మదిరేవ భామినీ.
కా దేవరూపా హృదయంగమా శుభే
హ్యాచక్ష్వ మే కస్య కుతోఽత్ర శోభనే
చిత్తం హి నిర్మథ్య కరోతి మాం వశే
న చాన్యదత్రౌషధమస్తి మే మతం.

---

## పదునాల్గవ అధ్యాయం

మత్స్యరాజధానిలో కౌంతేయులుఅజ్ఞాతవాస దీక్ష ప్రారంభించి పదినెలలు గడిచాయి. దాసదాసీజనంతో నిండిన రాజభవనంలో సర్వభోగభాగ్యాలూ అనుభవించవలసిన ద్రౌపది సుదేష్ణవద్దపరిచారికయై ఆమెను సేవిస్తూ కష్టమయకాలాన్ని గడుపుతోంది. బుద్ధిశక్తికీ విద్యావైదుష్యం తోడుపడినకాంత ద్రౌపది మహారాణికీ అంతఃపుర కాంతలకూ అనుకూలంగా చరిస్తూ వారిమన్ననలందుకుంటూ అప్రమత్తతతో రోజులు గడుపుతోంది. అజ్ఞాతవాసవత్సరం పూర్తికావస్తూన్నది.

మత్స్యసైన్యానికి సర్వసేనాధిపతియైన కీచకుడు ఒకనాడు సుదేష్ణ అంతఃపురానికి వచ్చి అక్కడ ద్రౌపదినిచూసి కామపరవశుడై విరహాగ్నితో వేగుతూ వివేకశూన్యుడై సుదేష్ణను సమీపించి - అక్కా! ఇంతటి సౌందర్యవతిని నే నెప్పుడూ చూడలేదు. మనదేశంలోనే కాదు. ఇతరదేశాల అంతఃపురాలలో కూడ ఇటువంటి లావణ్యవతి ఉంటుందని నే నెరుగను. దేవకాంతవలె వెలిగే ఈ సుందరి దేహంనుండి వెలువడే పద్మసుగంధం నాకు మత్తుకలిగిస్తోంది. ఈమె నా హృదయాన్ని ఆకర్షించింది. నా మనస్సును మథిస్తోంది. ఈ విరహజ్వరాన్ని నేను భరించలేను. నారుగ్మతకు ఈమెతోడి సంగమమే ఔషధం. ఇంతటి అందమైన యువతి నీ గృహంలో దాస్యం చేయడానికి తగదు. ఈమె రూపసౌందర్యాలు నవనవోన్మేషంతో నన్ను అలరిస్తున్నాయి. నా గృహిణియై నాకూ నా పరివారానికీ అధికారం వహించడానికి ఈమెకు అర్హతఉంది. రథగజతురగాలూ దాసదాసీజనమూ సిరిసంపదలూ రత్నఖచితమైన స్వర్ణభూషణలూ, చీనిచీనాంబరాలూ షడ్రసోపేతమైన ఆహారపదార్థాలూ నా కెన్నో

అహో తవేయం పరిచారికా శుభా
ప్రత్యగ్రరూపా ప్రతిభాతి మామియం.
అయుక్తరూపం హి కరోతి కర్మ తే
ప్రశాస్తు మాం యచ్చ మమాస్తి కించన.
ప్రభూతనాగాశ్వరథం మహాజనం
సమృద్ధియుక్తం బహుపానభోజనం
మనోహరం కాంచనచిత్రభూషణం
గృహం మహచ్ఛోభయతామియం మమ.
తతః సుదేష్ణామనుమంత్ర్య కీచక
స్తతః సమభ్యేత్య నరాధిపాత్మజాం
ఉవాచ కృష్ణామభిసాంత్వయంస్తదా
మృగేంద్రకన్యామివ జంబుకో వనే.
కా త్వం కస్యాసి కల్యాణి కుతో వా త్వం వరాననే
ప్రాప్తా విరాటనగరం తత్ త్వమాచక్ష్వ శోభనే.

రూపమగ్ర్యం తథా కాంతిః సౌకుమార్య
మనుత్తమం
కాంత్యా విభాతి వక్త్రం తే శశాంక ఇవ నిర్మలం.
నేత్రే సువిపులే సుభ్రు పద్మపత్రనిభే శుభే
వాక్యం తే చారుసర్వాంగి పరపుష్టరుతోపమం.
ఏవం రూపా మయా నారీ కాచిదన్యా మహీతలే
న దృష్టపూర్వా సుశ్రోణి యాదృశీ త్వమనిందితే.
లక్ష్మీః పద్మాలయా కా త్వమథ భూతిః సుమధ్యమే
హ్రీః శ్రీః కీర్తిరథో కాంతిరాసాం కా త్వం
వరాననే.
అతీవరూపిణీ కిం త్వమనంగాంగవిహారిణీ
అతీవ భ్రాజసే సుభ్రు ప్రభేవేందోరనుత్తమా.
అపి చేక్షణపక్ష్మాణాం స్మితం జ్యోత్స్నోపమం
శుభం

ఉన్నాయి. అటువంటి నాభవనానికి ఈమె వచ్చినట్లయితే ఆ సౌధానికే ఎంతో శోభకలుగుతుంది. దాస్యవిముక్తిపొంది నాతోవచ్చి నూతనాలంకారాలతో ఈమె భాసించాలి. అని ఆమెను ఒప్పించి ద్రౌపదిని సమీపించాడు. అప్పుడు వాడు సింహకిశోరిని సమీపించిన జంబుకంలా ఉన్నాడు.

ఓ కళ్యాణీ! నీ వెవరిఇంటి బిడ్డవు? ఎక్కడ నుంచి ఈ నగరానికి వచ్చావు? నీ దివ్యరూపము, సౌకుమార్యము, శరీరకాంతి ఈ లోకంలో ఎవరికీ లేవు. ఉత్తమ లక్షణాలతో నిండిఉన్న నీ ముఖం శరచ్చంద్రబింబాన్ని పరిహసిస్తోంది. మనోహరమైన కనుబొమ్మలతో పద్మదళాలను తిరస్కరించే విశాల నేత్రాలతో పుంస్కోకిలాలాపాన్ని వెక్కిరించే కంఠంతో నీ సౌందర్యం సమ్మోహకంగా ఉంది. ఇంతటి మనోహర రూపాన్ని ఇదివరలో నేను కనలేదు. పద్మాలయవైన లక్ష్మివా నువ్వు? మూర్తీభవించిన పరమేశ్వర విభూతివా? సుందరీ! కీర్తి, కాంతి, శ్రీ, లజ్జ ఆదిగాగల దేవతా శక్తులలో ఎవరవు! శరజ్జ్యోత్స్నలా ప్రకాశించే నువ్వు, మన్మథునితో చరించే రతీదేవివి కాదుగదా! నీ చంద్రవదనంలో లక్ష్మి కనిపిస్తోంది. అర్ధనిమీలిత నేత్రాలలో వెన్నెలలు కురుస్తున్నాయి. నీ ముఖ చంద్రుడు నా మనోంబుధిని ఓలలాడిస్తున్నాడు. నిన్నుచూసి కామాతురుడుకాని పురుషు డెవరు? పర్వతశిఖరోన్నతములై కనకకలశ సదృశములై శ్రీ సముపేతంగా భాసించే నీ చక్రవక్షోజాల పరస్పర సంఘర్షణలో మణిరత్న చంద్రహారాలు అలంకరించి తీరాలి. అవి మన్మథుని చేతిలోని ప్రతోదముల (కొరడా) వలె, నన్ను వేధిస్తున్నాయి. ఓ తనుమధ్యా! త్రివళీయుతమైన నీ దేహం స్తనభారంతో

దివ్యాంశురశ్మిభిర్వృత్తం దివ్యకాంతిమనోరమం.
నిరీక్ష్య వక్త్రచంద్రం తే లక్ష్మ్యానుపమయా యుతం
కృత్స్నే జగతి కో నేహ కామస్య వశగో భవేత్
హారాలంకారయోగ్యౌ తు స్తనౌ చోభౌ సుశోభనౌ
సుజాతౌ సహితౌ లక్ష్మ్యా పీనౌ వృత్తౌ నిరంతరౌ.
కుడ్మలాంబురుహాకారౌ తవ సుభ్రు పయోధరౌ
కామప్రతోదావివ మాం తుదతశ్చారుహాసిని.
వలీవిభంగచతురం స్తనభారవినామితం
కరాగ్రసమ్మితం మధ్యం తవేదం తనుమధ్యమే.
దృష్ట్వైవ చారు జఘనం సరిత్పులినసంనిభం
కామవ్యాధిరసాధ్యో మామప్యాక్రామతి భామిని
జజ్వాల చాగ్నిమదనో దావాగ్నిరివ నిర్దయః
త్వత్సంగమాభిసంకల్పవివృద్ధో మాం దహత్యయం
ఆత్మప్రదానవర్షేణ సంగమాంభోధరేణ చ
శమయస్వ వరారోహే జ్వలంతం మన్మథానలం
మచ్చిత్తోన్మాదనకరా మన్మథస్య శరోత్కరాః
త్వత్సంగమాశానిశితాస్తీవ్రాః శశినిభాననే
మహ్యం విదార్య హృదయమిదం నిర్దయవేగితాః
ప్రవిష్టా హ్యసితాపాంగి ప్రచండాశ్చండదారుణాః
అత్యున్మాదసమారంభాః ప్రీత్యున్మాదకరా మమ
చిత్రమాల్యాంబరధరా సర్వాభరణభూషితా
కామం ప్రకామం సేవ త్వం మయా సహవిలాసిని.

శోభామయమౌతోంది. నదీతటాలవలె నున్న నీ జఘనభాగం నా వంటి మహావీరుని ధైర్యాన్ని కూడా హరిస్తోంది. మదనుడు దయారహితుడై నా హృదయవనంలో దవానలంలా ప్రవేశించి దహిస్తున్నాడు. నీ సమాగమ వాంఛారూపమైన ఆజ్యధార ఆ అగ్నిని ప్రజ్వలింప చేస్తోంది. నీ సంగమ రూపమైన మేఘంతో ఆత్మసమర్పణ రూపమైన వర్షం వర్షించి ఈ అగ్నిని చల్లార్చు. నాకు ఉన్మత్తత కలిగించే మదనబాణాలు నీ సమాగమమనే రాతిమీద పదును పెట్టబడుతున్నాయి. మన్మధుడు విడిచే ఆ బాణాలు నాహృదయాన్ని చీల్చి నన్ను ఉన్మత్తుణ్ణి చేస్తున్నాయి. నీ కన్నుచూపుతో సంగమౌషధంతో నావ్యాధిని నిర్మూలించు. చిత్రవిచిత్రమాల్యాంబరాభరణాలు ధరించి నన్ను కలిసి నా కానందం కల్గించు. సుఖభోగా లనుభవించవలసిన నీవు ఇటువంటి దాస్యం చెయ్యకూడదు. అంతఃపురవాసం కంటె రాజసేవలో కష్టమయినది లేదు. ఈ సేవలో సుఖమనేదే స్మృతికిరాదు. అందుచేతనే నన్ను పొంది అనంతసుఖా లనుభవించమంటున్నాను.

రుచిరస్మితముఖి! నా భవనంలో అమృతోపమైన భోజనపానీయాలు లభిస్తాయి. నేను విశ్వవిఖ్యాత వీరుడను. తలుచుకుంటే లభించని భోగా లుండవు. నిర్విరామంగా ఆనందడోలిక లలో ఊగవచ్చు.

ఇలానే ఉండిపోతే నీ సౌందర్యం అడవి కాచిన వెన్నెలలా, సాగరంలో వర్షంలా వృధా అయిపోతుంది. దివ్యహారాలు కంఠసీమలో అలంకరించుకోనివాడి శోభవలె నీ సౌందర్యం కూడా ఒక సుందరవీరుని గళహారంగా ఉండకపోతే వ్యర్థమే ఔతుంది. నువ్వు ఆజ్ఞాపించినట్లయితే ఇతఃపూర్వం నా దగ్గరఉన్న స్త్రీ లందరినీ విడిచి నీకు సేవ చేయిస్తాను. నేనుకూడా నీ ఆజ్ఞానుసారం చరిస్తాను – అని పలికాడు.

కీచకుని మాటలు విని వానిని ఏ విధంగానయినా నీతిమార్గాన నడపా లనే సంకల్పంతో

నార్హాసీహాసుఖం వస్తుం సుఖార్హా సుఖవర్జితా
ప్రాప్నుహ్యనుత్తమం సౌఖ్యం మత్తస్త్వం మత్త
గామిని.
స్వాదూన్యమృతకల్పాని పేయాని వివిధాని చ
పిబమానా మనోజ్ఞాని రమమాణా యథాసుఖం.
భోగోపచారాన్ వివిధాన్ సౌభాగ్యం
చాప్యనుత్తమం
పానం పిబ మహాభాగే భోగైశ్చానుత్తమైః శుభై
ఇదం హి రూపం ప్రథమం తవానఘే
నిరర్థకం కేవలమద్య భామిని
అధార్యమాణా స్రగివోత్తమా శుభా
న శోభసే సుందరిశోభనా సతీ.
త్యజామి దారాన్ మమ యే పురాతనా
భవంతు దాస్యస్తవ చారుహాసిని
అహం చ తే సుందరి దాసవత్ స్థితః
సదా భవిష్యే వశగో వరాననే.
అప్రార్థనీయామిహ మాం సూతపుత్రాభిమన్యసే
విహీనవర్ణాం సైరంధ్రీం బీభత్సాం కేశకారిణీం.
స్వేషు దారేషు మేధావీ కురుతే యత్నముత్తమం
స్వదారనిరతో హ్యాశు నరో భద్రాణి పశ్యతి.
న చాధర్మేణ లిప్యేత న చాకీర్తిమవాప్నుయాత్
స్వదారేషు రతిర్ధర్మ్యా మృతస్యాపి న సంశయః.
స్వజాతిదారా మర్త్యస్య ఇహలోకే పరత్ర చ
ప్రేతకార్యాణి కుర్వంతి నివాపైస్తర్పయంతి.
తదక్షయ్యం చధర్మ్యంచస్వర్గ్యమాహుర్మనీషిణః
స్వజాతిదారజాః పుత్రా జాయంతే కులపూజితాః
ప్రియా హి ప్రాణినాం దారాస్తస్మాత్ త్వం
ధర్మభాగ్ భవ
పరదారరతో మర్త్యో న చ భద్రాణి పశ్యతి.
పరదారాస్మి భద్రం తే న యుక్తం తవసాంప్రతం

ద్రౌపది తన ప్రసంగం ప్రారంభిస్తున్నది. — సూతపుత్రా! నా వంటి నీచజాతిస్త్రీని దాసీవృత్తిలో ఉన్న దానిని వాంఛించడం నీకు ఉచితం కాదు. నా వేషం ఎంత వికృతంగా ఉందో చూశావా! కేశాలంకరణ వినా మరేవిధమయినదీ తెలియని తుచ్ఛవృత్తి నాది. ధీమంతులు అగ్నిసాక్షిగా గ్రహించిన భార్యనే అనుకూలంగా వర్తించేటట్లు చేసుకుంటారు. ఆత్మకళత్రం మీదనే అనురాగం కలవాడు సుఖభోగా లనుభవిస్తాడు. అధర్మంవల్ల అపకీర్తి పాపమూ వస్తాయి గనక ఆదారిని పోక ధర్మప్రధాన చరిస్తూ ఆత్మకళత్రంతోనే అనురాగం సాగించేవాడు ఇహపరాలలో సుఖిస్తాడు. ఆమెయే వానికి ఐహికభోగాలనూ పారలౌకిక సుఖాలనూ ఇవ్వగలుగుతుంది. మరణించే భర్తకు ఆమె ఇచ్చే తిలాంజలులు పరలోకంలో సుఖమిస్తాయి. ఇటువంటి ధర్మకార్యంవల్ల అక్షయమైన పుణ్యలోకాలూ సిద్ధిస్తాయి. స్వజాతి స్త్రీ యందు కలిగిన సంతతికే కులగౌరవం లభిస్తుంది. ధర్మపత్నియే ప్రియమైనదీ హితమయినదీ. పరస్త్రీలంపటత్వం విడిచి నువ్వు నీధర్మపత్నితోనే అనురాగంతో చరించు. పరనారీవాంఛాపరులకు ఇహపరాలలో ఆనందసుఖాలు లేవు. నన్నే కాదు నువ్వు ఏ ఇతరస్త్రీని వాంఛించకూడదు. పరస్త్రీవైపు కన్నెత్తి చూడకూడదు. ఇది ఆర్యసమ్మతమైన సజ్జనలక్షణం. అధర్మమార్గంలోనూ, అసత్యప్రవర్తనలోనూ ఆసక్తికల పాపాత్ముడు భయంకర మోహపాశ బంధితుడై అపకీర్తి పాలవుతాడు. వానికి దుర్మరణమే సిద్ధిస్తుంది. అందుచేత ధైర్యాన్ని విడిచిపెట్టక ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొని ధర్మప్రధాన సత్యబద్ధమయిన

దయితాః ప్రాణినాం దారా ధర్మం సమనుచితయ
పరదారే న తే బుద్ధిర్జాతు కార్యా కథంచన
వివర్జనం హ్యకార్యాణామేతత్ సుపురుషవ్రతం.
మిథ్యాభిగృధ్నో హి నరః పాపాత్మా మోహ మాస్థితః
అయశః ప్రాప్నుయాద్ ఘోరం మహద్ వా ప్రాప్నుయాద్ భయం.
ఏవముక్తస్తు సైరంధ్ర్యా కీచకః కామమోహితః
జానన్నపి సుదుర్బుద్ధిః పరదారాభిమర్శనే.
దోషాన్ బహూన్ ప్రాణహరాన్ సర్వలోకవిగర్హితాన్
ప్రోవాచేదం సుదుర్బుద్ధిర్ద్రౌపదీమజితేంద్రియః.
నార్హస్యేవం వరారోహే ప్రత్యాఖ్యాతుం వరాననే
మాం మన్మథసమావిష్టం త్వత్కృతేచారుహాసిని
ప్రత్యాఖ్యాయ చ మాం భీరు వశగం ప్రియావాదినం
నూనం త్వమసితాపాంగి పశ్చాత్తాపం కరిష్యసి.
అహం హి సుభ్రు రాజ్యస్య కృత్స్నస్యాస్య సుమధ్యమే
ప్రభుర్వాసయితా చైవ వీర్యే చాప్రతిమః క్షితౌ.
పృథివ్యాంమత్సమోనాస్తికశ్చిదన్యః పుమానిహ
రూపయౌవనసౌభాగ్యైర్భోగైశ్చానుత్తమైః. శుభైః
సర్వకామసమృద్ధేషు భోగేష్వనుపమేష్విహ
భోక్తవ్యేషు చ కల్యాణి కస్మాద్ దాస్యే రతాహ్యసి.
మయా దత్తమిదం రాజ్యం స్వామిన్యసి శుభాననే
భజస్వ మాం వరారోహే భుంక్ష్వ భోగాననుత్తమాన్.

---

సదాచారంలో జీవించు–అన్నది. కీచకునికి ద్రౌపది చేసిన నీతిమార్గోపదేశం వ్యర్థమే అయింది. కామావేశితుడైన కీచకునికి పరస్త్రీని అంటడంవల్ల అపఖ్యాతి వస్తుందని ప్రాణాపాయం కూడ ఏర్పడ వచ్చునని తెలుసు. అయినా ఇంద్రియ వశీభూతుడై బలగర్వంతో సర్వసైన్యాధిపత్యాహంకారంతో నిర్లక్ష్యంగా ఆమెను సమీపించి – సైరంధ్రీ ఈవిధంగా నువ్వు నన్ను వ్యతిరేకించడం ఉచితం కాదు. ఈ కామావేశంతో నేను వేగలేను. నేను ఎంతో ప్రియంగా బతిమాలి ప్రార్థిస్తున్నాను. మహావీరుడైన కీచకు డెప్పుడూ ఇంతటి దైన్యస్థితి ననుభవించలేదు. నా వంటి వీరుడు నీకు దాసుడై చరించడం కంటె కావలసిన దేముంది? ఇప్పుడు నన్ను తిరస్కరిస్తే తరువాయి నీకు పశ్చాత్తాపం తప్పదు.

ఈ రాజ్యానికి నేను ప్రభువును. నా ఆజ్ఞ లేకుండా ఈ దేశంలో ఏమీ జరగదు. నా అనుమతి లేనిదే ఏ ఒక్కరూ ఇక్కడ నివసించడానికి వీల్లేదు. రూప యౌవన సౌభాగ్య వీరత్వాలలో నా అంతటివాడీ పృథ్వీలో లేడు. ఈ విరటుడు నామ మాత్రనికే ప్రభువు. నీవు నామాటవిని నా వెంట ఉన్నట్లయితే ఈ భోగాలన్నీ అనుభవించగలవు. అటువంటి మహదవకాశాన్ని వదులుకొని ఇటువంటి దాసీవృత్తిలో ఎందుకుంటావు? ఈ రాజ్యమంతా నీకు ధారపోస్తున్నాను. దీని ఆధిపత్యం వహించి ఆనందిస్తూ నాకు సంతోషం కలిగించు. – అని కీచకుడు చేసిన అమంగళప్రసంగం తన హృదయాన్ని వేధించగా ద్రౌపది వానిని మందలిస్తూ ఇలా అన్నది.

సూతపుత్రా! నువ్వు మోహాంధకారంలో

ఏవముక్తా తు సా సాధ్వీ కీచకేనాశుభం వచః
కీచకం ప్రత్యువాచేదం గర్హయంత్యస్య తద్వచః.
మా సూతపుత్ర ముహ్యస్వ మాద్య త్యక్ష్యస్వ జీవితం
జానీహి పంచభిర్ఘోరైర్నిత్యం మామభిరక్షితాం.
నచాప్యహంత్వయాలభ్యాగంధర్వాఃపతయోమమ
తే త్వాం నిహన్యుః కుపితాః సాధ్వలం మా వ్యనీనశః.
అశక్యరూపం పురుషైరధ్వానం గంతుమిచ్ఛసి
యథా నిశ్చేతనో బాలః కూలస్థః కూలముత్తరం
తర్తుమిచ్ఛతిమందాత్మా తథాత్వంకర్తుమిచ్ఛసి.
అంతర్మహీం వా యది వోర్ధ్వముత్పతేః
సముద్రపారం యది వా ప్రధావసి
తథాపి తేషాం న విమోక్షమర్హసి
ప్రమాథినో దేవసుతా హి ఖేచరాః.
మాం హి త్వమనమన్వానః సూతపుత్రవినంక్ష్యసి
ఆశు చాద్యైవ నచిరాత్ సపుత్రః సహబాంధవః.
దుర్లభామభిమన్వానో మాం వీరైరభిరక్షితాం
పతిష్యస్యవశస్తూర్ణం వృంతాత్ తాళఫలం యథా
యో మామజ్ఞాయ కామార్తః అబద్ధాని ప్రభాషసే

---

మునిగిపోకు. నా కైదుగురు గంధర్వ భర్తలున్నారు. వారు నన్ను నిరంతరం రక్షిస్తూంటారు. ఆ ఐదుగురికీ క్రోధంవస్తే నిన్ను యమసదనం చేర్చగలరు. నీ మనస్సును కుదుటపరుచుకో! ఈ ఇంద్రియాలనే గుర్రాలను అదుపులో పెట్టు. పాప బుద్ధిని వదలకపోయినట్లయితే నీకు సర్వనాశనం తప్పదు. తెలివితక్కువపిల్లవాడు నది ఒడ్డున కూర్చుని అవ్వలిఒడ్డుకు పోవాలనుకుంటాడు. కాని అది సాధ్యమా అలానే నువ్వూ చరించాలనుకుంటున్నావు. ఏ విధమయిన దుర్మార్గమయినా నాపట్ల ఆచరింపబడినట్లయితే ఉత్తర క్షణంలో ప్రాణాపాయం సంభవిస్తుంది. నా మీద దుస్సంకల్పం కలిగినట్లయితే నువ్వు పాతాళంలో ఉన్నా, సముద్రంలో దాగినా, ఆకాశాని కెగిరినా, ప్రచ్ఛన్నరూపంలో ఉన్నా మృత్యువు తప్పదు. నా భర్తలు దేవతలవల్ల జన్మించారు. అవలీలగా ఏ లోకానికయినా పోయే ఆకాశగమనం వారి కున్నది. శాత్రవ చమూసంహారంలో వారు సర్వ సమర్థులు. నాకు నువ్వుచేసే అవమానం అంతంతగా పోయేదికాదు. అగ్నిహోత్రునివలె సర్వాన్నీ దగ్ధం చేసితీరుతుంది. సోదరబాంధవ సహితుడవై నశించిపోతావు. నా భర్తలయిన గంధర్వులయిదుగురూ సజీవులయి ఉన్నారు. వారుజీవించిఉండగా నువ్వు నన్ను పొందలేవు. నాపై ఏ విధమయిన అసభ్యప్రవర్తన సాగించినా పండినతాటిపండువలె నేలకూలుతావు. అసమర్థుడు పర్వతాన్నిలంఘించలేడు. అలానే నువ్వు నన్ను పొందలేవు. దుర్గమారణ్యాలలో దాగినా, పర్వత గుహలలో దూరినా, తపస్సులో ఉన్నా, సూర్యాగ్నులను శరణు వేడినా నన్నవమానించిన వాడికి ప్రాణరక్షణ లేదు. పర్వతాన్ని త్రాసులో తూచడానికి ప్రయత్నించడం ఎంత అవివేకమో నీ ప్రయత్నమూ అంతే! గ్రీష్మకాలంలో దావానల దగ్ధమయే ఘోరారణ్యంలో ప్రవేశించే వాడికీ నీకూ భేదం లేదు. ఈ దావానలం నిన్నేకాదు నీ బంధుకోటిని కూడా నశింపచేస్తుంది. నేను నా స్వరూపాన్ని రహస్యంగా ఉంచుకోవడం వల్ల నా నిజస్వరూపం నీకు బోధపడటం లేదు.

నువ్వు సర్వసైన్యాధిపతివై ఉండి స్వీయ కర్తవ్యాన్ని విస్మరించి ప్రవర్తిస్తున్నావు. నీ

అశక్తస్తు పుమాన్ఛైలం న లంఘయితుమర్హతి.
దిశః ప్రపన్నో గిరిగహ్వరాణి వా
గుహాం ప్రవిష్టోఽన్తరితోఽపివా క్షితేః.
జుహ్వన్ జపన్ వా ప్రపతన్ గిరేస్తటా
ద్ధుతాశనాదిత్యగతిం గతోఽపి వా
భార్యాభిమంతా పురుషో మహాత్మనాం
న జాతు ముచ్యేత కథంచనాహతః.
మోఘం తవేదం వచనం భవిష్యతి
ప్రతోళనం వా తులయా మహాగిరేః
హుతాశనం ప్రజ్వలితం మహావనే
నిదాఘమధ్యాహ్న ఇవాతురః స్వయం.
ప్రవేష్టుకామోఽసి వధాయ చాత్మనః
కులస్య సర్వస్య వినాశనాయ చ
సదేవగంధర్వమహర్షి సంనిధౌ
సనాగలోకాసురరాక్షసాలయే.
గూఢస్థితాం మామవమన్య చేతసా
న జీవితార్థీ శరణం త్వమాప్స్యసి.
త్వం కాళరాత్రిమివ కశ్చిదాతురః
కిం మాం దృఢం ప్రార్థయసేఽద్య కీచక
కిం మాతురంకే శయితో యథా శిశు
శ్చంద్రం జిఘృక్షురివ మన్యసే హి మాం.
తేషాం ప్రియాం ప్రార్థయతో న తే భువి
గత్వా దివం వా శరణం భవిష్యతి
న వర్తతే కీచక తే దృశా శుభం
యా తేన సంజీవనమర్థయేత సా.

## పదునైదవ అధ్యాయం

ప్రత్యాఖ్యాతో రాజపుత్ర్యా సుదేష్ణాం కీచకోఽబ్రవీత్
అమర్యాదేన కామేన ఘోరేణాభిపరిప్లుతః.
యథా కైకేయి సైరంధ్రీసమేయాత్ తద్విధీయతాం

రాజ్యంలోని స్త్రీల సౌశీల్యానికి రక్షణనివ్వవలసిన నువ్వు రాజధాని నగరంలోనే ఉత్తమ సాధ్వుల శీలాన్ని భంగపరచటానికి ప్రయత్నిస్తున్నావు. ఇది నీకు తగనిపని. నన్నవమానించిన తరువాయి దేవ గంధర్వ యక్షాసుర రాక్షస నాగలోకాలలో కూడా నీ ప్రాణానికి భద్రంలేదు. మహర్షులు కూడ నీకు రక్షాకవచం ఇవ్వలేరు. రోగి కాళరాత్రి కోసం ఎదురు చూచేటట్లు నువ్వు నన్ను పొందగోరుతున్నావు. దురాగ్రహంతో చేసే నీ ప్రార్థనకు అర్థంలేదు. తల్లిఒడిలోఉండే పసిపాప చంద్రబింబంకోసం చేతులు చాచేటట్లు నువ్వు నాకోసం అర్రులు జాస్తున్నావు. గంధర్వ పత్నినైన నన్ను కామించి నువ్వీపాంచభౌతికప్రపంచంలో జీవించలేవు. నీ దుర్బుద్ధి శుభకామనల్నైపు పోవడం లేదు. నీకు కాలమాసన్నమైంది - అని ద్రౌపది తన భర్తల పరాక్రమాన్ని తన పాతివ్రత్య సౌశీల్యాలనూ వివరించి అవశ్యమయిన నీతిని బోధించి కుపితభుజంగంవలెనిట్టూర్పులువిడుస్తూ నిలబడింది.

## పదునైదవ అధ్యాయం

ద్రౌపదీతిరస్కృతుడై కీచకుడు కామవ్యథతో సుదేష్ణను సమీపించి - కేకయ రాజనందినీ! ఏ ఉపాయం చేతనైనా ఈ సైరంధ్రి నన్ను కలిసే మార్గ మాలోచించి నా అంతః పురానికి పంపు.

యేనోపాయేన సైరంధ్రీ భజేన్మాం గజగామినీ
తం సుదేష్ణే పరీప్సస్వ ప్రాణాన్ మోహాత్
ప్రహాసిషం.

తస్య సా బహుశః శ్రుత్వా వాచం విలపత స్తదా
విరాటమహిషీ. దేవీ కృపాం చక్రే మనస్వినీ
శరణాగతేయం సుశ్రోణీ మయా దత్తాభయా చ సా
శుభాచారా చ భద్రం తే నైనాం
వక్తుమిహోత్సహే.

నైషా శక్యాహి చాన్యేన స్ప్రష్టుం పాపేన చేతసా
గంధర్వాః కిల పంచైనాం రక్షంతి రమయంతి చ.
ఏవమేషా మమాచష్టే తథా ప్రథమసంగమే
తథైవ గజనాసోరుః సత్యమాహ మమాంతికే.
తే హి క్రుద్ధా మహాత్మానో నాశయేయుర్హి జీవితం
రాజాచైవసమాక్ష్యైనాం సమ్మోహం గతవానిహ.

మయా చ సత్యవచనైరనునీతో మహీపతిః
సోఽప్యేనామనిశం దృష్ట్వా మనసైవాభ్యనందత
భయాద్ గంధర్వముఖ్యానాం జీవితస్యాప
ఘాతినాం

మనసాపి తత స్త్వేనాం న చింతయతి పార్థివః.
తే హి క్రుద్ధా మహాత్మానో గరుడానిలతేజసః
దహేయురపి లోకాంస్త్రీన్ యుగాంతేష్వివ
భాస్కరాః.

సైరంధ్ర్యాహ్యేతదాఖ్యాతం మమ తేషాం
మహద్బలం

తవ చాహమిదం గుహ్యాం స్నేహాదాఖ్యామి
బంధువత్.

మా గమిష్యసి వై కృచ్ఛ్రాం గతిం
పరమదుర్గమాం

---

ఆ విధంగా నువ్వు చెయ్యకపోతే ఈ బాధతో నేను మరణిస్తాను-అని పరిపరివిధాల దీనంగా ప్రార్థిస్తూ విలపించాడు.

ఏ విధంగా అయినా కీచకుని మనస్సు మరల్చాలని సుదేష్ణ – సోదరా! ఈ మహాపతివ్రత నన్ను శరణువేడింది. సదాచారసంపత్తిగల ఈ సౌశీల్యవతితో నీ మనోరథాన్ని గూర్చి నేను ప్రసంగించలేను. దుర్బుద్ధితో ఆమె నెవరూ సమీపించలేరు. ఆమె భర్తలైన గంధర్వులైదుగురు నిరంతరం ఆమెను కంటికి రెప్పలా కాపాడుతారు. వారివల్ల ఆమె ఎల్లప్పుడూ సంతోషతరంగాలలో ఓలలాడుతూంటుందని నేను కర్ణాకర్ణిగా ఆకర్ణించాను. ఆమె కూడా ఈ విషయం చెప్పింది. ఆమె కేవిధమైన అవమానం జరిగినా ఆ గంధర్వులు క్రోధోన్మత్తులై వచ్చి ఆమె నవమానించిన వారి ప్రాణాలను బలిగొంటా రని ఆమె చెప్పింది. ఈ మహారాజు ఆమెనిక్కడే చూసి మోహావశుడైనప్పుడు నే నాయనకు ఈ విషయం చెప్పాను. అది మొదలు ఆయ నెప్పుడామెనుచూచినా నిష్కల్మష చిత్తంతోనే చూస్తున్నారు. గరుత్మంతునితో, వాయుదేవునితో, సమమైన పరాక్రమం గల ఆ గంధర్వులు చండభానునివలె క్రోధోద్దీపితులై విక్రమిస్తే ఈ ప్రపంచాలు భస్మమయిపోతాయి. ఈ విషయం కూడా సైరంధ్రి నాకు చెప్పింది. సోదరప్రేమతో నీ కీ విషయాలు చెప్తున్నా. ఆమెపై మనసుంచుకొని దుఃఖసాగరంలోపడిపోకు. ఈవిషయం తెలిస్తే ఆగంధర్వులు నీ కులాన్ని సంపదల్ని నాశనం చేసేస్తారు. నీ ప్రాణాలమీద నీకు తీపిఉంటే నా హితోపదేశం నీకు రుచించినట్లయితే ఈమె నుండి నీ దృష్టి మరల్చుకో. ఎప్పుడూ ఆమె వైపుకు పోకు – అన్నది.

బలినస్తే రుజం కుర్యుః కులస్య చ ధనస్య చ.
తస్మాన్నాస్యాం మనః కర్తుం యది ప్రాణాః ప్రియాస్తవ
మా చింతయేథా మా గాస్త్వం మత్ప్రియం చ యదీచ్ఛసి.
ఏవముక్తస్తు దుష్టాత్మా భగినీం కీచకోఽబ్రవీత్
గంధర్వాణాం శతం వాపి సహస్రమయుతాని వా.
అహమేకో హనిష్యామి గంధర్వాన్ పంచ కిం పునః
ఏవముక్తా సుదేష్ణా తు శోకేనాభిప్రపీడితా.
అహోదుఃఖమహోకృచ్ఛ్రమహో పాపమితి స్మ హ
ప్రారుదద్ భృశదుఃఖార్తా విపాకం తస్య వీక్ష్య సా
పాతాలేషు పతత్యేవ విలపన్ వడవాముఖే
త్వత్కృతే వినశిష్యంతి భ్రాతరః సుహృదశ్చ మే
కిం ను శక్యం మయా కర్తుం తత్ త్వమేమభిప్లుతః
న చ శ్రేయోఽభిజానీషే. కామమేవానువర్తసే

సోదరీ ! నేను ఒక్కడనే నిలిచి వేలకొద్ది గంధర్వులను సంహరించగలను. అటువంటి నాకు అయిదుగురు గంధర్వులు ఒక లెఖ్ఖయా ! – అని కీచకుడు వివేకశూన్యుడై కామార్తుడై పల్కాడు.

సుదేష్ణ పరిపరివిధాల ఆలోచించింది. వీడికి దుష్కాలం ప్రాప్తించడం వల్లనే ఇటువంటి దురూహ కల్గింది. వీడు బడభాగ్ని ముఖంలో ప్రవేశించడానికి ఉద్యుక్తుడవుతున్నాడు. అని విచారించి కీచకా, నీ వలన ఈసోదరులు నీస్నేహితులు నశిస్తారు. నీబలాన్ని నమ్ముకొని కామాంధుడవై అనుచితానికి పాల్పడుతూ నీ శ్రేయస్సును గుర్తించుకోలేక పోతున్నావు. నీకు ఆయువు మూడింది. లేకపోతే ఇంతమూర్ఖంగా ఆమెను వాంఛించవు. ఇటువంటి పాపకార్యాలలో నన్ను కూడా ప్రవేశపెట్టడం మంచిపనికాదు. వంశానికి

ధ్రువం గతాయుస్త్వం పాప యదేవం కామమోహితః
అకర్తవ్యే హి మాం పాపే నియునంక్షి నరాధమ.
అపి చైతత్ పురా ప్రోక్తం నిపుణైర్మనుజోత్తమైః
ఏకస్తు కురుతే పాపం స్వజాతిస్తేన హన్యతే.
గతస్త్వం ధర్మరాజస్య విషయం నాత్ర సంశయః
అదూరమకమిమం సర్వం స్వజనం ఘాతయిష్యసి.
ఏతత్ తు మే దుఃఖతరం యేనాహం భ్రాతృసౌహృదాత్
విదితార్థా కరిష్యామి తుష్టో భవ కులక్షయాత్
స్వమంత్రమభిసంధాయ తస్యార్థమనుచింత్య చ
ఉద్యోగం చైవ కృష్ణాయాః సుదేష్ణా సూతమబ్రవీత్
పర్వాణి త్వం సముద్దిశ్య సురామన్నం చ కారయ
తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారీం తవాంతికం

ఒక్క దుష్టుడు జన్మిస్తే చాలు. ఆ వంశమంత నశిస్తుందని పెద్దలంటారు. నీ చేతులతో నువ్వు సమసదనానికి దారి వేసుకుంటున్నావు. నీ బంధువులకు నీ మిత్రులకు కూడా చేటు తెస్తున్నావు. ఈ విషయాలన్నీ నాకు తెలుసు. అయినా సోదర వాత్సల్యంతో నీ కోరిక నెరవేరుస్తాను. ఈ వంశాన్నంతనీ నాశనంచేసి తృప్తిపడుదువుగాని ఏపర్వదినంనాడో సైరంధ్రిని నీ మందిరానికి పంపుతాను. నీ ఇంట్లో మధురమధురమైన భోజనాలు, మదిర (కల్లు) తయారుచేయించి ఉంచు. ఆమెను మదిర తెమ్మని పంపుతాను. అక్కడ ఏకాంతప్రదేశంలో ఆమెకు ఏవిధమైన కష్టమూ కలగకుండా చరించు- అని చెప్పి పంపింది.

కీచకుడు నిజసౌధానికి వచ్చాడు. భక్ష్య భోజ్యాలు మధురపానీయాలూ తయారుచేయించి

తత్ర సంప్రేషితామేనాం విజనే నిరవగ్రహే
సాంత్వయేథా యథాకామం సాంత్వ్యమానా రమేద్ యది.
ఇత్యుక్త స వినిష్క్రమ్య భగిన్యా వచనాత్ తదా
సురామాహారయామాస రాజార్హాం సుపరిష్కృతాం.
భక్ష్యాంశ్చ వివిధాకారాన్ బహూంశ్చోచ్చావచాం స్తదా
కారయామాస కుశలైరన్నం పానం సుశోభనం.
తస్మిన్ కృతే తదా దేవీ కీచకేనోపమంత్రి
త్వరాశాన్ కాలపాశేన కంఠే బద్ధః పశుర్యథా
నావబుధ్యత మూఢాత్మా మరణం సముపస్థితం.
మధుమద్యంబహువిధం భక్ష్యాశ్చవివిధాఃకృతాః
సుదేష్ణే బ్రూహి సైరంధ్రీం యథా సా మే గృహం వ్రజేత్.
కేనచిత్ త్వద్యకార్యేణ త్వరశీఘ్రంమమ ప్రియం
అహం హి శరణం దేవం ప్రపద్యే వృషభధ్వజం
సమాగమం మే సైరంధ్ర్యా మరణం వా విశేతి నై
సా తమాహ విశ్వస్య ప్రతిగచ్ఛ స్వకం గృహం
ఏషాహమపి సైరంధ్రీం సురార్థే తూర్ణమాదిశే.
ఏవముక్తస్తు పాపాత్మా కీచకస్త్వరితః పునః
స్వగృహం ప్రావిశత్ తూర్ణం సైరంధ్రీగతమానసః
సుదేష్ణా ప్రేషయామాస సైరంధ్రీం కీచకాలయం
ఉత్తిష్ఠ గచ్ఛ సైరంధ్రి కీచకస్య నివేశనం
పానమానయ కల్యాణి పిపాసా మాం ప్రబాధతే.
న గచ్ఛేయమహం తస్య రాజపుత్రి నివేశనం
త్వమేవ రాజ్ఞి జానాసి యథా స నిరపత్రయః.
న చాహమనవద్యాంగి తవ వేశ్మని భామిని
కామవృత్తా భవిష్యామి పతీనాం వ్యభిచారిణీ.
త్వం చైవ దేవి జానాసి యథా స సమయః కృతః

---

సుదేష్ణకు తెలియజేశాడు. కాలపాశాన్ని కంఠంలో బంధించుకొన్న కీచకుడు ఆసన్నమృత్యువును గుర్తించలేక ద్రౌపది మీద మనస్సు మరల్చుకొనలేక — అక్కా మధురమధురమైన మత్తుపదార్థాలు స్వాదువులైన భోజ్యాలు తయారుచేయించాను. ఈనాడే సైరంధ్రిని నా మందిరానికి పంపు. ఈ సైరంధ్రితో నాకు సమాగమము కలిగించక పోతే మరణమే శరణ్యము. — అనగా సుదేష్ణ అలానే చేస్తానని వానిని త్వరగా వాని మందిరానికి వెళ్ళమని చెప్పింది. కీచకుడు వెళ్ళిపోయాడు.

సుదేష్ణ సైరంధ్రిని పిలిచి—నాకిప్పుడెంతో దాహంగా ఉంది. కీచకుని ఇంట రసభరితములైన ద్రవపదార్థా లున్నాయి. నువ్వు తక్షణం వెళ్ళి అవి తీసుకురా — అని ఆజ్ఞాపించగా — మహారాణీ! ఆసిగ్గుమాలినవాడింటికివెళ్ళను. స్వేచ్ఛాచారిగా, వ్యభిచారిగా, నా భర్తలు నన్ను శంకించేటట్లు నేను చరించను. నీ రాణివాసంలో చేరబోయే ముందు నేనే ప్రతిజ్ఞలుచేసానో నువ్వు మరచిపోయుండవు. కీచకుడు పరమమూర్ఖుడై కామోద్రేకంతో మదించి ఉన్నాడు నేను ఒంటరిగా కనపడతే అవమానించే సంకల్పంతో ఉన్నాడు. ఈ సౌధంలో ఇందరు దాసదాసీజనులుండగా వారిలో ఏ ఒకరినైనా పంపక ఈ విషయంలో నన్నెందుకు ఆజ్ఞాపిస్తావు నన్ను పంపకు నీకు మేలు కలుగుతుంది — అని సైరంధ్రి వినయంగా సమాధాన మిచ్చింది.

శుభస్వరూపిణీ? ఇప్పుడే నేను కీచకున్ని పంపుతూ సురకోసం నిన్ను పంపుతున్నానని చెప్పాను. నాకు నీకే కష్టము కలిగించడు— అని సుదేష్ణ ఒక సువర్ణపాత్ర సైరంధ్రి కిచ్చింది.

ప్రవిశంత్యా మయా పూర్వం తవ వేశ్మని భామిని
కీచకస్తు సుకేశాంతే మూఢో మదనదర్పితః
సోఽవమంస్యతి మాం దృష్ట్వా న యాస్యే తత్ర శోభనే.

సంతి బహ్వ్యస్తవ ప్రేష్యా రాజపుత్రి వశానుగాః
అన్యాం ప్రేషయ భద్రం తే స హి మామవమంస్యతే.

నైవత్వాంజాతుహింస్యాత్ స ఇతః సంప్రేషితాం మయా
ఇత్యుక్త్వా ప్రదదౌ పాత్రం సపిధానం హిరణ్మయం
సా శంకమానా రుదతీ దైవం శరణమీయుషీ
ప్రాతిష్ఠత సురాహారీ కీచకస్య నివేశనం.

యథాహమన్యం భర్తృభ్యో నాభిజానామి కంచన
తేన సత్యేన మాం ప్రాప్తాం మా కుర్యాత్ కీచకో వశే.

ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్తమబలా తతః
స తస్యాస్తనుమధ్యాయాః సర్వం సూర్యోఽవబుద్ధవాన్

అంతర్హితం తతస్తస్యా రక్షో రక్షార్థమాదిశత్
తచ్చైనాంనాజహాత్ తత్రసర్వావస్థాస్వనిందితాం.
తాం మృగీమివ సంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగాం
ఉదాతిష్ఠన్ముదా సూతో నావం లబ్ధ్వేవ పారగః.

---

## పదునారవ అధ్యాయం

స్వాగతం తే సుకేశాంతే సువ్యుష్టా రజనీ మమ
స్వామినీ త్వమనుప్రాప్తా ప్రకురుష్వ మమ ప్రియం.
సువర్ణమాలాః కంబూశ్చ కుండలే పరిహాటకే
నానాపత్తనజే శుభ్రే మణిరత్నం చ శోభనం.
ఆహరంతు చ వస్త్రాణి కౌశికాన్యజినాని చ
అస్తి మే శయనం దివ్యం త్వదర్థముపకల్పితం.

---

సైరంధ్రి వ్యాకులచిత్తంతో కీచకుని మందిరంవైపు బయలుదేరింది. దారిలో వెడుతూ శీలరక్షణార్థమై సూర్యభగవానుని ఇలా ప్రార్థించింది.

భాస్కరా ! నేను నా భర్తలనుతప్ప ఇతరులెవ్వరినీ ఎన్నడూ నా మనసులోకి రాకుండా చరించినట్లయితే ఆ పాతివ్రత్యధర్మ ప్రభావంవల్ల ఈ నాడు కీచకుని గృహంలో నాకేవిధమైన ప్రమాదమూ రాకుండా ఉండుగాక అని అనేక విధాల సూర్యుని ప్రార్థించింది.

సూర్యుడు ద్రౌపదిస్థితిని గ్రహించి ఆమెను రక్షించుటకై అదృశ్యరూపంలో ఒక రాక్షసుని నియోగించాడు. సూర్యుని ఆజ్ఞానుసారం ఆ అసురుడు ద్రౌపదిని వెన్నంటి నడుస్తున్నాడు. భయపడిన లేడిలా ద్రౌపది కీచకుని మందిరంలోకి ప్రవేశించింది. నదీమధ్యంలో మునిగిపోయేవాడికి నావ దొరికినట్లు కీచకుడు ద్రౌపదిని చూచి పరమానందం పొందాడు.

---

## పదునారవ అధ్యాయం

సైరంధ్రీ! నీకు శుభమగు గాక. ఈ రాత్రి నాకు సర్వసుఖాలూ చేకూరేసూచనలు గోచరిస్తున్నాయి. నా ప్రేమను అంగీకరించి నాకు సంతోషం కలిగించు. నా దాసీజనం నీకు సేవలు చేస్తూంటారు. ఇప్పుడే నిన్ను దివ్యమాల్యాభరణాంబరాలతో అలంకరిస్తారు. సుందర సువర్ణహారాలూ,

ఏహి తత్ర మయా సార్ధం పిబస్వ మధుమాధవీం.
నాహం శక్యా త్వయా స్ప్రష్టుం నిషాదేనేవ బ్రాహ్మణీ
మా గమిష్యసి దుర్బుద్ధే గతిం దుర్గాంతరాంతరాం.
యత్ర గచ్ఛంతి బహవః పరదారాభిమర్శకాః
నరాః సంభిన్నమర్యాదాః కీటవచ్చ గుహాశయాః
అప్రైషీద్ రాజపుత్రీమాం సురాహారీం తవాంతికం
పానమాహారమేత్యుగ్రం పిపాసా మేఽతి చాబ్రవీత్.
అన్యాభద్రేనయిష్యంతి రాజపుత్ర్యాః ప్రతిశ్రుతం
ఇత్యేతాం దక్షిణే పాణౌ సూతపుత్రః పరామృశత్
యథా నాహం నాభిచరే కదాచిత్
పతీన్ మదాద్ వై మనసాపి జాతు
తేనైవ సత్యేన వశీకృతం త్వాం
ద్రష్టాస్మి పాపం పరికృష్యమాణాం.
స తామభిప్రేక్ష్య విశాలనేత్రాం
జిఘృక్షమాణః పరిభర్త్సయంతీం
జగ్రాహ తాముత్తరవస్త్రదేశే
స కీచకస్తాం సహసాఽఽక్షిపంతీం.
ప్రగృహ్యమాణా తు మహాజవేన
ముహుర్వినిఃశ్వస్య చ రాజపుత్రీ
తయా సమాక్షిప్తతనుః స పాపః
పపాత శాఖీవ నికృత్తమూలః.
సా గృహీతా విధున్వానా భూమావాక్షిప్య కీచకం
సభాం శరణమాగచ్ఛద్ యత్ర రాజా యుధిష్ఠిరః
తాం కీచకః ప్రధావంతీం కేశపాశే పరామృశత్
అథైనాం పశ్యతో రాజ్ఞః పాతయిత్వా పదావధీత్
తస్యా యోఽసౌ తదార్కేణ రాక్షసః సంనియోజితః
స కీచకమపోవాహ వాతవేగేన భారత.
స పపాత తదా భూమౌ రక్షోబలసమాహతః

---

శంఖధవళకుండలాలూ, మణిరత్నఘటితభూషణాలూ, పట్టుచీరలూ, అంగరాగాలూ నీముందుంచుతారు. హంసతూలికాతల్పం నీకోసం సిద్ధంగా ఉంది. నీ మృదుకంఠంతో నాకు శ్రవణానందం కల్గించు- అని కీచకుడు మదోన్మత్తుడయి ప్రలాపించగా- ఓరిదుష్టుడా! ఉత్తమ బ్రాహ్మణవంశంలో ప్రభవించిన స్త్రీని నీచనిషాదుడు స్పృశించలేనట్లు నువ్వు నావైపు కన్నెత్తికూడాచూడలేవు. ధర్మమార్గం విడిచి పరస్త్రీగమనానికి ఉద్యుక్తులయిన దురాచారులకు కలిగిన దుర్గతులను గుర్తుకుతెచ్చుకొని సక్రమంగా ప్రవర్తించు. సుదేష్ణాదేవి దాహంతో ఉంది. సుర తెమ్మని నన్ను నీ ఇంటికి పంపింది. నన్ను అడ్డుపెట్టక త్వరగాపంపు - అని ద్రౌపది తీవ్రస్వరంతో పలికింది.

కామార్తుడయిన కీచకుడు విచక్షణాజ్ఞానశూన్యుడయి - సైరంధ్రీ! సుదేష్ణకు నా దాసీలు మదిర తీసుకొనివెళ్ళి ఇస్తారు. ఇప్పుడే వారిని పంపుతాను - అన్నాడు.

ద్రౌపది క్రోధోద్రిక్తయయి - ఓరి పాపాత్ముడా! నేను పాతివ్రత్య నియమాన్ని ఉల్లంఘించకుండా ఇంతవరకూ చరించినట్లయితే అద్య తన భావిలో నీ పాపఫల మనుభవిస్తావు - అని పళ్ళు పటపట కొరికింది.

కామాంధుడయిన కీచకుడు ఆమెను తన బాహుబంధంలో బంధించడానికి ఉద్యుక్తుడయాడు. ద్రౌపది పారిపోవడానికి ప్రయత్నించింది. చీరచెంగుపట్టి కీచకు డామెను దగ్గరకు తీసికోబోతూండగా ద్రౌపది వేడినిట్టూర్పులు విడుస్తూ రెండుచేతులతో కీచకుని త్రోసిపారేసింది. మూలం తెగిన చెట్టులా వాడు నేల కూలాడు. ఆమె కీచ

విఘూర్ణమానో నిశ్చేష్టశ్ఛిన్నమూల ఇవ ద్రుమః
సభాయాం పశ్యతో రాజ్ఞో విరాటస్య మహాత్మనః
బ్రాహ్మణానాం చ వృద్ధానాం క్షత్రియాణాం చ పశ్యతాం
తస్యాః పాదాభితప్తాయాముఖాద్ రుధిరమాస్రవత్
తాం దృష్ట్వా తత్ర తే సభ్యా హాహాభూతాః సమంతతః.
న యుక్తం సూతపుత్రేతి కీచకేతి మానవాః
కిమియం వధ్యతే బాలా కృపణా చాప్యబాంధవా
తాం చాసీనౌ దదృశతుర్భీమసేనయుధిష్ఠిరౌ
అమృష్యమాణౌ కృష్ణాయాః కీచకేన పరాభవం
తస్య భీమో వధం ప్రేప్సుః కీచకస్య దురాత్మనః
దంతైర్దంతాంస్తదారోషాన్నిష్పిపేష మహామనాః
ధూమచ్ఛాయా హ్యభజతాం నేత్రే చోచ్ఛ్రిత పక్ష్మణీ
సస్వేదా భృకుటీ చోగ్రా లలాటే సమవర్తత.
హస్తేన మమృజే చైవ లలాటం పరవీరహా
భూయశ్చ త్వరితః క్రుద్ధః సహసోత్థాతుమైచ్ఛత.
అథావమృద్నాదంగుష్ఠమంగుష్ఠేన యుధిష్ఠిరః
ప్రబోధనభయాద్ రాజా భీమం తం ప్రత్యషేధయత్.
తం మత్తమివమాతంగం వీక్షమాణం వనస్పతిం
స తమావారయామాస భీమసేనం యుధిష్ఠిరః.
ఆలోకయసి కిం వృక్షం సూద దారుకృతేన వై
యది తే దారుభిః కృత్యం బహిర్వృక్షాన్నిగృహ్యతాం.
యస్య చార్ద్రస్య వృక్షస్య శీతచ్ఛాయాం సమాశ్రయేత్
న తస్య పర్ణం ద్రుహ్యేత పూర్వవృత్తమనుస్మరన్
ఇంగితజ్ఞః స తు భ్రాతుస్తూష్ణీమాసీద్ వృకోదరః

---

కుని సౌధం విడిచి విరటరాజ సభామధ్యానికి వచ్చింది. కీచకుడు ఒళ్ళు దులుపుకొని ఆమెను వెంబడించాడు. విరట ధర్మరాజాదు లందరూ కొలువుతీర్చిఉన్న సభలో ఆమెను పరాభవించ డానికి కీచకుడు ప్రయత్నిస్తూండగా సూర్యాజ్ఞా బద్ధుడయిన రాక్షసుడు ఆ దుష్టుని బంధించి దూరంగా విసిరేశాడు. కీచకుడు చైతన్యశూన్యుడయి నేలమీద పడ్డాడు. ద్రౌపది ముఖంనుండి కీచకుని పాదతాడనంవల్ల రక్తం కారింది.

సభాసదులందరూ కీచకుని పాపకార్యాన్ని నిందించారు. సభలోఉన్న ధర్మజ భీమసేనులు కూడా ఆ దృశ్యాన్ని కన్నులారాచూస్తూ ఏమీ చేయలేకపోయారు. సహజక్రోధియయిన భీముడు పళ్ళు పటపట కొరుకుతూ కనుబొమలు బిగించి కీచకుని చంపటానికి నిశ్చయించుకున్నాడు. భీముని ముఖంలో క్రోధం గమనించి ధర్మరాజు పరిస్థితి విషమిస్తోందని గ్రహించి తన బొటనవ్రేలితో భీముని కాలు నొక్కాడు. భీముడు కొంతసేపు తటపటాయించి పరిసరాలలోఉన్న ఒక వృక్షంవైపు దృష్టి పోనిచ్చాడు. ధర్మరా జది గ్రహించి - వల్లవా! కట్టెలకోసం ఆ చెట్టుకేసి చూస్తావెందుకు. వంటకు కట్టెలులేకపోతే నగర బాహ్యప్రదేశానికి వెళ్ళి తెచ్చుకో! అంతేకాని ఫలపుష్పభరితమయి ప్రజలకు సంతోషం కలిగించే ఈ వృక్షాన్ని మనం రక్షించుకోవాలేగాని మనచేతులతో పాడుచేయకూడదు - అని ద్వంద్వార్థయుక్తంగా పలికాడు. అదివిని భీముడు శాంతించాడు. ద్రౌపది కుపిత భుజంగంవలె నిట్టూర్పులువిడుస్తూ రాజసభాముఖ ద్వారంలో నిలిచి ఎర్రవారిన కనులతో తన భర్తలనూ విరటరాజునూచూచి - మహారాజా! ప్రజా

భీమస్య తు సమారంభం దృష్ట్వా రాజ్ఞశ్చ చేష్టితం
ద్రౌపద్యభ్యధికం క్రుద్ధా ప్రారుదత్ సా పునఃపునః
కీచకేనానుగమనాత్ కృష్ణా తామ్రాయతేక్షణా
సా సభాద్వారమాసాద్య రుదతీ మత్స్యమబ్రవీత్
అవేక్షమాణా సుశ్రోణీ పతీంస్తాన్ దీనచేతసః.
ఆకారమభిరక్షంతీ ప్రతిజ్ఞాధర్మసంహితా
దహ్యమానేవ రౌద్రేణ చక్షుషా ద్రుపదాత్మజా.
ప్రజారక్షణశీలానాం రాజ్ఞాం హ్యమితతేజసాం
కార్యం హి పాలనం నిత్యం ధర్మే సత్యే చ తిష్ఠతాం.
స్వప్రజాయాం ప్రజాయాం చ విశేషం నాధిగచ్ఛతాం
ప్రియేష్వపిచ ద్వేష్యేషుసమత్వంయేసమాశ్రితాః,
వివాదేషు ప్రవృత్తేషు సమం కార్యానుదర్శినా
రాజ్ఞా ధర్మాసనస్థేన జితౌ లోకావుభావపి.
రాజన్ ధర్మాసనస్థోఽపి రక్ష మాం త్వమనాగసీం
అహం త్వనపరాధ్యంతీ కీచకేన దురాత్మనా.
పశ్యతస్తే మహారాజ హతా పాదేన దాసవత్.
మత్స్యాధిప ప్రజా రక్ష పితా పుత్రానివౌరసాన్
యస్త్వధర్మేణ కార్యాణి మోహాత్కురుతే నృపః
అచిరాత్ తం దురాత్మానం వశే కుర్వంతి శత్రవః
మత్స్యానాంకులజస్త్వంహి తేషాంసత్యంపరాయణం
త్వం కిలైవంవిధో జాతః కులే ధర్మపరాయణే.
అతస్త్వాహమభిక్రందే శరణార్థం నరాధిప
త్రాహి మామద్య రాజేంద్ర కీచకాత్ పాపపూరుషాత్.
అనాథామిహ మాం జ్ఞాత్వా కీచకః పురుషాధమః
ప్రహరత్యేవ నీచాత్మా న తు ధర్మమవేక్షతే.
అకార్యాణామనారంభాత్ కార్యాణామనుపాలనాత్

రక్షణ తత్పరులైన మీరు సత్యధర్మాలను విడువకుండా ఈ ప్రజలను కన్నబిడ్డలవలె ప్రేమించి పాలిస్తున్నారు. ఆశ్రితజన రక్షణ మహారాజుకు ప్రధాన కర్తవ్యం. హితులనూ అహితులనూ సమదృష్టితో చూస్తూ ప్రజలమధ్య వివాదాలు చెలరేగినప్పుడు ప్రభువు న్యాయస్థానంమీద ఉండి ధర్మదృష్టితో చరించాలి. అటువంటి ప్రభువుకు ఇహపరాలలో కీర్తిసుఖాలు లభిస్తాయి. ధర్మాసనమధిష్ఠించిన మీరు ఈ అబలకు రక్షణ కల్పించండి. ఈ దుష్టుడు మీ కనుల ఎదుటగా నన్ను తన్నుతున్నాడు. తండ్రి బిడ్డలను చూసేటట్లు మీరు మీ ప్రజలను రక్షించండి. ప్రభువు మోహబుద్ధియై అధర్మమార్గం అనుసరిస్తే త్వరలోనే నశిస్తాడు. పవిత్ర మత్స్యవంశంలో జన్మించిన నిన్ను సత్య మాశ్రయించుకొని ఉంది. నీవంటి ధర్మపరులవల్లనే మీవంశం వన్నె పెరిగింది. ఈ దుర్మార్గుడు ద్రోహబుద్ధితో ధర్మమార్గం విడిచి నన్ను హింసిస్తున్నాడు. అవసరానుకూలంగా కర్తవ్యాన్ని నిర్వర్తించే మహారాజు స్వర్గసుఖాలు పొందుతాడు. అంతేకాని సామాన్య ప్రజలవలె ప్రభువు పాపాచారపరాయణుడై ప్రవర్తిస్తే అధోగతికి పోతాడు. యాగాలు, దానాలూ గురుజనసేవలూ ఆచరించక చలించేరాజు కర్తవ్యజ్ఞానశూన్యుడయి నీచగతులు పొందుతాడు.

ఈ భూమండలంమీద ధర్మాధర్మభేదాలను గ్రహించి చరించేవారికి సత్వరం ఫలప్రాప్తి కలుగుతుందని విధాత నిర్దేశించాడు. సజ్జనులు మంచిపనులనూ దుష్టులు పాపకర్మలనూ ఆచరించి తత్ఫలాలు పొందుతారు. మోహాంధకారంలోపడి మానవుడు దుష్కర్మలుచేస్తే పశ్చాత్తాపం తప్ప

ప్రజాసు యేసువృత్తాస్తేస్వర్గమాయాంతిభూమిపాః.
కార్యాకార్యవిశేషజ్ఞాః కామకారేణ పార్థివ
ప్రజాసుకిల్బిషంకృత్వానరకం యాంత్యధోముఖాః
నైవ యజ్ఞైర్న వా దానైర్న గురోరుపసేవయా
ప్రాప్నువంతి తథా ధర్మం యథా కార్యానుపాలనాత్.
క్రియాయామక్రియాయాం చ ప్రాపణే పుణ్యపాపయోః
ప్రజాయాం సృజ్యమానాయాం పురా హ్యేతదుదాహృతం.
ఏతద్వై మానుషాః సమ్యక్ కార్యం జ్ఞాత్వాలయో భువి
అస్మిన్ సునీతే దుర్నీతే లభతే కర్మజం ఫలం.
కళ్యాణకారీ కళ్యాణం పాపకారీ పాపకం
తేన గచ్ఛతి సంసర్గం స్వర్గాయ నరకాయ వా.
సుకృతం దుష్కృతం వాపి కృత్వా మోహేన మానవః
పశ్చాత్తాపేన తప్యేత స్వబుద్ధ్యా శరణం గతః.
ఏవముక్త్వా పరం వాక్యం విససర్జ శతక్రతుం
శక్రోఽప్యాపృచ్ఛ్య బ్రహ్మాణం దేవరాజ్యమపాలయత్
యథోక్తం దేవదేవేన బ్రహ్మణా పరమేష్ఠినా
తథా త్వమపి రాజేంద్ర కార్యాకార్యే స్థిరో భవ.
ఏవం విలపమానాయాం పాంచాల్యాం మత్స్యపుంగవః
అశక్తః కీచకం తత్ర శాసితుం బలదర్పితం.
విరాటరాజః సూతం తు సాంత్వేనైవ న్యవారయత్
కీచకం మత్స్యరాజేన కృష్ణాగసమనిందితా.
నాపరాధానురూపేణ దండేన ప్రతిపాదితం
పాంచాలరాజస్య సుతా దృష్ట్వా సురసుతోపమా.

---

దని ఇంద్రునికి నీతిమార్గం చెబుతూ బ్రహ్మ చెప్పాడు. ఆ ప్రజాపతి మాటలను యథాతథంగా పాలించి ఇంద్రుడు స్వర్గాధిపతి అయాడు. ఆ మార్గాన్ననుసరించి నువ్వు నడిచినట్లయితే నీకు మేలు కలుగుతుంది - అని పలికి దీనంగా విలపించ సాగింది.

బలశౌర్యసంపన్నుడయిన కీచకుని దండించే శక్తిలేక వారిని శాంతవచనాలతో మందలించబోయాడు. ద్రౌపది ఉత్తమధర్మాలను ఒక్కమారు స్మరించి విచారభారంతో సభాసదులను కలయజూసి - అసహాయస్థితిలోనున్న ఈ అబల సూతపుత్రునివల్ల అవమానింపబడుతూంటే రక్షించేవారీ సభలో లేరా! నా భర్తలయొక్క శత్రువుల అయిదు దేశాలూ దాటి ఈ ఆరవ దేశంలో నివసిస్తున్నా ఇక్కడకూడా నాకు భయంవల్ల మరణం సిద్ధిస్తే అది నా తప్పు కాదు. ఈ దుష్టకీచక పదతాడనంకంటె మరణమే మేలు. దానాసక్తచిత్తులూ నప్రతిగ్రహీతలూ బ్రాహ్మణభక్తులూ సత్యవాదులూ అయిన వీరశ్రేష్ఠుల భార్య ఈనాడు సూతసుతుని పదతాడనాలకు గురికావలసి వచ్చింది. కాలమూ కర్మా అనుభవించక తప్పనివికదా! -దేవదుందుభులవలె మ్రోగే ధనుష్టంకారమాత్రంచేత శత్రువీరుల గుండెలను బ్రద్దలుచేసే మహావీరుని భార్యనయి ఉండి నేనీ పరాభవం పొందక తప్పలేదు. బలశౌర్య సమన్వితులూ తేజస్సంపన్నులూ జితేంద్రియులూ అయిన వారిభార్యనై ఈనాడు రక్షణలేక ఈ సూతుని కాలి తాపులకు గురికావలసి వచ్చింది. శరణు వేడినవారిని రక్షించే వ్రతంతోసాగే మహారథికుడు నాకు భర్తయైఉండీ నన్ను రక్షించకుండా

ధర్మజ్ఞా వ్యవహారాణాం కీచకం కృతకిల్బిషం
పునః ప్రోవాచ రాజానం స్మరంతీ ధర్మముత్తమం.
సంప్రేక్ష్య చ వరారోహా సర్వాం స్తత్ర సభాసదః
విరాటం చాహ పాంచాలీ దుఃఖేనావిష్టచేతనా
యేషాం వైరీ న స్వపితి షష్ఠేఽపి విషయే వసన్
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః
పదావధీత్.
యే దద్యుర్న చ యాచేయుర్బ్రహ్మణ్యాః సత్యవాదినః
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః
పదావధీత్.
యేషాం దుందుభినిర్ఘోషో జ్యాఘోషః శ్రూయతే
ఽనిశం
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః
పదావధీత్.
యే చ తేజస్వినో దాంతా బలవంతోఽభిమానినః
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః
పదావధీత్.
సర్వలోకమిమం హన్యుర్ధర్మపాశసితాస్తు యే
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః
పదావధీత్.
శరణం యే ప్రపన్నానాం భవంతి శరణార్థినాం
చరంతి లోకే ప్రచ్ఛన్నాః క్వను తేఽద్య మహారథాః
కథం తే సూతపుత్రేణ వధ్యమానాం ప్రియాం సతీం
మర్షయంతి యథా క్లీబా బలవంతోఽమితౌజసః.
క్వ ను తేషామమర్షశ్చ వీర్యం తేజశ్చ వర్తతే
న పరీప్సంతి యే భార్యాం వధ్యమానాం దురాత్మనా
మయాత్ర శక్యం కిం కర్తుం విరాటే ధర్మదూషకే
యః పశ్యన్ మాం మర్షయతి వధ్యమానామనాగసం.
న రాజా రాజవత్ కించిత్ సమాచరతి కీచకే
దస్యూనామివ ధర్మస్తే న హి సంసది శోభతే

---

ఎందుకు చరిస్తున్నారో అర్థం కావడంలేదు. తను భార్య ఒక సూతుని చేతిలో పరాభవం పొందుతూ ఉంటే నపుంసకులవలె సహించి ఊరుకోగలగడానికి వారి పరాక్రమ తేజస్సులు ఏమయిపోయాయి? ఈ విరటుడుకూడా ధర్మభ్రష్టు డయిపోయాడు. ఇంక ఈ రాజ్యంలో జీవించడం ఎలా?

మహారాజా! నీ ధర్మపాలనా దక్షత ఈ సభలో శోభించడంలేదు. నీ కనులఎదుట నాకు జరిగే పరాభవానికి ప్రతీకారం జరగడంలేదు. ఈ అత్యాచారాలను సహించడం ఎవరికీ ఉచితం కాదు. కీచకుడు అధర్మమార్గనిరతుడు. ధర్మజ్ఞాన శూన్యుడయిన మత్స్యభూపతి సభలోఉన్న సదస్యులుకూడ అంతే - అని కన్నీరు కారుస్తూ నిలబడింది.

సైరంధ్రీ! మీ ఉభయులమధ్యా జరిగిన వివాదమేమిటో మాకు తెలియదు. విషయం వినకుండా న్యాయ నిర్ణయం చేయడం కష్టం - అని విరటుడు పలుకగా ద్రౌపదివిషయం సర్వస్వం నివేదించింది. సభాసదులు అదివిని కీచకుని నిందిస్తూ ఆమెను ఊరడిస్తూ - ఈమె ఎవరిభార్యయో వారు ధన్యులు ఇటువంటి నారీకి ఈ స్థితి కలగడం ఉచితంకాదు. కమలసన్నిభకోమల తనుకాంతితో కుందపుష్పశోభను పరిహసించే వదనపద్మంతో మల్లిమొగ్గలవంటి దంతాలతో దీర్ఘకేశపాశంతో శంఖచక్ర కమలధ్వజ చిహ్నిత హస్తద్వయంతో చతురావర్త దేహంతో శోభించే ఈ పద్మాయతాక్షి పాదతాడనాలకు యోగ్యమయిందికాదు. శచీదేవితో ఉపమింపదగ్గ ఈ నారీశిరోమణి ఆ దుష్టుని పాదతాడనాలతో మరణించవలసిందేనా? నిరపరాధికి ఇటువంటిశిక్ష ఉచితంకాదు-అన్నారు.

నాహమేతేనయుక్తం వై హంతుంమత్స్యత వాంతికే
సభాసదోఽత్ర పశ్యంతు కీచకస్య వ్యతిక్రమం.
కీచకో న చ ధర్మజ్ఞో న చ మత్స్యః కథంచన
సభాసదోఽప్యధర్మజ్ఞా య ఏనం పర్యుపాసతే.
ఏవంవిధై ర్వచోభిః సా తదా కృష్ణాశ్రులోచనా
ఉపాలభత రాజానం మత్స్యానాం వరవర్ణినీ.
పరోక్షం నాభిజానామి విగ్రహం యువయోరహం
అర్థతత్వమవిజ్ఞాయ కిం ను స్యాత్ కౌశలం మమ.
తతస్తు సభ్యా విజ్ఞాయ కృష్ణాం భూయోఽభ్యపూజయన్.
సాధు సాధ్వితిచాప్యాహుః కీచకంచవ్యగర్హయత్.
యస్యేయం చారుసర్వాంగీ భార్యా స్యాదాయతేక్షణా
పరో లాభస్తు తస్య స్యాన్న చ శోచేత్ కథంచన.
యస్యా గాత్రం శుభంపీనం ముఖంజయతి పంకజం
గతిర్హంసం స్మితం కుందం సైషా నార్హతిపద్వధం.
పద్మం చక్రం ధ్వజం శంఖంప్రాసాదోమకరస్తథా
యస్యాః పాణితలే సంతి సైషానార్హతి పద్వధం.
ఆవర్తాః ఖలు చత్వారః సర్వే చైవ ప్రదక్షిణాః
సమంగాత్రంశుభంస్నిగ్ధం యస్యానార్హతిపద్వధం.
అచ్ఛిద్రహస్తపాదా చ అచ్ఛిద్రదశనా చ యా
కన్యా కమలపత్రాక్షీ కథమర్హతి పద్వధం.
సేయం లక్షణసంపన్నా పూర్ణచంద్రనిభాననా
సురూపిణీ సువదనా నేయం యోగ్యా పదావధం.
దేవదేవీవ సుభగా శక్రదేవీవ శోభనా
అప్సరా ఇవసౌరూప్యాన్నేయంయోగ్యాపదావధం
న హీదృశీ మనుష్యేషు సులభా వరవర్ణినీ
నారీ సర్వానవద్యాంగీ దేవీం మన్యామహేవయం.
ఏవం సంపూజ్యయంతస్తే కృష్ణాంప్రేక్ష్యసభాసదః.
యుధిష్ఠిరస్య కోపాత్ తు లలాటే స్వేద ఆగమత్.

---

ధర్మరాజుకు కీచకునిపై విపరీత క్రోధం పుట్టింది. ద్రౌపది అవనతవదనయై పాదతాడిత భుజంగంలా దీర్ఘనిశ్వాసాలు విడుస్తూ ధర్మరాజుతో భాషించడానికి ఉద్యుక్తురాలవుతూండగా అది గ్రహించి ధర్మరాజు – సైరంధ్రీ! నువ్విక్కడ నిలబడకూడదు. తక్షణం అంతఃపురానికి వెళ్ళు. భర్తృశాసనాన్ని అతిక్రమించకుండా క్లేశాలనుసైతం అనుభవించే సాధ్వి సుఖాలను పొందుతుంది. సూర్యసమతేజస్సంపన్నులైన నీ గంధర్వ భర్తలు ఇప్పుడు కుపితులు కావలసిన అవసరం లేదని నేననుకుంటున్నాను. అందుచేతనే వారు నీ సంరక్షణకు పూనుకోలేదు. కులస్త్రీకి ఉపవాసవ్రతాలు అవసరంలేదు. పతిసేవయే పరమ ధర్మమని శాస్త్రం ఘోషిస్తోంది. బాల్యావస్థలో తండ్రి, యౌవనంలో భర్త, వార్ధక్యంలో కుమారుడు స్త్రీకి రక్షణనిస్తారు గనుక ఆమెకు స్వతంత్రమవసరంలేదు. శత్రువులు కల్పించే క్లేశాలను పతివ్రత సహించి ఊరుకోవాలేగాని భర్తను నిందించకూడదు. ఇది సనాతనమయిన ధర్మం. నీ భర్తలకు ఆగ్రహమే కలిగితే వృత్రాసురుని సంహరించిన ఇంద్రుడుకూడా వారిముందు నిలబడలేడు. క్షమకంటె ఉత్తమమయిన ధర్మం లేదు. సమయమాసన్నమవగానే సర్వకార్యాలూ సక్రమంగా ఫలిస్తాయి. సత్యదానధర్మాలు క్షమతో సమంగావు. క్షమయే తపస్సు. అది ఇహపరాల నిస్తుంది. ఉత్తర దక్షిణాయణాలనే అంశలతో మాసాలనే అంగాలతో పర్వపక్షాలతో దినాలనే అంచులతో సంవత్సర కాలచక్రం పరిభ్రమించేవరకూ ఓర్పు వహిస్తే శుభాలు కలుగుతాయి. ఒక్కమాసం ఆ ఓరిమిపట్టలేకపోతే అది ప్రయోజనకారికాదు –

సా వినిఃశ్వస్య సుశ్రోణీ భూమావంతర్ముఖీ స్థితా
తూష్ణీమాసీత్ తదా దృష్ట్వా వివక్షంతం యుధిష్ఠిరం.
అథాబ్రవీద్ రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియాం
గచ్ఛ సైరంధ్రి మాత్రస్థాః సుదేష్ణాయా నివేశనం.
భర్తారమనురుంధ్యంత్యః క్లిశ్యంతే వీరపత్నయః
శుశ్రూషయా క్లిశ్యమానాః పతిలోకం జయంత్యుత.
మన్యే న కాలం క్రోధస్య పశ్యంతి పతయస్తవ
తేన త్వాం నాభిధావంతి గంధర్వాః సూర్యవర్చసః.
శ్రూయంతాం తే సుకేశాంతే మోక్షధర్మాశ్రయాః కథాః
యథా ధర్మం కులస్త్రీణాం దృష్టో ధర్మానురోధనాత్
నాస్తి కశ్చిత్ స్త్రియా యజ్ఞో న శ్రాద్ధం నాప్యుపోషణం
యా చ భర్తరి శుశ్రూషా సా స్వర్గాయాభిజాయతే.
పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
పుత్రస్తు స్థవిరే భావే న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి.
భర్తౄన్ ప్రతి తథాపశ్యోన్యన క్రుధ్యంతి కదాచన
బహుభిశ్చ పరిక్లిష్టైరవజ్ఞాతాశ్చ శత్రుభిః.
అనన్యభావశుశ్రూషాః పుణ్యలోకం వ్రజంత్యుత
న క్రుద్ధాః ప్రతిప్రాయాద్ వై పతీం స్తే వృత్రహా అపి.
యది తే సమయః కశ్చిత్ కృతో హ్యాయతలోచనే
తం స్మరస్వ క్షమాశీలే క్షమా ధర్మో హ్యనుత్తమః
క్షమా సత్యం క్షమా దానం క్షమా ధర్మః క్షమా తపః
క్షమావతామయం లోకః పరలోకః క్షమావతాం
ద్వ్యంశినో ద్వాదశాంగస్య చతుర్వింశతిపర్వణః
కః షష్టిత్రిశతారస్య మాసోనస్యాక్షమీ భవేత్.
ఇత్యేవముక్తే తిష్ఠంతీం పునరేవాహ ధర్మరాట్
అకాలజ్ఞాసి సైరంధ్రి శైలూషీవ విరోదిషి.
విఘ్నం కరోషి మత్స్యానాం దీవ్యతాం రాజసంసది
గచ్ఛ సైరంధ్రి గంధర్వాః కరిష్యంతి తవ ప్రియం
వ్యపనేష్యంతి తే దుఃఖం యేన తే విప్రియం కృతం.
అతీవ తేషాం ఘృణినామర్థేఽహం ధర్మచారిణీ
తస్య తస్యైవ తే వధ్యా యేషాం జ్యేష్ఠోఽక్ష దేవితా.
ఇత్యుక్త్వా ప్రాద్రవత్ కృష్ణా సుదేష్ణాయా నివేశనం
కేశాన్ ముక్త్వా చ సుశ్రోణీ సంరంభాల్లోహితేక్షణా

అని ధర్మరాజు సాంకేతికంగా ప్రసంగించాడు. అయినా ద్రౌపది కదలలేదు.

సైరంధ్రీ! నీకు సమయాసమయాలు తెలియడంలేదు. నటివలె రాజసభలో రోదిస్తున్నావు. ఇందువల్ల విరట రాకుమానుని క్రీడకు విఘ్నం కలుగుతోంది. నిన్ను అవమానించిన వారిని నీ భర్తలయిన గంధర్వులు హతమారుస్తారు వెళ్లు — అనగా ద్రౌపది — నా గంధర్వ భర్తలలో జ్యేష్ఠుడు ద్యూతక్రీడాసక్తుడయి ఉన్నా నేనందరినీ సమ ధర్మబుద్ధితోనే సేవిస్తున్నాను. నన్ను హింసించే వాడు నా భర్తలందరకూ వధ్యుడే! — అని ద్రౌపది అంతఃపురానికి వెళ్ళిపోయింది. మేఘమండల విముక్తమయిన చంద్రబింబంవలె శోభించే వదనంతో ఘూర్ణిఘూసరిత గజవధూ సదృశ మందగమనంతో, భీతహరిణేక్షణాలతో ఆమె రాజసభాస్థలి విడిచింది. ప్రాణాధికంగా చూసుకొనే ద్రౌపదిని ఆ స్థితిలో చూసికూడా ధర్మతత్వ్వులయిన పాండవులు ఓర్పునే వహించారు. అజ్ఞాతవాస దీక్షా కారణంగా వారా స్థితిలో ఉండిపోయారు.

అంతఃపురానికి వచ్చిన సైరంధిని చూసి— కళ్యాణీ! నువ్వెందుకు విచారిస్తున్నావు. నీ కిటువంటి స్థితి కల్గించి ఘోరవిపత్తును తెచ్చిపెట్టి కొన్నవాడెవడు? రాకాచంద్రసఖమైన నీ వదనం వివర్ణమై అశ్రుబిందువులతో నిండడానికి కారణమేమిటి? అని సుదేష్ణ ప్రశ్నించగా — మహారాణీ! సర్వమూ నీకు తెలుసు. అయినా నన్ను సుర

శుశుభే వదనం తస్యా రుదత్యాః సుచిరం తదా
మేఘలేఖావినిర్ముక్తం దివీవ శశిమండలం.
పాంసుకుంఠితసర్వాంగీ గజరాజవధూరివ
ప్రతస్థే నాగనాసోరూర్భర్తూరాజ్ఞాయ శాసనం.
విముక్తా మృగశాబాక్షీ నిరంతరపయోధరా
ప్రభా నక్షత్రరాజస్య కాలమేఘైరివావృతా
యస్యా హ్యర్థే పాండవేయాస్త్యజేయురపి జీవితం
తాం తేదృష్ట్వాతిధాకృష్ణాం పసి నోధర్మచారిణః
సమయం నాతివర్తంతే వేలామివ మహోదధిః.
కిస్త్వావధీద్ వరారోహే కస్మాద్ రోదిషి శోభనే
కస్యాద్య న సుఖం భద్రే కేన తే విప్రియంకృతం
కిమిదం పద్మసంకాశం సుదంత్యోష్ఠాక్షినాశికం
రుదంత్యాఅవమృష్టాస్రం పూర్ణేందుసమవర్చసం.
బింబోష్ఠంకృష్ణతారాభ్యా మత్యంతరుచిరప్రభం
నయనాభ్యామజిహ్మాభ్యాం ముఖం తే
ముంచతే జలం.

తాం నిఃశ్వస్యాబ్రవీత్ కృష్ణాజానంతీనామపృచ్ఛసి
భ్రాతే త్వంమామనుప్రేష్య కిమేవంత్వం వికత్థసే.
కీచకో మావధీత్ తత్ర సురాహారీం గతాం తవ
సభాయాం పశ్యతో రాజ్ఞో యథైవ విజనే వనే.
ఘాతయామి సుకేశాం తే కీచకం యది మన్యసే
యోఽసౌ త్వాం కామసమ్మత్తో దుర్లభామభిమన్యతే
అన్యే చైనం వధిష్యంతి యేషామాగః కరోతి సః
మన్యే చైవాద్యసువ్యక్తం యమలోకం గమిష్యతి
భ్రాతుః ప్రయచ్ఛ త్వాగినా జీవశ్రాద్ధంత్వమద్యవై
సుదృష్టంకురు వై చైనం నాసూన్ మన్యే ధరిష్యతి.
తేషాం హి మమ భర్తౄణాం పంచానాం ధర్మ
చారిణాం
ఏకో దుష్ప్రధర్షోఽత్యర్థం బలే చాప్రతిమో భువి
నిర్మనుష్య మిమం లోకం కుర్యాత్ క్రుద్ధో నిశా
మయాం
న చ సంక్రుధ్యతే తావద్ గంధర్వః కామరూపధృక్.

కోసం పంపారు. వారు రాజసభా మధ్యంలో నన్నవమానించారు విజనారణ్యాలలోకూడా ఏ అబలకూ ఇటువంటి అవమానం జరగదు - అని ద్రౌపది జవాబివ్వగా - సైరంధ్రీ! నువ్వుకోరితే కీచకునికి మరణదండన విధిస్తాను. నీ వంటి పరమ సాధ్విని పరాభవించిన వాడిని ఉపేక్షించరాదు. కాలమాసన్నమయినవాడు కాని ఇటువంటిపనులు చేయడు - అన విని సైరంధ్రి - అమ్మా! నీ సోదరుడి జీవితం నేటితో పరిసమాప్తమవుతుంది. ఒక్కసారి కన్నులార చూసుకో. ఆ ప్రేతకోసం శ్రాద్ధదానాలు పూర్తిచేయించు. నా భర్తలయిదుగురిలో ఒకానొక మహావీరు డున్నాడు. వాని ముందు ఈ భూమండలంలోని ఏ ప్రాణీ నిలబడదు. ఒక్కరాత్రిలో ఈ ప్రపంచాన్ని ధ్వంసం చేయగలడు. ఆయన కామరూపధరుడు - అని పలికి దుఃఖంతో వెళ్ళిపోయింది. సుదేష్ణతోబాటు అంతఃపురస్త్రీ లెందరో ఆమె ననునయించినా ద్రౌపది ఆహారనిద్రాస్నానాలను గ్రహించలేదు.

దుష్టాత్ముడయిన కీచకుడు ద్రౌపదిని పరాభవించి ఘోర దుఃఖసాగరంలో మునిగిపోయాడు. జనమేజయ మహారాజా! ఆనాడు సైంధవుడు తనను పరాభవించినప్పుడు దుస్సల సౌభాగ్యం కోలుపోతుందని ద్రౌపది శపించకుండా విడిచిపెట్టింది. నేడు కీచకుని తిరస్కారాన్ని ఆమె సహించలేదు - అని చెప్పగా కీచకుని గురించిన వివరాలు చెప్పమని జనమేజయుడు వైశంపాయనుని కోరగా - మహారాజా! క్షత్రియపురుషునికి బ్రాహ్మణస్త్రీకి ప్రభవించినవాడు సూతనామంతో

సుదేష్ణామేవముక్త్వాతు సైరంధ్రీదుఃఖమోహితా
కీచకస్య వధార్థాయ వ్రతదీక్షాముపాగమత్.
అభ్యర్థితా చ నారీభిర్మానితా చ సుదేష్ణయా
న చ స్నాతి న చాశ్నాతి నపాంశూన్ పరిమార్జతి
రుధిరక్లిన్నవదనా బభూవ రుదితేక్షణా
తాం తథా శోకసంతప్తాం దృష్ట్వా ప్రమదితాం స్త్రియః
కీచకస్య వధం సర్వా మనోభిశ్చ శంశంసిరే
అహో దుఃఖతరం ప్రాప్తా కీచకేన పదా హతా
పతివ్రతా మహాభాగా ద్రౌపదీ యోషితాం వరా
దుఃశలాం మానయంతీ యా భర్తౄణాం భగినీం శుభాం
నాశపత్ సింధురాజం తం బలాత్కారేణ వాహితా
కిమర్థం ధర్షణం ప్రాప్తా కీచకేన దురాత్మనా
నాశపత్ తం మహాభాగ కృష్ణా పాదేన తాడితా
తేజోరాశిరియం దేవీ ధర్మజ్ఞా సత్యవాదినీ
కేశపక్షే పరామృష్టా మర్షయిష్యత్యశక్తవత్
నైతత్ కారణమల్పంహి శ్రోతుకామోఽస్మిసత్తమ
కృష్ణాయాస్తు పరిక్లేశాన్మనో మే దూయతే భృశం
కస్య వంశే సముద్భూతః స చ దుర్బలితో మునే
బలోన్మత్తఃకథంచాసీచ్చాప్యలోమాత్స్యస్యకీచకః
త్వదుక్తోఽయమనుప్రశ్నః కురూణాం కీర్తివర్ధన
ఏతత్ సర్వం తథా వక్ష్యే విస్తరేణైవ పార్థివ.
బ్రాహ్మణ్యాంక్షత్రియాజ్జాతః సూతోభవతిపార్థివ
ప్రాతిలోమ్యేన జాతానాం స హ్యేకో ద్విజఏవతు
రథకారమితీమం హి క్రియాయుక్తం ద్విజన్మనాం
క్షత్రియాదవరం వైశ్యాద్ విశిష్టమితి చక్షతే
సహ సూతేన సంబంధః కృతపూర్వో నరేశ్వరైః
తథాపి తైర్మహీపాల రాజశబ్దో న లభ్యతే.
తేషాంతుసూతవిషయఃసూతానాం నామతఃకృతః
ఉపజీవ్య చ యత్ క్షత్రం లబ్ధంసూతేనతత్ పురా
సూతానామధిపోరాజా కేకయో నామ విశ్రుతః
రాజకన్యాసముద్భూతః సారథ్యేఽనుపమోఽభవత్
పుత్రాస్తస్య కురుశ్రేష్ఠ మాలవ్యాం జజ్ఞిరే తదా
తేషామతిబలో జ్యేష్ఠః కీచకః సర్వజిత్ ప్రభో
ద్వితీయాయాం తు మాలవ్యాం చిత్రా చిత్రా హ్యవరజాభవత్

వ్యవహరింపబడతాడు. ఈ విధమయిన ప్రతిలోమ జాతులలో సూతులకు ద్విజత్వం ప్రాప్తిస్తుంది. బ్రాహ్మణోచితకర్మ లాచరించే వీరు రథకారులని పిలవబడతారు. ఐతే వీరు క్షత్రియులకంటె దిగువగానూ వైశ్యులకంటె ఒక శ్రేణి పైనా ఉంటారు. పూర్వంలో రాజులకు సూతవంశాలతో వైవాహికబంధా లుండేవి. అయినా రాజ శబ్దంతో పిలువబడ్డ సూతుడు కనిపించడు.

ఈ సూతులలో కొందరు రాజుల నాశ్రయించి రాజ్యాలు సంపాదించారు. వారిని సూత రాజులని పిలిచేవారు. అటువంటి వారిలో కేకయుడు సూతులకు అధిపతి. వాడు క్షత్రియస్త్రీకి ప్రభవించాడు. కేకయులు సారథ్యంలో అనుపములు. వానికి మాళవియందు ప్రభవించినవాడు కీచకుడు. వాడు మహాబలిష్ఠుడు. కేకయుని ద్వితీయ పత్నికి చిత్ర అనే పేరుగల ఆడపిల్ల కలిగింది. ఆమెనే సుదేష్ణ అని పిలిచేవారు. కీచకు లందరికీ ఈమె ఒక్కతెయే సోదరి. ఈ సుదేష్ణయే విరటుని పట్టమహిషి. విరటుని ప్రథమపత్ని అయిన కోసల రాజపుత్రి శ్వేత మరణించిన అనంతరం విరటు డీమెను భార్యగా గ్రహించాడు. సుదేష్ణకు ఉత్తరుడు ఉత్తర అనే బిడ్డలు కలిగారు. కీచకుడు

తాం సుదేష్ణేతి వై ప్రాహుర్విరాటమహిషీం ప్రియాం
తాం విరాటస్యమాత్స్యస్య కేకయః ప్రదదౌముదా
సురథాయాం సుతాయాం తు కౌసల్యాం శ్వేత
మాతరి
సుదేష్ణాం మహిషీం లబ్ధ్వా రాజా
దుఃఖమపానుదత్
ఉత్తరం చోత్తరాం చైవ విరాటాత్ పృథివీపతే
సుదేష్ణా సుషువే దేవీ కైకేయీ కులవృద్ధయే
మాతృష్వసృసుతాం రాజన్ కీచకస్తామనిందితాం
సదా పరిచరన్ ప్రీత్యా విరాటే న్యవసత్ సుఖీ
భ్రాతరస్తస్య విక్రాంతాః సర్వే చ తమనువ్రతాః
విరాటస్యైవ సంహృష్టా బలం కోశం చ వర్ధయన్.
కాలేయానామదైతేయాః ప్రాయశో భువివిశ్రుతాః
జజ్ఞిరే కీచకా రాజన్ బాణో జ్యేష్ఠస్తతో౽భవత్.
న హి సర్వాస్త్రసంపన్నో బలవాన్ భీమవిక్రమః
కీచకో నష్టమర్యాదో బభూవ భయదో నృణాం
తం ప్రాప్య బలసమ్మత్తం విరాటః పృథివీపతిః
జిగాయ సర్వాంశ్చరిపూన్ యథేంద్రో దానవానివ
మేఖలాంశ్చత్రిగర్తాంశ్చ దశార్ణాంశ్చకశేరుకాన్
మాలవాన్ యవనాంశ్చైవ పుళిందాన్
కాశికోసలాన్
అంగాన్ వంగాన్ కళింగాంశ్చ తంగణాన్
పరతంగణాన్
మలదాన్నిమధాంశ్చైవతుండికేరాంశ్చ కోంకణాన్
కరదాంశ్చ నిషిద్ధాంశ్చ శివాన్ దుశ్ఛల్లికాంస్తథా
అన్యే చ బహవః శూరాః నానాజనపదేశ్వరాః
కీచకేన రణే భగ్నా న్యద్రవంత దిశో దశ.
తమేవం వీర్యసంపన్నం నాగాయుతబలం రణే
విరాటస్తత సేనాయాశ్చకార పతిమాత్మనః.
విరాటభ్రాతరశ్చైవ దశ దాశరథోపమాః
తే చైనామన్వవర్తంత కీచకాన్ బలవత్తరాన్.
ఏవంవిధబలోపేతాః కీచకాస్తే న తద్విధాః
రాజ్ఞః శ్యాలామహాత్మానో విరాటస్యహితైషిణః
ఏతత్ తే కథితం సర్వం కీచకస్య పరాక్రమం
ద్రౌపదీ న శశాపైనం యస్మాత్ తద్గదతః శృణు
క్షరతీత తపః క్రోధాదృషయో న శపంతి హి.
జానంతీ తద్ యథాతత్వం పాంచాలీ న శశాప తం
క్షమాధర్మః క్షమాదానం క్షమాయజ్ఞః క్షమాయశః

సుదేష్ణనుచేరి మత్స్యదేశంలో మహారాజును సేవిస్తూ కోశాగారాన్ని సేనాబలాన్ని వృద్ధి చేశాడు అందుచేత విరటునికి వానిమీద ప్రీతి మెండు ప్రఖ్యాతులయిన కాళేయ రాక్షసులే కీచకులుగా భూమండలంలో పుట్టారు. వారిలో పెద్దవాడయిన బాణుడు వివిధశస్త్రాస్త్ర విదుడయి భయంకర పరాక్రమంతో అధర్మమార్గానచరిస్తూ కీచకనామంతో ప్రవర్తిస్తున్నాడు. విరాటుడు ఈ కీచకుని సహాయంతోనే మేఖల త్రిగర్త దశార్ణ కశేరు మాళవ యవన పుళింద కోసల కాశీ అంగ వంగ కళింగ తంగళ పరతంగళ మలద నిమధ తుండి కేర కోంకణ కరద శివ దుశ్ఛల్లి కాదిజనపదాలనూ రాజ్యాధీశులనూ పరాజితులను చేశాడు. కీచకునికి దశసహస్ర గజబలముంది. అందుచే వానినే విరటుడు తన సైన్యాధిపతిగా నియోగించుకున్నాడు. విరటసోదరులు పదిమందీ శ్రీరామునివలె శోభిల్లేవారు. వీరు కూడా కీచకునీ వాని సోదరులనూ అనుసరిస్తూ విరటుని శ్రేయస్సు కోరేవారు

జనమేయజయ మహారాజా! ద్రౌపది కీచకుని ఎందుచేత శపించలేదనికదా నువ్వు ప్రశ్నిస్తున్నావు? క్రోధంవల్ల తపోబలం నశించిపోతుంది.

క్షమా సత్యం క్షమా శీలం క్షమా కీర్తిః క్షమా పరం.
క్షమా పుణ్యం క్షమా తీర్థం క్షమా సర్వమితి శ్రుతిః
క్షమావతామయం లోకః పరశ్చైవ క్షమావతాం
ఏతత్సర్వం విజానంతీ సా క్షమామన్వపద్యత.
భర్తౄణాం మతమాజ్ఞాయ క్షమిణాం ధర్మచారిణాం
నాశపత్ తం విశాలాక్షీ సతీ శక్తాపి భారత.

పాండవాంశ్చాపి తే సర్వే ద్రౌపదీం ప్రేక్ష్య దుఃఖితాః
క్రోధాగ్నినా వ్యదహ్యంత తదా కాలవ్యపేక్షయా.
అథ భీమో మహాబాహుః సూదయిష్యంస్తు కీచకం
వారితో ధర్మపుత్రేణ వేలయేవ మహోదధిః.
సంధార్య మనసా రోషం దివారాత్రం వినిఃశ్వసన్
మహానసే తదా కృచ్ఛ్రాత్ సుష్వాప రజనీం చ తాం.

---

## పదిహేడవ అధ్యాయం

సా హతా సూతపుత్రేణ రాజపత్నీ యశస్వినీ
వధం కృష్ణా పరీప్సంతీ సేనావాహస్య భామినీ
జగామావాసమేవాథ సా తదా ద్రుపదాత్మజా
కృత్వా శౌచం యథాన్యాయం కృష్ణా సా తనుమధ్యమా.
గాత్రాణి వాససీ చైవ ప్రక్షాళ్య సలిలేన సా
చింతయామాస రుదతీ తస్య దుఃఖస్య నిర్ణయం.

కిం కరోమి క్వ గచ్ఛామి కథం కార్యం భవేన్మమ
ఇత్యేవం చింతయిత్వా సా భీమం వై మనసాగమత్
నాన్యః కర్తా ఋతే భీమాన్మమాద్య మనసః ప్రియం
తత ఉత్థాయ రాత్రౌ సా విహాయ శయనం స్వకం
ప్రాద్రవన్నాథమిచ్ఛంతీ కృష్ణా నాథవతీ సతీ
భవనం భీమసేనస్య క్షిప్రమాయతలోచనా
దుఃఖేన మహతా యుక్తా మానసేన మనస్వినీ

---

అందుచేతనే మహాత్ములు ఎవరినీ శపించరు. ద్రౌపది కూడా తన తపశ్శక్తిని వృథా చేయదలచుకోలేదు సత్యధర్మదాన యజ్ఞ యశశ్శీలాలకు మించినది క్షమ. పుణ్యక్షేత్రాలతో ఉపమింపదగ్గది, పవిత్ర తీర్థాలతో పోల్చదగినదీ క్షమయేనని శ్రుతి ఘోషిస్తోంది. క్షమావంతులకే ఇహపరాలలో ఉత్తమ గతులు కలుగుతాయని ఎరిగిన ద్రౌపది క్రోధంతో వారిని శపించలేదు. ద్రౌపది దురవస్థను కన్నులారచూసి కూడా పాండవులు సమయపాలనకోసం ఎదురు చూస్తూ ఉండిపోయారు భీముడప్పుడే ఉద్యుక్తుడయాడు కాని, ధర్మరాజు వానిని నిరోధించాడు అయినా భీముని క్రోధజ్వాలలు చల్లారలేదు తోకతొక్కిన త్రాచులా బుసలు కొడుతూ ఆ రాత్రి పాకశాలలో నిద్రిస్తున్నాడు.

---

## పదిహేడవ అధ్యాయం

దండతాడిత భుజంగంవలె కీచక పరాభూతమైన ద్రౌపది ఆ మూర్ఖుని హరించడానికి అవసరమయిన మార్గాలను అన్వేషిస్తూ తన వాసస్థలం చేరి, స్నానం చేసి శుచియై విచారిస్తూండగా భీమసేనుడామె మనసులో మసలినాడు. తన ఊహ సక్రమంగా ఫలించాలంటే భీముడే కార్యరంగంలోకి దిగాలని నిశ్చయించుకొని విచారగ్రస్త హృదయంతో ద్రౌపది భీముడు శయనించిన స్థలానికి పోయి – భీమసేనా! నన్ను పరాభవించి దోషిగా చెయ్యడానికి ప్రయత్నించిన ఆ దుష్టుడు

తస్మిన్ జీవతి పాపిష్ఠే సేనావాహే మమ ద్విషి.
తత్కర్మ కృతవానద్య కథం నిద్రాం నిషేవసే
ఏవముక్త్వాథ తాం శాలాం ప్రవివేశ మనస్వినీ.
యస్యాం భీమస్తథా శేతే మృగరాజ ఇవ శ్వసన్
తస్యా రూపేణ సా శాలా భీమస్య చ మహాత్మనః
సమ్మూర్ఛితేవ కౌరవ్య ప్రజజ్వాల చ తేజసా
సా వై మహానసం ప్రాప్య భీమసేనం శుచిస్మితా
సర్వశ్వేతేవ మాహేయీ వనే జాతా త్రిహాయణీ
ఉపాతిష్ఠత పాంచాలీ వాసితేవ నరర్షభం.
సా లతేవ మహాశాలం ఫుల్లం గోమతితీరజం
పరిష్వజత పాంచాలీ మధ్యమం పాండునందనం.
బాహుభ్యాం పరిరభ్యైనం ప్రాబోధయదనిందితా
సింహం సుప్తం వనే దుర్గే మృగరాజవధూరివ.
భీమసేనముపాశ్లిష్యద్ధస్తినీవ మహాగజం
వీణేవ మధురాలాపా గాంధారం సాధు మూర్ఛతీ
అభ్యభాషత పాంచాలీ భీమసేనమనిందితా.
ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేన యథా మృతః
నామృతస్య హి పాపీయాన్ భార్యామాలభ్య జీవతి
స సంప్రహాయ శయనం రాజపుత్ర్యా ప్రబోధితః
ఉపాతిష్ఠత మేఘాభః పర్యంకే సోపసంగ్రహే.
అథాబ్రవీద్ రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియాం
కేనాస్యర్థేన సంప్రాప్తా త్వరితేవ మమాంతికం.
న తే ప్రకృతిమాన్ వర్ణః కృశా పాండుశ్చ లక్ష్యసే
ఆచక్ష్వ పరిశేషేణ సర్వం విద్యామహం యథా.
సుఖం యది వా దుఃఖం ద్వేష్యం వా యది వా ప్రియం
యథావత్ సర్వమాచక్ష్వ శ్రుత్వా జ్ఞాస్యామి యత్ క్షమం.
అహమేవ హి తే కృష్ణే విశ్వాస్యః సర్వకర్మసు
అహం మాపత్సు చాపి త్వాం మోక్షయామి పునఃపునః
శీఘ్రముక్త్వా యథాకామం యత్ తే కార్యం వివక్షితం
గచ్ఛ వై శయనాయైవ పురాన్యేన బుధ్యతే.

---

జీవించి ఉండగా నీకు నిద్ర ఎలా పడుతోంది- అని పలికింది.

గుహలో నిద్రించే సింహంలా భీముడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో నిద్రిస్తూనే ఉన్నాడు. గోమతీనదీతీరంలోని లత సాలవృక్షాన్ని ఆలింగనం చేసికొన్నట్లు పాంచాల రాజనందిని భీముని గాఢంగా కౌగిలించుకొని భుజం తట్టి గాంధార స్వరంతో భాషిస్తూ మేలుకొలుపుతోంది.

భీమసేనా ! ఇంకా నిద్రపోతున్నావా ? నీ వంటి ఉత్తమ పురుషుడు జీవించి ఉండగానే నీ భార్యకు అవమానం జరిగింది. పరాభవించిన వాడింకా బ్రతికున్నాడు. అయినా నీకు నిద్ర ఎలా పడుతోంది ? - అనగా భీముడు లేచి దేవీ ! ఇంత శీఘ్రంగా నా దగ్గరకు రావడానికి కారణమేమిటి? నీ శరీరం కాంతి విహీనంగా కనిపిస్తోందే !-ముఖం వివర్ణమై ఉన్నది. నీకు కలిగిన కష్టమేమిటో చెబితే వారిస్తాను. నీ కోసం అసాధ్యాలు కూడా సాధ్యం చేయగలను ? కావలసిన కార్యమేమిటో చెప్పి వేళ్ళిపో - అన్నాడు.

## పదునెనిమిదవ అధ్యాయం

సా లజ్జమానా భీతా చ అధోముఖముఖీ తతః
నోవాచ కించిద్వచనం బాష్పదూషితలోచనా.
అథాబ్రవీద్ భీమపరాక్రమో బలీ
వృకోదరః పాండవముఖ్యసమ్మతః
ప్రబ్రూహి కిం తే కరవాణి సుందరి
ప్రియం ప్రియే వారణఖేలగామినీ.
అశోచ్యత్వం కుతస్తస్య యస్యా భర్తా యుధిష్ఠిరః
జానన్సర్వాణిదుఃఖాని కింమాంత్వం పరిపృచ్ఛసి
యన్మాం దాసీప్రవాదేన ప్రాతికామీతదానయత్
సభాపరిషదో మధ్యే తన్మాం దహతి భారతి.
క్షత్రియైస్తత్ర కర్ణాద్యైర్దృష్టా దుర్యోధనేన చ
శ్వశురాభ్యాం చ భీష్మేణ విదురేణ చ ధీమతా
ద్రోణేన చ మహాబాహో కృపేణ చ పరంతప
సాహంశ్వశురయోర్మధ్యేభాత్రృమధ్యేచపాండవ
కేశే గృహీత్వైవ సభాం నీతా జీవతి వై త్వయి
పార్థివస్య సుతా నామ కా ను జీవతి మాదృశీ
అనుభూయేదృశం దుఃఖమన్యత్ర ద్రౌపదీం ప్రభో
వనవాసగతాయాశ్చ సైంధవేన దురాత్మనా
పరామర్శోద్వితీయో వై సోఢుముత్సహతే తు కా
పద్భ్యాం పర్యచరం చాహం దేశాన్ విషమ సంస్థితాన్
దుర్గాన్ఛ్రివాపదసంకీర్ణాం స్త్వయి జీవతి పాండవ.
తతోఽహం ద్వాదశే వర్షే వన్యమూలఫలాశనా
ఇదం పురమనుప్రాప్తా సుదేష్ణాపరిచారికా.

---

## పదునెనిమిదవ అధ్యాయం

బోటబోట కన్నీరు విడుస్తూ ఏమీ మాట్లాడకుండా భయభీతచిత్తంతో ద్రౌపది కూర్చుండిపోగా భీముడు - ఇప్పుడు నీకు ఏం కావాలో చెప్పు. అది తక్షణం నెరవేరుస్తాను - అన్నాడు. భీమసేనుని అనునయ వాక్యాలు విని ద్రౌపది కొంత తేరుకొని - యుధిష్ఠురునివంటి ధర్మపురుషునికి భార్యనై ఉండి విచారంతో క్రుంగి క్రుశించడం మంచిది కాదు. నా బాధకు కారణం తెలిసి ఉండి కూడా ఎందుకు మళ్ళీ అడుగుతావు. కురుసభామధ్యంలో దుష్ట దుశ్శాసనుడు నా శిరోజాలు పట్టి ఈడ్చుకొని వచ్చినప్పుడు దుర్యోధనుడు చేసిన పరాభవం నన్నింకా పీడిస్తూనే ఉంది. ఆ మహాసభలో భీష్మ, ద్రోణ, విదుర, కృపాదులు కూడా నా దురవస్థను చూస్తూ ఉండి పోయారే గాని ఆ దుర్మార్గాన్ని అడ్డుకోలేక పోయారు. కపట ద్యూతంలో మిమ్ము ఓడించి నన్ను అవమానించారు. అటువంటి దుఃఖాన్ని అనుభవించడానికి ఈ ద్రుపదరాజనందిని అర్హురాలేనా? వనవాస కాలంలో దుర్యోధన సోదరి అయిన దుస్సల భర్త సైంధవుడు నన్నవమానించాడు. అది కూడా సహించాను. మీరందరూ బ్రతికి ఉండగా, నేను అరణ్యాలలో పాదచారినై చరిస్తూ కందమూల ఫలాలే ఆహారంగా తీసికొంటూ జీవించవలసి వచ్చింది. ఎలానో ఆ పన్నెండేండ్లూ గడిచాయి. ఇప్పుడీ విరాటనగరంలో సుదేష్ణకు దాసిగా ఉండవలసి వచ్చింది. మీరందరూ బ్రతికి ఉండగా నేనిక్కడి చక్రవర్తికి చందనానులేపనాలు సమకూర్చవలసి వచ్చింది. అయినా మీ కోసం ఈ దుఃఖాని లెక్కచేయడం లేదు.

పాంచాలాధీశుడైన ద్రుపదుని ప్రియ పుత్రి

పరస్త్రీయముపాతిష్ఠే సత్యధర్మపథస్థితా
గోశీర్షకం పద్మకం చ హరిశ్యామం చ చందనం
నిత్యం పింషే విరాటస్య త్వయి జీవతి పాండవ.
సాహం బహూని దుఃఖాని గణయామి న తే కృతే
ద్రుపదస్యసుతాచాహం ధృష్టద్యుమ్నస్యచానుజా
అగ్నికుండాత్ సముద్భూతా నోర్వ్యాం జాతు చరామి భోః.

మత్స్యరాజసమక్షం తు తస్య ధూర్తస్య పశ్యతః
కీచకేన పరామృష్టా కా ను జీవతి మాదృశీ.
ఏవం బహువిధైః క్లేశైః క్లిశ్యమానాం చ భారత
న మాం జానాసి కౌంతేయ కిం ఫలం జీవతేన మే
యోఽయం రాజ్ఞో విరాటస్య కీచకోనామభారత
సేనానీః పురుషవ్యాఘ్ర శ్యాలః పరమదుర్మతిః.

స మాం సైరంధ్రివేషేణ వసంతీం రాజవేశ్మని
నిత్యమేవాహ దుష్టాత్మా భార్యా మమ భవేతి వై.
తేనోపమంత్ర్యమాణాయా వధార్హేణ సపత్నహన్
కాలేనేవ ఫలం పక్వం హృదయం మే విదీర్యతే.
విజానామి తవామర్షం బలం వీర్యం చ పాండవ
తతోఽహం పరిదేవామి చాగ్రతస్తే మహాబల.

యథా యూథపతిర్మత్తః కుంజరః షష్టిహాయనః
భూమావిపతితంబిల్వంపద్భ్యామాక్రమ్యపీడయేత్
తథైవ చ శిరస్తస్య నిపాత్య ధరణీతలే
వామేన పురుషవ్యాఘ్ర మర్ద పాదేన పాండవ
స చేదుద్యంతమాదిత్యం ప్రాతరుత్థాయ పశ్యతి
కీచకః శర్వరీం వ్యుష్టాం నాహం జీవితుముత్సహే.

---

కను, మహారథికుడైన ధృష్టద్యుమ్నుని సహోదరిని, పవిత్రమైన యజ్ఞాగ్నికుండంనుండి ప్రభవించిన దానను. అంతటి ప్రఖ్యాత చరిత్రగల నేను ఈ విరాట సభామధ్యంలో జూదరుల ఎదుట కీచక పాదతాడనానికి లోను కావలసి వచ్చింది. ఇటువంటి అవమానాలను ఏ రాజపుత్రియైనా సహించ గలదా? సహించి జీవించ గలదా? ఇవన్నీ నీకు తెలియనివి కావు. ఇంకా నేను బ్రతికి ప్రయోజనమేమిటి?. పరమ దుష్టుడైన కీచకుడు విరటుని బావమరది. వాడే వీరి సైన్యాధిపతి. వాడు ప్రతి దినమూ నన్ను చేరి పతిగా గ్రహించ మంటాడు. వాడి మాటలు నా చెవులకు శూలాలవలె సోకుతున్నాయి. నా గుండెను బ్రద్దలు చేస్తున్నాయి. నువ్వు బలిష్టుడవనీ, శౌర్య ధైర్య పరాక్రమోపేతుడవనీ నీతో చెప్పుకొని ఇంతగా ఏడుస్తున్నాను. రేపు నాకు కీచకుడు కనిపిస్తే నేను మరణించి తీరతాను. జూద ప్రియుడైన నీ అన్నగారి అనాలోచిత కార్యాలవల్ల ఈ విపత్తులు కలుగుతున్నాయి.

రాజ్యసర్వస్వమూ! కోల్పోయాము. అది చాలక అరణ్యవాసం పణంగా పెట్టి జూదమాడే వారెవరైనా ఉంటారా!

సహస్ర సువర్ణముద్రికలు పణంగా పెడుతూ రజత, రత్న, సువర్ణ, వస్త్ర, రథ, గజ, అశ్వ, మేషాలను ఒడ్డుతూ ఉదయాది అస్తమయ పర్యంతం నిర్విరామంగా జూదమాడినా క్షీణించని రాజ్యవైభవమే మనది. మహావైభవోపేతమైన రాజ్యలక్ష్మిని ఏలించి సింహాసన మధిష్ఠించిన మన మహారాజు ద్యూతక్రీడాలోలుడై వైభవాదిచ్యుతుడైనాడు. ఆ కర్మఫల చింతనతోనే విచారిస్తూ కూర్చుంటాడు.

భీమసేనా! ఆయన వేటకు వెడుతూంటే సర్వాంగాలంకృతాలైన పదివేల ఏనుగులూ అశ్వాలూ ఆయన వెంట సాగేవి. లక్ష బంగారు రథాలు ఆయన కోసం సిద్ధంగా ఉండేవి. వేలకొద్దీ

భ్రాతరం చ విగర్హాస్య జ్యేష్ఠం దుర్ద్యూతదేవినం
యస్యాస్మి కర్మణా ప్రాప్తా దుఃఖమేతదనంతకం.
కో హి రాజ్యం పరిత్యజ్య సర్వస్వం చాత్మనా సహ
ప్రవ్రజ్యాయైవ దీవ్యేత వినా దుర్ద్యూతదేవినం.
యది నిష్కసహస్రేణ యచ్చాన్యత్ సారవద్ ధనం
సాయంప్రాతర దేవిష్యదపి సంవత్సరాన్ బహూన్
రుక్మం హిరణ్యం వాసాంసి యానం యుగ్యమ జావికం
అశ్వాశ్వతరసంఘాంశ్చ న జాతు క్షయమావహేత్
సోఽయం ద్యూతప్రవాదేన శ్రియః ప్రత్యవరోపితః
తూష్ణీమాస్తే యథా మూఢః స్వాని కర్మాణి చింతయన్
దశ నాగసహస్రాణి హయానాం హేమమాలినాం
యం యాంతమనుయాంతీహ సోఽయం ద్యూతేన జీవతి.
రథాః శతసహస్రాణి నృపాణామమితౌజసాం
ఉపాసంత మహారాజమింద్రప్రస్థే యుధిష్ఠిరం.

శతం దాసీసహస్రాణాం యస్య నిత్యం మహానసే
పాత్రీహస్తం దివారాత్రమతిథీన్ భోజయంత్యుత.
ఏష నిష్కసహస్రాణి ప్రదాయ దదతాం వరః
ద్యూతజేన హ్యనర్థేన మహతా సముపాశ్రితః.
ఏనం హి సర్వసంపన్నా బహవః సూతమాగధాః
సాయంప్రాతరుపాతిష్ఠన్ సుమృష్టమణికుండలాః.
సహస్రమృషయో యస్య నిత్యమాసన్ సభాసదః
తపఃశ్రుతోపసంపన్నాః సర్వకామైరుపస్థితాః.
అష్టాశీతిసహస్రాణి స్నాతకా గృహమేధినః
త్రింశద్దాసీక ఏకైకో యాన్ బిభర్తి యుధిష్ఠిరః.
అప్రతిగ్రాహిణాం చైవ యతీనామూర్ధ్వరేతసాం
దశ చాపి సహస్రాణి సోఽయమాస్తే నరేశ్వరః.
ఆనృశంస్యమనుక్రోశం సంవిభాగస్తథైవ చ
యస్మిన్నేతాని సర్వాణి సోఽయమాస్తే నరేశ్వరః
అంధాన్ వృద్ధాంస్తథానాథాన్ రాజాధృతిమాన్ సత్యవిక్రమః
సంవిభాగమనా నిత్యమానృశంస్యాద్ యుధిష్ఠిరః

---

సైనికులు ఆయన సేవకోసం నిరీక్షించేవారు. ఆ రాజశ్రేష్ఠుని భోజనశాలలో లక్షమంది సుందరీమణులు బంగారు పాత్రలతో వడ్డనలు సాగిస్తూ అతిథి సంతర్పణం చేసేవారు. ఆ రోజులలో ఆయన సహస్రాధిక సంఖ్యలలో సువర్ణ ముద్రికలు దానం చేసేవారు. అంతటివాడు ద్యూతాసక్తుడై సర్వసంపదలూ కోల్పోయి ఘోర విపత్పరంపరలకులోనై జీవించవలసి వచ్చింది. ఇంద్రప్రస్థంలో- మణిరత్నాలంకార భూషితులై వందిమాగధులు మృదుమధుర మంద మనోజ్ఞ స్వరాలతో ప్రాతస్సాయం సంధ్యలలో కైవారాలు చేసేవారు. వేద వేదాంగవిదులూ, తపోబలసంపన్నులూ, ఋషులూ మహర్షులూ మన మహారాజు సభలో ఉచితాసనాలధిష్ఠించి ధర్మ ప్రసంగాలు చేస్తూండేవారు. ఎనభై ఎనిమిది వేలమంది బ్రాహ్మణులు ఆయన ఆశ్రయంలో ఉండేవారు. వారిలో ఒకొక్కరికి సేవలుచేస్తూ ముప్ఫైమంది దాసదాసీజను లుండేవారు. నప్రతిగ్రహీతలైన పదివేలమంది ఊర్ధ్వరేతస్కులు ధర్మజుని పోషణలో ఉండేవారు. దయాపరుడూ, దానశాలీ, కోమలచిత్తుడు ఐన మహారాజే ఇటువంటి దురవస్థలపాలు కావలసి వచ్చింది. బధిర, పంగ్వంధ, మూక, ప్రజలనూ, అనాథులనూ పోషించే మహారాజు ఈ నాడు విరటుని సేవలో ఉండవలసి వచ్చింది. రాజసభలో ఆయనను 'కంకా' అని పిలుస్తూంటే నా గుండె నీరైపోతోంది. ఆ నాడు ఇంద్రప్రస్థంలో వీరు

ఇంద్రప్రస్థే నివసతః సమయే యస్య పార్థివాః
ఆసన్ బలిభృతః సర్వే సో௨ద్యాన్యైర్భృత్తిమిచ్ఛతి.
పార్థివాః పృథివీపాలా యస్యాసన్ వశవర్తినః
స వశే వివశో రాజా పరేషామద్య వర్తతే.
ప్రతాప్య పృథివీం సర్వాం రశ్మిమానివ తేజసా
సో௨యం రాజ్ఞో విరాటస్య సభాస్తారో యుధిష్ఠిరః.
యముపాసంత రాజానః సభాయామృషిభిః సహ
తముపాసీనమద్యాన్యం పశ్య పాండవ పాండవం.
సదస్యం యముపాసీనం పరస్యప్రియవాదినం
దృష్ట్వా యుధిష్ఠిరం కోపో వర్ధతే మామసంశయం
అతదర్హం మహాప్రాజ్ఞం జీవితార్థే௨భిసంస్థితం
దృష్ట్వా కస్య న దుఃఖం స్యాద్ ధర్మాత్మానం యుధిష్ఠిరం.
ఉపాస్తే స్మసభాయాంయంకృత్స్నావీరవసుంధరా
తముపాసీనమప్యన్యం పశ్య భారత భారతం.
ఏవం బహువిధైర్దుఃఖైః పీడ్యమానామనాథవత్
శోకసాగరమధ్యస్థాం కిం మాం భీమ న పశ్యసి.



## పందొమ్మిదవ అధ్యాయం

ఇదంతు తేమహద్దుఃఖంయత్ ప్రవక్ష్యామి భారత
న మే௨భ్యసూయా కర్తవ్యా దుఃఖాదేతత్ బ్రవీమ్యహం.
సూదకర్మణి హీనే త్వమసమే భరతర్షభ
బ్రువన్ బల్లవజాతీయః కస్య శోకం న వర్ధయేః.
సూపకారం విరాటస్య బల్లవం త్వాం విదుర్జనాః
ప్రేష్యత్వం సమనుప్రాప్తం తతోదుఃఖతరంను కిం
యదా మహానసే సిద్ధే విరాటముపతిష్ఠసి
బ్రువాణో బల్లవః సూదస్తదా సీదతి మే మనః.

---

పాలించే టప్పుడు ఈ విరటుడు మన సామంతుడు. అటువంటి సామంతునివద్ద సేవాభావంతో చరించ వలసివచ్చింది. ఈ భూమండలంలోని రాజేంద్రు లందరూ ఒకనాడు వీరిని సేవించారు. అటువంటి వాడు ఈనాడు ఈకొలువుకూటంలో పరతంత్ర జీవనం సాగించవలసి వచ్చిది. సామ్రాజ్యాధిపతులూ, మహారాజులూ, ఋషులూ, ధర్మజునికీర్తించేవారు. అది నేడు లేదు సరికదా ఈయనే విరటుని కీర్తించ వలసి వచ్చింది. ఈ పరిస్థితులు చూస్తూంటే నా క్రోధాగ్నిజ్వాలలు మరీ ప్రజ్వలిస్తున్నాయి. ఈ స్థితిలో మీకు దుఃఖం కలగడం లేదా! భూమండలాధీశుల శిరస్థగిత మణిమయకిరీటాలు ఈ మహారాజు పాదాలమీద వ్రాలేవి. అటువంటివాడు ఈ సామాన్యుడైన విరటుని కొలువులో దీనదశ ననుభవిస్తే నాకు దుఃఖం ముంచుకొస్తోంది – అంది.



## పందొమ్మిదవ అధ్యాయం

భీమసేనా! దుర్భరమైన ఈ దుఃఖాన్ని నీకు చెప్పుకుంటున్నాను. నీ వంటి మహావీరుడు పాకశాలలో పదార్థాలు తయారుచేస్తూ విరటునికి సేవ చేస్తూంటే నా హృదయం దగ్ధమైపోతోంది. వలలుడు భోజనాలు తయారు చేసాడని విరటునికి వార్త వెడుతూంటే నా గుండె మండిపోతోంది. ఈరాజుకీ, వీరి పరివారానికీ సంతోషం కలిగించడం కోసం మదించిన ఏనుగులతో నువ్వు యుద్ధం చేస్తూంటే నేను శోకంతో కుమిలి పోతున్నాను. అంతఃపుర స్త్రీల ఆనందంకోసం సింహాలతో నువ్వు

**యదా ప్రహృష్టః సమ్రాట్ త్వాం సంయోధయతి కుంజరైః.**
హసంత్యంతఃపురే నార్యో మమ తూద్విజతే మనః
శార్దూలైర్మహిషైఃసింహైరాగారే యోధ్యసే యదా
కైకేయ్యాః ప్రేక్షమాణాయాస్తదా మే కశ్మలం భవేత్.
తత ఉత్థాయ కైకేయీ సర్వాస్తాః ప్రత్యభాషత
ప్రేష్యాః సముత్థితాశ్చాపి కైకేయీం తాః స్త్రియోఽబ్రువన్.
ప్రేక్ష్య మామనవద్యాంగీం కశ్మలోపహతామివ
స్నేహాత్ సంవాసజాద్ ధర్మాత్ సూదమేషా శుచిస్మితా.
యోధ్యమానం మహావీర్యమియం సమనుశోచతి
కల్యాణరూపా సైరంధ్రీ బల్లవశ్చాపి సుందరః.
స్త్రీణాంచిత్తంచదుర్జ్ఞేయం యుక్తరూపౌచమేమతౌ
సైరంధ్రీ ప్రియసంవాసాన్నిత్యం కరుణవాదినీ.
అస్మిన్ రాజకులే చేమౌ తుల్యకాలనివాసినౌ
ఇతి బ్రువాణా వాక్యాని సా మాం నిత్యమతర్జయత్
క్రుధ్యంతీంమాంచసంప్రేక్ష్య సమశంకతమాంత్వయి

**తస్యాం తథా బ్రువత్యాం తు దుఃఖం మాం మహదావిశత్.**
త్వయ్యేవం నిరయం ప్రాప్తే భీమే భీమపరాక్రమే
శోకే యౌధిష్ఠిరే మగ్నా నాహం జీవితుముత్సహే
యః సదేవాన్ మనుష్యాంశ్చ సర్వాంశ్చైకరథోఽజయత్
సోఽయంరాజ్ఞోవిరాటస్యకన్యానాంనర్తకోయువా
యోఽతర్పయదమేయాత్మాఖాండవేజాతవేదసం
సోఽన్తఃపురగతః పార్థః కూపేఽగ్నిరివ సంవృతః.
యస్మాత్ భయమమిత్రాణాంసదైవపురుషర్షభాత్
స లోకపరిభూతేన వేషేణాస్తే ధనంజయః.
యస్య జ్యాక్షేపకఠినౌ బాహూ పరిఘసంనిభౌ
స శంఖపరిపూర్ణాభ్యాం శోచన్నాస్తే ధనంజయః
యస్య జ్యాతలనిర్ఘోషాత్ సమకంపంత శత్రవః
స్త్రియో గీతస్వనం తస్య ముదితాః పర్యుపాసతే.
కిరీటం సూర్యసంకాశం యస్య మూర్ధన్యశోభత
వేణీ వికృతకేశాంతః సోఽయమద్యధనంజయః.
తం వేణీకృతకేశాంతం భీమధన్వానమర్జునం
కన్యాపరివృతం దృష్ట్వా భీమ సీదతి మే మనః.

---

పోరాడుతోంటే నా మనస్సు వికలమై పోతోంది. అటువంటి సమయాలలో సుదేష్ణాదేవి నన్ను చూసి నీకూ నాకూ ఏదో సంబంధం ఉన్నదేమో అని దాసీజనంతో పలికింది. ఇదివరకొకసారి ధర్మరాజు ప్రసంగిస్తూండగా నేనక్కడే నిలబడి శ్రద్ధగా ఆలకించిన విషయాన్నికూడా ఈమె కెలికి వారితో చెప్పింది. నువ్వు సింహాలతో ఏనుగులతో పోరాడుతూన్నప్పుడు ఈ రాజ్యంలో మనుష్యులకూ పశువులకూ తేడాలేదు – అని నేనన్న మాటలు ఆ దాసీలకుకూడా శంకాశ్చర్యాలు కలిగించాయి. వారి ప్రసంగాలూ, నీ కష్టాలూ, నన్ను విచార సాగరంలో ముంచుతున్నాయి. ఈ దుఃఖాన్ని ధర్మరాజు ఎలా సహిస్తున్నాడో అర్థం కావడం లేదు. దేవదానవులు ఏకమైవచ్చినా నిలబెట్టి నిర్జించగల అర్జునుడు ఈ విరటుని పిల్లలకు నృత్యం నేర్పవలసి వచ్చింది. ఖాండవవనాన్ని అగ్నికి ఆతిథ్యమిచ్చిన గాండీవి బృహన్నలా రూపంతో గాజులు తొడుక్కొని వీరి అంతఃపురంలో రహస్యంగా బ్రతుకవలసి వచ్చింది. ధనుష్టంకారంతో శత్రువీరుల హృదయాలను దద్దరిల్ల చేసే అర్జునుడు ఈ అంతఃపుర స్త్రీల ఆనందంకోసం శ్రావ్యగీతాలు ఆలాపించవలసి వచ్చింది. సూర్య

యస్మిన్నస్త్రాణి దివ్యాని సమస్తాని మహాత్మని
ఆధారః సర్వవిద్యానాం స ధారయతి కుండలే.
స్పృష్టుం రాజసహస్రాణి తేజసాప్రతిమాని వై
సమరే నాభ్యవర్తంత వేలామివ మహార్ణవః.
సోఽయం రాజ్ఞో విరాటస్య కన్యానాం నర్తకో యువా
ఆస్తే వేషప్రతిచ్ఛన్నః కన్యానాం పరిచారకః.
యస్య స్మ రథఘోషేణ సమకంపత మేదినీ
సపర్వతవనా భీమ సహ స్థావరజంగమా.
యస్మిన్ జాతే మహాభాగే కుంత్యాః శోకో వ్యనశ్యత.
స శోచయతి మామద్య భీమసేన తవానుజః
భూషితం తమలంకారైః కుండలైః పరిహాటకైః
కంబుపాణినమాయాంతం దృష్ట్వా సీదతి మే మనః
యస్యానాస్తి సమో వీర్యే కశ్చిదుర్వ్యాం ధనుర్ధరః
సోఽద్య కన్యాపరివృతో గాయన్నాస్తే ధనంజయః
ధర్మే శౌర్యే చ సత్యే చ జీవలోకస్య సమ్మతం
స్త్రీవేషవికృతం పార్థం దృష్ట్వా సీదతి మే మనః
యదా హ్యేనం పరివృతం కన్యాభిర్దేవరూపిణం
ప్రభిన్నమివ మాతంగం పరికీర్ణం కరేణుభిః,
మత్స్యమర్థపతిం పార్థం విరాటం సముపస్థితం
పశ్యామి తూర్యమధ్యస్థం దిశో నశ్యంతి మే తదా
నూనమార్యా న జానాతి కృచ్ఛ్రం ప్రాప్తం ధనంజయం
అజాతశత్రుం కౌరవ్యం మగ్నం దుర్ద్యూతదేవినం
ఐంద్రవారుణవాయవ్యబ్రాహ్మాగ్నేయైశ్చ వైష్ణవైః
అగ్నిం సంతర్పయన్ పార్థః సర్వాంశ్చైకరథోఽజయత్
దివ్యైరస్త్రైరచింత్యాత్మా సర్వశత్రునిబర్హణః
దివ్యం గాంధర్వమస్త్రం వాయవ్యమథ వైష్ణవం.
బ్రాహ్మం పాశుపతం చైవ స్థూణాకర్ణం చ దర్శయన్
పౌలోమాన్ కాలకేయాంశ్చ ఇంద్రశత్రూన్ మహాసురాన్.
నివాతకవచైః సార్ధం ఘోరానేకరథోఽజయత్
సోఽన్తఃపురగతః పార్థః కూపేఽగ్నిరివ సంవృతః
కన్యాపురగతం దృష్ట్వా గోష్ఠేష్వివ మహర్షభం
స్త్రీవేషవికృతం పార్థం కుంతీం గచ్ఛతి మే మనః
తథా దృష్ట్వా యవీయాంసం సహదేవం గవాంపతిం
గోషు గోవేషమాయాంతం పాండుభూతాస్మి భారత
సహదేవస్య వృత్తాని చింతయంతీ పునఃపునః

---

సదృశ తేజంతో వెలిగే కిరీటంతో భాసించే గాండీవి జడ వేసుకొని స్త్రీలమధ్య మెలగవలసి వచ్చింది. వీరాధివీరులను ఓడించి వన పర్వత ప్రాంతాలలో రథాన్ని సాగిస్తూ ఆ ఘోషతో శత్రువులను గజగజ లాడించే అర్జునుడు స్త్రీ వేషం ధరించి నాట్యం చేస్తూంటే నా దుఃఖం పొంగిపొర్లుతోంది. ఇంద్ర, వరుణ, వాయు, బ్రహ్మ, ఆగ్నేయాది అస్త్రాలతో అగ్నిని తృప్తిపరచిన ఆ మహారథికుని స్థితి చూసి చింతిస్తున్నాను. నివాతకవచ కాలకేయాది భయంకర రాక్షసులను హతమార్చిన అర్జునుని స్థితి ఎలాఉందో చూసావా ?

సహదేవుడు గోపాలకుడుగా గొల్లవేషం ధరించి చరిస్తూంటే నా శరీరం కంపిస్తోంది. పాపరహితుడూ, సత్యపరాక్రమోపేతుడూ, సదాచారశీలసంపన్నుడూ అయిన సహదేవుని గోపాలకస్థితితో చూస్తే నా గుండె శోకంతో నిండిపోతోంది. ఆ సహదేవుడు మధురభాషి, లజ్జాశీలుడు, ధర్మతత్పరుడు, నాకు వానిపై అమిత ప్రేమ అని వనవాసానికి వచ్చేముందు మా అత్తగారు కుంతీదేవి నాతో ఇంకా ఇలా చెప్పింది:

న నిద్రమభిగచ్ఛామి భీమసేన కుతో రతిం.
నవిందామి మహాబాహో సహదేవస్య దుష్కృతం
యస్మిన్నేవంవిధం దుఃఖం ప్రాప్నుయాత్ సత్యవిక్రమః
దూయామి భరతశ్రేష్ఠ దృష్ట్వా తే భ్రాతరం ప్రియం
గోషు గోవృషసంకాశం మత్స్యేనాభినివేశితం.
సంరబ్ధం రక్తనేపథ్యం గోపాలానాం పురోగమం
విరాటమభినందంతమథ మే భవతి జ్వరః.
సహదేవం హి మే వీర నిత్యమార్యా ప్రశంసతి
మహాభిజనసంపన్నః శీలవాన్ వృత్తవానితి.
హ్రీనిషేవో మధురవాక్ ధార్మికశ్చ ప్రియశ్చ మే
స తేఽరణ్యేషు వోఢవ్యో యాజ్ఞసేనీ క్షపాస్వపి.
సుకుమారశ్చ శూరశ్చ రాజానం చాప్యనువ్రతః
జ్యేష్ఠాపచాయినం వీరం స్వయం పాంచాలి భోజయేః
ఇత్యువాచ హి మాం కుంతీ రుదతీ పుత్రగృద్ధినీ
ప్రవ్రజంతం మహారణ్యం తం పరిష్వజ్య తిష్ఠతీ.
తం దృష్ట్వా వ్యాపృతం గోషు వత్సచర్మక్షపాశయం
సహదేవం యుధాం శ్రేష్ఠం కిం ను జీవామి పాండవ
యస్త్రిభిర్నిత్యసంపన్నో రూపేణాస్త్రేణ మేధయా
సోఽశ్వబంధో విరాటస్య పశ్య కాలస్య పర్యయం.
అభ్యకీర్యంత వృందాని దామగ్రంథిముదీక్షతం
వినయంతం జవేనాశ్వాన్ మహారాజస్య పశ్యతః.
అపశ్యమేనం శ్రీమంతం మత్స్యం భ్రాజిష్ణుముత్తమం
విరాటముపతిష్ఠంతం దర్శయంతం చ వాజినః.
కిం ను మాం మన్యసే పార్థ సుఖినీతి పరంతప
ఏవం దుఃఖశతావిష్టా యుధిష్ఠిరనిమిత్తతః.
అతః ప్రతివిశిష్టాని దుఃఖాన్యన్యాని భారత
వర్తంతే మయి కౌంతేయ వక్ష్యామి శృణు తాన్యపి.
యుష్మాసు ధ్రియమాణేషు దుఃఖాని వివిధాన్యుత
శోషయంతి శరీరం మే కిం ను దుఃఖమతః పరం.

---

అమ్మాయీ! వీడికి అగ్రజులపై అధికమైన భక్తిశ్రద్ధలు ఉన్నాయి. అరణ్యాలలో రాత్రివేళ వీడిని నీ బాహువులలో ఉంచి రక్షించు. వీడు నడవలేక అలసటతో ఉంటే చెయ్యిపట్టుకు నడిపించు వీడి భోజనవిషయంలో నువ్వు శ్రద్ధవహించాలి సుమా—అని.

భీమసేనా! అటువంటి సహదేవుని ఇటువంటి స్థితిలో చూస్తూంటే ఇంకా ఎందుకు బ్రతికి ఉన్నానా అనిపిస్తోంది. సర్వశత్రుసంహారసమర్థుడూ, శోభాసంపన్నుడూ, ఉత్తమ ప్రతిభాసౌందర్యవంతుడూ, అయిన నకులుడు ఈ మాత్స్యుని అశ్వశాలలో పనిచేస్తూంటే నా హృదయం శతధాభిన్నమై పోతోంది. ఈ విషయాలన్నీ నీకు తెలియనివి కావు. ఇన్నిటికీ కారణం ధర్మరాజు కపటద్యూతం కారణంగా ప్రాప్తించిన ఈ దుఃఖాలను మించిన విషాదంతో నా శరీరం దగ్ధమైపోతోంది, అది చెబుతాను విను - అని కొనగోట కన్నీరు తుడుచుకొన్నది ద్రౌపది.

## ఇరువదియవ అధ్యాయం

అహం సైరంధ్రివేషేణ చరంతీ రాజవేశ్మని
శౌచదాస్మిసుదేష్ణాయాఅక్షధూర్తస్యకారణాత్.
విక్రియాం పశ్య మే తీవ్రాం రాజపుత్రాఃపరంతప
ఆత్మకాలముదీక్షంతీ సర్వం దుఃఖం కిలాంతవత్.
అనిత్యాకిల మర్త్యానామర్థసిద్ధిర్జయాజయౌ
ఇతి కృత్వా ప్రతీక్షామి భర్తౄణాముదయంపునః
చక్రవత్పరివర్తంతే హ్యర్థాశ్చ వ్యసనాని చ
ఇతి కృత్వా ప్రతీక్షామి భర్తౄణాముదయంపునః.
య ఏవ హేతుర్భవతి పురుషస్య జయావహః
పరాజయే చ హేతుశ్చ స ఇతి ప్రతిపాలయే
కిం మాం న ప్రతిజానీషే భీమసేన మృతామివ.
దత్వా యాచంతిపురుషా హత్వావధ్యంతిచాపరే
పాతయిత్వా చ పాత్యంతే పరైరితి చ మేశ్రుతం.
న దైవస్యాతిభారోఽస్తి న చైవాస్యాతివర్తనం
ఇతి చాప్యాగమం భూయో దైవస్య ప్రతిపాలయే
స్థితం పూర్వం జలం యత్ర పునస్తత్రైవ గచ్ఛతి
ఇతి పర్యాయమిచ్ఛంతీ ప్రతీక్షే ఉదయం పునః.
దైవేన కిల యస్యార్థః సునీతోఽపి విపద్యతే
దైవస్య చాగమే యత్నస్తేన కార్యో విజానతా.
యత్ తు మే వచనస్యాస్య కథితస్య ప్రయోజనం
పృచ్ఛ మాం దుఃఖితాం తత్వం పృష్టా చాత్ర
బ్రవీమి తే.
మహిషీ పాండుపుత్రాణాం దుహితా ద్రుపదస్య చ
ఇమామవస్థాం సంప్రాప్తా మదన్యా కా జిజీవిషేత్
కురూన్ పరిభవేత్ సర్వాన్ పంచాలానపి భారత
పాండవేయాంశ్చసంప్రాప్తోమమక్లేశో హ్యరిందమ

---

## ఇరువదియవ అధ్యాయం

మహారాజ పుత్రినైన నేను సైరంధ్రీ వేషంలో ఈ విరట రాజాంతఃపురంలో సుదేష్ణాదేవికి స్నానపానాలు సమకూరుస్తూ హీనంగా దాస్యం చేయడానికి కారణం మీ అన్న ద్యూత వ్యామోహమే కదా. సాధారణంగా మానవులు మంచిరోజులను అపేక్షిస్తూ కాలం గడుపుతూ ఉంటారు. వారిక్లేశాలుగూడా చిరకాలం ఉండవు. జయాపజయాలు అర్థానర్థాలు శాశ్వతాలు కావు అని తెలియడంవల్లనే నేను మీ శ్రేయస్సును కాంక్షిస్తూ విచారంతో ఈ కష్టదినాలు గడుపుకొని వస్తున్నాను. సుఖదుఃఖాలు చక్రనేమిక్రమేణ సాగుతూ ఉంటాయి. విజయసాధనకు సహాకరించే కాలమే పరాజయానికి కూడా హేతు వౌతుంది. మహాదాత భిక్షుకుడు కావలసి వస్తుంది. ఎదుట వానిని చంపడానికి సమర్థుడైనవాడు అశక్తుడై ఆ ప్రత్యర్థి చేతులలోనే మరణించడం కూడ సంభవిస్తుంది. కాలం ఇటువంటి ఇంద్రజాలా లెన్నో సాగిస్తూ ఉంటుంది.

కాని దైవం ఉన్నదే – దానికి అసాధ్యమైన దేదీలేదు. దానిని అతిక్రమించడానికి ప్రయత్నించడం మన మూర్ఖత్వమే ఔతుంది. విధి బలీయమని నాకు తెలుసు. నీరు ఎక్కడనుంచి వచ్చిందో అక్కడకే వెళుతోంది. ఈ వస్తు సముదాయం కూడా మన రక్షణవల్ల నిలబడటం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ధనకనకవస్తు వాహనాదులన్నీ దైవనిర్ణయాను సారం ప్రజలకు భోగ్యాలౌతూ, అది ప్రతికూలించినప్పుడు దూరమైపోతాయి. కనకనే విజ్ఞులు విధిని అనుకూలం

భ్రాతృభిః శ్వశురైః పుత్రైర్బహుభిః పరివారితా
ఏవం సముదితా నారీ కాత్వన్యా దుఃఖితా భవేత్.
నూనంహి బాలయా ధాతుర్మయా వై విప్రియంకృతం
యస్య ప్రసాదాద్ దుర్నీతం ప్రాప్తాస్మి భరతర్షభ.
వర్ణావకాశమపి మే పశ్య పాండవ యాదృశం
తాదృశో మే న తత్రాసీద్ దుఃఖే పరమకే తదా
త్వమేవ భీమ జానీషే యన్మే పార్థ సుఖం పురా
సాహం దాసీత్వమాపన్నా న శాంతిమవశా లభే
నా దైవికమహం మన్యే యత్ర పార్థో ధనంజయః
భీమధన్వా మహాబాహురాస్తే ఛన్న ఇవానలః
అశక్యా వేదితుం పార్థ ప్రాణినాం వై గతిర్నరైః
వినిపాతమిమం మన్యే యుష్మాకం హ్యవిచింతితం.
యస్యా మమ ముఖప్రేక్షా యూయమింద్రసమాః సదా
సా ప్రేక్షే ముఖమన్యాసామవరాణాం వరా సతీ.

పశ్య పాండవ మేఽవస్థాం యథానార్హామి వై తథా
యుష్మాసు ధ్రియమాణేషు పశ్య కాలస్య పర్యయం.
యస్యాః సాగరపర్యంతా పృథివీ వశవర్తినీ
ఆసీత్ సాద్య సుదేష్ణాయా భీతాహం వశవర్తినీ.
యస్యాః పురఃసరా ఆసన్ పృష్ఠతశ్చానుగామినః
సాహమద్య సుదేష్ణాయాః పురఃపశ్చాచ్చగామినీ.
ఇదం తు దుఃఖం కౌంతేయ మమాసహ్యం
నిబోధ తత్
యా న జాతు స్వయం పింషే గాత్రోద్వర్తనమాత్మనః
అన్యత్ర కుంత్యా భద్రం తే సా పినష్మ్యద్య చందనం
పశ్య కౌంతేయ పాణీ మే నైవాభూతాం హి యౌ పురా
ఇత్యస్య దర్శయామాస కిణబద్ధౌ కరావుభౌ.
బిభేమి కుంత్యా యా నాహం యుష్మాకం వా కదాచన
సాద్యాగ్రతో విరాటస్య భీతా తిష్ఠామి కింకరీ.

చేసుకోడానికి ప్రయత్నిస్తాను. ఇప్పుడు చాలా విషయాలు నీతో మాట్లాడాను. ఇదంతా అనవసర ప్రసంగం. ముఖ్యాంశం చెప్తున్నాను. సావధానంగా విను.

మహావీరులైన పాండవ పట్టమహిషినై విఖ్యాతుడైన ద్రుపద మహారాజుకు ప్రియపుత్రికనై నేను ఇటువంటి కష్టాలలో చిక్కుకోనవలసి వచ్చింది. నా వంటి దానికి ఇటువంటి క్లేశాలు రావడం పాండవ పాంచాల కురు రాజవంశాలకే కళంకం. పసితనంలో నే నేవో తెలియని దోషాలు చేసి ఉంటాను. ఆ ఫలాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నాను. దీనితో నా శరీరకాంతి ఏలా క్షీణిస్తోందో చూసావా. ఈ నగరంలో ప్రవేశించాక నేను అనుభవించే కష్టాలకు అంతూపంతూ లేకుండా పోయింది. వనవాస సమయంలోకూడా నే నింతటి కష్టం అనుభవించలేదు. ఇతఃపూర్వం ఈ ద్రుపద రాజపుత్రి ఎటువంటి భోగభాగ్యాలు అనుభవించిందో నువ్వెరుగుదువు. అటువంటి రాజభోగాలనుభవించిన ఈపాండవపత్ని పరతంత్రజీవనంతో దాసీవృత్తితో జీవించవలసి వచ్చింది. ఐనా దైవం నా పట్ల సుముఖుడు కావడం లేదు. ఈ కష్టాలకుఒక అంతమంటూ ఉంటుందనే ఆశ నాకు కన్పించడం లేదు. గాండీవధనుర్ధారియైన అర్జునుడు అంతఃపుర నారీజనమధ్యంలోఆటపాటలు నేర్పుతూజీవయాత్ర సాగిస్తూంటే, మీ రందరూ ఎన్నో అవమాన పరాభవాలకు గురిఔతూంటే నేనెంతో బాధపడుతున్నానే కాని మీరు ఆ విషయాలను ఆలోచించనే లేకపోతున్నారు అదే నాకు ఆశ్చర్య విషాదాలను కల్గిస్తోంది దేవేంద్రసమ భోగ పరాక్రమ రూపలావణ్యాలుకల మీరు నన్నూ నా సౌంద

కిం ను వక్ష్యతి సమ్రాజ్ఞాం వర్ణకః సుకృతోనవా
నాన్యపిష్టం హి మత్స్యస్య చందనం కిల రోచతే.
సా కీర్తయంతీ దుఃఖాని భీమసేనస్య భామినీ
రురోద శనకైః కృష్ణా భీమసేనముదీక్షతీ.
సా బాష్పకలయా వాచా నిశ్వసంతీ పునఃపునః
హృదయం భీమసేనస్య ఘట్టయంతీదమబ్రవీత్
నాల్పం కృతంమయాభీమ దేవానాంకిల్బిషంపురా
అభాగ్యా యత్ర జీవామి కర్తవ్యే సతి పాండవ.
తత స్తస్యాః కరౌ సూక్ష్మౌ కిణబద్ధౌ వృకోదరః
ముఖమానీయ వై పత్న్యా రురోద పరవీరహా.
తౌ గృహీత్వా చ కౌంతేయో బాష్పముత్సృజ్య వీర్యవాన్
తతః పరమదుఃఖార్త ఇదం వచనమబ్రవీత్.

## ఇరువదిఒకటవ అధ్యాయం

ధిగస్తు మే బాహుబలం గాండీవం ఫాల్గునస్య చ
యత్ తే రక్తౌ పురా భూత్వా పాణీకృతకిణావిమౌ.
సభాయాం తు విరాటస్య కరోమి కదనం మహత్
తత్ర మే కారణంభాతి కౌంతేయో యత్ ప్రతీక్షతే.
అథవా కీచకస్యాహం పోథయామి పదా శిరః
ఐశ్వర్యమదమత్తస్య క్రీడన్నివ మహాద్విపః.
అపశ్యం త్వాం యదా కృష్ణే కీచకేనపదాహతాం
తదైవాహంచికీర్షామిమత్స్యానాంకదనంమహత్.
తత్రమాం ధర్మరాజస్తు కటాక్షేణ న్యవారయత్
తదహం తస్య విజ్ఞాయ స్థిత ఏవాస్మి భామిని.
యచ్చరాష్ట్రాత్ ప్రచ్యవనం కురూణామవధశ్చయః
సుయోధనస్య కర్ణస్య శకునేః సౌబలస్య చ.

ర్యాన్ని అభినందిస్తూ నిరంతరం నా వైపే మీ దృష్టులు ప్రసరిస్తూ ఉండేవారు. అటువంటి నా వైభవం భోగం క్షయమై ఈ స్థితికి వచ్చాను. ఈ భూమండలాన్నంతనీ పరిపాలించేవారి పట్టమహిషి ఈ నా డెటువంటి స్థితిలో ఉందో చూసావా. ఈ మహారాణిముందు భయపడుతూ ఆమె ఆజ్ఞలను అనుక్షణం అనుసరిస్తూ అడుగులకు మడుగులొత్తుతూ జీవిస్తున్నాను. ఐనా నేను విచారించడం లేదు –

మీకుగాని పూజ్యురాలైన అత్తగారికిగాని నే నెప్పుడూ తైలలేపనాలు సమకూర్చలేదు. ఈనాడు వీరికి చందనాదులు తీస్తూంటే నా చేతులు ఏలా కాయకాచాయో చూడు. నే నిచ్చే చందనాదులు ఆ మహారాజుకు ఆహ్లాదం కల్గిస్తూఉంటే నా కెక్కువ బాధగానే ఉంటోంది. ఇటువంటి క్లేశాలు అనుభవించడం కంటె మరణమే శ్రేయస్కర మనిపిస్తోంది-అని వేడినిట్టూర్పులు విడుస్తూ కన్నీరు కారుస్తూంటే భీముడు తన రెండు చేతులతోనూ పట్టుకొని కన్నీరు ఒత్తి అనునయిస్తూ ఇలా అంటున్నాడు.

## ఇరువదిఒకటవ అధ్యాయం

ద్రౌపదీ – నా బాహుబల పరాక్రమమూ అర్జునుని గాండీవప్రభావమూ నిరర్థకమే అయాయి. నీ కరకమలాలు ఈ దాస్యంతో కాయలు కాచి అరుణిమ కోలుపోయి నల్లబడ్డాయి. ఐనా మన అజ్ఞాతవాసం బయటపడుతుం దనే భయంతో ఏ సాహసం చెయ్యడానికీ వీలులేకుండా ఉంది. ఆనాడు ధర్మరాజు నిరోధించి ఉండకపోతే విరటుని కొలువులో ఏమయ్యేదో చెప్పలేను. ఐశ్వర్య

దుశ్శాసనస్య పాపస్య యన్మయా నాహృతం శిరః
తన్మే దహతి గాత్రాణి హృది శల్యమివార్పితం
మా ధర్మం జహి సుశ్రోణి క్రోధం జహి మహామతే.
ఇమం తు సముపాలంభం త్వత్తో రాజా యుధిష్ఠిరః
శృణుయాద్వాపి కల్యాణి కృత్స్నం జహ్యాత్ స జీవితం.
ధనంజయో వా సుశ్రోణి యమౌ వా తనుమధ్యమే
లోకాంతరగతేష్వేషు నాహం శక్ష్యామి జీవితుం.
పురా సుకన్యా భార్యా చ భార్గవం చ్యవనం వనే
వల్మీకభూతం శామ్యంతమన్వపద్యత భామినీ
నారాయణీ చేంద్రసేనా రూపేణ యది తే శ్రుతా
పతిమన్వచరద్ వృద్ధం పురా వర్షసహస్రిణం.
దుహితా జనకస్యాపి వైదేహీ యది తే శ్రుతా
పతిమన్వచరత్ సీతా మహారణ్యనివాసినం.
రక్షసా నిగ్రహం ప్రాప్య రామస్య మహిషీ ప్రియా
క్లిశ్యమానాపి సుశ్రోణీ రామమేవాన్వపద్యత.
లోపాముద్రా తథా భీరు వయోరూపసమన్వితా
అగస్త్యమన్వయాద్ధిత్వా కామాన్ సర్వానమానుషాన్.
ద్యుమత్సేనసుతం వీరం సత్యవంతమనిందితా.
సావిత్ర్యనుచచారైకా యమలోకం మనస్వినీ.
యథైతాః కీర్తితా నార్యో రూపవత్యః పతివ్రతాః
తథా త్వమపి కల్యాణి సర్వైః సముదితా గుణైః.
మాదీర్ఘం క్షమ కాలం త్వం మాసమర్ధం చ సమ్మితం
పూర్ణే త్రయోదశే వర్షే రాజ్ఞాం రాజ్ఞీ భవిష్యసి.
సత్యేన తే శపే చాహం భవితా నాన్యథేతి హ
సర్వాసాం పరమస్త్రీణాం ప్రామాణ్యం కర్తుమర్హసి
సర్వేషాం చ నరేంద్రాణాం మూర్ధ్నిస్థాస్యసి భామిని
భర్తృభక్త్యా చ వృత్తేన భోగాన్ ప్రాప్స్యసి దుర్లభాన్

మదోన్మత్తుడైన కీచకుడు అప్పుడే యమసదనానికి అతిథిగా పోయేవాడు. వాడు కర్కశపాదాలతో నిన్ను తాడిస్తూంటే నేను చూసి ఊరుకోవలసి వచ్చింది. అప్పుడే నాకు ఏవిరోధమూ లేకపోతే ఆ కీచకుడే కాదు ఈ మత్స్యదేశమంతా మట్టిపాలయ్యేది. అన్నగారి కనుసన్నలు నన్ను అడ్డుపెట్టాయి. ద్యూతసమయంలో వంచన జరిగినప్పుడే నేను తగిన ప్రతీకారం చేసిఉండేవాడిని. కాని అప్పుడూ ఇదే అడ్డంవచ్చింది. ఆ దుష్టులు నలుగురినీ హతమార్చకుండా విడిచిపెట్టడం హృదయంలో శల్యంలా వేధిస్తూనే ఉంది. ఆ బాధాగ్ని జ్వాలలు నా శరీరాన్ని దహిస్తున్నాయి. నువ్వు ధర్మమార్గానుసారిణివి ఇప్పుడు గూడా ధర్మచ్యుతికి అవకాశ మివ్వడం మంచిది కాదు. కనక ఈ కోపాన్ని విడిచిపెట్టు. నీ మాటలు ధర్మరాజు వింటే అభిమానంతో ప్రాణత్యాగం చేస్తాడు. అర్జున నకుల సహదేవులు ఈ ప్రసంగం విన్నట్లైతే జీవయాత్ర చాలించక తప్పదు.

భార్గవుడైన చ్యవనుడు తపోదీక్షలో శల్యావశిష్టుడైనప్పుడు వానిపై పుట్టలు మొలిచాయి. ఆ సమయంలోనే వానిని అనుసరించి సేవించే సుకన్య భార్యగా లభించింది. అతిలోక సౌందర్యవతియైన చంద్రసేన పరమవృద్ధుడైన ముద్గలమహర్షిని భక్తిశ్రద్ధలతో సేవించి విశ్వవిఖ్యాతురాలైంది. జనకరాజపుత్రి సీత రాముని అనుసరించి అరణ్యాలకుపోయి రాక్షసులపాలై అనేక క్లేశాలు అనుభవించింది. ఐనా ఆమె ధర్మమార్గం విడవక రామునియందే అనురక్తయై త్రికాలాబాధితమైన త్రిలోక విఖ్యాతి పొందింది. అఖిలలోకాశ్చర్యకర సౌందర్య లావణ్యాలతో

ఆర్తయైతన్మయా భీమ కృతం బాష్పప్రమోచనం
అపారయంత్యా దుఃఖాని న రాజానముపాలభే.
కిముక్తేన వ్యతీతేన భీమసేన మహాబల
ప్రత్యుపస్థితకాలస్య కార్యస్యానంతరో భవ.
మమేహ భీమ కైకేయీ రూపాభిభవశంకయా
నిత్యముద్విజతే రాజా కథం నేయాదిమామితి.
తస్యా విదిత్వా తంభావం స్వయంచానృతదర్శనః
కీచకోఽయంసుదుష్టాత్మా సదాప్రార్థయతేహిమాం
తమహం కుపితా భీమ పునః కోపం నియమ్య చ
అబ్రువం కామసమ్మూఢ మాత్మానం రక్ష కీచక.
గంధర్వాణామహం భార్యా పంచానాం మహిషీ ప్రియా
తేత్వాంనిహన్యుఃకుపితాః శూరాఃసాహసకారిణః
ఏవముక్తః సుదుష్టాత్మా కీచకః ప్రత్యువాచ హ
నాహం బిభేమి సైరంధ్రి గంధర్వాణాం శుచిస్మితే
శతం శతసహస్రాణి గంధర్వాణామహం రణే
సమాగతం హనిష్యామి త్వం భీరు కురు మేక్షణం
ఇత్యుక్తేచాబ్రువమత్తం కామాతురమహంపునః
నత్వంప్రతిబలశ్చైషాంగంధర్వాణాంయశస్వినాం
ధర్మే స్థితాస్మి సతతం కులశీలసమన్వితా
నేచ్ఛామి కంచిద్ వధ్యంతం తేన జీవసి కీచక.
ఏవముక్తః స దుష్టాత్మా ప్రాహసత్ స్వనవత్ తదా
అథ మాం తత్రకైకేయీ ప్రైషయత్ ప్రణయేనతు.
తేనైవ దేశితా పూర్వం భ్రాతృప్రియచికీర్షయా
సురామానయ కల్యాణి కీచకస్య నివేశనాత్.
సూతపుత్రస్తు మాం దృష్ట్వా మహత్ సాంత్వమవర్తయత్
సాంత్వే ప్రతిహతే క్రుద్ధః పరామర్శమనాభవత్.
విదిత్వా తస్య సంకల్పం కీచకస్య దురాత్మనః
తథాహం రాజశరణం జవేనైవ ప్రధావితా.

అలనాడే లోపాముద్ర అగస్త్యమహర్షిని అనుసరించి రాజభోగాలను సుఖాలను విడిచిపెట్టిన విషయం నువ్వెరుగుదువు. ద్యుమత్సేన నందనుడైన సత్యవంతుని సావిత్రి ఏ విధంగా అనుసరించి అసాధ్యమైన వరాన్ని పొంది తన భర్తను పునరుజ్జీవింప చేసుకుందో కూడా నీకు తెలుసు. వారి వలెనే నువ్వుకూడా ఆదర్శపథాన వర్తించి విఖ్యాతి పొందాలి. కొద్దిరోజులు ఓపికపడితే ఈ అజ్ఞాతవాసం పూర్తి అవుతుంది. ఇంక సరిగ్గా నెలాపదిహేను రోజులు ఓరిమివహిస్తే నువ్వు మహారాణి వౌతావు. ఈ భూమండలంలో స్త్రీజనానికంతకూ ఆదర్శమహిళవుగా కీర్తిగడించడానికి ప్రయత్నించు. నీ పాతివ్రత్యమూ సదాచారమూ పరమోత్కృష్టంగా పరిగణింప బడతాయి. అప్పుడు నీ ధర్మశక్తిముందు ఈ వీరరాజలోకమంతా తలలువంచి నిలబడుతుంది. ఏ భోగ భాగ్యాలను నువ్వు వాంఛిస్తున్నావో అవన్నీ నీపాదాలముందు ప్రాలతాయి – అని భీముడు ఓదార్చాడు.

అప్పుడు ద్రౌపది – భీమసేన! ఈ దుఃఖం దుర్భరమైనందువల్లనే నీతో చెప్పుకోవలసి వచ్చింది. ధర్మజుని ఆజ్ఞల నతిక్రమించాలనే ఊహ నాకులేదు. పైగా ఆ విషయాలన్నీ ఇప్పుడు ప్రసంగించి ప్రయోజనం లేదు. నువ్వు మాత్రం అప్రమత్తుడవై కార్యసాధనకు సిద్ధంగా ఉండు. ఈ సుదేష్ణాదేవి రూపలావణ్యాలలో నా కన్న ఎన్నోరెట్లు తక్కువది కావడంచేత తన భర్త వ్యామోహం కలవాడై ఎటువంటి విపత్తులకు పాల్పడతాడో అని అనుక్షణం భయపడుతూనే ఉంది. పాపాత్ముడైన కీచకుడు నా సమక్షంలో ఆమెతో నన్ను తనకు సమర్పించమని అర్థించి

సందర్శనేతుమాంరాజ్ఞః సూతపుత్రః పరామృశత్
పాతయిత్వా తు దుష్టాత్మా పదాహం తేన తాడితా.
ప్రేక్షతే స్మ విరాటస్తు కంకస్తు బహవో జనాః
రథినః పీఠమర్దాశ్చ హస్త్యారోహాశ్చ నైగమాః.
ఉపాలబ్ధో మయా రాజా కంకశ్చాపి పునఃపునః
తతో న వారితో రాజ్ఞా న తస్యావినయః కృతః.
యోఽయం రాజ్ఞో విరాటస్య కీచకో నామ సారథిః
త్యక్తధర్మా నృశంసశ్చ నరస్త్రీసమ్మతః ప్రియః.
శూరోఽభిమానీ పాపాత్మా సర్వార్థేషు చ ముగ్ధవాక్
దారామర్శీ మహాభాగ లభతేఽర్థాన్ బహూనపి.
ఆహరేదపి విత్తాని పరేషాం క్రోశతామపి
న తిష్ఠతి స్మ సన్మార్గే న చ ధర్మం బుభూషతి.

పాపాత్మా పాపభావశ్చ కామబాణవశానుగః
అవినీతిశ్చ దుష్టాత్మా ప్రత్యాఖ్యాతః పునఃపునః.
దర్శనే దర్శనే హన్యాద్ యది జహ్యాం చ జీవితం
తద్ ధర్మే యతమానానాం మహాన్ ధర్మో నశిష్యతి.
సమయం రక్షమాణానాం భార్యా వో న భవిష్యతి
భార్యాయాం రక్ష్యమాణాయాం ప్రజా భవతి రక్షితా.
ప్రజాయాం రక్ష్యమాణాయామాత్మా భవతి రక్షితః
ఆత్మా హి జాయతే తస్యాం తేన జాయాం విదుర్బుధాః
భర్తా తు భార్యయా రక్ష్యః కథం జాయాన్మమోదరే
వదతాం వర్ణధర్మాంశ్చ బ్రాహ్మణానామితి శ్రుతః
క్షత్రియస్య సదా ధర్మో నాన్యః శత్రునిబర్హణాత్
పశ్యతో ధర్మరాజస్య కీచకో మాం పదావధీత్.

---

నప్పుడు ఆగ్రహంతో ఆమె పరిపరివిధాల హెచ్చరించింది. సైరంధ్రిని మోహించినట్లైతే ప్రాణాలు దక్కవని కూడా మరీమరీ చెప్పింది, ఐనా ఆ దుష్టుడు తన కేవిధమైన భయమూ లేదనీ, ఎందరు గంధర్వులు దండెత్తివచ్చినా నిగ్రహించగలననీ నన్ను అనుగ్రహించమనీ ప్రార్థించినప్పుడు నేను నా భర్తలు గంధర్వులనీ అతులిత బలపరాక్రమ సంపన్నులనీ అటువంటి వాంఛ వానికి దగదనీ హితబోధచేస్తూ పాతివ్రత్యధర్మమార్గానుసారం జీవించే నన్ను కామించవద్దనీ నా వల్ల ఎవరికీ ప్రాణహాని జరగడం ఇష్టంలేదనీ – చెప్పాను.

నా మాటలు విని ఆ దురాత్ముడు వెర్రినవ్వు నవ్వాడు. అనంతరం కీచకుని నిర్దేశానుసారం సుదేష్ణ వాని మనోవాంఛ నీడేర్చే ఊహతో నన్ను వాని అంతఃపురానికి పోయి మధురమైన మదిర తెమ్మన్నది. చేసేదిలేక నేను కీచకసౌధం చేరేను. వాడు మదమోహితుడై వికృతంగా భాషిస్తూంటె నేను వానిని ఎలా అయినా అదృష్టినుండి మరలించాలని ప్రయత్నించాను. కాని వాడు బలాత్కారానికి సంసిద్ధుడయ్యాడు. తక్షణం నేను విరటుని కొలువుకు వచ్చాను. సభలో నేను ప్రవేశిస్తూండగా వాడు పరుగుపరుగున వచ్చి నన్ను నానావిధాలా హింసించాడు. విరటుడు కంకుడు ఇతర రాజపారిషదులు ఆ సన్నివేశాన్ని చూస్తూనే ఉన్నారు. వారి కనుల ఎదుటగా ఒక స్త్రీ అవమానింపబడుతూంటే ఆమెను రక్షించాలనే ఊహ వారికి లేకపోయింది. ఒక్కరూ నా ప్రార్థనను మన్నించి అభయమివ్వలేకపోయారు. కీచకుడు పేరుకు మాత్రమే అక్కడ సూతుడు. ధర్మద్రోహంలో క్రూరకర్మాచరణలలో ఆరితేరిన కీచకుని ఆగడాలను అనురోధించడానికి ఎవ్వరికి శక్తి లేదు. వాడు పరధనాన్నీ పరదారలను హరిస్తాడు. ఆ విషయాన్ని ఆ దేశవాసులు విరటు ముందు ఎన్నిసార్లు నివేదించుకున్నా వారికి రక్షణ

తవ చైవ సమక్షే వై భీమసేన మహాబల
త్వయా హ్యహం పరిత్రాతా తస్మాద్ ఘోరా జ్జటాసురాత్
జయద్రథం తథైవ త్వమజైషీర్భ్రాతృభిః సహ
జహీమమపి పాపిష్ఠం యోఽయం మామవమన్యతే.
కీచకో రాజవాల్లభ్యాచ్ఛోకకృన్మమ భారత
తమేవం కామసమ్మత్తం భింధి కుంభమివాశ్మని.
యో నిమిత్తమనర్థానాం బహూనాం మమ భారత
తం చేజ్జీవంతమాదిత్యః ప్రాతరభ్యుదయిష్యతి.
విషమాలోడ్య పాస్యామి మా కీచకవశం గమం
శ్రేయో హి మరణం మహ్యం భీమసేన తవాగ్రతః
ఇత్యుక్త్వా ప్రారుదత్ కృష్ణా భీమస్యోరః సమాశ్రితా
భీమశ్చ తాం పరిష్వజ్య మహత్ సాంత్వం ప్రయుజ్య చ.
ఆశ్వాసయిత్వా బహుశో భృశమార్తాం సుమధ్యమాం
హేతుతత్త్వార్థసంయుక్తైర్వచోభిర్ద్రుపదాత్మజాం
ప్రమృజ్య వదనం తస్యాః పాణినాశ్రుసమాకులం
కీచకం మనసాగచ్ఛత్ సృక్కిణీ పరిసంలిహన్
ఉవాచ చైనాం దుఃఖార్తాం భీమః క్రోధసమన్వితః



లేము. కీచకుడు ఈ దేశానికి సర్వసైన్యాధిపతి. వాడు సన్మార్గానికీ ధర్మవిధులకూ దూరంగా ఉంటాడు. ఆ ఘోరాచారపరాయణుడు కామాంధుడై అవినీతితో చరిస్తూ నన్ను హింసిస్తున్నాడు. ఆ బాధలు భరించలేక ఎన్నోసార్లు ఆత్మహత్యచేసుకుందామని కూడా ప్రయత్నించాను. మీరందరూ అజ్ఞాతవాస నియమానుసారం ఏ విధమైన ప్రతీకారానికీ సంకల్పించక పోతే నేను బ్రతకడం కష్టం. భార్యను రక్షించుకునే వాడికి సంతానం ప్రాప్తిస్తుంది. సంతానం ఆత్మరక్షణ కుపకరిస్తుంది. పత్నిగర్భంనుండి ఆత్మ పుత్రరూపంలో ప్రభవిస్తుంది. అందుచేతనే ఆమెను 'జాయా' నామంతో వ్యవహరిస్తారు. పత్నిని పతి సర్వదా రక్షించాలనీ ఆమె గర్భంనుండి పుత్రరూపంలో తనకు జన్మను ప్రసాదిస్తుందనీ నేను విన్నాను.

భీమసేన – శత్రుసంహారమే క్షత్రియోచిత ధర్మం. ధర్మజుని సమక్షంలో నీకళ్ళముందు కీచకుడు నన్నవమానించాడు. జటాసురుడు నన్ను బధించబోయినప్పుడు రక్షించినది నువ్వు. నన్నవమానించబోయిన సైంధవుని సోదర పరివారసహితంగా శిక్షించిందీ నువ్వే. ఇప్పుడు ఈ కీచకుని కూడా సంహరించు. వాడు రాజబంధువు. రాజప్రియుడు కావడంవల్ల వాడి బాధ మరీ దుర్భరమౌతోంది. మట్టికుండ బ్రద్దలు కొట్టినట్లు ఆ కామోన్మత్తుని శిరస్సు ఛిన్నాభిన్నంచేసి నా దుఃఖం దూరంచెయ్యి. తెల్లవారేసరికి వాడి శిరస్సు బ్రద్దలుకాకపోతే నేను బ్రతకను. వానికి స్వాధీనం కావడం నా కెంతమాత్రం ఇష్టంలేదు. ఆపాపాత్ముడి కర్కశ హస్తాలలో పడటం కంటె నీపాదాలముందు ప్రాణత్యాగం చేయడం ఎంతో సంతోషకరమైన విషయం– అని విలవిల విలపిస్తూ భీముని గుండెపై తలచేర్చింది. భీముడు ఆమెను దగ్గరగా తీసుకొని కన్నీరు తుడిచి ఓదార్చి తన కార్యక్రమం చెపుతున్నాడు.



## ఇరువది రెండవ అధ్యాయం

తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు భాషసే
అద్య తం సూదయిష్యామి కీచకం సహబాంధవం.
అస్యాః ప్రదోషే శర్వర్యాః కురుష్వానేన సంగతం
దుఃఖం శోకం చ నిర్ధూయ యాజ్ఞసేని శుచిస్మితే.
యైషా నర్తనశాలేహ మత్స్యరాజేన కారితా
దివాత్ర కన్యా నృత్యంతి రాత్రౌ యాంతి యథాగృహం.
తత్రాస్తి శయనం దివ్యం దృఢాంగం సుప్రతిష్ఠితం
తత్రాస్య దర్శయిష్యామి పూర్వప్రేతాన్ పితామహాన్.
యథా చ త్వాం న పశ్యేయుః కుర్వాణాం తేన సంవిదం
కుర్యాస్తథా త్వం కల్యాణి యథా సంనిహితో భవేత్
తథా తౌ కథయిత్వా తు బాష్పముత్సృజ్య దుఃఖితౌ
రాత్రిశేషం తమత్యుగ్రం ధారయామాసతుర్హృది.
తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం ప్రాతరుత్థాయ కీచకః
గత్వా రాజకులాయైవ ద్రౌపదీమిదమబ్రవీత్.
సభాయాం పశ్యతో రాజ్ఞః పాతయిత్వా పదాహనం
న చైవాలభసే త్రాణమభిపన్నా బలీయసా.
ప్రవాదేనేహ మత్స్యానాం రాజా నామ్నాయముచ్యతే
అహమేవ హి మత్స్యానాం రాజా వై వాహినీపతిః
మాం సుఖం ప్రతిపద్యస్వ దాసో భీరు భవామి తే
అహ్నాయ తవ సుశ్రోణి శతం నిష్కాన్ దదామ్యహం
దాసీశతం చ తే దద్యాం దాసానామపి చాపరం
రథం చాశ్వతరీయుక్తమస్తు నౌ భీరు సంగమః.

## ఇరువది రెండవ అధ్యాయం

### నర్తనశాల

వ్యథితహృదయంతో ద్రౌపది తన క్లేశాలను ఆమూలాగ్రం వివరించేసరికి భీమసేనుని హృదయం క్రోధోద్రిక్తమైంది. ఆమెకు సంతోషం కల్గించే ఉద్దేశంతో కీచకుని సంహరించడానికి నిశ్చయించుకొని తన అభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తున్నాడు.

కళ్యాణీ - నీ ఊహ ప్రకారం కీచకుని పరివారసమేతంగా రేపే పరిమారుస్తాను. నువ్వు ఏలా అయినా రేపు ఒక్కసారి కీచకుని కలుసుకొని రాత్రివేళ వాడు నర్తనశాలకు వచ్చే ఏర్పాటు చెయ్యి. ఈనగరంలోని నర్తనశాల రాత్రిపూట నిర్జనంగా ఉంటుంది. నృత్యం అభ్యసించే రాజకన్యలందరూ రాత్రి తమతమ గృహాలకు వెళ్ళిపోతారు. నర్తనశాలలో పరమ సుందరమైన పర్యంకం కూడా ఉంది. నువ్వు ఎలా అయినా ఆ పాపిని ఈ పర్యంకం మీదకు జేరిస్తే వాడిని యమసదనానికి పంపుతాను. అయితే ఈ వ్యవహారం మూడవకంటికి తెలియనియ్యకు - అన్నాడు.

వారిద్దరూ కొంతసేపు విచారించి ఎవరి స్థానాలకు వారు పోయారు. తూరుపు తెల్లవారింది.

కీచకుడు అంతఃపురానికి వచ్చాడు. అక్కడ సైరంధ్రిని సమీక్షించి - సైరంధ్రీ ఇప్పటికైనా నీకు నాశక్తి తెలిసి ఉంటుంది. విరటు రాజసభామధ్యంలో నిన్ను నేను నేలమీద పడగొట్టి కాళ్ళతో తన్నినా నన్ను అడ్డినవారు లేరు. ఈ విరటుడు నామమాత్ర ప్రభువనీ నేనే సర్వాధికారి -

ఏవం మే సమయం త్వద్య ప్రతిపద్యస్వ కీచక
న త్వాం సఖా వా భ్రాతా వా జానీయాత్
సంగతం మయా.
అనుప్రవాదాద్భీతాస్మి గంధర్వాణాం యశస్వినాం
ఏవం మే ప్రతిజానీహి తతోఽహం వశగా తవ.
ఏవమేతత్ కరిష్యామి యథా సుశ్రోణి భాషసే.
ఏకో భద్రే గమిష్యామి శూన్యమావసథం తవ.
సమాగమార్థం రంభోరు త్వయా మదనమోహితః
యథా త్వాం నైవ పశ్యేయుర్గంధర్వాః
సూర్యవర్చసః.
యదేతన్నర్తనాగారం మత్స్యరాజేన కారితం
దివాత్ర కన్యా నృత్యంతి రాత్రౌ యాంతి
యథాగృహం.
తమిస్రే తత్ర గచ్ఛేథా గంధర్వాస్తన్న జానతే
తత్ర దోషః పరిహృతో భవిష్యతి న సంశయః.

తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు మన్యసే
ఏకః సన్ నర్తనాగారమాగమిష్యామి శోభనే.
సమాగమార్థం సుశ్రోణి శపే చ సుకృతేన మే
యథా త్వాం నావబుధ్యంతే గంధర్వా వరవర్ణిని.
సత్యం తే ప్రతిజానామి గంధర్వేభ్యో న తే భయం
తమర్థమపి జల్పంత్యాః కృష్ణాయాః కీచకేన హ
దివసార్థం సమభవన్మాసేనైవ సమం నృప
కీచకోఽథ గృహం గత్వా భృశం హర్షపరిప్లుతః
సైరంధ్రిరూపిణం మూఢో మృత్యుం తం నావ
బుద్ధవాన్.
గంధాభరణమాల్యేషు వ్యాసక్తః స విశేషతః
అలంచక్రే తదాఽఽత్మానం సత్వరః కామ
మోహితః.
తస్య తత్ కుర్వతః కర్మ కాలో దీర్ఘ ఇవాభవత్
అనుచింతయతశ్చాపి తామేవాయతలోచనాం.

---

వని నీకు తెలిసిఉండాలి. ఇప్పుడైనా నువ్వు నన్ను పరిగ్రహిస్తే సుఖంగాజీవించగలవు. రోజూ నూరు బంగారునాణాలు దినబత్తెంగా పంపుతాను. నిన్ను సేవించడానికి నూరుమంది దాసీజనం నిరంతరం నీముందునిలబడతారు. ఉత్తమాశ్వాలనుపూన్చిన రథాలు నీకు విహారార్థం సిద్ధంగా ఉంటాయి. ఈసుఖాలన్నీ నీవు ఒక్కసారి ఆలోచించి నన్ను ప్రేమించు - అని కీచకు డనగా - నేను చెప్పే నియమానికి నీవు అంగీకరించినట్లైతే నీ కోరిక నెరవేర్చడానికి నా కేమీ అభ్యంతరం లేదు. మనసమాగమవిషయం నీబంధుమిత్రులకూ పరివారానికీ తెలియకూడదు. ఈ విషయం నీకు తప్ప మరెవ్వరికి తెలిసినా నాభర్తలు అపకీర్తి పాలవుతారు. కనక ఈ నియమానికి అంగీకరిస్తే నిన్ను పరిగ్రహించడానికి నా కేమీ అభ్యంతరం లేదు - అని ద్రౌపది అనగా కీచకు డంగీకరించి ఒంటరిగానే ఆమెను జేరుతాననీ ఆసమాగమాన్ని ఆమె గంధర్వపతులుగూడా చూడరాదనీ అనగా ఆమె తన సమ్మతిని తెలుపుతూ - కీచకా, ఈ అంతఃపురంలోని నర్తనశాల మనకు సంకేతస్థలంగా ఏర్పరచుకొందాం. అది పగటివేళ రాచకన్యలకు విహారభూమి. రాత్రి అక్కడ ఎవ్వరూ ఉండరు. అందుచేత ఈ రాత్రి అక్కడకు రా. నా గంధర్వపతులకు కూడ ఆవిషయం తెలియదు. అక్కడ సర్వదోషాలు దూరమౌతాయి- అని నర్మగర్భంగా సంకేతస్థలం ఏర్పాటు చేసే సరికి కీచకుడు సంతోషతరంగితస్వాంతంతో - శోభనాంగీ - నీమాట జవదాటను. ఒంటరిగానే నర్తనశాలకు వస్తాను. ప్రమాణంచేసి చెప్పుతున్నాను. ఈ విషయం గంధర్వులకు తెలియ

ఆసీదభ్యధికా చాపి శ్రీః శ్రియం ప్రముముక్షతః
నిర్వాణకాలే దీపస్య వర్తీమివ దిధక్షతః.
కృతసంప్రత్యయ స్తస్యాః కీచకః కామమోహితః
నాజానాద్దివసంయాంతం చింతయానః సమాగమం.
తతస్తు ద్రౌపదీ గత్వా తదా భీమం మహానసే
ఉపాతిష్ఠత కళ్యాణీ కౌరవ్యం పతిమంతికం.
తమువాచ సుకేశాంతా కీచకస్య మయా కృతః
సంగమో నర్తనాగారే యథావోచః పరంతప.
శూన్యం స నర్తనాగారమాగమిష్యతి కీచకః
ఏకో నిశి మహాబాహో కీచకం తం నిషూదయ.
తం సూతపుత్రం కౌంతేయ కీచకం మదదర్పితం
గత్వా త్వం నర్తనాగారం నిర్జీవం కురు పాండవ.
దర్పాచ్చ సూతపుత్రోఽసౌ గంధర్వానవమన్యతే
తంత్వం ప్రహర తాం శ్రేష్ఠ హ్రదాన్నాగమివోద్ధరః
అశ్రు దుఃఖాభిభూతాయా మమ మార్జస్వ భారత
ఆత్మనశ్చైవ భద్రం తే కురు మానం కులస్య చ.
స్వాగతం తే వరారోహే యన్మాం వేదయసే ప్రియం
న హ్యన్యం కంచిదిచ్ఛామి సహాయం వరవర్ణిని.
యా మే ప్రీతి స్త్వయాఽఽఖ్యాతా కీచకస్య సమాగమే
హత్వా హిడింబం సా ప్రీతిర్మమాసీద్ వరవర్ణిని.
సత్యంభ్రాతౄంశ్చధర్మంచ పురస్కృత్యబ్రవీమి తే
కీచకం నిహనిష్యామి వృత్రం దేవపతిర్యథా.
తం గహ్వరే ప్రకాశే వా పోథయిష్యామి కీచకం
అథ చేదపి యోత్స్యంతి హింసేమత్స్యానపి ధ్రువం
తతో దుర్యోధనం హత్వా ప్రతిపత్స్యే వసుంధరాం
కామంమత్స్యముపాస్తాంహి కుంతీపుత్రో యుధిష్ఠిరః
యథానసంత్యజేథా స్త్వంసత్యంవై మత్కృతే విభో
నిగూఢ స్త్వం తథా పార్థ కీచకం తం నిషూదయ.
ఏవమేతత్ కరిష్యామి యథా త్వం భీరు భాషసే
అద్య తం సూదయిష్యామి కీచకం సహ బాంధవైః
అదృశ్యమాన స్తస్యాథ తమస్వినామనిందితే
నాగో బిల్వమివాక్రమ్య పోథయిష్యామ్యహంశిరః
అలభ్యామిచ్ఛత స్తస్య కీచకస్య దురాత్మనః.
భీమోఽథప్రథమంగత్వా రాత్రౌచ్ఛన్న ఉపావిశత్
మృగం హరిరివాదృశ్యః ప్రత్యాకాంక్షత కీచకం.

నివ్వకు. తెలిసినా నీకేమీ భయం లేదు - అని వెళ్ళిపోయాడు.

ద్రౌపది ఈ విషయమంతా భీమసేనునికి ఎప్పుడు చెపుదామా అనే కుతూహలంతో ఆ పగ లొక యుగంగా గడిపింది.

కీచకుడు హర్ష పులకిత దేహుడై నిజసౌధం జేరి స్నానాదులు పూర్తి చేసి చందన లేపనాలు అలదుకొని చీనాంబరధారియై పుష్పమాలాలంకృతుడై సంధ్యకోసం నిరీక్షిస్తున్నాడు. ద్రౌపదీ సమాగమం కోసం అనుక్షణం ఆతుర పడుతున్నాడు. కామమోహితచిత్తుడై సైరంధ్రీ వాక్యాలపై పరమవిశ్వాసముంచి అదే ఊహతో నున్న కీచకునికి తెలియకుండానే సూర్యుడు పశ్చిమ సాగరంలో కలిసి పోయాడు

సాయం సంధ్యాకాంతులు చల్లచల్లగా తప్పుకొన్నాయి. ద్రౌపది పాకశాలచేరి భీమసేనుని సమీపించి జరిగిన విషయాన్ని వివరించి ఆ రాత్రి కీచకుని హతమార్చమని చెప్పింది. ఆమె మాటలు విని భీముడు-సుందరీ ఈ కీచక సంహారం అన్యసహాకార రహితంగా నిర్వర్తిస్తాను. హిడింబాసురుని సంహరించిన నాడు ఎంత సంతోషం కల్గిందో ఇప్పుడంత ఆనందంగా ఉంది. ఇంద్రుడు వృత్రాసురుని సంహరించినట్లునే డీ భీము డా కీచకునిఅంత మొందిస్తాడు. ఎవ రడ్డువచ్చినా ఇంక కీచకుడు బ్రతకడు.

కీచకశ్చాప్యలంకృత్య యథాకామముపాగమత్
తాం వేలాం నర్తనాగారం పాంచాలీసంగమాశయా
మన్యమానః స సంకేతమాగారం ప్రావిశచ్చతత్
ప్రవిశ్యచసతద్ వేశ్మ తమసాసంవృతంమహత్
పూర్వాగతం తతస్తత్ర భీమమప్రతిమౌజసం
ఏకాంతావస్థితం చైనమాససాద స దుర్మతిః.
శయానం శయనే తత్ర సూతపుత్రః పరామృశత్
జాజ్వల్యమానం కోపేన కృష్ణాధర్షణజేన హ.
ఉపసంగమ్య చైవైనం కీచకః కామమోహితః
హర్షోన్మథిత చిత్తాత్మా స్మయమానోఽభ్యభాషత.
ప్రాపితం తే మయా విత్తం బహురూపమనంతకం
యత్కృతం ధనరత్నాఢ్యం దాసీశతపరిచ్ఛదం.
రూపలావణ్యయుక్తాభిర్యువతీభిరలంకృతం
గృహంచాంతఃపురం సుభ్రు క్రీడారతివిరాజితం
తత్సర్వం త్వాం సముద్దిశ్య సహసాహ ముపాగతః
అకస్మాన్మాం ప్రశంసంతి సదా గృహగతేః స్త్రియః
సువాసాదర్శనీయశ్చ నాన్యోఽస్తి త్వాదృశః
పుమాన్.

దిష్ట్యా త్వం దర్శనీయోఽథ దిష్ట్యాఽఽత్మానం
ప్రశంససి
ఈదృశస్తుత్వయాస్పర్శఃస్పృష్టపూర్వోనకర్హిచిత్
స్పర్శం వేత్సి విదగ్ధస్త్వం కామధర్మవిచక్షణః
స్త్రీణాం ప్రీతికరోనాన్యస్త్వత్సమః పురుషస్త్విహ.
ఇత్యుక్త్వా తంమహాబాహుర్భీమో భీమపరాక్రమః
సహసోత్పత్య కౌంతేయః ప్రహస్యేదమువాచహః
అద్యత్వాం భగినీపాపం కృష్యమాణంమయాభువి
ద్రక్ష్యతేఽద్రిప్రతీకాశం సింహేనేవ మహాగజం.
నిరాబాధా త్వయి హతే సైరంధ్రీ విచరిష్యతి
సుఖమేవ చరిష్యంతి సైరంధ్ర్యాః పతయస్సదా
తతో జగ్రాహ కేశేషు మాల్యవత్సు మహాబలః
స కేశేషు పరామృష్టో బలేన బలినాం వరః
ఆక్షిప్య కేశాన్ వేగేన బాహ్వోర్జగ్రాహపాండవం
బాహుయుద్ధం తయోరాసీత్ క్రుద్ధయోర్నర
సింహయోః
వసంతే వాసితాహేతోర్బలవద్గజయోరివ
కీచకానాం తు ముఖ్యస్యనరాణాముత్తమస్య చ.

---

అదే రీతిగా దుర్యోధనునికూడా అంతమొదించి రాజ్యలక్ష్మిని చేపడతాను – అన్నాడు. ద్రౌపది వాని ప్రతిజ్ఞను మరొకసారి హెచ్చరించి ఆ కార్య క్రమమంతా రహస్యంగా సాగాలని చెప్పగా భీము డంగీకరించాడు.

చీకటి దట్టమౌతోంది, అర్ధరాత్రి కాబో తోంది. కీచక సంహారార్థం భీముడు నర్తనశాల చేరాడు. కీచకునికోసం నిరీక్షిస్తున్నాడు.

సుగంధమాల్యాభరణాలంకృతుడై కీచకుడు సైరంధ్రీ సమాగమాభిలాషతో నర్తనశాలలో అడుగు పెట్టాడు. అప్పటికే ఆ శాలలోని పర్యంకం మీద ఉన్నాడు భీముడు. కీచకుడు నెమ్మదిగా పర్యంకంచేరి ఆశయ్యమీది వ్యక్తి సైరంధ్రియే నని భ్రమించి – సుందరీ నీ కోసం అమూల్య ధన రాసులు సేకరించాను. దాసదాసీజనం రత్న వస్త్రా లంకారాలు క్రీడావిలాసగృహారామాలు నీ కోసం సిద్ధంచేసి వచ్చాను నా కంటె అందమైనవాడూ, విలాసా లెరిగినవాడూ మరొకడు లేడని నా సేవ కులు అంటూనే ఉన్నారు – అన్నాడు.

నీ అందచందాల విషయమై నా కేమీ సందేహం లేదు. నీ ప్రశంసలోనే ఆ విషయం స్పష్ట మౌతోంది. అయితే ఇంతవరకూ ఇటువంటి స్పర్శ సుఖం నీకు లభించి ఉండదు. ఇప్పుడు లభించే దానిని నువ్వు జన్మలో మరచిపోలేవు. స్త్రీలను

వాలిసుగ్రీవయోర్భ్రాత్రోః పురేవకపిసింహయోః
అన్యోన్యమపి సంరబ్ధౌ పరస్పరజయైషిణౌ
తతః సముద్యమ్య భుజౌ పంచశీర్షావివోరగౌ
నఖదంష్ట్రాభిరన్యోన్యం ఘ్నతః క్రోధ విషోద్ధతౌ
వేగేనాభిహతో భీమః కీచకేన బలీయసా
స్థిరప్రతిజ్ఞః స రణే పదాన్న చలితః పదం
తావన్యోన్యం సమాశ్లిష్య ప్రకర్షంతే పరస్పరం
ఉభావపి ప్రకాశేతే ప్రవృద్ధే వృషభావివ
తయోర్హ్యాసీత్ సుతుములః సంప్రహారః సుదారుణః
నఖదంతాయుధవతోర్వ్యాఘ్రయోరివ దృప్తయోః
అభిపత్యాథ బాహుభ్యాం ప్రత్యగృహ్ణాదమర్షితః
మాతంగ ఇవ మాతంగం ప్రభిన్నకరటాముఖం
స చాప్యేనం తదా భీమః ప్రతిజగ్రాహ వీర్యవాన్
తమాక్షిపత్ కీచకోఽథ బలేన బలినాం వరః
తయోర్భుజవినిష్పేషాదుభయోర్బలినోస్తదా
శబ్దః సమభవద్ ఘోరో వేణుస్ఫోటసమో యుధి.

అథైనమాక్షిప్య బలాద్ గృహమధ్యే వృకోదరః
ధూనయామాస వేగేన వాయుశ్చండ ఇవద్రుమం
భీమేన చ పరామృష్టో దుర్బలో బలినా రణే
ప్రాస్పందత యథాప్రాణం విచకర్ష చ పాండవం
ఈషదాకలితం చాపి క్రోధాద్ ద్రుతపదం స్థితం
కీచకో బలవాన్ భీమం జానుభ్యామాక్షిపద్ భువి
పాతితో భువి భీమస్తు కీచకేన బలీయసా
ఉత్పపాతాథ వేగేన దండపాణిరివాంతకః.
స్పర్ధయా చ బలోన్మత్తౌ తావుభౌ సూతపాండవౌ
నిశీథే పర్యకర్షేతాం బలినౌ నిర్జనే స్థలే
తతస్తద్ భవనం శ్రేష్ఠం ప్రాకంపత ముహుర్ముహుః
బలవచ్చాపి సంక్రుద్ధావన్యోన్యం ప్రతి గర్జతః
తలాభ్యాం స తు భీమేన వక్షస్యాభిహతో బలీ
కీచకో రోషసంతప్తః పదాన్న చలితః పదం
ముహూర్తం తు స తం వేగం సహిత్వా భువి
దుఃసహం

వశపరచుకోవడంలో నీ అంతటి చతురుడు మరొకడు లేడు - అని వికటాట్టహాసం చేస్తూ భీముడు లేచి నిలబడి - ఓరీ పాపీ నీ దేహమెంత విశాలమైనదైనా నా ముందు అల్పమే ఔతుంది సింహం ముందు ఎటువంటి మత్తేభమూ నిలబడనట్లు నువ్వు నా ముందు ఎందుకూ కొరగావు. నిన్ను నేలమీద పెట్టి నలిపినప్పుడు ఆ దేహాన్ని చూసి నీ చెల్లెలు కంతోషిస్తుంది. సైరంధ్రికి బాధ తొలగుతుంది. ఆమె భర్తలు పరమానందం పొందుతారు - అని పలుకుతూనే క్రోధోద్రిక్తుడై కీచకుని జుట్టుపట్టి పడగొట్టబోగా వాడు తప్పించుకున్నాడు. భీముడు తీవ్రవేగంతో వానిని తన భుజమధ్యంలో బంధించాడు. కీచకుడు తన శక్తినంతనూ వినియోగించి బయటపడ్డాడు. మదించిన ఏనుగులవలె వారు ద్వంద్వయుద్ధం ప్రారంభించారు. వాలి సుగ్రీవులవలె బాహుయుద్ధం సాగిస్తున్నారు. ఐదు తలల పాములవలె ఒకరినొకరు ఆక్రమించుకొంటున్నారు. బలిష్ఠులైన ఆ యోధులు భయంకర వ్యాఘ్రాలవలె పోరాడుతున్నారు. మహా వాయువు విశాల వృక్షాన్ని నేల కూల్చినట్లు భీముడు కీచకుని పడగొట్టాడు. నర్తనశాల ఒక్కసారి కంపించింది. కీచకుని బలశౌర్యాలు క్షీణదశకు వస్తున్నాయి. భీముని ధైర్యసాహసాలు ఇనుమడిస్తున్నాయి. ఆలస్యానికి భీముని హృదయం అంగీకరించటం లేదు. అంతలో కీచకుడు భీముని తన మోకాళ్లతో వేధించాడు. భీముని క్రోధం మరింత హెచ్చింది. తీవ్రవేగంతో కీచకునిపై పడ్డాడు. వారి ద్వంద్వయుద్ధంలో నర్తనశాల దద్దరిల్లుతోంది సింహ

బలాదహీయత తదా సూతో భీమబలార్దితః
తం హీయమానం విజ్ఞాయ భీమసేనో మహాబలః
వక్షస్యానీయ వేగేన మమర్దైనం విచేతసం
క్రోధావిష్టో వినిఃశ్వస్య పునశ్చైనం వృకోదరః
జగ్రాహ జయతాం శ్రేష్ఠః కేశేష్వేవ తదాభృశం
గృహీత్వా కీచకం భీమో విరరాజ మహాబలః
శార్దూలః పిశితాకాంక్షీ గృహీత్వేవమహామృగం
తత ఏనం పరిశ్రాంతముపలభ్య వృకోదరః
యోక్త్రయామాస బాహుభ్యాం పశుం రశనయా యథా.
నదంతం చ మహానాదం భిన్నభేరీసమస్వనం
భ్రామయామాస సుచిరం విస్ఫురంత మచేతసం
ప్రగృహ్యతరసాదోర్భ్యాం కంఠం తస్య వృకోదరః
అపీడయత కృష్ణాయా స్తదా కోపోపశాంతయే.
అథతం భగ్నసర్వాంగం వ్యావిద్ధనయనాంబరం
ఆక్రమ్య చ కటీదేశే జానునా కీచకాధమం
అపీడయత బాహుభ్యాం పశుమారమమారయత్
తం విషీదంతమాజ్ఞాయ కీచకం పాండునందనః
భూతలే భ్రామయామాస వాక్యంచేదమువాచహ
అద్యాహమనృణో భూత్వా భ్రాతుర్భార్యాపహారిణం
శాంతింలబ్ధాస్మిపరమాం హత్వాసైరంధ్రికంటకం
ఇత్యేవముక్త్వా పురుషప్రవీర
స్తం కీచకం క్రోధసరాగనేత్రః
ఆస్రస్తవస్త్రాభరణం స్ఫురంత
ముద్భ్రాంతనేత్రం వ్యసుముత్ససర్జ
నిష్పిష్య పాణినా పాణిం సందష్టోష్ఠపుటం బలీ
సమాక్రమ్య చ సంక్రుద్ధో బలేన బలినాం వరః
తస్య పాదౌ చ పాణీ చ శిరో గ్రీవాం చ సర్వశః
కాయే ప్రవేశయామాస పశోరివ పినాకధృక్
తం సమ్మథితసర్వాంగం మాంసపిండోపమం కృతం
కృష్ణాయా దర్శయామాస భీమసేనో మహాబలః
ఉవాచ చ మహాతేజా ద్రౌపదీం యోషితాం వరాం
పశ్యైనమేహి పాంచాలి కాముకోఽయం యథాకృతః

---

గర్జనలుచేస్తూ భీముడు కీచకుని వక్షంమీద పిడుగులవలె గ్రుద్దులు సాగించాడు. కీచకుడు భీముని బలవేగాలను సహించలేక నేలకూలాడు. ఒక్కసారి వాని వక్షంమీద కురికి భీముడు మర్దించాడు. అల్పమృగాన్ని పట్టిన సింహంవలె భీముడు కీచకుని శిరోజాలుపట్టి నలిపివేశాడు. భీమబాహుమధ్యంలో వాడు చైతన్యహీనుడై పడిపోయాడు. భీముడు కీచకుని కంఠాన్ని రెండు చేతులతో నలిపి అంగసంధులు సడలించి శరీరాన్ని ముద్దచేసి నేలమీద కుప్పగా పడవేసాడు.

ద్రౌపదికి కంటకరూపంలో ఉన్న కీచకుడు నేటితో అంతమయాడు. ఇది ఆమెకూ నా సోదరులకూ సంతోషం కలిగించే విషయం అని అనుకొంటూ మరొకసారి కీచకుని దేహాన్ని పైకెత్తి నేలమీద వేసికొట్టి పటపట పండ్లు కొరుకుతూ వాని వక్షస్థలంమీద కూర్చుని కీచకుని బాహువులనూ పాదాలనూ శిరస్సునూ వాని పొట్టచీల్చి అందులో గ్రుచ్చివేసాడు. మాంసపు ముద్దలా తయారైన కీచకుని దేహాన్ని ద్రౌపదికి చూపాలనే ఊహతో అగ్నిని ప్రజ్వలింపజేసి ఆమెను దగ్గరగా పిలిచి-ద్రౌపదీ ఈ దుష్టకాముకుని స్థితి చూచావా సద్గుణ సంపన్నురాలవైన నిన్ను పరిభవించడానికి ప్రయత్నించిన వారికి ఇటువంటిస్థితే కలుగుతుంది-

ఏవముక్త్వా మహారాజ భీమో భీమపరాక్రమః
పాదేన పీడయామాస తస్య కాయం దురాత్మనః
తతోఽగ్నిం తత్ర ప్రజ్వాల్య దర్శయిత్వాతు కీచకం
పాంచాలీం స తదా వీర ఇదం వచనమబ్రవీత్
ప్రార్థయంతి సుకేశాంతే యే త్వాం శీలగుణాన్వితాం
ఏవం తే భీరు వధ్యంతే కీచకః శోభతే యథా.
తత్ కృత్వా దుష్కరం కర్మ కృష్ణాయాః ప్రియ
ముత్తమం
తథా స కీచకం హత్వా గత్వా రోషస్య వై శయం
ఆమంత్ర్య ద్రౌపదీం కృష్ణాం క్షిప్రమాయాన్మ
హానసం
కీచకం ఘాతయిత్వా తు ద్రౌపదీ యోషితాం వరా

ప్రహృష్టా గతసంతాపా సభాపాలానువాచ హ
కీచకోఽయం హతః శేతే గంధర్వైః పతిభిర్మమ
పరస్త్రీకామసమ్మత్త స్తత్రాగచ్ఛత పశ్యత
తచ్ఛ్రుత్వా భాషితం తస్యా నర్తనాగారరక్షిణః
సహసైవ సమాజగ్మురాదాయోల్కాః సహస్రశః
తతో గత్వాథ తద్ వేశ్మ కీచకం వినిపాతితం
గంతాసు దదృశుర్భూమౌ రుధిరేణ సముక్షితం.
పాణిపాదవిహీనం తు దృష్ట్వా చ వ్యథితాఽభవన్
నిరీక్షంతి తతస్సర్వే పరం విస్మయమాగతాః
అమానుషం కృతం కర్మ తం దృష్ట్వా వినిపాతితం
క్వాస్య గ్రీవా క్వ చరణౌ క్వ పాణీ క్వ శిరస్తథా
ఇతి స్మ తం పరీక్షంతే గంధర్వేణ హతం తదా.

## ఇరువదిమూడవ అధ్యాయం

తస్మిన్ కాలే సమాగమ్య సర్వే తత్రాస్య బాంధవాః
రురుదుః కీచకం దృష్ట్వా పరివార్య సమంతతః
సర్వే సంహృష్టరోమాణః సంత్రస్తాః ప్రేక్ష్య కీచకం
తథా సంభిన్నసర్వాంగం కూర్మం స్థల ఇవోద్ధృతం
పోథితం భీమసేనేన తమింద్రేణేవ దానవం
సంస్కారయితుమిచ్ఛంతో బహిర్నేతుం ప్రచక్రముః

అని ఆమెను ఆనందం కలిగించి పాకశాలకు చేరాడు.

సైరంధ్రి తన సదనం చేరి అక్కడ స్త్రీలను పిలిచి – పరస్త్రీ వ్యామోహ కారణంగా కీచకునకు కలిగిన దుస్థితి చూడదలచుకొన్నవారు నర్తనశాలకు వెళ్లవచ్చునని చెప్పింది.

ఆమె మాటలు వింటూనే నర్తనశాలా రక్షకులు పరుగు పరుగున అక్కడకు వెళ్లారు. ప్రాణరహితుడై పడిఉన్న కీచకుని చూసారు. వాని కాళ్లూ చేతులూ ఒకరికీ కనిపించడం లేదు. ఆ ముద్దలా ఉన్న శవాన్ని చూస్తూ–ఇటువంటి కార్యం మానవుడెవ్వడూ చెయ్యలేడు. ఇది గంధర్వులపనే ఐ ఉంటుంది. వీని అవయవం ఒక్కటీ కనిపించటం లేదు. ఇంతటి అమానుషమైన హత్య గంధర్వ కార్యమే – అని నిశ్చయించుకొన్నారు.

## ఇరువదిమూడవ అధ్యాయం

ఉపకీచకులు

నర్తనశాలలో కీచకుడు మరణించిన వార్త విని వాని బంధుమిత్రులందరూ అక్కడకు చేరి విలపించారు. భూమిమీద పడవేసిన తాంబేలులా కీచకుని అవయవాలన్నీ లోపలికి పోయిఉండటం చూసి మరింత దుఃఖించారు. దేవేంద్రుని హస్తాలలో మరణించిన వృత్రాసురునివలెఉన్న కీచకుని శవానికి దహన సంస్కారాలు నిర్వర్తించేందుకు

దదృశు స్తే తతఃకృష్ణాం సూతపుత్రాఃసమాగతాః
అదూరాచ్చానవద్యాంగీం స్తంభమాలింగ్య తిష్ఠతీం.
సమవేతేషు సర్వేషు తామూచు రుపకీచకాః
హన్యతాం శీఘ్రమసతీ యత్కృతే కీచకో హతః
అథవా నైవ హంతవ్యాదహ్యతాం కామినాసహ
మృతస్యాపి ప్రియంకార్యం సూతపుత్రస్య సర్వథా
తతో విరాటమూచు స్తే కీచకోఽస్యాఃకృతే హతః
సహానేనాద్య దహ్యేమ తదనుజ్ఞాతుమర్హసి
పరాక్రమం తు సూతానాం మత్వా రాజాన్వమోదత
సైరంధ్ర్యాఃసూతపుత్రేణ సహదాహంవిశాంపతిః
తాంసమాసాద్యవిత్రస్తాంకృష్ణాంకమలలోచనాం
మోముహ్యమానాం తే తత్ర జగృహుః కీచకా భృశం
తతస్తు తాం సమారోప్య నిబధ్యచ సుమధ్యమాం
జగ్మురుద్యమ్య తే సర్వే శ్మశానాభిముఖా స్తదా
హ్రియమాణా తుసా రాజన్ సూతపుత్త్రైరనిందితా
ప్రాక్రోశన్నాథమిచ్ఛంతీ కృష్ణా నాథవతీ సతీ
జయా జయంతో విజయోజయత్సేనోజయద్బలః
తే మే వాచంవిజానంతు సూతపుత్రానయంతిమాం
యేషాం జ్యాతలనిర్ఘోషో విస్ఫూర్జితమివాశనేః
వ్యశ్రూయత మహాయుద్ధే భీమఘోష స్తరస్వినాం
రథఘోషశ్చ బలవాన్ గంధర్వాణాంతరస్వినాం
తే మే వాచంవిజానంతు సూతపుత్రా నయంతిమాం
తస్యాస్తాః కృపణా వాచః కృష్ణాయాః పరిదేవితం
శ్రుత్వైవాభ్యాపతద్భీమః శయనాదవిచారయన్
అహం శృణోమి తే వాచం త్వయా సైరంధ్రి భాషితాం
తస్మాత్ తే సూతపుత్రేభ్యో భయంభీరునవిద్యతే
ఇత్యుక్త్వా స మహాబాహు ర్విజజంభేజిఘాంసయా
తతః స వ్యాయతం కృత్వా వేషం విపరివర్త్యచ
అద్వారేణాభ్యవస్కంద్య నిర్జగామ బహిస్తదా
స భీమసేనః ప్రాకారాదారుహ్య తరసా ద్రుమం
శ్మశానాభిముఖఃప్రాయాద్ యత్రతేకీచకాగతాః
సలంఘయిత్వాప్రాకారంనిఃసృత్యచపురోత్తమాత్
జవేన పతితో భీమః సూతానామగ్రత స్తదా
చితాసమీపే గత్వా స తత్రాపశ్యద్ వనస్పతిం

---

వారు సన్నద్ధులయారు. శవాన్ని స్మశానానికి తీసుకుపోవడానికి సిద్ధంగా ఉన్న సమయంలో అక్కడే ఒక్క స్తంభం చాటున ఉన్న ద్రౌపదిపై ఉపకీచకులదృష్టి పడింది. ఆమెను చూస్తూనే వారు– ఈ సైరంధ్రివల్లనే కీచక సేనాపతి మరణించాడు. కనక ఈ దుష్టురాలిని ఇప్పుడే సంహరించి ఈ శవంతోనే దహించాలి. అప్పటికి కీచకుని మనస్సు శాంతిస్తుంది. ఆయనకు శాంతి కలిగించడం కంటె మనం చెయ్యవలసిన పని లేదు. అని నిశ్చయించుకొని విరటునిచేరి తమ నిర్ణయం తెలిపి అనుజ్ఞ కోరారు.

విరటుడు కీచకుని పరాక్రమాదులను తలచుకొని కొంతసేపు చింతించి సైరంధ్రినికూడా కీచకుని శవంతో దహించడానికి అనుమతి నిచ్చాడు. మూర్ఛపోయిన ద్రౌపదిని కీచక శవంతో బంధించి ఉపకీచకులు పరేతభూమికి బయలుదేరారు. ద్రౌపది విలవిల విలపిస్తూ దీనంగాఅరుస్తూ – జయ జయంత విజయ జయత్సేన జయద్బలులారా నా దీనస్థితి మీకు తెలియటం లేదా? నా ఆర్తనాదం వినండి. ఈ సూతపుత్రులు నన్ను స్మశానానికి తీసికొనిపోతున్నారు. మహారథికులు శస్త్రాస్త్రవిదులు ఐన నా భర్తలకు ఈ ఆర్తనాదం వినిపించి తీరుతుంది–

తాళమాత్రం మహాస్కంధం మూర్ధశుష్కం విశాంపతే
తం నాగవదుపక్రమ్య బాహుభ్యాం పరిరభ్య చ
స్కంధమారోపయామాస దశవ్యామంపరంతపః
స తం వృక్షం దశవ్యామం సస్కంధవిటపం బలీ
ప్రగృహ్యాభ్యద్రవత్ సూతాన్ దండపాణిరివాంతకః
ఊరువేగేన తస్యాథ న్యగ్రోధాశ్వత్థకింశుకాః
భూమౌ నిపతితా వృక్షాః సంఘశస్తత్ర శేరతే
తం సింహమివసంక్రుద్ధందృష్ట్వా గంధర్వమాగతం
విత్రేసుః సర్వశః సూతా విషాదభయకంపితాః
గంధర్వో బలవానేతి క్రుద్ధ ఉద్యమ్య పాదపం
సైరంధ్రీముచ్యతాంశీఘ్రంయతోనోభయమాగతం
తే తు దృష్ట్వా తదాఽఽవిద్ధం భీమసేనేన పాదపం
విముచ్య ద్రౌపదీం తత్ర ప్రాద్రవన్నగరం ప్రతి.
ద్రవతస్తాంస్తు సంప్రేక్ష్య స వజ్రీ దానవానివ
శతంపంచాధికం భీమః ప్రాహిణోద్ యమసాదనం
వృక్షేణైతేన రాజేంద్ర ప్రభంజనసుతో బలీ
తత ఆశ్వాసయత్ కృష్ణాం స విముచ్య విశాంపతే
ఉవాచచ మహాబాహుః పాంచాలీంతత్రద్రౌపదీం
అశ్రుపూర్ణముఖీం దీనాం దుర్ధర్షః స వృకోదరః
ఏవం తే భీరువధ్యంతే యేత్వాంక్లిశ్యంత్యనాగసం
ప్రైహి త్వం నగరం కృష్ణే న భయంవిద్యతేతవ
అన్యేనాహం గమిష్యామి విరాటస్య మహానసం
పంచాధికం శతం తచ్చ నిహతం తేన భారత
మహావనమివచ్ఛిన్నం శిశ్యే విగళితద్రుమం.
ఏవం తే నిహతా రాజన్ శతం పంచ చ కీచకాః
స చ సేనాపతిః పూర్వమిత్యేతత్ సూతషట్‌శతం
తద్దృష్ట్వామహదాశ్చర్యంనరానార్యశ్చసంగతా
విస్మయం పరమం గత్వా నోచుః కించన భారత.

అని పరిపరివిధాల చింతిస్తూంటే అది భీముని చెవిని పడింది.

ఈ సూతులవల్ల నీకేమీ భయంలేదు – అని గర్జిస్తూ భీముడు వికృతవేషధారియై పాకశాలను చుట్టిఉన్న గోడ దూకి ఉపకీచక సంహారార్థం అలోచిస్తూ సమీపంలో ఉన్న ఒక చెట్టు ఎక్కాడు. వారు కీచకుని శవంతో ద్రౌపదినికూడ ప్రేత భూమికి తీసుకుపోతున్నట్లు గ్రహించి వారిని వెంబడించి, వెంబడించి వారి నతిక్రమించి స్మశానంచేరి ఒక ఎండుచెట్టును పెకలించి గదాధరుడైన యమధర్మరాజువలె నిలబడ్డాడు. అల్లంత దూరంలోకి ఉపకీచకులు వచ్చారు. వారిని చూస్తూనే భీముడు తీవ్రవేగంతో లంఘించాడు. ఆ వేగానికి దారిలోని చెట్లన్నీ నేల కూలాయి. సింహసమక్రోధంతో గంధర్వరూపంతో తమమీదికివచ్చే భయంకరాకారాన్ని చూసి ఉపకీచకులు భయభ్రాంతులయ్యారు. భీముడు వారినందరినీమర్దించి చేతిలోని వృక్షంతో ఆ నూటఐదుగురినీ యమసదనానికి అతిథులుగా పంపాడు. సంతోషంతో ద్రౌపదిని సమీపించి ఆమె కట్లువిప్పి కొంతసేపు ఊరడించి నిన్ను పరాభవించడానికి ప్రయత్నించిన వారందరికీ ఇటువంటి గతులే గలుగుతాయి. నీకు యిక భయం లేదు వెళ్లు. నేను వేరొకదారిని పాకశాల ప్రవేశిస్తాను – అని ఆమెను సాగనంపాడు. వేరు దారిని తను పాకశాలలో ప్రవేశించాడు.

భీమునిచే నిహతులైన కీచకుడు కీచకసోదరులూ వ్రేళ్లు తెగిపడిన చెట్లవలె ఆ స్మశానంలోపడి ఉన్నారు. విరాటనగరప్రజలందరూ విస్మయచకిత దృక్కులతో ఆ భీభత్సదృశ్యాన్ని తిలకిస్తున్నారు.

## ఇరువదినాల్గవ అధ్యాయం

తే దృష్ట్వా నిహతాన్ సూతాన్ రాజ్ఞే గత్వా న్యవేదయన్
గంధర్వైర్నిహతా రాజన్ సూతపుత్రా మహాబలాః
యథా వజ్రేణ వై దీర్ణం పర్వతస్య మహచ్ఛిరః
వ్యతికీర్ణాః ప్రదృశ్యంతే తథా సూతా మహీతలే
సైరంధ్రీ చ విముక్తాసౌ పునరాయాతి తే గృహం
సర్వం సంశయితం రాజన్ నగరం తే భవిష్యతి.
యథారూపా చ సైరంధ్రీ గంధర్వాశ్చ మహాబలాః
పుంసామిష్టశ్చ విషయో మైథునాయ న సంశయః
యథా సైరంధ్రి దోషేణ న తే రాజన్నిదం పురం
వినాశమేతి వై క్షిప్రం తథా నీతిర్విధీయతాం
తేషాం తద్వచనం శ్రుత్వా విరాటో వాహినీపతిః
అబ్రవీత్ క్రియతామేషాం సూతానాం పరమక్రియా
ఏకస్మిన్నేవ తే సర్వే సుసమిద్ధే హుతాశనే
దహ్యంతాం కీచకాః శీఘ్రం రత్నైర్గంధైశ్చ సర్వశః
సుదేష్ణామబ్రవీద్ రాజా మహిషీం జాతసాధ్వసః
సైరంధ్రీమాగతాం బ్రూయా మమైవ వచనాదిదం
గచ్ఛ సైరంధ్రి భద్రం తే యథాకామం వరాననే
బిభేతి రాజా సుశ్రోణి గంధర్వేభ్యః పరాభవాత్.
న హి త్వాముత్సహే వక్తుం స్వయం గంధర్వరక్షితాం
స్త్రియాస్త్వదోషస్తాం వక్తుమతస్త్వాం ప్రబ్రవీమ్యహం.
అథ ముక్తా భయాత్ కృష్ణా సూతపుత్రాన్ నిరస్య చ
మోక్షితా భీమసేనేన జగామ నగరం ప్రతి.
త్రాసితేవ మృగీ బాలా శార్దూలేన మనస్వినీ
గాత్రాణి వాససీ చైవ ప్రక్షాల్య సలిలేన సా

## ఇరువదినాల్గవ అధ్యాయం

కీచకుల శవాలను కన్నులార చూచిన విరాటనగరవాసు లందరూ మహారాజును సమీపించి తాము చూసిన విషయాలు ఇలా వివరించారు–మహారాజా! పర్వత శిఖరాలు వజ్రాయుధాఘాతంతో విరిగి పడిపోయినట్లు సూతపుత్రులు స్మశానంలో పడిఉన్నారు. సైరంధ్రి బంధనముక్తయై అంతఃపురానికి వస్తోంది. ఈ ప్రమాదాలన్నీ ఆమెవల్లనే కలుగుతున్నాయి. ఆమె ఎంతటి సౌందర్యవతియో ఆమె భర్తలు అంతటి పరాక్రమ సంపన్నులు. ఆమె ఇక్కడ ఉండడంవల్ల మీకు కూడా విపత్తులు ప్రాప్తిస్తాయేమోనని మాకు భయంగా ఉంది. పురుషుడు విషయవాంఛాపరుడై సౌందర్యవతియైన స్త్రీని కాంక్షించడం లోకసహజం. అందులో సైరంధ్రి అతిలోక లావణ్యవతి. ఆమెవల్ల ఈ రాజ్యానికి మహావిపత్తు వచ్చే అనుమానం మాకు కలుగుతోంది. అందుచేత మనకు ఏ విధమైన హానీ కలుగకుండానే ఆమెను ఈ నగరమునుండి పంపే ఏర్పాటు చూడండి – అని వారు నివేదించారు.

మరణించిన సూతపుత్రులందరికీ రాజమర్యాదలతో అంత్యక్రియలు జరిపించమని ఆజ్ఞాపించి విరటుడు జరిగిన సంఘటనలనన్నీ తలచుకొని భయపడుతూ అంతఃపురంచేరి–దేవీ సైరంధ్రి ఇక్కడకు వచ్చినట్లైతే ఆమెను ఇక్కడ ఉండవద్దనీ ఆమె ఇష్టం వచ్చినచోటుకు వెళ్లవచ్చుననీ ఆమె భర్తలైన గంధర్వుల ప్రతాప పరాక్రమాలకు నగర

తాం దృష్ట్వా పురుషా రాజన్ ప్రాద్రవంత దిశో దశ
గంధర్వాణాం భయత్రస్తాః కేచిద్ దృష్ట్వా
న్యమీలయన్.
తతో మహానసద్వారి భీమసేనమవస్థితం
దదర్శ రాజన్ పాంచాలీ యథామత్తం మహాద్విపం
తం విస్మయంతీ శనకైః సంజ్ఞాభిరిదమబ్రవీత్
గంధర్వరాజాయ నమో యేనాస్మి పరిమోచితా
యే పురా విచరంతీహ పురుషా వశవర్తినః
తస్యాస్తే వచనం శ్రుత్వా హ్యన్యాశా విహరంత్వతః
తతః సా నర్తనాగారే ధనంజయముపశ్యత
రాజ్ఞః కన్యా విరాటస్య నర్తయానం మహాభుజం
తతస్తా నర్తనాగారాద్ వినిష్క్రమ్య సహార్జునాః
కన్యా దదృశురాయాంతీం క్లిష్టాం కృష్ణామనాగసం
దిష్ట్యా సైరంధ్రి ముక్తాసి దిష్ట్యాసి పునరాగతా
దిష్ట్యా వినిహతాః సూతా యే త్వాం క్లిశ్యంత్య
నాగసం
కథం సైరంధ్రి ముక్తాసి కథం పాపాశ్చ తే హతాః
ఇచ్ఛామి వై తవ శ్రోతుం సర్వమేవ యథాతథం
బృహన్నలే కిం ను తవ సైరంధ్ర్యా కార్యమద్య వై
యా త్వం వససి కళ్యాణి సదా కన్యాపురే సుఖం

---

వాసులూ చక్రవర్తీ భయపడుచున్నారని గంధర్వ రక్షితయైన ఆమెను ఏ భీతీ ఉండదనీ సర్వసుఖాలూ లభిస్తాయనీ చెప్పు. నేను పురుషుణ్ణి కావడంవల్ల ఆమెముందు నిలబడి ఈ విషయం చెప్పకూడదు. ఈ విషయం వివరించి నా మాటలు నీ ముఖతః వినిపించమన్నానని చెప్పు. అందువల్ల ఏ దోషమూ నన్నంటదు. మన రాజ్యానికి ఆమెవల్ల ఏదో ఒక ఉపద్రవం రావచ్చుననే భయంకూడా మన కున్నదని గట్టిగా చెప్పు - అన్నాడు.

ద్రౌపది భీమునివల్ల బంధన విముక్తయై భయరహితయై పరిశుభ్రస్నాతయై వస్త్రాలు తడియార్చుకొని భీతహారిణంవలె నగరంలో ప్రవేశించింది. ఆమెను చూసేసరికి పౌరులందరికీ గంధర్వ భయం వ్యాపించింది. వారు హాహాకారాలు చేస్తూ ఆమెను సమీపించకుండా పరుగులెత్తడం ప్రారంభించారు. కొందరు ఆమెస్థితిని చూసి జాలి పడ్డారు. ద్రౌపది మహానసశాలవద్ద భీమునకు కృతజ్ఞత తెలుపుతూ - నాకు బంధవిముక్తి కలిగించిన గంధర్వపతికి అభివాదాలు - అని గుప్తంగా పలికి నమస్కరించి నిలిచింది.

దేవి నీ అభీష్టార్థం నీ ఆజ్ఞానుసారం చరించాను. ఎప్పుడూ నీ ఆజ్ఞా పాలనార్థం సిద్ధంగా ఉంటాను. నువ్వు యథేచ్ఛగా విహరించవచ్చు - అన్నాడు.

ద్రౌపది అర్జునుని కలిసే సంకల్పముతో నర్తనశాల చేరింది. ఆమె ఆగమన వార్తను అభ్యంతర మందిరంలోకి తెలియచెయ్యగా నర్తనశాలలో రాజకన్యలందరూ బృహన్నలా సహితులై ద్వారం దగ్గరికి వచ్చి ఆమెకు కలిగిన క్లేశాలను చింతిస్తూ - సైరంధ్రీ నీకు కలిగిన కష్టాలనుండి విముక్తి పొందావు. ఇప్పుడు మా కెంతో సంతోషంగా ఉంది నువు సుఖంగా తిరిగి రావటం మా కెంతో ఆనందం కలిగిస్తోంది. కీచకుడు పరివార సహితంగా మరణించడంవల్ల ఈ విరాట నగర నారీజనానికి భీతి నశించింది. నీవు ఇప్పుడు సంతోషంగా సుఖంగా చరించగలవు - అని ఆమెను అభినందించారు.

సైరంధ్రీ-పాపాత్ములైన కీచకుని హస్తాలనుండి నువ్వెలా రక్షింపబడ్డావో వారెలా మరణించారో ఈ విషయాలన్నీ నీముఖతః వినాలని నాకు కుతూ

నహి దుఃఖంసమాప్నోషి సైరంధ్రీయదుపాశ్నుతే
తేన మాం దుఃఖితామేవం పృచ్ఛసే ప్రహసన్నివ
బృహన్నలాపికళ్యాణి దుఃఖ మాప్నోత్యనుత్తమం
తిర్యగ్యోనిగతా బాలే న చైన మనబుధ్యసే.
త్వయా సహోషితా చాస్మి త్వం చ సర్వైః సహోషితా
క్లిశ్యంత్యాం త్వయి సుశ్రోణి కో ను దుఃఖం న చింతయేత్.
న తు కేనచిదత్యంతం కస్యచిద్ధృదయం క్వచిత్
వేదితుం శక్యతే నూనం తేన మాం నావబుధ్యసే

తతః సహైవ కన్యాభిర్ద్రౌపదీ రాజవేశ్మ తత్
ప్రవివేశ సుదేష్ణాయాః సమీపముపగామినీ.
తామబ్రవీత్ రాజపుత్రీ విరాటవచనాదిదం
సైరంధ్రిగమ్యతాం శీఘ్రం యత్ర కామయసేగతిం
రాజా బిభేతి తే భద్రే గంధర్వేభ్యః పరాభవాత్
త్వం చాపి తరుణీ సుభ్రు రూపేణాప్రతిమా భువి
పుంసామిష్టశ్చ విషయో గంధర్వాశ్చాతికోపనాః
త్రయోదశాహమాత్రం మే రాజా క్షమ్యాస్తు భామిని
కృతకృత్యా భవిష్యంతి గంధర్వాస్తే న సంశయః

---

హాలంగా ఉంది - అని బృహన్నల వేడగా సైరంధ్రి - బృహన్నలా - కన్యాంతఃపురంలో సుఖంగా జీవించే నీకు సైరంధ్రితో పనేమిటి. ఈ సైరంధ్రి దుఃఖవార్తను విని, క్లేశాలను ఆమె ముఖతః ఆలకించి ఆనందించాలనకొంటున్నావా. నా క్లేశాలలో పాలు పంచుకోలేవు. నాదుఃఖాలను దూరము చేయలేవు. పరిహసించి పరమానందం పొందాలనుకొంటున్నావా-అని ఎదురు ప్రశ్నించే సరికి బృహన్నల ఇలా సమాధానమిస్తున్నాడు.

కళ్యాణీ - పసుజన్మతో తుల్యమైన ఈనపుంసక రూపంతో నేను పడే ఆవేదన నీకేం తెలుసు. మన మందరమూ ఒక్కచోట ఉంటూన్నప్పుడు నీకు కలిగే బాధ మాకు విచారాన్ని కలిగించదని నువ్వెందుకు అనుకోవాలి. పరుల ఇంగితాన్ని గ్రహించే శక్తి ఏవ్యక్తికీ ఉండదనే విషయం నీ మూలంగా నాకు బోధపడుతోంది నేను పడే బాధ నువ్వు గ్రహించలేనందుకు మరింత చింతిస్తున్నాను - అని దీనంగా పలకగా, ద్రౌపది - అక్కడి రాచబిడ్డలను వెంటబెట్టుకొని సుదేష్ణా దేవి నివసించే అంతఃపురానికి వెళ్ళి ఆమెకు దగ్గరగా నిలబడింది. వచ్చిన సైరంధ్రిని చూస్తూ విరటుని మాటలు స్మరించి సుదేష్ణ - సైరంధ్రీ నీ గంధర్వపతుల సాహస పరాక్రమాలకు మహారాజు భయపడుతున్నాడు. వారివల్ల ఎప్పుడు ఏ ఆపద వస్తుందో మాకు తెలియడం లేదు. నిన్ను చూస్తే యౌవనం తొణికిలాడుతోంది. ఈ యౌవన వసంతానికి రూపలావణ్యాలు అతిశయ మాధుర్యం కలిగిస్తున్నాయి. నిన్నుచూసిన పురుషుని కన్ను చెదరకుండా ఉండదు. నీ మీద మోహదృష్టి ప్రసరిస్తే నీ గంధర్వపతులు ఆగ్రహోదగ్రులు కాకుండా ఉండరు. అందువల్లవచ్చే ఉపద్రవాలు మా ఊహాకందవు. కనక తక్షణం నీయిష్టం వచ్చినచోటికి వెళ్ళమని మా మహారాజు ఆజ్ఞ - అని పలికింది.

మహారాణి మాటలు విని సైరంధ్రి క్షణ మాలోచించి - మహారాణీ - నాకు పదమూడు రోజులు గడు వివ్వండి. ఈలోగా నాగంధర్వపతుల కార్యాలు నెరవేరుతాయి. అప్పుడు వారు వచ్చి నన్ను తీసికొనివెడతారు. వారు ప్రసన్నులైమిమ్ము మీబంధువులను సుఖసంపదలతో విరాజిల్లచేస్తారు.

తతో మాముపనేష్యంతి కరిష్యంతి చ తే ప్రియం
ధ్రువంచ శ్రేయసా రాజా యోక్ష్యతే సహ బాంధవైః
రాజా కృతోపకారాశ్చ కృతజ్ఞాశ్చ సదా శుభే
సాధవశ్చ బలోత్సిక్తాః కృతప్రతికృతేప్సవః
అర్థినీ ప్రబ్రవీమ్యేషా యద్వా తద్ వేతి చింతయ
భరస్వ తదహర్మాత్రం తతః శ్రేయో భవిష్యతి
తస్యాస్తద్వచనం శ్రుత్వా కైకేయీ దుఃఖ మోహితా
ఉవాచ ద్రౌపదీమార్తా భ్రాతృవ్యసనకర్శితా
వసభద్రే యథేష్టం త్వం త్వామహం శరణంగతా
త్రాయస్వ మమ భర్తారం పుత్రాంశ్చైవ విశేషతః

## ఇరువది అయిదవ అధ్యాయం

కీచకే తు హతే రాజా విరాటః పరవీరహా
శోకమాహారయత్ తీవ్రం సామాత్యః సపురోహితః
కీచకస్య తు ఘాతేన సానుజస్య విశాంపతే
అత్యాహితం చింతయిత్వా వ్యస్మయంత పృథగ్జనాః
తస్మిన్ పురే జనపదే సంజల్పోఽభూచ్చ సంఘశః
శౌర్యాద్ధి వల్లభో రాజ్ఞో మహాసత్త్వః స కీచకః.
ఆసీత్ ప్రహర్తా సైన్యానాం దారామర్శీ చ దుర్మతిః
స హతః ఖలు పాపాత్మా గంధర్వైర్దుష్టపూరుషః.
ఇత్యజల్పన్ మహారాజ పరానీకవినాశనం
దేశే దేశే మనుష్యాశ్చ కీచకం దుష్ప్రధర్షణం.
అథ వై ధార్తరాష్ట్రేణ ప్రయుక్తా యే బహిశ్చరాః
మృగయిత్వా బహూన్ గ్రామాన్ రాష్ట్రాణి నగరాణి చ.

---

నాకు ఆశ్రయమిచ్చి రక్షించినందుకు ప్రత్యుపకారం చేసి తీరుతారు. వారు బలపరాక్రమ సంపన్నులే కాదు, సాధుజనాలుకూడా. ఉపకారాన్ని విస్మరించే తత్వం వారికి లేదు. ప్రత్యుపకారం చేయకుండా ఉండరు. ఒక ప్రయోజనాన్ని అపేక్షించి నేనిక్కడ ఉన్నాను. ఇన్నిరోజులవలెనే ఈ కొద్దిపాటి గడువుకాలం నన్ను భరించండి. మీకు సుఖం కలుగుతుంది – అని అర్థించింది.

భ్రాతృమరణ దుఃఖంతో ఉన్న సుదేష్ణ సైరంధ్రిమాటలు విని – నువ్వెంతకాలం ఉండదలచుకొంటే అంతకాలం నువ్విక్కడ ఉండు. నీవల్ల నా భర్తకు బిడ్డలకు ఏ అపాయం రాకుండా మాత్రం చూడు. ఈ అభయమిచ్చినట్లైతే నువ్వు ఇక్కడ ఉండవచ్చును – అంది.

## ఇరువది అయిదవ అధ్యాయం

కీచకుడు ఉపకీచకులు మరణించడం విరట నగరవాసులకూ, మహారాజుకూ ఆశ్చర్యాన్నీ భయాన్నీ కూడ కలిగించాయి. వారిలోవారు అనేకవిధాలుగా వితర్కించుకొన్నారు. కీచకుడు అద్భుత సాహస పరాక్రమోపేతుడు కావటంవల్ల విరటుడు వానిని అధికంగా ప్రేమించేవాడనీ దానికి ప్రతిఫలంగా కీచకుడు సర్వశత్రుసంహారం చేసేవాడనీ కొందరు వానిగుణగణాలను కీర్తించారు. పరస్త్రీ వ్యామోహమే ఆ పాపిని ఆలా చేసిందని మరికొందరు వాదించారు. కీచక మరణ వార్త దేశదేశాలలో వాడవాడలలో వ్యాపించింది. ఇది ఇలా ఉండగా –

సంవిధాయ యథాదృష్టం యథాదేశప్రదర్శనం
కృతకృత్యా న్యవర్తంత తే చరా నగరం ప్రతి.
తత్ర దృష్ట్వా తు రాజానం కౌరవ్యం ధృతరాష్ట్రజం
ద్రోణకర్ణకృపైః సార్ధం భీష్మేణ చ మహాత్మనా.
సంగతం భ్రాతృభిశ్చాపి త్రిగర్తైశ్చ మహారథైః
దుర్యోధనం సభామధ్యే ఆసీనమిదమబ్రువన్.
కృతోఽస్మాభిః పరో యత్నస్తేషామన్వేషణే సదా
పాండవానాం మనుష్యేంద్ర తస్మిన్ మహతి కాననే
నిర్జనే మృగసంకీర్ణే నానాద్రుమలతాకులే
లతాప్రతానబహులే నానాగుల్మసమావృతే.
న చ విద్మో గతా యేన పార్థాః సుదృఢవిక్రమాః
మార్గమాణాః పదన్యాసం తేషు తేషు తథా తథా
గిరికూటేషు తుంగేషు నానాజనపదేషు చ
జనాకీర్ణేషు దేశేషు ఖర్వటేషు పురేషు చ.
నరేంద్ర బహుశోఽన్విష్టా నైవ విద్మశ్చ పాండవాన్
అత్యంతం వా వినష్టాస్తే భద్రం తుభ్యం నరర్షభ.
వర్త్మన్యన్వేష్యమాణా వై రథినాం రథిసత్తమ
న హి విద్మో గతిం తేషాం వాసం హి నరసత్తమ.
కించిత్కాలే మనుష్యేంద్ర సూతానామనుగా వయం
మృగయిత్వా యథాన్యాయం వేదితార్థాః స్మ తత్త్వతః.
ప్రాప్తా ద్వారవతీం సూతా వినా పార్థైః పరంతప
న తత్ర కృష్ణా రాజేంద్ర పాండవాశ్చ మహావ్రతాః
సర్వథా విప్రణష్టాస్తే నమస్తే భరతర్షభ
నహి విద్మో గతిం తేషాం వాసం నాపి మహాత్మనాం
పాండవానాం ప్రవృత్తిం చ విద్మః కర్మాపి వా కృతం
స నః శాధి మనుష్యేంద్ర అత ఊర్ధ్వం విశాంపతే.
అన్వేషణే పాండవానాం భూయః కిం కరవామ హే
ఇమాం చ నః ప్రియామీర వాచం భద్రవతీం శృణు
యేన త్రిగర్తా నిహతా బలేన మహతా నృప
సూతేన రాజ్ఞో మత్స్యస్య కీచకేన బలీయసా.
స హతః పతితః శేతే గంధర్వైర్నిశి భారత
అదృశ్యమానైర్దుష్టాత్మా భ్రాతృభిః సహ సోదరైః
శ్యాలో రాజ్ఞో విరాటస్య సేనాపతిరుదారధీః

---

పాండవులు ఎక్కడ ఉంటున్నారో తెలుసుకోడానికి బయలుదేరిన గూఢచారులు రాష్ట్ర నగర గ్రామాలు వెదికివెదికి విఫలప్రయత్నులై హస్తినాపురం చేరారు. భీష్మ, ద్రోణ, శకుని, కర్ణాదులు పరివేష్టించిఉన్న మహాసభలో సుఖాసనాసీనుడైన దుర్యోధనుని సమీపించి – మహారాజా పాండవుల వాసస్థానం తెలుసుకోడానికి మేమెన్నో ప్రయత్నాలు చేసాం. క్రూరఘాతుకమృగాలతో నిండిన అరణ్యాలలో అన్నిమూలలూ వెతికాము. వారి కాలిజాడలు లేవు. అడవి విడిచి వారెటువెళ్లారో తెలియలేదు. పర్వతగుహలు సోధించాము. పట్టణాలు పరిశీలించాము. నగరాలు అన్వేషించాము. రాష్ట్రాలన్నీ కలయవెతికాము. వారి జాడలు, రథపథాలు పదచిహ్నాలు చూసుకుంటూ పోయాము. వారి సారథులను వెంబడించి చూసాము. మా ప్రయత్నాలు విఫలమయాయి. ఇంద్రసేనాదులు ద్వారకలో ఉన్నారు. అక్కడ ద్రౌపదీ పాండవులూ ఉన్నారో లేదో తెలియదు. మా ఊహ ప్రకారం వారీ పాటికి మరణించి ఉండాలి. వారిని గురించిన ఆచూకీ ఈషన్మాత్రమూ మాకు లభించలేదు. ఇపుడిక ఏం చెయ్యాలో చెప్పండి.

మా యాత్రలో ఒక విశేషం మాత్రము మాకు తెలిసింది. విన్నవిస్తూన్నాం వినండి మత్స్యదేశానికి ప్రభువైన విరటరాజుకు కీచకుడు బావమరిది. కీచకుడు బలపరాక్రమ సంపన్నుడు. వాడే ఆ దేశానికి సర్వసైన్యాధిపతి. తన సేనలతోపోయి

సుదేష్ణాయాః సవై జ్యేష్ఠః శూరో వీరో గతవ్యథః
ఉత్సాహవాన్ మహావీర్యో నీతిమాన్ బలవానపి
యుద్ధజ్ఞో రిపువీరఘ్నః సింహతుల్యపరాక్రమః.
ప్రజారక్షణదక్షశ్చ శత్రునిగ్రహణశక్తిమాన్
విజితారిర్మహాయుద్ధే ప్రచండో మానవత్ పరః.
నరనారీమనోహ్లాదీ ధీరో వాగ్మీ రణప్రియః

సహతో నిశి గంధర్వైః స్త్రీనిమిత్తం నరాధిప
అమృష్యమాణో దుష్టాత్మా నిశీథే సహ సోదరైః
సుహృదశ్చాస్య నిహతా యోధాశ్చ
ప్రవరా హతాః
ప్రియమేతదుపశ్రుత్య శత్రూణాం చ పరాభవం
కృతకృత్యశ్చ కౌరవ్య విధత్స్వ యదనంతరం.

## ఇరువదిఆరవ అధ్యాయం

తతో దుర్యోధనో రాజా జ్ఞాత్వా తేషాం వచస్తథా
చిరమంతర్మనా భూత్వా ప్రత్యువాచ సభాసదః.
సుదుఃఖం ఖలు కార్యాణాం గతిర్విజ్ఞాతు మంతతః
తస్మాత్ సర్వే నిరీక్షధ్వం క్వను తే పాండవా గతాః
అల్పావశిష్టం కాలస్య గతభూయిష్ఠ మంతతః
తేషామజ్ఞాతచర్యాయామస్మిన్ వర్షే త్రయోదశే

అస్య వర్షస్య శేషం చేద్ వ్యతీయురిహ పాండవాః
నివృత్తసమయాస్తే హి సత్యవ్రతపరాయణాః.
క్షరంతి ఇవ నాగేంద్రాః సర్వే హ్యాశీవిషోపమాః
దుఃఖాభవేయుః సంరబ్ధాః కౌరవాన్ ప్రతితే ధ్రువం.
సర్వే కాలస్య వేత్తారః కృచ్ఛ్రరూపధరాః స్థితాః
ప్రవిశేయుర్జితక్రోధాస్తావదేవ పునర్వనం.

---

త్రిగర్తదేశాన్ని జయించి వశపరచుకొన్నవీరుడు. అటువంటి మహావీరుడు సోదర సహితుడై గుప్త రూపధరులైన గంధర్వుల చేతులలో అర్ధరాత్రి దుర్మరణం పొందాడని విన్నాము. యుద్ధతంత్ర విశారదుడూ ప్రజారక్షణదక్షుడూ తీవ్రక్రోధుడూ నారీజనప్రియుడూ ఐన మహావీరుడు ఒకానొక స్త్రీ మీద వ్యామోహం కారణంగా అటువంటి అవస్థకు లోనయాడు. వాని మిత్రులూ సోదరులూ కూడా వానివలెనే నిహతులయారు. ఈవిషయం వల్ల ఏమైనా ప్రయోజనం ఉంటుందేమో ఆలోచించండి - అన్నారు.

## ఇరువదిఆరవ అధ్యాయం

దుర్యోధనుడు గూఢచారులవార్త విని ఒక క్షణమాలోచించి సభాసదులవేపు తిరిగి - ఏదైనా ఒక పని తలపెట్టినపుడు అది ఎటువంటి పరిణామమిస్తుందో మనం ముందుగా నిర్ణయించలేము. పాండవులు ఎక్కడకు వెళ్ళిఉంటారో మీరందరూ బాగాఆలోచించి చెప్పండి. వారి వనవాసం పూర్తి అయింది. అజ్ఞాతవాస సంవత్సరం కూడా కొద్ది రోజులలో పూర్తి కాబోతోంది. అదిపూర్తి అయితే వారి ప్రతిజ్ఞ పరిసమాప్తమైనట్లే.

ఘోరవిషాలు కక్కే కుపిత భుజంగాలవలె మత్తేభాలవలె వారు తీవ్రవేగంతో వచ్చి కౌరవులకు క్లేశాలు కలిగించి తీరుతారు. ఆ సమయం కోసమే వారునిరీక్షిస్తున్నారు. ఎక్కడ ఏవేషంతో ఉంటున్నారో మనం గుర్తుపట్టడం చాలా అవసరం. ఇప్పుడు వారిని గుర్తుపట్టినా మళ్ళీ పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం వారు చెయ్యవలసి

తస్మాత్ క్షిప్రం బుభూషధ్వం యథా తేఽత్యంత మవ్యయం
రాజ్యం నిర్ద్వంద్వమవ్యగ్రం నిఃసపత్నం చిరం భవేత్.
అథాబ్రవీత్ తతః కర్ణః క్షిప్రం గచ్ఛంతు భారత
అన్యే ధూర్తా నరా దక్షా నిభృతాః సాధుకారిణః
చరంతు దేశాన్ సంవీతాః స్ఫీతాన్జనపదాకులాన్
తత్ర గోష్ఠీషు రమ్యాసు సిద్ధప్రవ్రజితేషు చ.
పరిచారేషు తీర్థేషు వివిధేష్వాకరేషు చ
విజ్ఞాతవ్యా మనుష్యైస్తైస్తర్కయా సువినీతయా.
వివిధైస్తత్పరైః సమ్యక్ తజ్జ్ఞైర్నిపుణసంవృతైః
అన్వేష్టవ్యాః సునిపుణైః పాండవాశ్ఛన్నవాసినః.
నదీకుంజేషు తీర్థేషు గ్రామేషు నగరేషు చ
ఆశ్రమేషు చ రమ్యేషు పర్వతేషు గుహాసు చ.

అథాగ్రజానంతరజః పాపభావానురాగవాన్
జ్యేష్ఠం దుఃశాసనస్తత్ర భ్రాతా భ్రాతరమబ్రవీత్
యేషు నః ప్రత్యయో రాజంశ్చారేషు మనుజాధిప
తేయాంతు దత్తదేయా వై భూయస్తాన్ పరిమార్గితుం
ఏతచ్చ కర్ణో యత్ ప్రాహ సర్వమీహామహే తథా
యథోద్దిష్టం చరాః సర్వే మృగయంతు యతస్తతః
ఏ తేచాన్యేచభూయాంసో దేశాద్ దేశంయథావిధి
న తు తేషాం గతిర్వాసః ప్రవృత్తిశ్చోపలభ్యతే.
అత్యంతంవానిగూఢాస్తే పారంచోర్మిమతోగతాః
వ్యాళైశ్చాపిమహారణ్యే భక్షితాఃశూరమానినః.
అథవా విషమం ప్రాప్య వినష్టాః శాశ్వతీః సమాః
తస్మాన్మానసమవ్యగ్రం కృత్వా త్వం కురునందన
కురుకార్యంమహోత్సాహం మన్యసేయన్నరాధిప



వస్తుంది. అంతవరకూ నిరాఘాటంగా నా రాజ్యం సుఖంగా ఉంటుంది - అన్నాడు.

కౌరవేశ్వరా - కార్యకౌశలంగల గూఢచారులను మళ్ళీ పంపండి. ధనకనకవస్తువాహన సమృద్ధమై జనసమర్దమై అలరారే ప్రాంతాలూ ఋషి సిద్ధ మునిజనులు వసించే ప్రదేశాలూ పవిత్రతీర్థాలూ తిరుగుతూ అక్కడి జనులను యుక్తి యుక్తంగా ప్రశ్నిస్తూ వెడితే మన కోరిక నెరవేరకపోదు. వారు ఏ వేషంలో ఏ ప్రాంతంలో నివసిస్తున్నా గుర్తుపట్టగల చారులు మనకు కావాలి - అని కర్ణుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

అపుడు దుశ్శాసనుడు లేచి ప్రభూ - నాకు ఈ చారులపై పూర్ణమైన విశ్వాసం ఉంది. వీరిని ఉచితరీతిని సత్కరించి మళ్ళీ పంపండి. ఈసారి వీరితోపాటు మరి కొందరిని గూడా వీరి వెంటనే పంపండి. అంగరాజు చెప్పిన విషయాలతో నే నేకీభవిస్తున్నాను. ఈ వెళ్ళేవారు నానా దేశాలూ అన్వేషించాలి. వారు ఏ రహస్యప్రదేశంలోనో దాగి ఉండవచ్చు. సముద్రాలు దాటి వెళ్ళినా వెళ్ళవచ్చు. లేదా అరణ్యంలో ఏ అజగరమైనా మ్రింగి యుండవచ్చు. మరేవిధంగానైనా నశించడానికి సావకాశం లేకపోలేదు. ఈ విషయాలు గ్రహించడానికి సమర్థులైన ఉత్సాహవంతులు ఇప్పుడు వెళ్ళాలి - అని తన అభిప్రాయం వ్యక్తీకరించాడు.



## ఇరువదిఏడవ అధ్యాయం

అథాబ్రవీన్మహావీర్యో ద్రోణ స్తత్వార్థదర్శివాన్
న తాదృశా వినశ్యంతి న ప్రయాంతి పరాభవం.
శూరాశ్చకృతవిద్యాశ్చబుద్ధిమంతో జితేంద్రియాః
ధర్మజ్ఞాశ్చ కృతజ్ఞాశ్చ ధర్మరాజమనువ్రతాః.
నతధర్మార్థత త్త్వజ్ఞం పితృవచ్చ సమాహితం
ధర్మేస్థితం సత్యధృతిం జ్యేష్ఠం జ్యేష్ఠానుయాయినః
అనువ్రతా మహాత్మానం భ్రాతరో భ్రాతరం నృప
అజాతశత్రుం శ్రీమంతం సర్వభ్రాతృననువ్రతం.
తేషాంతథావిధేయానాంనిభృతానాంమహాత్మనాం
కిమర్థం నీతిమాన్ పార్థః శ్రేయోనైషాం కరిష్యతి.
తస్మాద్ యత్నాత్ ప్రతీక్షంతే కాలస్యోదయ
మాగతం
న హి తేనాశమృచ్ఛేయురితిపశ్యామ్యహంధియా.
సాంప్రతం చైవ యత్కార్యం తచ్చక్షిప్రమకాలికం
క్రియతాం సాధు సంచింత్య వాసశ్చైషాం
ప్రచింత్యతాం.
యథావత్ పాండుపుత్రాణాం సర్వార్థేషు
ధృతాత్మనాం
దుర్జ్ఞేయాఃఖలుశూరాస్తే దురాపాస్తపసావృతాః
శుద్ధాత్మాగుణవాన్ పార్థః సత్యవాన్ నీతిమాన్ శుచిః
తేజోరాశిరసంఖ్యేయో గృహ్ణీయాదపి చక్షుషా.
విజ్ఞాయ క్రియతాం తస్మాద్ భూయశ్చ మృగ
యామహే
బ్రాహ్మణైశ్చారకైః సిద్ధైర్యే చాన్యే తద్విదోజనాః.

---

## ఇరువదిఏడవ అధ్యాయం

అవక్రపరాక్రమోపేతుడూ తత్వవిదుడూ ఐన ద్రోణాచార్యుడు దుర్యోధన కర్ణ దుశ్శాసనుల ప్రసంగాలు ఆకర్ణించి తన మనస్సులోని విషయాలను వివరించడానికి ఉద్యుక్తుడై లేచి – పాండవులు మహావీరులు. ధర్మతత్పరులైన జితేంద్రియులు. విద్వాంసులు. ధర్మస్వరూపుడైన యుధిష్ఠిరుడు వారి అగ్రజుడు. వానిఆజ్ఞలను వారెన్నడూ జవదాటరు. నిరంతర ధర్మమార్గనిరతులైన పాండవులు నశించిఉంటారనుకోవడం మనభ్రమ. నీతిశాస్త్రవిశారదుడూ అర్థతత్వవిదుడూ ఐన ధర్మజుడు సోదర సమ్మానితుడై సత్యమార్గాన్నాచరిస్తాడు. భీమాదులు కూడా వాని అడుగుజాడలలోనడుస్తారు. వారిలో ఒకరిపై ఒకరికి అపారమైన అనురాగం ఉంది. ఆయన కనుసన్నలలో నడిచే సోదరులకు ప్రియం చేకూర్చడానికి ధర్మజుడెందుచేత ప్రయత్నించడం లేదో నాకిప్పుడు తెలుస్తోంది. అనుకూల వాతావరణం కోసం వారిప్పుడు నిరీక్షిస్తున్నారు. అది రాగానే తమ పని పూర్తి చేసుకుంటారు.

ఇప్పుడు మనం ఏపని చేయదలచుకున్నా సావధానంగా ఆలోచించి చెయ్యాలి. కాలవిలంబన వల్ల ప్రయోజనం లేదు. ధైర్యస్థైర్యాలు కలవారు మాత్రమే వారినిగూర్చి తెలుసుకోగలరు. తపశ్శక్తిసంపన్నులైన పాండవులను గుర్తించడం సామాన్యంగాదు. సద్గుణసంపన్నుడూ సత్యవ్రతపరాయణుడూ పరిశుద్ధమనస్కుడూ ఐన ధర్మజుని వాని అనుజులనూ గుర్తుపట్టలేము. ఒకవేళ మనము చూసినా మన కేదో మోహం ఆవేశిస్తుంది. పూర్వాపరాలు చింతించి ఈ అన్వేషణ ప్రారంభించండి – అన్నాడు.

## ఇరువది ఎనిమిదవ అధ్యాయం

తతః శాంతనవో భీష్మో భరతానాం పితామహః
శ్రుతవాన్ దేశకాలజ్ఞ స్తత్త్వజ్ఞః సర్వధర్మవిత్.
ఆచార్యవాక్యోపరమే తద్వాక్యమభిసందధత్
హితార్థం సముఖాచైనాం భారతీంభారతాన్ప్రతి.
యుధిష్ఠిరే సమాసక్తాం ధర్మజ్ఞే ధర్మసంవృతాం
అసత్సు దుర్లభాంనిత్యం సతాంచాభిమతాం సదా
భీష్మః సమభవత్ తత్ర గిరం సాధుభిరర్చితాం
యథైష బ్రాహ్మణః ప్రాహ ద్రోణః సర్వార్థ
తత్త్వవిత్.
సర్వలక్షణసంపన్నాః సాధువ్రతసమన్వితాః
శ్రుతవ్రతోపపన్నాశ్చ నానాశ్రుతిసమన్వితాః.
వృద్ధానుశాసనే యుక్తాః సత్యవ్రతపరాయణాః
సమయం సమయజ్ఞాస్తే పాలయంతః శుచివ్రతాః
క్షత్రధర్మరతా నిత్యం కేశవానుగతాః సదా
ప్రవీరపురుషాస్తే వై మహాత్మానో మహాబలాః
నావసీదితుమర్హంతి ఉద్వహంతః సతాం ధురం.
ధర్మతశ్చైవ గుప్తాస్తే సువీర్యేణ చ పాండవాః
న నాశమధిగచ్ఛేయురితి మే ధీయతే మతిః,
తత్ర బుద్ధిం ప్రవక్ష్యామి పాండవాన్ ప్రతి భారత
న తు నీతిః సునీతస్య శక్యతేఽన్వేషితుం పరైః.
యత్ తు శక్యమిహాస్మాభిస్తాన్ వై సంచింత్య
పాండవాన్
బుద్ధ్యా ప్రయుక్తం న ద్రోహాత్ ప్రవక్ష్యామి
నిబోధ తత్.
న త్వియం మాదృశైర్నీతి స్తస్య వాచ్యాకథంచన
సాత్వియంసాధువక్తవ్యా న త్వనీతిఃకథంచన.

---

## ఇరువది·ఎనిమిదవ అధ్యాయం

దేశకాలస్థితిగతు లెరిగినవాడూ వేదవేదాంగ విషయజ్ఞుడూ సర్వధర్మవిదుడూ తత్త్వదర్శి ఐన భీష్ముడు ద్రోణుని ప్రసంగంలోని ఆంతర్యాన్ని గ్రహించి కౌరవశ్రేయోభిలాష దృష్టితో తన అభిమతాన్ని అభివ్యక్తీకరించే అభిప్రాయంతో కౌరవసభామధ్యంలో లేచి నిలబడి - విప్రశ్రేష్ఠుడైన ద్రోణాచార్యుని ధర్మయుక్తమైన ప్రసంగంతో నామనస్సు అనుసంధిస్తున్నది. పాండురాజ నందనులు ఏ శుభలక్షణ సంపన్నులో ద్రోణులు చెప్పారు. ధర్మరాజాదులు సాధుజనోచితమైన కర్మల నాచరిస్తూ విధ్యుక్తధర్మప్రవణులై చరిస్తారు. పెద్దల ఆజ్ఞలను శిరసావహించి పాలిస్తారు. పరిశుద్ధ మనస్కులై నియమానుసారం అజ్ఞాత వాసం సాగిస్తున్నారు. క్షత్రియధర్మం నుండి వారెన్నడూ పతితులు కారు. సదా కృష్ణుని అడుగు జాడలలో చరిస్తారు. అటువంటి సాధుజనులు నశించా రనుకోడం పొరపాటు వారు ఎటువంటి కష్టాలూ పొందకూడదు. ధర్మరక్షణ తత్పరులైన వారు ధర్మంచేతనే రక్షింపబడుతూ ఉంటారు. ఉత్తమ నీతిపథగాములైన పాండవులను అవినీతి పరులు అనుసరించలేరు. వారి విషయంలో ఒక యుక్తి నాకు తోస్తోంది. వారికి ద్రోహం తల పెట్టే ఉద్దేశం కాదుగాని మీకు సంతోషం కలిగించే భావంతో చెపుతున్నాను - ధర్మజుని ప్రజ్ఞను మే మెన్నడూ నిందించము. ధర్మజుని అజ్ఞాతవాసం విషయమై ఇతరులు ఇచ్చిన అభిప్రాయంతో నే నేకీభవించను.

వృద్ధానుశాసనే తాత తిష్ఠతా సత్యశీలినా
అవశ్యం త్విహ ధీరేణ సతాం మధ్యే వివక్షతా.
యథార్థమిహ వక్తవ్యం సర్వథా ధర్మలిప్సయా
తత్ర నాహం తథామన్యే యథాయమితరో జనః.
నివాసం ధర్మరాజస్య వర్షేఽస్మిన్ వై త్రయోదశే
తత్రతాతనతేషాంహి రాజ్ఞాంభావ్యమసాంప్రతం.
పురే జనపదే చాపి యత్ర రాజా యుధిష్ఠిరః
దానశీలో వదాన్యశ్చ నిభృతో హ్రీనిషేవకః
జనో జనపదే భావ్యో యత్ర రాజా యుధిష్ఠిరః.
ప్రియవాదీ సదా దాంతో భవ్యః సత్యపరో జనః
హృష్టః పుష్టః శుచిర్దక్షో యత్రరాజా యుధిష్ఠిరః.
నాసూయకో న చాపీర్ష్యు ర్నాభిమానీ నమత్సరీ
భవిష్యతి జనస్తత్ర స్వయం ధర్మమనువ్రతః.
బ్రహ్మఘోషాశ్చ భూయాంసః పూర్ణాహుత్య
స్తథైవచ
క్రతవశ్చ భవిష్యంతి భూయాంసో భూరిదక్షిణాః,
సదా చ తత్ర పర్జన్యః సమ్యగ్వర్షీ న సంశయః
సంపన్నసస్యా చ మహీ నిరాతంకా భవిష్యతి.
గుణవంతి చ ధాన్యాని రసవంతి ఫలాని చ
గంధవంతి చ మాల్యాని శుభశబ్దా చ భారతీ.
వాయుశ్చ సుఖసంస్పర్శో నిష్ప్రతీపం చ దర్శనం
నభయంత్వావిశేత్ తత్ర యత్రరాజాయుధిష్ఠిరః.
గావశ్చ బహులాస్తత్ర న కృశా న చ దుర్బలాః
పయాంసి దధిసర్పీంషి రసవంతి హితాని చ.
గుణవంతి చ పేయాని భోజ్యాని రసవంతి చ
తత్ర దేశే భవిష్యంతి యత్ర రాజా యుధిష్ఠిరః.
రసాఃస్పర్శాశ్చగంధాశ్చ శబ్దాశ్చాపిగుణాన్వితా
దృశ్యాని చ ప్రసన్నాని యత్ర రాజా యుధిష్ఠిరః
ధర్మాశ్చ తత్ర సర్వైస్తు సేవితాశ్చ ద్విజాతిభిః
స్వైఃస్వైర్గుణైశ్చసంయుక్తాఅస్మిన్ వర్షేత్రయోదశే
దేశే తస్మిన్ భవిష్యంతి తాత పాండవసంయుతే
సఃప్రీతిమాన్ జనస్తత్ర సంతుష్టః శుచిరవ్యయః.
దేవతాతిథిపూజాసు సర్వభావానురాగవాన్
ఇష్టదానోమహోత్సాహః స్వస్వధర్మపరాయణః.
అశుభాద్ధి శుభప్రేప్సు రిష్టయజ్ఞః శుభవ్రతః
భవిష్యతి జనస్తత్ర యత్ర రాజా యుధిష్ఠిరః.
త్యక్తవాక్యానృతస్తాత శుభకల్యాణమంగళః
శుభార్థేప్సుః శుభమతిర్యత్ర రాజా యుధిష్ఠిరః.

---

వారెక్కడ నివసిస్తూంటే అక్కడి ప్రజలలో దానబుద్ధీ ఉదారహృదయతా వినయశీలమూ ప్రసరిస్తూ ఉంటాయి. ఆప్రజలు హితవుగా ప్రియముగా భాషిస్తారు. శౌర్యధైర్యబలసంపన్నులై కార్యకుశలులై పవిత్రహృదయాలతో చరిస్తారు. ఈర్ష్యాస్వభావులూ మత్సరగ్రస్తులూ దోషైకదృక్కులూ ఐన ప్రజానీకం కూడా ధర్మతత్పరులై చరిస్తారు. పాండవు లున్నచోట వేదాలు మూర్తీభవించి ఉంటాయి. విద్య వికసిస్తుంది. యజ్ఞయాగాలు విరివిగా సాగుతాయి. పాడిపంటలతో భూమి తులతూగుతూ ఉంటుంది. సకాలంలో మేఘాలు వర్షిస్తాయి. ప్రజలకు రోగభీతి ఉండదు. ఒక్కరూ కర్కశంగా భాషించరు. ఉపద్రవాలేవీ అక్కడ పుట్టవు. గాలి చల్లచల్లగా మెల్లమెల్లగా వీస్తుంది. ఆదేశంలో నాస్తికు లుండరు. భయ ముండదు. గోధనం సమృద్ధిగా ఉంటుంది. అన్నీ పాలిచ్చేవే ఉంటాయి. మధురమైన పళ్ళు అధికంగా లభిస్తాయి. నయనానందకరమైన దృశ్యాలి మధ్య ధర్మరాజు ఉంటాడు. ప్రజలందరూ కులాచార ధర్మతత్పరులై చరిస్తారు. అతిథిపూజలూ అభ్యాగతసేవలూ దేవతారాధనలూ నిరంతరం సాగుతూంటాయి. వారెప్పుడూ

భవిష్యతి జనస్తత్ర నిత్యం చేష్టప్రియుప్రతః
ధర్మాత్మా శక్యతే జ్ఞాతుం నాపి తాత ద్విజాతిభిః.
కిం పునః ప్రాకృతైస్తాత పార్థో విజ్ఞాయతే క్వచిత్
యస్మిన్ సత్యంధృతిర్దానంపరాశాంతిర్ధ్రువాక్షమా
హ్రీః శ్రీః కీర్తిః పరం తేజ ఆనృశంస్యమథార్జవం
తస్మాత్ తత్ర నివాసంతు ఛన్నంయత్నేనధీమతః
గతిం చ పరమాం తత్ర నోత్సహే వక్తుమన్యథా
ఏవమేతత్ తుసంచింత్య యత్కృతే మన్యసేహితం
తత్ క్షిప్రం కురు కౌంవ్య యద్యేవంశ్రద్దధాసి మే.

## ఇరువది తొమ్మిదవ అధ్యాయం

తతః శారద్వతో వాక్యమిత్యువాచ కృపస్తదా
యుక్తంప్రాప్తంచవృద్ధేన పాండవాన్ ప్రతిభాషితం.
ధర్మార్థసహితం శ్లక్ష్ణం తత్వతశ్చ సహేతుకం
తత్రానురూపం భీష్మేణ మమాప్యత్ర గిరం శృణు.
తేషాంచైవగతిస్తీర్థైర్వ్యాసశ్చైషాం ప్రచింత్యతాం
నీతిర్విధీయతాంచాపి సాంప్రతంయాహితాభవేత్.
నావజ్ఞేయో రిపుస్తాత ప్రాకృతోఽపి బుభూషతా
కిం పునః పాండవాస్తాత సర్వాస్త్రకుశలా రణే.
తస్మాత్ సత్రం ప్రవిష్టేషు పాండవేషు మహాత్మసు
గూఢభావేషు ఛన్నేషు కాలే చోదయమాగతే.
స్వరాష్ట్రే పరరాష్ట్రే చ జ్ఞాతవ్యం బలమాత్మనః
ఉదయః పాండవానాం చ ప్రాప్తే కాలే నసంశయః
నివృత్తసమయాః పార్థా మహాత్మానో మహాబలాః
మహోత్సాహా భవిష్యంతి పాండవా హ్యమితౌజసః
తస్మాద్ బలం చ కోశశ్చ నీతిశ్చాపి విధీయతాం
యథాకాలోదయే ప్రాప్తే సమ్యక్ తైఃసంధధామహే

---

శుభకరమైన ఆలోచనలే సాగిస్తూంటారు. అబద్ధమాడరు. మిత్రులకు ప్రీతి కలిగిస్తూ చరించే పాండుపుత్రులు ధర్మరతులూ సత్యనిరతులూ దానశీలురూ శాంతిస్వభావులూ లజ్జాసమన్వితులూ శ్రీ శోభితులూ తేజోమయులూ మృదుహృదయులూ కీర్తిపరులూ ఐ శోభిస్తారు. వారిని గుర్తించడం కష్టం. ఐతే ఈ లక్షణాలన్నీ ఎక్కడ కేంద్రీకరింపబడి ఉంటాయో అక్కడ వారున్నారని గ్రహించండి - అన్నాడు.

## ఇరువది తొమ్మిదవ అధ్యాయం

ద్రోణుడూ భీష్ముడూ ప్రసంగించిన అనంతరం శరద్వత సూనుడైన కృపాచార్యుడు లేచి - దుర్యోధనమహారాజా వయోవృద్ధుడైన భీష్మపితామహుడు పాండవుల విషయమై వాస్తవమైన అభిప్రాయాలు ప్రకటించాడు. పూర్వాపరా లెరిగిన భీష్ముడు ధర్మవిరుద్ధంగా ప్రసంగించడుగదా ఆయన అభిప్రాయంతో ఏకీభవించడానికి ఎవరికీ సందేహమవసరంలేదు. ఇప్పుడు నామాటలను గూడా నువ్వు విన్నట్లైతే పాండవాన్వేషణమార్గం మరో కొంత సుగమం కాగలదు.

సామ్రాజ్యాధిపతి కాదలచుకొన్నవాడు ఎటువంటి శత్రువునూ ఉపేక్షించరాదు. రాజనీతిలో ఇది ప్రథమపాఠం. సామాన్యశత్రువునే ఉపేక్షించకూడనప్పుడు శస్త్రాస్త్రవిదులైన పాండవులను ఉదాసీనభావంతో విడలడం ఉచితంగాదు. ఇప్పుడు వారు మారువేషాలతో నియమానుసారం రహ

తాత బుద్ధ్వాపి తత్సర్వం బుధ్యస్వ బలమాత్మనః
నియతం సర్వమిత్రేషు బలవత్స్వబలేషు చ.
ఉచ్చావచం బలం జ్ఞాత్వా మధ్యస్థం చాపి భారత
ప్రహృష్టమప్రహృష్టం చ సందధామ తథాపరైః
సామ్నా దానేన భేదేన దండేన బలికర్మణా
న్యాయేనాక్రమ్య చ పరాన్ బలాచ్చానమ్య
దుర్బలాన్.
సాంత్వయిత్వా తు మిత్రాణి బలం చాభాష్యతాం
సుఖం
సుకోషబలసంవృద్ధః సమ్యక్ సిద్ధిమవాప్స్యసి.
యోత్స్యసే చాపి బలిభిరరిభిః ప్రత్యుపస్థితైః
అన్యైస్త్వంపాండవైర్వాపి హీనైఃస్వబలవాహనైః
ఏవం సర్వం వినిశ్చిత్య వ్యవసాయం స్వధర్మతః
యథాకాలం మనుష్యేంద్ర చిరంసుఖమవాప్స్యసి

తతో దుర్యోధనో వాక్యం శ్రుత్వా తేషాం
మహాత్మనాం
ముహూర్తమివ సంచింత్య సచివానిదమబ్రవీత్.
శ్రుతం హ్యేతన్మయా పూర్వం కథాసుజనసంసది
వీరాణాం శాస్త్రవిదుషాం ప్రాజ్ఞానాంమతినిశ్చయే.
కృతినాం సారఫల్గుత్వం జానామి నయచక్షుషా
సత్వే బాహుబలే ధైర్యే ప్రాణే శారీరసంభవే
సాంప్రతంమానుషే లోకే సదైత్యనరరాక్షసే.
చత్వారస్తు నరవ్యాఘ్రా బలే శక్రోపమా భువి
ఉత్తమాఃప్రాణినాం తేషాంనాస్తి కశ్చిద్ బలేసమః.
సమప్రాణబలా నిత్యం సంపూర్ణబలపౌరుషాః
బలదేవశ్చ భీమశ్చ మద్రరాజశ్చ వీర్యవాన్.
చతుర్థః కీచకస్తేషాం పంచమం నానుశుశ్రుమః
అన్యోన్యానంతరబలాః పరస్పరజయైషిణః.

---

స్యంగా చరిస్తున్నారు. అజ్ఞాతవాసకాలంకూడ పరిసమాప్తదశకు వచ్చింది. ఇప్పుడు వారిశక్తి మనకు బోధపడి ఉంటుంది. స్వదేశంలోనే గాక పరరాష్ట్రంలో గూడ వారెటువంటి శక్తిని సాధించారో ఇప్పుడైనా మనం గుర్తించాలి. ఇంత వరకూ వారిని ఎవరూ గుర్తుపట్టలేక పోయారు. నేడో రేపో అజ్ఞాతవాసంపూర్తిచేసి వారే బయట పడతారు. ఆ సమయం రాగానే ఉత్సాహంతో ధైర్యశౌర్యాలతో పరాక్రమించి విక్రమిస్తారు. ఈలోగానే సైన్యాలను ధనసంపదలనూ సమీకరించి సంధికి అవసరమైన ఏర్పాటులు పూర్తి చేసుకో. లేదా సర్వశక్తులూ సమీకరించి యుద్ధానికి సిద్ధంగా ఉండు. నీ పక్షంలో ఉండి సహాకరంచే వారెందరో వారి బలాబలాలు ఎంతటివో పరిశీలించుకో. సంధి సమయంలో సైన్యాల సంతోషం కూడా చూడాలి. శత్రువులను స్వాధీనం చేసుకోడానికి సామ దాన భేదాది చతుర్విధోపాయాలూ అనుసరించాలి. దుర్బలులను బలంతో హరించాలి. మిత్రులను ప్రియవచనాలతో సమీకరించుకోవాలి. సేనలకు బహూకరణలిచ్చి వశపరచుకోవాలి. సామంతులనుండికప్పాలుగ్రహించి కోశం వృద్ధిచేయాలి. ధనసైన్యాలు వృద్ధిపొందక పోతే శత్రువు దృష్టిలో మనం చాలా నీచంగా కనిపిస్తాము. ధనసేనాబలం సమృద్ధిగా ఉంటే ఎవరినైనా జయించవచ్చు. నీ ధర్మాన్ని నువ్వు నిర్వర్తిస్తే చిరకాలం సుఖంగా బ్రతకగలవు-అని అన్నాడు.

అమాత్యవరులారా - నేను పూర్వం శాస్త్ర విదులవల్ల విన్నవిషయాలూ వారిసిద్ధాంతాలూ స్మరించుకొని మానవుల బలాబలాలు గ్రహించడంలో శక్తి సంపాదించాను. ఆత్మబలం కలవారూ బాహుబలం కలవారూ ధీరులూ శారీరక

బాహుయుద్ధమభీప్సంతో నిత్యం సంరబ్ధమానసః
తేనాహమవగచ్ఛామి ప్రత్యయేన వృకోదరం.
మనస్యభినివిష్టం మే వ్యక్తం జీవంతి పాండవాః
తత్రాహం కీచకం మన్యే భీమసేనేన మారితం.
సైరంధ్రీం ద్రౌపదీంమన్యే నాత్రకార్యావిచారణా
శంకే కృష్ణానిమిత్తం హి భీమసేనేన కీచకః
గంధర్వవ్యపదేశేన హతో నిశి మహాబలః
కోహిశక్తః పరోభీమాత్ కీచకం హంతుమోజసా.
శస్త్రం వినా బాహువీర్యాత్ తథా
సర్వాంగచూర్ణనే
మర్దితం వాతథాశీఘ్రం చర్మమాంసాస్థిచూర్ణితం
రూపమన్యత్ సమాస్థాయ భీమస్యైతద్ విచేష్టితం
(ధ్రువం కృష్ణానిమిత్తం తు భీమసేనేన సూతజాః.)

గంధర్వవ్యపదేశేన హతా యుధి న సంశయః
పితామహేన యే చోక్తా దేశస్య చ జనస్య చ.
గుణాస్తేమత్స్యరాష్ట్రస్య బహుశోఽపిమయాశ్రుతాః.
విరాటనగరే మన్యే పాండవాశ్ఛన్నచారిణః.
నివసంతి పురే రమ్యే తత్ర యాత్రా విధీయతాం
మత్స్యరాష్ట్రం హనిష్యామో గ్రహీష్యామశ్చ
గోధనం.
గృహీతే గోధనే నూనం తేఽపి యోత్స్యంతి
పాండవాః
అపూర్ణే సమయే చాపి యది పశ్యేమ పాండవాన్
ద్వాదశాన్యాని వర్షాణి ప్రవేక్ష్యంతి పునర్వనం.
తస్మాదన్యతరేణాపి లాభోఽస్మాకం భవిష్యతి
కోశవృద్ధిరిహాస్మాకం శత్రూణాం నిధనం భవేత్.

శక్తి సంపన్నులూ ఐన వీరులు నలుగురు దైత్య మానవ రాక్షస సంఘాలలో ఉద్భవించారని విన్నాను. వారు ఈ ప్రపంచంలో అందరికంటె బలవంతులు. బలపౌరుషాలలో వారు నలువురూ ఒకరి కొకరు తీసిపోరు. వారు బలరాముడు భీముడు శల్యుడు కీచకుడు. కీచకునికిచతుర్థస్థానమేఇచ్చారు. వీరందరూ ఒకరిపై ఒకరు ద్వేషం వహించి పరస్పర బాహుయుద్ధాన్ని కాంక్షిస్తూ ఉంటారు. ఈ విషయాన్నిబట్టి చూస్తే భీముడు జీవించి ఉన్నాడని తోస్తోంది. అప్పుడు పాండవులుకూడా జీవించే ఉంటారు. విరాటనగరంలో జరిగిన కీచక సంహారం భీముని వల్లనే జరిగి ఉంటుంది. ఆ సైరంధ్రి ద్రౌపది ఐ ఉంటుంది. అందువల్లనే భీముడు గంధర్వనామంతో కీచకుని సంహరించి ఉంటాడు. ఎముకలు చూర్ణంచేసి అవయవాలను శరీరంలో గుచ్చివేయగల శక్తి భీమునికి తప్ప మరొకరికి లేదు.

పితామహుడు ఐన భీష్ముడు వర్ణించినట్లు మత్స్యదేశం సుభిక్షంగా శుభలక్షణాలతో అలరారుతోందని చారులవల్ల తెలిసింది. అందుచేత ఆ సుందర విరటనగరంలో పాండవులు ప్రచ్ఛన్న వేషాలతో చరిస్తున్నారని నాకు విశ్వాసం కలుగుతోంది. ఇప్పుడు మనం 'మత్స్య దేశాన్ని ఆక్రమించి వారి గోధనం హరించాలి. అప్పుడు పాండవులు విరటునికి సాయంగా వచ్చి మనతో యుద్ధంచేస్తారు. ఆసమయంలో మనం పాండవులను గుర్తుపడతాం. అంతలో వారి అజ్ఞాతవాస వ్రతం భంగమౌతుంది. మళ్ళీ అరణ్యవాసమూ అజ్ఞాతవాసమూ ఆరంభమౌతాయి. పాండవులు అక్కడ లేకపోయినా మన కేమీ నష్టం లేదు. విరాటనగరం జయించడంవల్ల రాజకోశాగారం వృద్ధిపొందుతుంది. విరటుడు పూర్వం ధర్మరాజుకు సామంతుడుగా ఉండటంవల్ల నన్ను కొంత తిరస్కార

కథం సుయోధనం గచ్ఛేద్ యుధిష్ఠిరభృతఃపురా
ఏతచ్చాపి వదత్యేష మాత్స్యః పరిభవాన్మయి
తస్మాత్ కర్తవ్యమేతద్ వై తత్ర తత్ర యాత్రా విధీయతాం
ఏతత్ సునీతం మన్యేఽహం సర్వేషాంయదిరోచతే

## ముప్పదియవ అధ్యాయం

అథ రాజా త్రిగర్తానాం సుశర్మా రథయూథపః
ప్రాప్తకాలమిదం వాక్యమువాచ త్వరితో బలీ.
అసకృన్నికృతాః పూర్వంమత్స్యశాల్వేయకైః ప్రభో
సూతేనైవ చ మత్స్యస్య కీచకేన పునః పునః.
బాధితో బంధుభిః సార్ధం బలాద్ బలవతా విభో
స కర్ణమభ్యుదీక్ష్యాథ దుర్యోధనమభాషత.
అసకృన్మత్స్యరాజ్ఞా మే రాష్ట్రం బాధితమోజసా
ప్రణేతా కీచకస్తస్య బలవానభవత్ పురా.
క్రూరోఽమర్షీ స దుష్టాత్మా భువి ప్రఖ్యాతవిక్రమః
నిహతః స తు గంధర్వైః పాపకర్మా నృశంసవాన్.
తస్మిన్ వినిహతే రాజా హతదర్పో నిరాశ్రయః
భవిష్యతి నిరుత్సాహో విరాట ఇతి మే మతిః.
తత్ర యాత్రా మమ మతా యది తే రోచతేఽనఘ
కౌరవాణాం చ సర్వేషాం కర్ణస్య చ మహాత్మనః
ఏతత్ ప్రాప్తమహం మన్యే కార్యమాత్యాయికం హి నః

దృష్టితో చూస్తున్నాడు. ఇప్పుడు దానికి తగిన ప్రతీకారం జరుగుతుంది. అందుచేత ఇప్పుడు మత్స్యదేశంమీద దాడిచేయడానికి మీరందరూ నాకూ సహకరించాలి – అన్నాడు దుర్యోధనుడు.

## ముప్పదియవ అధ్యాయం

దుర్యోధనుడు తన ప్రసంగం ముగించి కూర్చునే సరికి చతురంగబల సమన్వితుడైన త్రిగర్తదేశాధీశుడు సుశర్మ ఒక్కసారి కర్ణుని వైపు చూసి దుర్యోధనుని వైపు తిరిగి – ప్రభూ మత్స్యదేశసేనలు ఎన్నోమారులు మామీదదాడి చేసి మమ్మ ఓడించి అనేక కష్టాలు కలిగించాయి ఆసేనాపతి కీచకుడు మహాబలుడు. వాడు బంధు సోదర సహితుడై బలదర్పంతో పరాక్రమించి నన్ను నానాహింసల పాలుచేసాడు.. అటువంటి దుష్టుడు గంధర్వుల చేతులలో మరణించాడు. కీచకుని మరణంతో విరటరాజు ధైర్యదర్పాలు కోల్పోయి అసహాయ దశలో ఉంటాడు. ఇప్పుడు మీరంగీకరిస్తే కౌరవ వీరులందరూ కర్ణసహితులై విరటునిపై దాడిచెయ్యాలనీ అది సర్వవిధాలా శ్రేయస్కరమనీ నాభావం. అందువల్ల ఉభయులకూ శ్రేయస్సు కలుగుతుంది. ధనధాన్యరత్న సంపదలతో తులతూగే మత్స్యదేశం గోసంపదకు నిలయం. విరటుని జయించినట్లైతే వాని కోశాగారంతోపాటు గోధనం కూడ లభిస్తుంది. సరాసరి వానితో యుద్ధానికి అంగీకరించకపోతే వాని గోధనం హరించడానికైనా మనం ప్రయత్నించవచ్చు. మా త్రిగర్తసేవలు కురుసేనలతో కలసి

రాష్ట్రం తస్యాభియాస్యామో
బహుధాన్యసమాకులం.
ఆదదామోఽస్య రత్నాని వివిధాని వసూని చ
గ్రామాన్ రాష్ట్రాణివా తస్య హరిష్యామో విభాగశః
అథవా గోసహస్రాణి శుభాని చ బహూని చ
వివిధాని హరిష్యామః ప్రతిపీడ్య పురం బలాత్.
కౌరవైః సహ సంగత్య త్రిగర్తైశ్చ విశాంపతే
గాస్తస్యాపహరామోఽద్య సర్వైశ్చైవ
సుసంహతాః
సంవిభాగేన కృత్వాతు నిబధ్నీమోఽస్య పౌరుషం
హత్వా చాస్య చమూం కృత్స్నాం
వశమేవానయామహే.
తం వశే న్యాయతః కృత్వా సుఖం వత్స్యామహే
వయం
భవతాం బలవృద్ధిశ్చ భవిష్యతి న సంశయః.
తచ్ఛ్రుత్వా వచనం తస్య కర్ణో రాజానమబ్రవీత్
సూక్తం సుశర్మణా వాక్యం ప్రాప్తకాలంహితంచనః
తస్మాత్ క్షిప్రం వినిర్యామో యోజయిత్వా
వరూథినీం
విభజ్య చాప్యనీకాని యథా వా మన్యసేఽనఘ.
ప్రాజ్ఞో వా కురువృద్ధోఽయం సర్వేషాం నః
పితామహః.
ఆచార్యశ్చ యథా ద్రోణః కృపః శారద్వతస్తథా
మన్యంతే తే యథా సర్వే తథా యాత్రా విధీయతాం
సమ్మంత్ర్య చాశుగచ్ఛామః సాధనార్థం మహీపతేః
కిం చ నః పాండవైః కార్యం హీనార్థబలపౌరుషైః
అత్యంతం వా ప్రణష్టాస్తే ప్రాప్తా వాపియమక్షయం
యామో రాజన్ నిరుద్విగ్నా విరాటనగరం వయం
ఆదాస్యామో హి గాస్తస్య వివిధాని వసూని చ.
తతో దుర్యోధనో రాజా వాక్యమాదాయతస్యతత్
వైకర్తనస్య కర్ణస్య క్షిప్రమాజ్ఞాపయత్ స్వయం.
శాసనే నిత్యసంయుక్తం దుశ్శాసనమనంతరం
సహ వృద్ధైస్తు సమ్మంత్ర్య క్షిప్రం యోజయ
వాహినీం.
యథోద్దేశం చ గచ్ఛామః సహితాస్తత్ర కౌరవైః
సుశర్మా చ యథోద్దిష్టం దేశం యాతు మహారథః

---

విరటుని గోవులను హరించి అనుభవించడానికి కుతూహలపడుతున్నాయి. విరటుడు మనకు సామంతుడుగా ఉంటాడు. సర్వవిధాలా మనకు లాభం కలుగుతుంది - అన విని దుర్యోధనుడు - మిత్రులారా సుశర్మ మనశ్రేయస్సునుకోరి సమయోచితమైన సలహానిచ్చాడు. మనం సైన్యసమేతులమై తక్షణం విరటునిపై దాడి సాగించాలి. వయోబుద్ధివృద్ధులైన భీష్మ ద్రోణ కృపాచార్యాదులు ఈ కార్యక్రమనిర్వహణలో మన మవలంబించవలసిన విధానాలను ఆదేశిస్తారు. మీరందరూ కూడా ఈ విషయమై బాగా ఆలోచించండి.

ప్రస్తుతం పాండవులు ధనబలపౌరుష హీనులై వసిస్తున్నారు. వారు రహస్య జీవనమే సాగిస్తున్నారో మరణించారో మన కనవసరం. విరటుని ధనరాసులతోపాటు గోగణాలను హరించడం మన కర్తవ్యం - అని తన నిశ్చయం ప్రకటించి కర్ణుని వైపు సాభిప్రాయంగా దృష్టిప్రసరింపచేసి వాని అంగీకారం గ్రహించి కార్యసాధన కుశలుడైన దుశ్శాసనుని పిలచి - సోదరా కురువృద్ధుల అనుమతితో మనసైన్యాలను సిద్ధపరచి మత్స్యదేశం వైపు నడుపు. సుశర్మ తన సేనలతో ఒక దిశగా ముట్టడి ప్రారంభిస్తాడు. ఒకరోజు గడిచాక మన

త్రిగర్తైః సహితో రాజా సమగ్రబలవాహనః.
ప్రాగేవ హి సుసంవీతో మత్స్యస్య విషయం ప్రతి
జఘన్యతో వయంతత్ర యాస్యామో దివసాంతరే
విషయం మత్స్యరాజస్య సుసమృద్ధంసుసంహతాః
తేయాంతుసహితా స్తత్ర విరాటనగరం ప్రతి
క్షిప్రంగోపాన్‌సమాసాద్య గృహ్ణంతువిపులంధనం
గవాం శతసహస్రాణి శ్రీమంతి గుణవంతి చ
వయమప్యనుగృహ్ణీమో ద్విధా కృత్వావరూథినీం
తేస్మ గత్వా యథోద్దిష్టాం దిశంవహ్నేర్మహీపతే
సంనద్ధా రథినః సర్వే సపదాతా బలోత్కటాః
ప్రతివైరం చికీర్షంతో గోషు గృద్ధా మహాబలాః
ఆదాతుం గాః సుశర్మాథ కృష్ణపక్షస్య సప్తమీం
అపరే దివసే సర్వే రాజన్ సంభూయ కౌరవాః
అష్టమ్యాం తే న్యగృహ్ణంత గోకులాని సహస్రశః

ముప్పది ఒకటవ అధ్యాయం

తత స్తేషాం మహారాజ తత్రైవామిత తేజసాం
ఛద్మలింగప్రవిష్టానాంపాండవానాంమహాత్మనాం
వ్యతీతః సమయః సమ్యగ్వసతాం వై పురోత్తమే
కుర్వతాం తస్య కర్మాణి విరాటస్య మహీపతేః
కీచకే తు హతే రాజా విరాటః పరవీరహా
పరాం సంభావనాం చక్రే కుంతీపుత్రే యుధిష్ఠిరే
తతస్త్రయోదశస్యాంతే తస్య వర్షస్య భారత
సుశర్మణా గృహీతం తద్ గోధనం తరసా బహు
తతః శబ్దో మహానాసీద్ రేణుశ్చదివమస్పృశత్
శంఖదుందుభిఘోషశ్చ భేరీణాం చ మహాస్వనః.
గవాశ్వరథనాగానాం నరాణాం చ పదాతినాం
ఏవం తైస్త్వభినిర్యాయ మత్స్యరాజస్య గోధనే.

సేనలు సర్వతోముఖంగా మత్స్యరాజ్యం ఆక్రమించాలి. త్రిగర్త సేనలు గోపాలకులను స్వాధీన పరచుకొని గోగణాలను హరిస్తాయి. మన సేనలలో ఒక భాగం గోహరణానికీ రెండవభాగం రాజ్యం జయించడానికీ పనిచెయ్యాలి - అని ఆదేశించాడు

సుశర్మ మనస్సులో మాత్స్యులపై గల పూర్వవైరం మసలింది. వారు చేసిన దాడులస్నీ స్మృతికివచ్చి ప్రతీకారవాంఛను ప్రకోపింపచేసాయి. సేనలను సమీకరించి నిశ్చయానుసారం కృష్ణపక్ష సప్తమీ దినాన ఆగ్నేయ దిశనుండి విరాట నగరాన్ని ముట్టడించాడు. పూర్వనిర్ణయానుసారం అష్టమీ దినాన కౌరవయోధులందరూ ఉత్తర దిశాముఖంగా విరటుని గోవులను హరించడానికి సిద్ధమయ్యారు.

ముప్పది ఒకటవ అధ్యాయం

కౌరవులు విరటుని గోవులను హరించడానికి వచ్చే సమయానికే పాండవుల అజ్ఞాతవాసకాలం పరిసమాప్తమైంది.

సర్వసైన్యాధిపతీ మహాబలిష్టుడూ ఐన కీచకుడు మరణించిన నాటినుండీ విరటునికి ధర్మరాజుపై గౌరవాభిమానాలు పెరుగుతున్నాయి. ఏతాదృశ స్థితిగతులలో సుశర్మ విరటుని గోపాలకులను వశపరచుకొని గోవులను తరలించే ఊహాంతో చతురంగ బలాన్వితుడై దండెత్తివచ్చాడు. విరటుని గోపాలకులు త్రిగర్తసేనలను అడ్డినిలబడ్డారు. కాని

త్రిగర్తైర్గృహ్యమాణేషు గోపాలాః ప్రత్యషేధయన్
అథ త్రిగర్తా బహవః పరిగృహ్య ధనం బహు.
పరిక్షిప్య హయైః శీఘ్రై రథవ్రాతైశ్చ భారత.
గోపాలాన్ ప్రత్యయుధ్యంత రణేకృత్వాజయేధృతిం
తే హన్యమానా బహుభిః ప్రాసతోమరపాణిభిః
గోపాలాః గోకులే భక్తా వారయామాసురోజసా
పరశ్వధైశ్చ ముసలైర్భిందిపాలైశ్చ ముద్గరైః
గోపాలాః కర్షణైశ్చిత్రైర్జఘ్నురశ్వాన్ సమంతతః
తే హన్యమానాః సంక్రుద్ధాస్త్రిగర్తా రథయోధినః
విసృజ్య శరవర్షాణి గోపాన్ వ్యాద్రవయన్ రణే.
తతో జవేన మహతా గోపః పురమథావ్రజత్
సదృష్ట్వా మత్స్యరాజంచ రథాత్ప్రస్కంద్యకుండలీ.
శూరైః పరివృతం యోధైః కుండలాంగదధారిభిః
సంవృతంమంత్రిభిఃసార్ధం పాండవైశ్చమహాత్మభిః
తం సభాయాం మహారాజమాసీనం రాష్ట్రవర్ధనం
సోఽబ్రవీ దుపసంగమ్య విరాటం ప్రణతస్తదా.
అస్మాన్ యుధి వినిర్జిత్య పరిభూయ సబాంధవాన్
గవాం శతసహస్రాణి త్రిగర్తాః కాలయంతి తే.
తాన్ పరీప్సస్వ రాజేంద్ర మా నేశుః పశవస్తవ

తచ్ఛ్రుత్వా నృపతిః సేనాం మత్స్యానాం
సమయోజయత్ -
రథనాగాశ్వకలిలాం పత్తిధ్వజసమాకులాం
రాజానో రాజపుత్రాశ్చ తనుత్రాణ్యథ భేజిరే.
భానుమంతి విచిత్రాణి శూరసేవ్యాని భాగశః
సవజ్రాయసగర్భం తు కవచం తత్ర కాంచనం.
విరాటస్యప్రియోభ్రాతా శతానీకోఽభ్యహారయత్
సర్వపారసవం వర్మ కళ్యాణపటలం దృఢం.
శతానీకాదవరజో మదిరాక్షోఽభ్యహారయత్
శతసూర్యం శతావర్తం శతబింగు శతాక్షిమత్.
అభేద్యకల్పంమత్స్యానాం రాజాకవచమాహరత్
ఉత్సేధే యస్య పద్మాని శతం సౌగంధికాని చ.
సువర్ణపృష్ఠం సూర్యాభం సూర్యదత్తోఽభ్యహారయత్
దృఢమాయసగర్భం చ శ్వేతం వర్మశతాక్షిమత్
విరాటస్యసుతో జ్యేష్ఠో వీరః శంఖోఽభ్యహారయత్
శతశశ్చ తనుత్రాణి యథాస్వం తే మహారథాః.
యోత్స్యమానా అనహ్యంత దేవరూపాః ప్రహారిణః
సూపస్కరేషు శుభ్రేషు మహత్సు చ మహారథాః

---

శస్త్రాయుధధరులైన త్రిగర్త సైనికుల ముందు సామాన్య గోపాలకులు ఎంతోసేపు నిలబడ లేక పోయారు. తమతమ రథాల మీద నగరం చేరి సభాస్థలి ప్రవేశించి విరటుని సమీపించి నమస్కరించి - మహారాజా త్రిగర్త సేనలు మమ్మ ఓడించి మనగోధనాన్ని హరించి పోతున్నాయి. మన గోవులు నష్టం గాకుండా మీరు తగిన చర్య తీసుకోవాలి - అని నివేదించగా విరటుడు తక్షణం రాజకుమారులనూ చతురంగబలాలనూ యుద్ధానికి సిద్ధంచేసాడు. శతానీకుని కనిష్ట సోదరుడైన మదిరాక్షుడు సువర్ణాచ్ఛాదిత కవచ ధారియై నిలచాడు. శస్త్రాస్త్రకోవిదుడైన మదిరాక్షుడు సర్వసైన్యాధిపతిగా ఉంటాడని విరటుడు ప్రకటించాడు. విరటుడు అస్త్రశస్త్రాలవల్ల ఛేదింప బడని అభేద్యకల్పమనే కవచం ధరించాడు. అది శతావర్తాలతో సూక్ష్మచక్రశతక్రంతో శత నేత్రాకారచక్రాలతో శతసూర్యకాంతితో సౌగంధిక కమలచిహ్నాలతో ఆకవచం అలరారుతోంది. దేవసమ పరాక్రమోపేతులైన మహాయోధులు కవచాయుధధరులై ఉత్తమాశ్వాలమీద మహోజ్వల రథాలమీద సంగ్రామానికి బయులుదేరారు. సువర్ణమయమై సూర్య చంద్రకాంతులను

పృథక్ కాంచనసంనాహాన్ రథేష్వశ్వానయో
జయన్
సూర్యచంద్రప్రతీకాశే రథే దివ్యే హిరణ్మయే.
మహానుభావో మత్స్యస్య ధ్వజ ఉచ్ఛ్రియే తదా
అథాన్యాన్ వివిధాకారాన్ ధ్వజాన్ హేమ
పరిష్కృతాన్.
యథాస్వం క్షత్రియాః శూరా రథేషు
సమయోజయన్
రథేషు యుజ్యమానేషు కంకో రాజానమబ్రవీత్
మయాప్యస్త్రంచతుర్మార్గమవాప్తమృషిసత్తమాత్
దంశితోరథమాస్థాయ పదంనిర్యాస్యామ్యహం
గవాం
అయం చ బలవాన్ శూరో బల్లవోదృశ్యతేఽనఘ
గోసంఖ్యమశ్వబంధం చ రథేషు సమయోజయ
నైతే న జాతు యుధ్యేయుర్గవార్థమితి మే మతిః.
అథమత్స్యోఽబ్రవీద్రాజా శతానీకంజఘన్యజం
కంకబల్లవగోపాలా దామగ్రంథిశ్చ వీర్యవాన్
యుధ్యేయురితిమేబుద్ధిర్వర్తతే నాత్ర సంశయః.
ఏతేషామపి దీయంతాం రథా ధ్వజపతాకినః
కవచాని చ చిత్రాణి దృఢాని చ మృదూని చ.
ప్రతిముంచంతుగాత్రేషు దీయంతామాయుధానిచ
వీరాంగరూపాః పురుషానాగరాజకరోపమాః.
నేమే జాతు న యుధ్యేరన్నితి మే ధీయతే మతిః
ఏతచ్ఛ్రుత్వా తు నృపతేర్వాక్యం త్వరితమానసః
శతానీకస్తు పార్థేభ్యో రథాన్ రాజన్ సమాదిశత్
సహదేవాయ రాజ్ఞే చ భీమాయ నకులాయ చ
తాన్ప్రహృష్టాంస్తతఃసూతారాజభక్తిపురస్కృతాః
నిర్దిష్టా నరదేవేన రథాన్శీఘ్రమయోజయన్
కవచాని విచిత్రాణి మృదూని చ దృఢాని చ.
విరాటః ప్రాదిశద్ యాని తేషామక్లిష్టకర్మణాం
తాన్యాముచ్య శరీరేషు దంశితాస్తే పరంతపాః.
రథాన్హయైఃసుసంపన్నానాస్థాయచనరోత్తమాః
నిర్యయుర్ముదితాః పార్థాః శత్రుసంఘావమర్దినః.
తరస్వినశ్ఛన్నరూపాః సర్వే యుద్ధవిశారదాః
రథాన్హేమపరిచ్ఛన్నానాస్థాయచ మహారథాః.
విరాటమన్వయుః పార్థాః సహితాః కురుపుంగవాః
చత్వారోభ్రాతరఃశూరాఃపాండవాఃసత్యవిక్రమాః
దీర్ఘాణాం చ దృఢానాం చధనుషాంతేయథాబలం
ఉత్కృష్య పాశాన్ మౌర్వీణాం వీరాశ్చా
పేష్వయోజయన్.

---

పరిహాసించే దివ్యరథం మీద విరటుడు బయలుదేరాడు. విరటుడు బయలుదేరేసమయంలోకంకభట్టు సమీపించి–ఒకానొక మహర్షి అనుగ్రహ విశేషం వల్ల తనకు కూడా చతుర్విధధనుర్విద్యాకౌశలం కలదనీ కవచధారణకు అనుమతిస్తే గోవుల పద చిహ్నాలు గుర్తించగలననీ పాకశాలలోని వల్లవుడు కూడా మహావీరుడుగా కనిపిస్తున్నాడనీ, గోశాలాదక్షుడైన తంత్రీపాలుడు అశ్వశిక్షణకుశలుడైన గ్రంథికుడూ యుద్ధవిద్యానిపుణులే ననీ వారికి కూడాకవచధారణానుమతిఇవ్వవలసిందనికోరాడు.

విరటుడు శతానీకునివైపు తిరిగి – సోదరా – కంక, వల్లవ, తంతీపాల, గ్రంథికులు కూడయుద్ధానికి వస్తారు. వారికి కూడా ఉత్తమ కవచరథాలూ శస్త్రాస్త్రాలూ సమకూర్చు వీరిఅవయవాలు సౌష్ఠవంగా సుందరంగా ఉన్నాయి. భుజాలు ఏనుగు తొండాలవలె బలిష్టంగా ఉన్నాయి. ఈలక్షణాలన్నీ చూస్తే వీరు కూడా వీరులని నాకు తోస్తోంది – అన్నాడు.

శతానీకుడు ధర్మజ భీమ నకుల సహదేవులకు రథాలు సిద్ధం చేశాడు. విరటుడు స్వహస్తాలతో

తతః సువాససః సర్వే తే వీరాశ్చందనోక్షితాః
చోదితా నరదేవేన క్షిప్రమశ్వానచోదయన్.
తే హయా హేమసంచ్ఛన్నా బృహంతః సాధువాహినః
చోదితాః ప్రత్యదృశ్యంత పక్షిణామివ పంక్తయః
భీమాశ్చ మత్తమాతంగా ప్రభిన్నకరటాముఖాః
క్షరంతశ్చైవనాగేంద్రాఃసుదంతాఃషష్టిహాయనాః
స్వారూఢా యుద్ధకుశలైః శిక్షితా హస్తిసాదిభిః
రాజానమన్వయుః పశ్చాచ్చలంత ఇవ పర్వతాః.

విశారదానాం ముఖ్యానాం హృష్టానాం చారుజీవినాం
అష్టౌ రథసహస్రాణి దశ నాగశతాని చ.
షష్టిశ్చాశ్వసహస్రాణి మత్స్యానామభినిర్యయుః
తదానీకం విరాటస్య శుశుభే భరతర్షభ.
సంప్రయాతం తదా రాజన్ నిరీక్షంతం గవాంపదం
తద్ బలాగ్ర్యం విరాటస్య సంప్రస్థితముశోభత
దృఢాయుధజనాకీర్ణం గజాశ్వరథసంకులం.

## ముప్పది రెండవ అధ్యాయం

నిర్యాయనగరాన్ఛూరా వ్యూఢానీకాః ప్రహారిణః
త్రిగర్తానస్పృశన్ మత్స్యాః సూర్యే పరిణతే సతి.
తే త్రిగర్తాశ్చమత్స్యాశ్చ సంరబ్ధా యుద్ధదుర్మదాః
అన్యోన్యమభిగర్జంతో గోషు గృద్ధా మహాబలాః.

భీమాశ్చ మత్తమాతంగాస్తోమరాంకుశనోదితాః
గ్రామణీయైః సమారూఢాః కుశలైర్హస్తిసాదిభిః.
తేషాంసమాగమో ఘోరస్తుములోలోమహర్షణః
ఘ్నతాం పరస్పరం రాజన్ యమరాష్ట్రవివర్ధనః.

వారికి సుదృఢకవచా లిచ్చాడు. పాండవులుపరమ సంతోషంతో రథాలపై బయలు దేరారు. విరటుని రథం వెనుకనే పాండవవీరుల రథాలు నడుస్తున్నాయి. ధనస్సులకు నారిసంధించి పాండవులు దివ్యశోభతో వెలుగొందుతున్నారు. సర్వాంగాలంకృతులై రథగజఅశ్వపదాతి బలాలు విరటుని అనుసరించి సాగుతున్నాయి. ఆసేనలో ఎనిమిది వేలమంది రథికులూ, ఆరువేలమంది అశ్వికులూ ఉన్నారు. గజబలం సహస్రసంఖ్యలో ఉంది. పరమ ఉత్సాహంతో సేనలు ముందుకు సాగుతున్నాయి.

## ముప్పది రెండవ అధ్యాయం

దక్షిణ గోగ్రహణము.

సేనావాహిని నగర సీమలు దాటింది. విరటుడు వ్యూహనిర్మాణంచేసి త్రిగర్తుని ముట్టడించాడు. ఉభయసేనల మధ్య పోరు ప్రారంభమైంది. బాణవర్షం కురుస్తోంది. మత్తేభాలమీది వీరులు అంకుశతోమరాద్యాయుధాలతో పరస్పరం ప్రహరించు కొంటున్నారు. యుద్ధ కోలాహలం మిన్నుముట్టింది. సంగ్రామం తీవ్రరూపం ధరించింది. సూర్యుడు పశ్చిమదిశాముఖంగా పయనం సాగిస్తున్నాడు. వారిమధ్య యుద్ధం దేవాసుర సంగ్రామాన్ని తలపిస్తోంది. ఉభయసేనలవీరులూ విడిచే బాణాలతో ఆకాశం కప్పబడిపోయింది. సూర్యరశ్మి భూమిమీద పడటంలేదు. రణరంగమంతా ధూళిధూసరితమైంది. రథికుడు రథికునితో

దేవాసురసమో రాజన్నాసీత్ సూర్యేఽవలంబతి
పదాతిరథనాగేంద్రహయారోహబలౌఘవాన్.
అన్యోన్యమభ్యాపతతాం నిఘ్నతాం చేతరేతరం
ఉదతిష్ఠద్ రజో భౌమం న ప్రాజ్ఞాయత కించన.
పక్షిణశ్చాపతన్ భూమౌ సైన్యేన
రజసాఽఽవృతాః
ఇషుభిర్వ్యతిసర్పద్భిరాదిత్యోఽంతరధీయత.
ఖద్యోతైరివ సంయుక్తమంతరిక్షం వ్యరాజత
రుక్మపృష్ఠాని చాపాని వ్యతిషిక్తాని ధన్వినాం.
పతతాం లోకవీరాణాం సవ్యదక్షిణమస్యతాం
రథా రథైః సమాజగ్ముః పాదాతైశ్చపదాతయః.
సాదినః సాదిభిశ్చైవ గజైశ్చాపి మహాగజాః
అసిభిః పట్టిశైః ప్రాసైః శక్తిభిస్తోమరైరపి.
సంరబ్ధాః సమరే రాజన్ నిజఘ్నురితరేతరం
నిఘ్నంతః సమరేఽన్యోన్యం శూరాః
పరిఘబాహవః.
న శేకురభిసంరబ్ధాఃశూరాన్ కర్తుం పరాఙ్ముఖాన్
కృత్తోత్తరోష్ఠం సునసం కృత్తకేశమలంకృతం.
అదృశ్యత శిరశ్ఛిన్నం రజోధ్వస్తం సకుండలం
అదృశ్యంస్తత్ర గాత్రాణి శరైశ్ఛిన్నాని భాగశః.
శాలస్కంధనికాశాని క్షత్రియాణాం మహామృధే
నాగభోగనికాశైశ్చ బాహుభిశ్చందనోక్షితైః.
ఆస్తీర్ణా వసుధా భాతి శిరోభిశ్చ సకుండలైః
రథినాం రథిభిశ్చాత్ర సంప్రహారోఽభ్యవర్తత.
సాదిభిః సాదినాం చాపి పదాతీనాం పదాతిభిః
ఉపాశామ్యద్ రజో భౌమం రుధిరేణ ప్రసర్పతా.
కశ్మలం చావిశద్ ఘోరం నిర్మర్యాదమవర్తత
యుధిష్ఠిరోఽపి ధర్మాత్మా భ్రాతృభిః సహితస్తదా
వ్యూహం కృత్వావిరాటస్యఅన్వయుధ్యతపాండవః
ఆత్మానం శ్యేనవత్ కృత్వాతుండమాసీద్యుధిష్ఠరః
పక్షౌయమౌచ భవతః పుచ్ఛమాసీద్ వృకోదరః.
సహస్రం న్యహనత్ తత్ర కుంతీపుత్రో యుధిష్ఠిరః
భీమసేనః సుసంక్రుద్ధః సర్వశస్త్రభృతాం వరః.
ద్విసహస్రం రథాన్ వీరః పరలోకం ప్రవేశయత్
నకులస్త్రిశతం జఘ్నే సహదేవశ్చతుశతం.
ఉపావిశన్ గరుత్మంతః శరైర్గాఢం ప్రవేజితాః
అంతరిక్షే గతిర్యేషాం దర్శనం చాప్యరుధ్యత.

---

మత్తేభాలు మత్తేభాలతో - పదాతులు పదాతులతో ఆశ్వికులు ఆశ్వికులతో పోరుసాగిస్తున్నారు. ఖడ్గ పట్టిస ప్రాస తోమర పరిఘలతో వీరులు యుద్ధం చేస్తున్నారు. రక్తం ప్రవహిస్తోంది. మణిఖచిత కుండలాలంకృత శీర్షాలు నేలమీద బంతులవలె దొర్లుతున్నాయి. ఆ మహావీరుల విశాల దేహాలు సాలవృక్షాలవలె నేల కూలుతున్నాయి. చందనచర్చిత విశాల భుజాలుఘోరవిషసర్పాల వలె తెగిపడుతున్నాయి. కొందరు మూర్ఛపోతున్నారు.

ధర్మరాజు సోదరసమేతంగా శ్యేనవ్యూహంతో త్రిగర్తునిపై తిరుగబడ్డాడు. నకుల సహదేవులు పక్షాలుగా నిలచారు. భీముడు పుచ్ఛభాగంలో ఉన్నాడు. ధర్మజుడు ముఖస్థానంలో నిలిచి శాత్రవ సహస్రాలను ఖండించాడు. భీముడి హస్తాలలో రెండు వేలమంది వీరులు మరణించారు. నకుల సహదేవుల బలపరాక్రమ ప్రదర్శనలో మూడు నాలుగువందలమంది వీరులు నిహతులయారు. ఆ యుద్ధవేళ ఆకాశంలో పక్షి కూడ చరించటం లేదు. పోరు ఘోరంగా సాగుతూన్నా ఉభయ పక్షాలలో ఒక్కడూ వెనుకడుగు వేయటంలేదు. శతానీకుని చేతిలో నూరుగురు వీరులూ. విశా

తే ఘ్నంతః సమరేఽన్యోన్యం శూరాః పరిఘ
బాహవః
న శేకురభిసంరబ్ధాః శూరాన్ కర్తుంపరాఙ్ముఖాన్.
శతానీకః శతం హత్వా విశాలాక్షశ్చతుఃశతం
ప్రవిష్టౌ మహతీం సేనాంత్రిగర్తానాం మహారథౌ.
తౌ ప్రవిష్టౌ మహాసేనాం బలవంతౌ మనస్వినౌ
ఆర్ఛేతాం బహుసంరబ్ధౌ కేశాకేశి రథారథి.
లక్షయిత్వా త్రిగర్తానాం తౌ ప్రవిష్టౌ రథవ్రజం
అగ్రతః సూర్యదత్తశ్చ మదిరాక్షశ్చ పృష్ఠతః.
విరాటస్తత్రసంగ్రామేహత్వాపంచశతాన్ రథాన్
హయానాం చ శతాన్యష్టౌ హత్వా పంచ
మహారథాన్.
చరన్ స వివిధాన్ మార్గాన్ రథేన రథసత్తమః
త్రిగర్తానాం సుశర్మాణ మార్ఛద్ రుక్మరథంరణే.
తౌ వ్యావాహరతాం తత్ర మహాత్మానౌ మహాబలౌ
అన్యోన్యమభిగర్జంతౌ గోష్ఠేషు వృషభావివ.
తతో రాజా త్రిగర్తానాం సుశర్మాయుద్ధదుర్మదః
మత్స్యంసమాయాద్ రాజానం ద్వైరథేన నరర్షభః
తతో రథాభ్యాం రథినౌ వ్యతీయతురమర్షణౌ
శరాన్ వ్యసృజతాం శీఘ్రం తోయధారా
ఘనా ఇవ.
అన్యోన్యం చాపి సంరబ్ధౌ విచేరతురమర్షణౌ
కృతాస్త్రౌ నిశితైర్బాణైరసిశక్తిగదాభృతౌ.
తతో రాజా సుశర్మాణం వివ్యాధ దశభిఃశరైః
పంచభిః పంచభిశ్చాస్యవివ్యాధచతురో హయాన్.
తథైవ మత్స్యరాజానం సుశర్మా యుద్ధదుర్మదః
పంచాశతాశితైర్బాణైర్వివ్యాధ పరమాస్త్రవిత్.
తతః సైన్యం మహారాజ మత్స్యరాజసుశర్మణోః
నాభ్యజానాత్ తదాన్యోన్యం సైన్యేన రజసా
ఽఽవృతం.



లాక్షుని చేతిలో నాలుగు వందలమంది శూరులూ నేలకూలారు. విరటుని రథికులందరూ విజృంభించి త్రిగర్తసేనలకు భయసంభ్రమాలు కలిగించారు. ఆసంభ్రమంలో త్రిగర్త సైనికులు తమలో తామే పొడుచుకోసాగారు. సూర్యదత్తుడు త్రిగర్తుని సేనను చీల్చుకుసాగిపోతూంటే మదిరాక్షుడు వెనుకనుండి వారిని సంహరిస్తూ ప్రవేశించాడు. విరటుడు తన రథాన్ని విచిత్రంగా నడిపించి ఐదువందలమంది రథికులనూ, గజయూధపతిశతాన్నీ, మహారథిక పంచకాన్నీ సంహరించి సుశర్మతో ముఖాముఖి పోరుప్రారంభించాడు. ఉభయులూ సింహగర్జనలు చేస్తూ వృషభాలవలె తలపడుతున్నారు. విరటుడు ఏకకాలంలో రెండు రథాలను వినియోగించి యుద్ధం చేస్తూంటే సుశర్మ నిలువలేకపోయాడు. అస్త్రశస్త్రాలతో గదాఖడ్గాలు కూడా నడుస్తున్నాయి. విరటుడు పది బాణాలతో సుశర్మను వేధించి శరపంచకంతో వాని రథాశ్వాలను పీడించాడు. సుశర్మకూడా వెనుదిరుగ కుండా రణోన్మత్తుడై బాణవర్షం కురిపిస్తున్నాడు.

పదాతుల పాదధూళితో యుద్ధరంగమంతా చీకటిమయ మైంది. వ్యక్తికి వ్యక్తి కనిపించడం లేదు. గత్యంతరం లేక యుద్ధ విరామ భేరీ మ్రోగించారు.



## ముప్పదిమూడవ అధ్యాయం

తమసాభిప్లుతే లోకే రజసా చైవ భారత
అతిష్ఠన్ వై ముహూర్తం తు వ్యూఢానీకాః ప్రహారిణః.
తతోఽన్ధకారం ప్రణుదన్నుదతిష్ఠత చన్ద్రమాః
కుర్వాణో విమలాం రాత్రిం నందయన్ క్షత్రియాన్ యుధి.
తతః ప్రకాశమాసాద్య పునర్యుద్ధమవర్తత
ఘోరరూపం తతస్తే స్మ నావైక్షంత పరస్పరం.
తతః సుశర్మా త్రైగర్తః సహ భ్రాత్రా యవీయసా
అభ్యద్రవన్మత్స్యరాజం రథవ్రాతేన సర్వశః.
తతో రథాభ్యాం ప్రస్కంద్య భ్రాతరౌ క్షత్రియర్షభౌ
గదాపాణీ సుసంరబ్ధౌ సమభ్యద్రవతాం రథాన్.
మత్తావివ వృషావేతౌ గజావివ మదోద్ధతౌ
సింహావివ గజగ్రాహౌ శక్రవృత్రావివోత్థితౌ.
ఉభౌ తుల్యబలోత్సాహావుభౌ తుల్యపరాక్రమౌ
ఉభౌ తుల్యాస్త్రవిదుషావుభౌ యుద్ధవిశారదౌ.
తథైవ తేషాం తు బలాని తాని
క్రుద్ధాన్యథాన్యోన్యమభిద్రవంతి
గదాసిఖడ్గైశ్చ పరశ్వధైశ్చ
ప్రాసైశ్చ తీక్ష్ణాగ్రసుపీతధారైః.
బలం తు మాత్స్యస్య బలేన రాజా
సర్వం త్రిగర్తాధిపతిః సుశర్మా
ప్రమథ్య జిత్వా చ ప్రసహ్య మత్స్యం
విరాటమోజస్వినమభ్యధావత్.
తౌ నిహత్య పృథగ్ ధుర్యావుభౌ తౌ పార్ష్ణిసారథీ
విరథం మత్స్యరాజానం జీవగ్రాహమగృహ్ణతాం
తమున్మథ్య సుశర్మాథ యువతీమివ కాముకః
స్యందనం స్వం సమారోప్య ప్రియయౌ శీఘ్రవాహనః
తస్మిన్ గృహీతే విరథే విరాటే బలవత్తరే
ప్రాద్రవంత భయాన్మత్స్యాస్త్రిగర్తైరర్దితా భృశం
తేషు సంత్రాస్యమానేషు కుంతీపుత్రో యుధిష్ఠిరః
ప్రత్యభాషన్మహాబాహుం భీమసేనమరిందమం.

---

## ముప్పదిమూడవ అధ్యాయం

సాయంసంధ్యారుణరోచులు చల్లచల్లగా జారిపోయాయి. అంధతమస్సు దశదిశలా వ్యాపించింది. ధూళిధూసరిత దేహాలతో సైన్యాలు యుద్ధం మాని నిలబడ్డాయి. వీరక్షత్రియులకు పరమ సంతోషం కల్గిస్తూ చంద్రుడుదయించి అంధకారాన్ని మాయం చేశాడు. ఆ వెన్నెలలో మళ్ళీ యుద్ధం ప్రారంభమైంది. రణావేశోన్మత్తులైన వీరులు ఆ చంద్రకాంతిలో ఒకరి నొకరు గుర్తించలేక పోతున్నారు. త్రిగర్తుడు తన కనిష్ట సోదరుని వెంటపెట్టుకుని రథబలం ముందు నడుపుతూ విరటుని మీదికి నడిచాడు. సంగ్రామకుశలులైన ఆ వీరు లిద్దరూ ఉన్మత్తగజాలవలె విరటునిపై విరుచుకు పడ్డారు. విరాట సేనలు సర్వాయుధాలూ ధరించి శత్రుసేనలను నిలువరించాయి. త్రిగర్త సేనలు విరటసేనలను కలవరపరిచాయి. సుశర్మ సోదర సహితుడై విరటునిమీదికి తీవ్రవేగంతో పోయి వాని అశ్వాలను సంహరించి పార్శ్వరక్షకులనూ సారథినీ హతమార్చి విరటుని బంధించి తీసుకుపోతున్నాడు. అదిచూసి మత్స్యసేనలు హాహా రవాలు ప్రారంభించాయి.

మత్స్యరాజః పరామృష్టస్త్రిగర్తేనసుశర్మణా
తం మోచయ మహాబాహో న గచ్ఛేద్
ద్విషతాం వశం.
ఉషితాః స్మ సుఖం సర్వేసర్వకామైఃసుపూజితాః
భీమసేన త్వయా కార్యా తస్య వాసస్యనిష్కృతిః
అహమేనం పరిత్రాస్యే శాసనాత్ తవ పార్థివ
పశ్యమే సుమహత్ కర్మ యుధ్యతఃసహశత్రుభిః
స్వబాహుబలమాశ్రిత్య తిష్ఠ త్వం భ్రాతృభిఃసహ
ఏకాంతమాశ్రితో రాజన్ పశ్య మేఽద్య
పరాక్రమం.
సుస్కంధోఽయం మహావృక్షోగదారూపఇవస్థితః
అహమేనమపారుజ్య ద్రావయిష్యామి శాత్రవాన్
తం మత్తమివ మాతంగం వీక్షమాణం వనస్పతిం
అబ్రవీత్ భ్రాతరం వీరం ధర్మరాజో యుధిష్ఠిరః.
మా భీమ సాహసం కార్షీ స్తిష్ఠత్వేష వనస్పతిః
మా త్వాంవృక్షేణకర్మాణికుర్వాణమతిమానుషం
జనాః సమవబుధ్యేరన్ భీమోఽయమితి భారత
అన్యదేవాయుధం కించిత్ ప్రతిపద్యస్వమానుషం
చాపం వా యది వా శక్తిం నిస్త్రింశం వా పరశ్వధం
యదేవ మానుషం భీమ భవేదన్యైరలక్షితం.
తదేవాయుధమాదాయ మోక్షయాశు మహీపతిం
యమౌ చ చక్రరక్షౌ తే భవితారౌ మహాబలౌ.
సహితాః సమరే తత్ర మత్స్యరాజం పరీప్సత
ఏవముక్తస్తు వేగేన భీమసేనో మహాబలః.
గృహీత్వా తు ధనుం శ్రేష్ఠం జవేన సుమహాజవః
వ్యముంచచ్ఛరవర్షాణి సతోయ ఇవ తోయదః.
తం భీమో భీమకర్మాణం సుశర్మాణమథాద్రవత్
విరాటం సమవీక్ష్యైనం తిష్ఠ తిష్ఠేతి చావదత్.
సుశర్మాచింతయామాస కాలాంతక యమోపమం
తిష్ఠ తిష్ఠేతి భాషంతం పృష్ఠతో రథపుంగవః
పశ్యతాంసుమహత్కర్మ మహద్యుద్ధముపస్థితం.
పరావృత్తో ధనుర్గృహ్య సుశర్మా భ్రాతృభిఃసహ
నిమేషాంతరమాత్రేణ భీమసేనేన తే రథాః.
రథానాం చ గజానాం చ వాజినాం చ ససాదినాం
సహస్రశతసంఘాతాః శూరాణాముగ్రధన్వినాం.
పాతితా భీమసేనేన విరాటస్య సమీపతః
పత్తయో నిహతాస్తేషాం గదాం గృహ్య
మహాత్మనా.

---

విన్నాడు ధర్మరాజు. తక్షణం భీముని పిలిచి - మహావీరా విరటుడు త్రిగర్తబంధితుడై పోయాడు. వానిని తక్షణం విడిపించుకురా. ఇంతకాలం మనం వీని ఆశ్రయంలో సుఖంగా నివసించాం. ఆ మహారాజు మన అభీష్టానుసారం అన్నీ సమకూర్చి సత్కరించాడు. ఇప్పుడు మన కృతజ్ఞత ప్రకటించుకోడానికి సావకాశం దొరికింది. ఆలశ్యం చెయ్యక తక్షణం వెళ్లు - అని ఆజ్ఞాపించగా భీముడు వాని ఆదేశానుసారం తక్షణం బయలుదేరి విరట భూపతిని తీసికొని వస్తానని నకుల సహదేవ సమేతంగా తన సాహసపరాక్రమాలు రహస్యంగా వీక్షిస్తూ ఉండమని చెప్పి అక్కడే ఉన్న ఒక మహావృక్షాన్ని పెకలించబోతూండగా ధర్మరాజు వానిని వారిస్తూ - సోదరా, ఇటువంటి దుస్సాహసాలు చేసినట్లైతే నువ్వు భీముడవని తెలిసి పోతుంది. ఈ మానవాతీతకర్మలు మాని సహజ యుద్ధం సాగించు. గదా ఖడ్గ శక్తి ధనురాద్యాయుధాలతో వెళ్ళి విరటునికి విముక్తి కల్గించు. నకుల సహదేవులు నీ చక్రరక్షకులుగా ఉంటారు. మీరు ముగ్గురూ త్వరగా వెళ్ళి విరటుని విడిపించండి - అన్నాడు.

భీముడు ఉత్తమ ధనుస్సు ధరించి బాణవర్షం

తద్ దృష్ట్వా తాదృశం యుద్ధం సుశర్మా యుద్ధదుర్మదః
చింతయామాస మనసా కిం శేషం హి బలస్య మే
అపరో దృశ్యతే సైన్యే పురా మగ్నో మహాబలే
ఆకర్ణపూర్ణేన తదా ధనుషా ప్రత్యదృశ్యత
సుశర్మా సాయకాంస్తీక్ష్ణాన్ క్షిపతే చ పునఃపునః
తతః సమస్తాస్తే సర్వే తురగానభ్యచోదయన్
దివ్యమస్త్రం వికుర్వాణాస్త్రిగర్తాన్ ప్రత్యమర్షణాః
తాన్ నివృత్తరథాన్ దృష్ట్వా పాండవానాం సా మహాచమూః
వైరాటిః పరమక్రుద్ధో యుయుధే పరమాద్భుతం
సహస్రమవధీత్ తత్ర కుంతీపుత్రో యుధిష్ఠిరః
భీమః సప్త సహస్రాణి యమలోకమదర్శయత్.
నకులశ్చాపి సప్తైవ శతాని ప్రాహిణోచ్ఛరైః
శతాని త్రీణి శూరాణాం సహదేవః ప్రతాపవాన్
యుధిష్ఠిరసమాదిష్టో నిజఘ్నే పురుషర్షభః
తతోఽభ్యపతదత్యుగ్రః సుశర్మాణముదాయుధః.
హత్వా తాం మహతీం సేనాం త్రిగర్తానాం మహారథః
తతో యుధిష్ఠిరో రాజా త్వరమాణో మహారథః
అభిపత్య సుశర్మాణం శరైరభ్యాహనద్ భృశం
సుశర్మాపి సుసంరబ్ధ స్త్వరమాణో యుధిష్ఠిరం.
అవిధ్యన్నవభిర్బాణైశ్చతుర్భిశ్చతురో హయాన్
తతో రాజన్నాశుకారీ కుంతీపుత్రో వృకోదరః
సమాసాద్య సుశర్మాణమశ్వానస్య వ్యపోథయత్
పృష్ఠగోపాంశ్చ తస్యాథ హత్వా పరమసాయకైః
అథాస్య సారథిం క్రుద్ధో రథోపస్థాదపాతయత్
చక్రరక్షశ్చ శూరో వై మదిరాక్షోఽతివిశ్రుతః.
సమయాద్ విరథం దృష్ట్వా త్రిగర్తం ప్రాహరత్ తదా
తతో విరాటః ప్రస్కంద్య రథాదథ సుశర్మణః.
గదాం తస్య పరామృశ్య తమేవాభ్యద్రవద్బలీ
స చచార గదాపాణిర్వృద్ధోఽపి తరుణో యథా.

---

కురిపిస్తూ శత్రుసేనలను చెండాడి కాలాంతకుని వలె సుశర్మను సమీపించి సింహగర్జన చేస్తూ తనతో పోరగల వీరుడు ఆ సేనలో ఉంటే ఎదురు రావచ్చునన్నాడు.

సుశర్మ సోదర **సహితుడై** యుద్ధసన్నద్ధుడు కాబోతూండగా భీముడు వాని చతురంగ బలాలనూ ఊచముట్టుగా సంహరిస్తున్నాడు. అంతలో గద ధరించి లక్షమంది త్రిగర్త సైనికులను సంహరించాడు. అప్పుడు సుశర్మ ఆ భయంకర యుద్ధాన్ని చూసి సేనావాహినిలో ఉన్న తన ద్వితీయ సోదరుడు గూడ భీముని చేతిలో బలి కావచ్చునని భయపడి నారిసారించి బాణవర్షం ప్రారంభించాడు. భీముని పరాక్రమంచూసి విరట సేనలు పరమోత్సాహంతో ముందుకుదూకాయి. ధర్మరాజు వేయిమంది త్రిగర్త వీరులను హతమార్చాడు. ఆ సమయంలో భీముడు ఏడు వేల మందినీ నకులుడు ఏడు వందల మందినీ సహదేవుడు మూడు వందల మందినీ యమపురికి అతిథులుగా పంపారు.

మహారథికుడైన సహదేవుడూ ధర్మరాజూ సుశర్మతో ప్రత్యక్షంగా పోరు ప్రారంభించారు. సుశర్మ నాల్గు వాడి బాణాలతో ధర్మజుని రథాశ్వాలను నేల కూల్చేసరికి భీముడు సుశర్మ రథాశ్వాలను నేలకూల్చాడు. అంతతో ఆగక భీముని బాహుబలం సుశర్మ సారథినీ పృష్ఠరక్షకులనూ బలిగొన్నది. రథహీనుడైన సుశర్మను సమీపించి మదిరాక్షుడు బాణవర్షం కురిపిస్తున్నాడు. విరటుడు బంధవిముక్తుడై గద ధరించి సుశర్మపై తిరుగ

పలాయమానం త్రైగర్తం దృష్ట్వా
భీమోఽభ్యభాషత
రాజపుత్ర నివర్తస్వ న తే యుక్తం పలాయనం.
అనేన వీర్యేణ కథం గాస్త్వం ప్రార్థయసే బలాత్
కథం చానుచరాంస్త్యక్త్వా శత్రుమధ్యే విషీదసి.
ఇత్యుక్తః స తు పార్థేన సుశర్మా రథయూథపః
తిష్ఠ తిష్ఠేతి భీమం స సహసాఽభ్యద్రవద్ బలీ.
భీమస్తు భీమసంకాశో రథాత్ ప్రస్కంద్య పాండవః
ప్రాద్రవత్ తూర్ణమవ్యగ్రో జీవితేప్సుః సుశర్మణః
తం భీమసేనో ధావంతమభ్యధావత వీర్యవాన్
త్రిగర్తరాజమాదాతుం సింహః క్షుద్రమృగం యథా
అభిద్రుత్య సుశర్మాణం కేశపక్షే పరామృశత్
సముద్యమ్య తు రోషాత్ తం నిష్పిపేష మహీతలే
పదా మూర్ధ్ని మహాబాహుః ప్రాహరద్ విలపిష్యతః
తస్య జానుం దదౌ భీమో జఘ్నే చైనమరత్నినా
స మోహమగమద్ రాజా ప్రహారవరపీడితః.
తస్మిన్ గృహీతే విరథే త్రిగర్తానాం మహారథే
అభజ్యత బలం సర్వం త్రైగర్తం తద్ భయాతురం
నివర్త్య గాస్తతః సర్వాః పాండుపుత్రా మహారథాః
అవజిత్య సుశర్మాణం ధనం చాదాయ సర్వశః.
స్వబాహుబలసంపన్నా హ్రీనిషేవా యతవ్రతాః
విరాటస్య మహాత్మనః పరిక్లేశవినాశనాః
స్థితాః సమక్షం తే సర్వే త్వథ భీమోఽభ్యభాషత
నాయం పాపసమాచారో మత్తో జీవితుమర్హతి
కింతు శక్యం మయా కర్తుం యద్ రాజా సతతం ఘృణీ.
గళే గృహీత్వా రాజానమానీయ వివశం వశం
తత ఏనం విచేష్టంతం బద్ధ్వా పార్థో వృకోదరః.
రథమారోపయామాస విసంజ్ఞం పాంసుగుంఠితం
అభ్యేత్య రణమధ్యస్థమభ్యగచ్ఛద్ యుధిష్ఠిరం.
దర్శయామాస భీమస్తు సుశర్మాణం నరాధిపం
ప్రోవాచ పురుషవ్యాఘ్రో భీమమాహవశోభినం.
తం రాజా ప్రాహసద్ దృష్ట్వా ముచ్యతాం వై
నరాధమః
ఏవముక్తోఽబ్రవీద్ భీమః సుశర్మాణం మహాబలం.
జీవితుం చేచ్ఛసే మూఢ హేతుం మే గదతః శృణు
దాసోఽస్మీతి త్వయా వాచ్యం సంసత్సు చ సభాసు చ.

---

బద్దాడు. సుశర్మ పలాయన మంత్రం పఠిస్తూంటే భీముడు ఎలుగెత్తి – ఓ రాజకుమారా వెన్నుజూపి పరుగుపెట్టడం రాజధర్మంకాదు. ఈ మాత్రం పరాక్రమం గలవాడివి విరటుని గోధనాన్ని హరిద్దామనే వచ్చావా. సపరిచారకులనూ సైనికులనూ శత్రుమధ్యంలో వదిలి పరుగెత్తకు – అని గర్జించే సరికి తిరిగి త్రైలలోని రథయూథాధిపతి కుపితుడై సుశర్మను నిలబడమని భీముని ఎదుర్కోడానికి సన్నద్ధుడయ్యాడు. భీమ బాహుబలంముందు వాడు కూడా అరతే అయ్యాడు. సుశర్మ పరుగిడుతూనే ఉన్నాడు. భీముడు తరిమితరిమి పట్టుకొని జుట్టుపట్టి నేలకు విసిరికొట్టి తన్నసాగాడు. భీమపదాఘాతంతో త్రిగర్తుడు మూర్ఛపోయాడు. మహారాజు బంధితుడు కావడంతో సేనలు దిక్కులు పట్టాయి.

విరటుని గోధనం వెనుదిరిగింది. భీముడు సుశర్మను విరటుని దగ్గరకు తెచ్చి – ఈ పాపికింక బ్రతికే యోగం లేదు. వీని నేం చేయాలో చెప్పండి – అంటూ సుశర్మను రజ్జువులతో బంధించి రథంమీద పడేసాడు.

భీముడు ధర్మరాజును సమీపించి నిలబడగా యుధిష్ఠిరుడు నవ్వుతూ సుశర్మను విడిచిపెట్టమని ఆజ్ఞాపించాడు. భీముడు సుశర్మవైపు తిరిగి – ఓరి మూర్ఖుడా నీకు జీవితం మీద ఆశ ఉంటే సర్వ

ఏవం తే జీవితం దద్యామేవ యుద్ధజితో విధిః
తమువాచ తతో జ్యేష్ఠో భ్రాతా సప్రణయంవచః
ముంచ ముంచాధమాచారం ప్రమాణం యది తే
వయం
దాసభావం గతో హ్యేష విరాటస్య మహీపతేః
అదాసో గచ్ఛ ముక్తో౽సి మైవం కార్షీః కదాచన.

## ముప్పదినాలుగవ అధ్యాయం

ఏవముక్తే తు సవ్రీడః సుశర్మా౽౽సీదధోముఖః
స ముక్తో౽భ్యేత్య రాజాన మభివాద్య ప్రతస్థివాన్
విసృజ్య తు సుశర్మాణం పాండవాస్తే హతద్విషః
స్వబాహుబలసంపన్నా హ్రీనిషేవా యతవ్రతాః
సంగ్రామశిరసోమధ్యే తాం రాత్రింసుఖినో౽వసన్
తతో విరాటః కౌంతేయానతిమానుషవిక్రమాన్
అర్చయామాస విత్తేన మానేన చ మహారథాన్
యథైవ మమ రత్నాని యుష్మాకం తానివై తథా
కార్యం కురుత వై సర్వే యథాకామం యథాసుఖం
దదామ్యలంకృతాః కన్యా వసూని వివిధాని చ
మనసశ్చాప్యభిప్రేతం యుద్ధే శత్రునిబర్హణాః.
యుష్మాకం విక్రమాదద్య ముక్తో౽హం
స్వస్తిమానిహ
తస్మాద్ భవంతో మత్స్యానామీశ్వరాః సర్వ
ఏవ హి.
తథేతివాదినం మత్స్యం కౌరవేయాః పృథక్ పృథక్
ఊచుః ప్రాంజలయః సర్వే యుధిష్ఠిరపురోగమాః.

రాజసభలకూ పోయి - విరటభూపతికి సుశర్మ దాసుడు అని చాటుకో. ఇందుకు నువ్వు అంగీకరిస్తే నీకు ప్రాణదానం చేస్తాను - అని గర్జించగా ధర్మరాజు భీముని పిలిచి - పరాజితుడెప్పుడూ దాసుడే. విజేతలు ఔదార్యం చూపించాలి. వానిని విడిచిపెట్టు - అనగా భీముడు సుశర్మను మందలించి కొంత నీతిబోధచేసి విడిచిపెట్టాడు.

## ముప్పదినాలుగవ అధ్యాయం

ధర్మరాజు మాటలతో సుశర్మ సిగ్గుపడి క్షణకాలం తలవాల్చి నిలబడి విరటుని సమీపించి పాదప్రణామంచేసి వాని శెలవు తీసికొని స్వదేశానికి వెళ్ళిపోయాడు. శత్రువులను ఓడించిన సంతోషంతో పాండవులు పరమానందంతో ఆ రాత్రి సుఖంగా గడిపారు.

తూర్పు దిక్కులో ఉదయారుణరోచులు ప్రసరిస్తున్నాయి. పాండవుల పరాక్రమానికి ఉచితమైన బహూకృతులు సమర్పించే సంకల్పంతో కొలువు తీర్చిన విరటుడు - మహావీరులారా - ఈ ధనకనకవస్తువాహనాలపై నాతో సమమైన అధికారం మీకు కూడా ఉంది. మీ మనస్సు ఏ పని చేయదలచుకొంటే అది చేయడానికి మాకేమీ అభ్యంతరం లేదు. చీనిచీనాంబర భూషణాలంకృతలైన యువతీజనాన్నీ రత్నరాసులనూ సంతోషంతో మీకు బహూకరిస్తున్నాను. మీ మనోభీష్టాలకు ఎప్పుడూ ఏ అభ్యంతరమూ లేదు. అన విని ధర్మరాజు చేతులు జోడించి - ప్రభూ

ప్రతినందామ తే వాక్యం సర్వం చైవ విశాంపతే
ఏతేనైవ ప్రతీతాః స్మ యత్ త్వం ముక్తోఽద్య శత్రుభిః.
తతోఽబ్రవీత్ ప్రీతమనా మత్స్యరాజో యుధిష్ఠిరం
పునరేవ మహాబాహుర్విరాటో రాజసత్తమః
ఏహి త్వామభిషేక్ష్యామి మత్స్యరాజస్తు నో భవాన్
మనసశ్చాప్యభిప్రేతం యత్తేష్టం భువి దుర్లభం
తత్ తేఽహం సంప్రదాస్యామి సర్వమర్హతి నో భవాన్.
రత్నాని గాః సువర్ణం చ మణిముక్తమథాపి చ
వైయాఘ్రపద్య విప్రేంద్ర సర్వథైవ నమోఽస్తు తే
త్వత్కృతే హ్యద్య పశ్యామి రాజ్యం సంతానమేవ చ
యతశ్చ జాతసంరంభో న చ శత్రువశం గతః.
తతో యుధిష్ఠిరో మత్స్యం పునరేవాభ్యభాషత
ప్రతినందామి తే వాక్యం మనోజ్ఞం మత్స్య భాషసే.
ఆనృశంస్యపరో నిత్యం సుసుఖః సతతం భవ
పునరేవ విరాటశ్చ రాజా కంకమభాషత.
అహో సూదస్య కర్మాణి బల్లవస్య ద్విజోత్తమ
సోఽహం సూదేన సంగ్రామే బల్లవేనాభిరక్షితః.
త్వత్కృతే సర్వమేవైతదుపపన్నం మమానఘ
వరం వృణీష్వ భద్రం తే బ్రూహి కిం కరవాణి తే
దదామి తే మహాప్రీత్యా రత్నాన్యుచ్చావచాని చ
శయనాసనయానాని కన్యాశ్చ సమలంకృతాః.
హస్త్యశ్వరథసంఘాశ్చ రాష్ట్రాణి వివిధాని చ
ఏతాని చ మమ ప్రీత్యా ప్రతిగృహ్ణీష్వ సువ్రత.
తం తథావాదినం తత్ర కౌరవ్యః ప్రత్యభాషత
ఏకైవ తు మమ ప్రీతిర్యత్ త్వం ముక్తోఽసి శత్రుభిః
ప్రతీతశ్చ పురం తుష్టః ప్రవేక్ష్యసి తదానఘ.
దారైః పుత్త్రైశ్చ సంశ్లిష్య సా హి ప్రీతిర్మమాతులా
గచ్ఛంతు దూతాస్త్వరితం నగరం తవ పార్థివ.

---

మీ మాటలు మా కెంతో సంతోషం కలిగించాయి. మీ కానుకలు మా కెంతో తృప్తిని కలిగించాయి. అన్నిటి కంటె శత్రువుల నుండి మీరు విముక్తులు కావడం మాకు పరమసంతోషదాయకమైన విషయం - అనగా విరటుడు ప్రసన్నుడై - కంకా మా రాజ్యానికి మిమ్ము అధిపతిగా అభిషేకిస్తున్నాను. ఈ భూమండలంలో మీ రేది కోరినా తెచ్చి ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను. మావల్ల మీకు లభించనిది లేదు వైయాఘ్రపదగోత్రంలో ఉద్భవించిన విప్రశ్రేష్ఠులు మీరు ఈ మణిరత్న సువర్ణరాసులూ ఈ గోగణాలూ వినయపూర్వకంగా మీకు సమర్పించి నమస్కరించుకొంటున్నాను. మీ అనుగ్రహంవల్లనే నాకు నా సంతానాన్ని చూచే యోగం కలిగింది. ఈ రాజ్యభోగా లనుభవించే అదృష్టం ప్రాప్తించింది. త్రిగర్తబంధితుడనై భయభ్రాంతులలో పడ్డప్పుడు మీరు పరాక్రమించి నన్ను విముక్తుణ్ణి చేశారు. అందుకు నాకృతజ్ఞత - అన్నాడు.

మహారాజా మీ ప్రసంగం సజ్జనోచితంగా ఉంది. సంతోషజనకంగానూ ఉంది. మీరు దయా స్వభావులు. సుఖజీవితం సాగించడమే మా వాంఛ - అని ధర్మరా జనగా - ద్విజశ్రేష్ఠా వల్లవునివంటలలో ఎన్నో విచిత్రమైన రుచులు మా కందుతున్నాయి. ఈ రణరంగంలో భీకరయుద్ధంచేసి నన్ను రక్షించాడు. మీవల్లనే నా కీ బంధవిముక్తి లభించింది. కనక కావలసిన వరం కోరుకోండి. మీకు కావలసిన సేవలు ఆజ్ఞాపించండి. నా కానుకలు గ్రహించి నన్నానందపరచండి - అని విరటు డన్నాడు.

ప్రభూ శత్రుహస్తాలనుండి మీరు విముక్తి

సుహృదాం ప్రియమాఖ్యాతుం ఘోషయంతు చ తే జయం
తతస్తద్వచనాన్మత్స్యో దూతాన్ రాజా సమాదిశత్.
ఆచక్షధ్వం పురం గత్వా సంగ్రామవిజయం మమ
కుమార్యః సమలంకృత్య పర్యాగచ్ఛంతు మే పురాత్.
వాదిత్రాణి చ సర్వాణి గణికాశ్చ స్వలంకృతాః
ఏతాం చాజ్ఞాం తతః శ్రుత్వా రాజ్ఞా మత్స్యేన నోదితాః
తామాజ్ఞాం శిరసా కృత్వా ప్రస్థితా హృష్టమానసాః.
తే గత్వా తత్ర తాం రాత్రిమథ సూర్యోదయం ప్రతి
విరాటస్య పురాభ్యాసే దూతా జయమఘోషయన్



## ముప్పది అయిదవ అధ్యాయం

యాతే త్రిగర్తాన్ మత్స్యే తు పశూంస్తాన్ వై పరీప్సతి
దుర్యోధనః సామాత్యో విరాటముపయాదథ.
భీష్మో ద్రోణశ్చ కర్ణశ్చ కృపశ్చ పరమాస్త్రవిత్
ద్రౌణిశ్చ సౌబలశ్చైవ తథా దుశ్శాసనః ప్రభో.
వివింశతిర్వికర్ణశ్చ చిత్రసేనశ్చ వీర్యవాన్
దుర్ముఖో దుశ్శలశ్చైవ యే చైవాన్యే మహారథాః
ఏతే మత్స్యానుపాగమ్య విరాటస్య మహీపతేః
ఘోషాన్ విద్రావ్య తరసా గోధనం జహ్రురోజసా
షష్టిం గవాం సహస్రాణి కురవః కాలయంతి చ
మహతా రథవంశేన పరివార్య సమంతతః
గోపాలానాం తు ఘోషస్య హన్యతాం తైర్మహారథైః
ఆరావః సుమహానాసీత్ సంప్రహారే భయంకరే.
గోపాధ్యక్షో భయత్రస్తో రథమాస్థాయ సత్వరః
జగామ నగరాయైవ పరిక్రోశం స్తదాఽఽర్తవత్.

కావడం కంటె మాకు కావలసిందేమీ లేదు. సంతోషంతో నగరం ప్రవేశించి బంధుమిత్రులను కూడి సుఖించండి. మనవిజయవార్తను దూతల ద్వారా నగరానికి పంపండి– అని ధర్మరాజనగా విరటుడు దూతలను పిలిచి త్రిగర్తులపై సాధించిన విజయవార్తను నగరమంతా చాటించి విజయోత్సవానికి అవసరమైన సన్నాహాలు ఏర్పాటు చేయమన్నాడు. మహారాజుకు స్వాగతమివ్వడానికి నగరకన్యకలు మంగళదివ్వెలతో వేశ్యలూ తూర్యనాదాలూ సిద్ధంగా ఉండాలన్నాడు. రాజాజ్ఞలు శిరసావహించి దూతలు రాత్రికి రాత్రి నగరంచేరి ఉత్సవవార్త ప్రకటించారు.



## ముప్పది అయిదవ అధ్యాయం

### ఉత్తర గోగ్రహణము.

త్రిగర్తుడు తరలించిన గోవులను మరలించుకు రావడానికి విరటుడు సేనతో బయలుదేరి వెళ్ళినప్పుడే దుర్యోధనుడు తన మంత్రి, మిత్ర బాంధవ జనంతో విరాట నగరాన్ని ఉత్తరదిశగావచ్చి ముట్టడించాడు. ఆముట్టడిలో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలూ, దుశ్శాసన కర్ణ వికర్ణ వివింశతి, శకుని, చిత్రసేన, దుర్ముఖ, దుశ్శలాది మహారథులందరూ దుర్యోధనుని అనుసరించివచ్చారు. గోష్ఠాలలో బంధింపబడిఉన్న విరటుని అరువేల గోవులను అపహరించడానికి వారు ప్రయత్నంచగా గోపాలకులు అడ్డుతగిలారు. కౌరవ మహారథికులు

స ప్రవిశ్య పురం రాజ్ఞో నృపవేశ్మాభ్యయాత్ తతః
అవతీర్య రథాత్ తూర్ణమాఖ్యాతుం ప్రవివేశ హ
దృష్ట్వా భూమింజయం నామ పుత్రం మత్స్యస్య మానినం
తస్మై తత్ సర్వమాచష్ట రాష్ట్రస్య పశుకర్షణం.
షష్టిం గవాం సహస్రాణి కురవః కాలయంతి తే
తద్విజేతుం సముత్తిష్ఠ గోధనం రాష్ట్రవర్ధన.
రాజపుత్రహితప్రేప్సుః క్షిప్రం నిర్యాహి చ స్వయం
త్వాం హి మత్స్యో మహీపాలః శూన్యపాలమిహాకరోత్
త్వయా పరిషదో మధ్యే శ్లాఘతే స నరాధిపః
పుత్రో మమానురూపశ్చ శూరశ్చేతి కులోద్వహః
ఇష్వస్త్రే నిపుణో యోధః సదా వీరశ్చ మే సుతః
తస్య తత్ సత్యమేవాస్తు మనుష్యేంద్రస్య భాషితం.
ఆవర్తయ కురూన్జిత్వా పశూన్ పశుమతాం వర
నిర్దహైషామనీకాని భీమేన శరతేజసా.
ధనుశ్చ్యుతై రుక్మపుంఖైః శరైః సంనతపర్వభిః
ద్విషతాం భింధ్యనీకాని గజానామివ యూథపః.
పాశోపధానాం జ్యాతంత్రీం చాపదండాం మహాస్వనాం
శరవర్ణాం ధనుర్వీణాం శత్రుమధ్యే ప్రవాదయ.
శ్వేతా రజతసంకాశా రథే యుజ్యంతు తే హయాః
ధ్వజం చ సింహం సౌవర్ణముచ్ఛ్రయంతు తవ ప్రభో.
రుక్మపుంఖాః ప్రసన్నాగ్రా ముక్తా హస్తవతా త్వయా
ఛాదయంతు శరాః సూర్యం రాజ్ఞాం మార్గనిరోధకాః.
రణే జిత్వా కురూన్ సర్వాన్ వజ్రపాణిరివాసురాన్
యశో మహదవాప్య త్వం ప్రవిశేదం పురం పునః

---

వారిని పరిపరివిధాల హింసించారు. గోపాలకులు భీతులై ఆర్తనాదాలతో రథాలమీద రాజధానికి పోయారు. రాజసౌధం ప్రవేశించి రాజపుత్రుడైన (భూమింజయునికి) ఉత్తరునకు ఆవార్త చెప్పేసంకల్పంతో – రాకుమారా మత్స్య దేశాభ్యుదయాన్ని శ్రేయస్సునూ కోరే మీరు తక్షణం బయలుదేరి మనగోవులను హరించుకుపోతూన్న కౌరవులను నిరోధించి గోగణాలను తరలించుకురండి. మహారాజు నగరంలో లేనప్పుడు ఆ భారం మీరే వహించాలి. మీరు వెంటనే మీ శౌర్యాన్ని ప్రకటించండి. ఈవంశమర్యాదను మీరు రక్షించగలరని శస్త్రాస్త్ర విద్యలో మీరు పారంగతులని మీ తండ్రిగారికి విశ్వాసం కలిగించండి. ఈ భూమండలంలో మత్స్యదేశానికి గల గోసంపద మరి ఏ దేశానికీ లేదు. దానిని రక్షించుకోవలసిన బాధ్యత మీ మీద ఉంది. మీ పౌరషప్రతాపాలను ఉగ్గడిస్తూ మహారాజు ఇదివరలో ఎన్నో మారులు చేసిన ప్రసంగాలను ఇప్పుడు మీరు ఋజువుచేయాలి. మీ ధనుష్టంకారంతో శత్రువీరుల గుండె లదరచేసి బాణాగ్నితో వారిని దగ్ధం చేసి మనగోవులను మరలించండి. మీ ధనుర్వీణానాదం వారి చెవులలో మారుమ్రోగాలి. దానినారి తంతువుగా, ధనువే దండంగా, వెలువడే బాణాలే స్వరాలుగా రణరంగంలో బాణ వీణ వాయించండి. స్వచ్ఛశ్వేతాశ్వాలు పూన్చిన రథంపై సింహాలాంఛనం ప్రతిష్ఠించి యుద్ధానికి బయలుదేరండి. మీరు విడిచే బాణాలు సూర్యకాంతిని నిరోధించి శత్రుకోటిని భీతావహం చెయ్యాలి వజ్రహస్తుడై దేవేంద్రుడు రాక్షస సమూహాలను నాశనంచేసినట్లు ధనుర్ధరులై మీరు కౌరవులను ఓడించి యశఃకాంతను చేపట్టండి. మా మహారాజుకు మీరు ప్రియపుత్రులు కనుక ఈ దేశ

త్వం హి రాష్ట్రస్య పరమా గతిర్మత్స్యపతేః సుతః
యథా హి పాండుపుత్రాణామర్జునోజయతాం వరః
ఏవమేవ గతిర్నూనం భవాన్ విషయవాసినాం
గతిమంతో వయం త్వద్య సర్వే విషయవాసినః.
స్త్రీమధ్య ఉక్తస్తేనాసౌ తద్ వాక్యమభయంకరం
అంతఃపురే శ్లాఘమాన ఇదం వచనమబ్రవీత్.

## ముప్పది ఆరవ అధ్యాయం

అద్యాహమనుగచ్ఛేయం దృఢధన్వా గవాంపదం
యది మే సారథిః కశ్చిత్ భవేదశ్వేషు కోవిదః
తంత్వహం నావగచ్ఛామి యో మే యంతా భవేన్నరః
పశ్యధ్వంసారథిం క్షిప్రంమమయుక్తంప్రయాస్యతః
అష్టావింశతిరాత్రంవా మాసంవా నూనమంతతః
యత్ తదాసీన్మహద్యుద్ధం తత్ర మే సారథిర్హతః
సలభేయం యదా త్వన్యం హయయానవిదంనరం
త్వరావానద్య యాత్వాహం సముచ్ఛ్రితమహాధ్వజం.
విగాహ్య తత్పరానీకం గజవాజిరథాకులం
శస్త్రప్రతాపనిర్వీర్యాన్ కురూన్జిత్వాఽఽనయే పశూన్.
దుర్యోధనం శాంతనవం కర్ణం వైకర్తనం కృపం
ద్రోణంచసహపుత్రేణమహేష్వాసాన్ సమాగతాన్
విత్రాసయిత్వా సంగ్రామే దానవానివ వజ్రభృత్
అనేనైవ ముహూర్తేన పునఃప్రత్యానయే పశూన్
శూన్యమాసాద్య కురవః ప్రయాంత్యాదాయ గోధనం
కింనుశక్యం మయాకర్తుం యదహం తత్రనాభవం

రక్షణభారం మీ మీద ఉంది. పాండవులకు అర్జునునివలె ఈరాజ్యానికి మీరే గతి. మీవల్లనే మేము రక్షింపబడుతున్నాము – అన్నారు.

అంతఃపురస్త్రీజనమధ్యంలో ఉన్న ఉత్తరుడు గోపాలకులు గానంచేసిన ప్రశస్తిని విని ఒక్కసారి అక్కడివారి నందరినీ తిలకించి గోపాలకుల వైపు తిరిగాడు.

## ముప్పది ఆరవ అధ్యాయం

### ఉత్తర కుమారుడు

**నా**చేతిలో దృఢమైనధనుస్సుఉంది. దానితో శత్రువులను జయించగలను. అయితే అశ్వశిక్షణ కౌశలం గల సారథి లేడు. నాకు తగిన సారథి ఉన్నట్లైతే ఇప్పుడే బయలుదేరి వెళ్ళి శత్రుసేనలను ఓడించి మన గోవులను తరల్చుకురాగలను. ఇదివరలో జరిగిన యుద్ధంలో నా సారథి మరణించాడు. అటువంటి సారథి దొరకాలే గాని ఈ చతురంగబలాలను ఓడించటం ఒక లెక్కగాదు.

దేవేంద్రుడు దానవపరాభవం గావించినట్లు నేను గోహరణార్థంవచ్చిన దుర్యోధన భీష్మ ద్రోణ కృప కర్ణ అశ్వత్థామాదులను ఓడించిరాగలను. సారథి లేకపోవడంవల్ల నే నింకా ఇక్కడే ఉండిపోవలసి వచ్చింది. సామాన్యులైన గోపాలకులను బెదిరించి కౌరవులు మా గోధనం హరించారు. వారందరూ నాపరాక్రమం చూసి ఓహో! వీడు అర్జునుడు కాదుగదా! అనుకునేటట్లు చేస్తాను – అని ఉత్తరుడు పలుకుతూంటే పారిషదులలోఉన్న అర్జునుడు గర్వంతో సంతోషించాడు.

పశ్యేయురద్య మే వీర్యం కురవస్తే సమాగతాః
కింనుపార్థోఽర్జునః సాక్షాదయమస్మాన్ ప్రబాధతే
శ్రుత్వా తదర్జునో వాక్యం రాజ్ఞః పుత్రస్య భాషతః
అతీతసమయే కాలే ప్రియాం భార్యామనిందితాం
ద్రుపదస్యసుతాంతన్వీం పాంచాలీంపావకాత్మజాం
సత్యార్జవగుణోపేతాం భర్తుః ప్రియహితే రతాం
ఉవాచ రహసి ప్రీతః కృష్ణాం సర్వార్థకోవిదః
ఉత్తరం బ్రూహి కళ్యాణి క్షిప్రం మద్వచనాదిదం
అయం వై పాండవస్యాసీత్ సారథిః సమ్మతో దృఢః
మహాయుద్ధేషు సంసిద్ధః స తే యంతా భవిష్యతి
తస్య తద్వచనం స్త్రీషు భాషతశ్చ పునః పునః
న సామర్షత పాంచాలీ బీభత్సోః పరికీర్తనం.
అథైనముపసంగమ్య స్త్రీమధ్యాత్ సా తపస్వినీ
వ్రీడమానేవ శనకై రిదం వచనమబ్రవీత్.

యోఽసౌ బృహద్వారణాభో యువా
సుప్రియదర్శనః
బృహన్నలేతి విఖ్యాతః పార్థస్యాసీత్ స సారథిః
ధనుష్యనవరశ్చాసీత్ తస్య శిష్యో మహాత్మనః
దృష్టపూర్వో మయా వీర చరంత్యా పాండవాన్ ప్రతి
యదా తత్ పావకో దావమదహత్ ఖాండవం
మహత్
అర్జునస్య తదానేన సంగృహీతా హయోత్తమాః
తేన సారథినా పార్థః సర్వభూతాని సర్వశః
అజయత్ ఖాండవప్రస్థే నహి యంతాస్తి తాదృశః
సైరంధ్రి జానాసి యథా యువానం
నపుంసకో నైవ భవేద్ యథాసౌ
అహం న శక్నోమి బృహన్నలాం శుభే
వక్తుం స్వయం యచ్ఛ హయాన్ మమేతి వై.

అజ్ఞాతవాసావధి గతించింది. ఆ విషయం గమనించి ద్రౌపదిని ప్రక్కకు పిలిచి అర్జునుడు ఇలా అంటున్నాడు - నువ్వు ఇప్పుడే వెళ్ళి, బృహన్నల పాండవమధ్యముడైన అర్జునునకు ఇతః పూర్వం ఎన్నోసార్లు సారథ్యం వహించాడు - అని చెప్పు. వీనిని సారథిగా గ్రహిస్తే విజయం తథ్యమని కూడా చెప్పు - అన్నాడు. ద్రౌపది తిరిగివచ్చేసరికి ఉత్తరుడు తాను అర్జునుని కంటె మహావీరుడైనట్లు ప్రసంగిస్తూంటే ద్రౌపది సహించలేక పోయింది.

రాకుమారా! మన నర్తనశాలలో ఉన్న నాట్యాచార్యుడు ఇదివరలో ఎన్నో ఘోరసంగ్రామాలలో అర్జునునికి సారథ్యం వహించాడు. అతనివల్ల మెప్పుపొందాడు. మహాపురుషులవద్ద అస్త్రవిద్యతోపాటు సారథ్యంలో గూడా శిక్షణ పొందాడు. నేను పాండవులదగ్గిర ఉన్నరోజులలో వీని శక్తిసామర్థ్యాలు ప్రత్యక్షంగా చూసాను. ఖాండవవనదహన సమయంలో అర్జునునికి బృహన్నలే సారథి. ఖాండవప్రస్థంలో ఉన్నప్పుడు జరిగిన ఘోరయుద్ధాలలో ఇతని సారథ్యంలోనే అర్జునుడు మహావిజయం సాధించాడు. ఇటువంటి సారథి ఈ భూమండలంలో మరియొకడు లేడు - అని సైరంధ్రి పలకగా ఉత్తరుడు నవ్వుతూ - సైరంధ్రీ నువ్వు చెప్పినట్లు ఈబృహన్నల అంతటివాడే ఐతే నపుంసకుడు కాకూడదు. ఆ విషయం నీకు తెలిసినట్లైతే నా రథానికి గుర్రాలు పూన్చి సారథ్యానికి సిద్ధంగా ఉండమని చెప్పు - అని పలకగా సైరంధ్రి రాజపుత్రా! నీ కనిష్టసోదరియైన ఉత్తర చెప్పిన మాటను బృహన్నల కాదనలేడు. అందుచేత ఆమెచేత ఈ సందేశం పంపించు -

యేయం కుమారీ సుశ్రోణీ భగినీ తే యవీయసీ
అస్యాః స వీర వచనం కరిష్యతి న సంశయః
యదివై సారథిఃసస్యాత్ కురూన్ సర్వాన్ నసంశయః
జిత్వాగాశ్చసమాదాయ ధ్రువమాగమనంభవేత్

ఏవముక్తః స సైరంధ్ర్యా భగినీం ప్రత్యభాషత
గచ్ఛత్వమనవద్యాంగి తామానయబృహన్నలాం
సా భ్రాత్రా ప్రేషితా శీఘ్రమగచ్ఛన్నర్తనాగృహం
యత్రాస్తే స మహాబాహుశ్ఛన్నః సత్రేణ పాండవః.

## ముప్పది ఏడవ అధ్యాయం

సా ప్రాద్రవత్ కాంచనమాల్యధారిణీ
జ్యేష్ఠేన భ్రాత్రా ప్రహితా యశస్వినీ
సుదక్షిణా వేదివిలగ్నమధ్యా
సా పద్మపత్రాభనిభా శిఖండినీ
తన్వీ శుభాంగీ మణిచిత్రమేఖలా
మత్స్యస్య రాజ్ఞో దుహితా శ్రియా వృతా
తన్నర్తనాగార మరాళపక్ష్మా
శతహ్రదా మేఘమివాన్వపద్యతా
సా హస్తి హస్తోపమసంహితోరూః

స్వనిందితా చారుదతీ సుమధ్యమా
ఆసాద్య తం వై వరమాల్యధారిణీ
పార్థం శుభా నాగవధూరివ ద్విపం
సా రత్నభూతా మనసః ప్రియార్చితా
సుతా విరాటస్య యథేంద్రలక్ష్మీః
సుదర్శనీయా ప్రముఖే యశస్వినీ
ప్రీత్యాబ్రవీ దర్జునమాయతేక్షణా
సుసంహతోరూం కనకోజ్జ్వలత్వచం
పార్థః కుమారీం స తదాభ్యభాషత

బృహన్నల సారథిగా వస్తే నిన్ను విజయశ్రీ వరించినట్లే - అంది.

ఉత్తరుడు ఉత్తరను పిలిచి బృహన్నలతో ఆవిషయం ప్రస్తావించమన్నాడు. సంతోషంతో ఉత్తర పరుగు పరుగున నర్తనశాల సమీపించింది.

## ముప్పది ఏడవ అధ్యాయం

సర్వాలంకృతభూషణాంగియైన ఉత్తర నర్తనశాలలో అడుగుపెట్టింది. సుందరరాజ్యలక్ష్మివలె ప్రకాశించే ఉత్తరను చూసి - పద్మాక్షీ ఇంత ఆకస్మికంగా ఇలా వచ్చిన కారణ మేమి? నీ ముఖ మండలం ఇంత వాడిపోయి ఉన్నదేమి ? - అని బృహన్నల ప్రశ్నించగా - బృహన్నలా - మా గోసంపదను కౌరవులు హరించుకు పోతున్నారు. వారిని ఓడించి మాసంపద మేం తెచ్చుకోవ డానికి మా సోదరుడు వెడుతున్నారు. అయితే వాని రథానికి సారథి లేడు. ఇతఃపూర్వం జరిగిన ఒకానొక యుద్ధంలో మా అగ్రజుని సారథి మరణించాడు. యోగ్యుడైన సూతుడు దొరుకక మా అన్న మరొకనిని నియోగించలేదు. సారథిలేని లోటు ఇప్పుడు తెలిసివచ్చింది. మే మందరం సారథిని గురించి ఆలోచిస్తూండగా సైరంధ్రి వచ్చి మీ అస్త్రవిద్యానైపుణ్యాన్నీ మీసారథ్యంలో అర్జునుడు సాధించిన విజయాలనూ వివరించి చెప్పింది. మీరు మాసోదరునకు సారథులైతే

కిమాగమః కాంచనమాల్యధారిణి
మృగాక్షి కిం త్వం త్వరితేవ భామిని
కిం తే ముఖం సుందరి న ప్రసన్న
మాచక్ష్వ తత్త్వం మమ శీఘ్రమంగనే
స తాందృష్ట్వావిశాలాక్షీం రాజపుత్రీంసఖీంతథా
ప్రహసన్నబ్రవీద్ రాజన్ కిమాగమనమిత్యుత
తమబ్రవీద్ రాజపుత్రీ సముపేత్య నరర్షభం
ప్రణయం భావయంతీ సా సఖిమధ్య ఇదం వచః
గావో రాష్ట్రస్య కురుభిః కాల్యంతే నో బృహన్నలే
తా విజేతుం మమ భ్రాతా ప్రయాస్యతి ధనుర్ధరః
నాచిరం నిహతస్తస్య సంగ్రామే రథసారథిః
తేన నాస్తి సమః సూతో యోఽస్య సారథ్య
మాచరేత్
తస్మై ప్రయతమానాయ సారథ్యర్థం బృహన్నలే
ఆచచక్షే హయజ్ఞానే సైరంధ్రీ కౌశలం తవ
అర్జునస్య కిలాసీస్త్వం సారథిర్దయితః పురా
త్వయాజయత్ సహాయేన పృథివీం పాండవర్షభః
సా సారథ్యం మమ భ్రాతుః కురుసాధుబృహన్నలే
పురా దరతరం గావో హ్రియంతే కురుభిర్హి నః
అథైతద్వచనం మేఽద్య నియుక్తా న కరిష్యసి
ప్రణయాదుచ్యమానా త్వం పరిత్యక్ష్యామి జీవితం
ఏవముక్తస్తు సుశ్రోణ్యా తయా సఖ్యా పరంతపః
జగామ రాజపుత్రస్య సకాశమమితౌజసః
తమావ్రజంతం త్వరితం ప్రభిన్నమివ కుంజరం
అన్వగచ్ఛద్ విశాలాక్షీ గజం గజవధూరివ
దూరాదేవతుతాంప్రేక్ష్య రాజపుత్రోఽభ్యభాషత
త్వయా సారథినాపార్థఃఖాండవేఽగ్నిమతర్పయత్
పృథివీమజయత్కృత్స్నాంకుంతీపుత్రోధనంజయః
సైరంధ్రీత్వాంసమాచష్టేసాహిజానాతిపాండవాన్
సంయచ్ఛమామకానశ్వాంస్తథైవత్వంబృహన్నలే
కురుభిర్యోత్స్యమానస్య గోధనాని పరీప్సతః
అర్జునస్య కిలాసీస్త్వం సారథిర్దయితః పురా
త్వయాజయత్ సహాయేన పృథివీం పాండవర్షభః
ఏవముక్తా ప్రత్యువాచ రాజపుత్రం బృహన్నలా
కా శక్తిర్మమ సారథ్యం కర్తుం సంగ్రామమూర్ధని
గీతంవాయదివానృత్యం వాదిత్రంవా పృథగ్విధం
తత్ కరిష్యామి భద్రంతే సారథ్యంతుకుతోమమ.
బృహన్నలే గాయనో వా నర్తనో వా పునర్భవ
క్షిప్రంమేరథమాస్థాయ నిగృహ్ణీష్వ హయోత్త
మాన్.

---

కురుసేనావాహినిని జయించి మాసంపదలు మేం తెచ్చుకోగలము. నామాట మన్నించకపోతే నేను ప్రాణత్యాగం చేస్తాను - అని ఉత్తర అనగా బృహన్నల అంగీకరించి ఉత్తరునివైపు నడిచాడు. ఉత్తర వానిని అనుసరించి నడిచింది.

బృహన్నలా నీ సూతకృత్యంలో అర్జునుడు ఖాండవవనం అగ్నికి ఆహుతిగా ఇచ్చి సంతృప్తి పరచాడనీ నీసారథ్యంలోనే ఈభూమండలమంతా జయించి విజయనామం సార్థకం చేసుకున్నాడనీ విన్నాము. ఈవిషయాలన్నీ పాండవులదగ్గర ఉన్న సైరంధ్రి మాకు చెప్పింది ఇప్పుడు నిన్ను సారథిగా నియోగించుకొని కౌరవులను జయించాలని ఉంది. అని ఉత్తరుడు అన్నాడు.

బృహన్నల యుద్ధరంగంలో సారథ్యంవహించే శక్తి తనకు లేదనీ నృత్యగానాది కళలలో నిపుణుడననీ చెప్పాడు.

బృహన్నలా! నృత్యగీతాలలో నీకు ప్రీతి ఉంటే తిరిగి వచ్చిన తరువాత వాటిని తీర్చుకోవచ్చు. ముందు నా రథానికి సారథివై మన పనికి అవసరమైన ఏర్పాట్లు అన్నీ చెయ్యి. అని

స తత్ర నర్మసంయుక్తమకరోత్ పాండవో బహు
ఉత్తరాయాః ప్రముఖతః సర్వం జానన్నరిందమః
ఊర్ధ్వముత్క్షిప్య కవచం శరీరే ప్రత్యముంచత
కుమార్యస్తత్ర తంద్రుష్ట్వా ప్రాహసన్ పృథులోచనాః
స తుద్రుష్ట్వా విముహ్యంతం స్వయమేవోత్తర స్తతః
కవచేన మహార్హేణ సమనహ్యద్ బృహన్నలాం.
స బిభ్రత్ కవచం చాగ్ర్యం స్వయమప్యంశుమత్ప్రభం
ధ్వజం చ సింహముచ్ఛ్రిత్య సారథ్యే సమకల్పయత్
ధనూంషి చ మహార్హాణి బాణాంశ్చ రుచిరాన్ బహూన్
ఆదాయ ప్రయయౌ వీరః స బృహన్నలసారథిః.
అథోత్తరా చ కన్యాశ్చ సఖ్యస్తామబ్రువం స్తదా
బృహన్నలే ఆనయేథా వాసాంసి రుచిరాణి చ.
పాంచాలికార్థం చిత్రాణి సూక్ష్మాణి చ మృదూని చ
విజిత్య సంగ్రామగతాన్ భీష్మద్రోణ ముఖాన్ కురూన్
ఏవం తా బ్రువతీః కన్యాః సహితాః పాండునందనః
ప్రత్యువాచ హసన్ పార్థో మేఘదుందుభినిఃస్వనః
యద్యుత్తరోఽయం సంగ్రామే విజేష్యతి మహారథాన్
అథాహరిష్యే వాసాంసి దివ్యాని రుచిరాణి చ.
ఏవముక్త్వా తు బీభత్సు స్తతః ప్రాచోదయద్ధయాన్
కురూనభిముఖః శూరో నానాధ్వజపతాకినః
తముత్తరం వీక్ష్య రథోత్తమే స్థితం
బృహన్నలాయాః సహితం మహాభుజం
స్త్రియశ్చ కన్యాశ్చ ద్విజాశ్చ సువ్రతాః
ప్రదక్షిణం చక్రురథోచురంగనాః.
యదర్జునస్యర్షభతుల్యగామినః
పురాభవత్ ఖాండవదాహమంగళం
కురూన్ సమాసాద్య రణే బృహన్నలే
సహోత్తరేణాద్య తదస్తు మంగళం.



ఉత్తరుడు అధికారికస్వరంతో పలుకగా బృహన్నల చిరునవ్వు నవ్వుతూ పని మొదలుపెట్టాడు. సేవకులు తెచ్చి కవచ మందించారు. బృహన్నల తన కేమీ తెలియనట్లు ఆ కవచాన్ని తల్లక్రిందులు చేసి తొడగబోతూండగా అక్కడ స్త్రీజనం కిలకిలారవం చేసారు.

ఉత్తరుడు స్వయంగా బృహన్నలకు కవచం తొడిగి తను కూడా కవచం ధరించి ధనుర్బాణాసనాలను సిద్ధంచేసి సమరోన్ముఖు డయ్యాడు. బృహన్నల బయలుదేరుతూండగా ఉత్తర సమీపించి - బృహన్నలా - సమర భూమిలో భీష్మద్రోణాది కురు గురు వృద్ధులను ఓడించి వారి తలపాగలపై ఉండే కుచ్చులను నా బొమ్మపొత్తికలకు తెచ్చిపెట్టు - అని కోరగా బృహన్నల నవ్వుతూ మేఘ గంభీరభాషణలలో - రాజపుత్రీ - నీఅగ్రజుడు వారిని జయించాలేగాని నీకు బొమ్మపొత్తికలు తేవడం అదెంత పని - అన్నాడు.

ఉన్నత ధ్వజ పతాక శోభితమైన సుందర స్యందనం కదులుతూంటే సుందరీజనం విప్ర సహితులై రథానికి దక్షిణభాగాన ఎదురువస్తూ బృహన్నలా - ఖాండవవన దహనసమయంలో అర్జునునికి విజయం కలిగించినట్లే ఇప్పుడు మా ఉత్తరరాకుమారుడు కౌరవ వీర శిరోమణులను ఓడించి మంగళప్రదుడై తిరిగి రావాలి - అని కోరారు.



## ముప్పది ఎనిమిదవ అధ్యాయం

స రాజధాన్యా నిర్యాయ వైరాటిరకుతోభయః
ప్రయాహీత్యబ్రవీత్ సూతం యత్ర తే కురవో గతాః
సమవేతాన్ కురూన్ సర్వాన్ జిగీషూనవజిత్య వై
గాస్తేషాం క్షిప్రమాదాయ పునరేష్యామ్యహం పురం
తతస్తాంశ్చోదయామాస సదశ్వాన్ పాండునందనః
తే హయా నరసింహేన నోదితా వాతరంహసః
ఆలిఖంత ఇవాకాశమూహుః కాంచనమాలినః.

నాతిదూరమథో గత్వా మత్స్యపుత్రధనంజయౌ
అవేక్షేతామమిత్రఘ్నౌ కురూణాం బలినాం బలం.

శ్మశానమభితో గత్వా ఆససాద కురూనథ
తాంశమీమన్వవీక్షేతాంవ్యూఢానీకాంశ్చసర్వశః
తదానీకం మహత్ తేషాం విబభౌ సాగరోపమం
సర్పమాణమివాకాశే వనం బహుళపాదపం.

దదృశే పార్థివో రేణుర్జనితస్తేన సర్పతా
దృష్టిప్రణాశో భూతానాం దివస్పృక్ కురుసత్తమ.
తదానీకం మహద్ దృష్ట్వా గజాశ్వరథసంకులం
కర్ణదుర్యోధనకృపైర్గుప్తం శాంతనవేన చ.
ద్రోణేన చ సపుత్రేణ మహేష్వాసేన ధీమతా
హృష్టరోమా భయోద్విగ్నః పార్థం వైరాటిరబ్రవీత్
నోత్సహే కురుభిర్యోద్ధుం రోమహర్షం హి పశ్య మే
బహుప్రవీరమత్యుగ్రం దేవైరపి దురాసదం.
ప్రతియోద్ధుం న శక్ష్యామి కురుసైన్యమనంతకం
నాశంసే భారతీం సేనాం ప్రవేష్టుం భీమకార్ముకాం
రథనాగాశ్వకలిలాం పత్తిధ్వజసమాకులాం
దృష్ట్వైవ హి పరానాజౌ మనః ప్రవ్యథతీవ మే.
యత్ర ద్రోణశ్చ భీష్మశ్చ కృపః కర్ణో వివింశతిః
అశ్వత్థామా వికర్ణశ్చ సోమదత్తశ్చ బాహ్లికః.

---

## ముప్పది ఎనిమిదవ అధ్యాయం

బృహన్నలా—నేను విజయవాంఛతో బయలుదేరుతున్నాను. మన రథం సరాసరి కౌరవసేనల వైపే పోవాలి. నేను కురుప్రముఖుల నందరినీ ఓడించి గోవులను నగరానికి తరలిస్తాను - అని ఉత్తరుడు గంభీరంగా అన్నాడు.

అర్జునుడు వాయువేగ మనోవేగాలతో రథం నడుపుతున్నాడు. నగరం వీడి మరుభూమి సమీపించేసరికి అల్లంత దూరంలో కౌరవసేనాసాగరం వారికంట బడింది. ఆ సైనికుల పాదధూళి సూర్యరశ్మిని నిరోధిస్తోంది. భీష్మ ద్రోణ కృపాది ధన్వి నికరపరివేష్ఠితమై దుర్యోధన కర్ణ అశ్వత్థామాది వీర శిరోమణుల పర్యవేక్షణలో సాగే చతురంగ బలాలను అవలోకించిన ఉత్తరునికి గుండె చెదిరి శరీరం గగుర్పొడిచింది. దేహమంతా చెమటలు పట్టాయి. భయభీతుడై గజగజ వణుకుతూ బృహన్నలా - ఈ కురువీరులతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. నా శరీరం ఎల్లా కంపిస్తోందో చూడు. మహావీరులతో నిండిన ఈ కురుసేనా సముద్రాన్ని తరించడం నాతరంగాదు. దేవతలుగూడా ఈ నిరుపమ కురుసేనముందు నిలబడలేరు. ఆ చతురంగ బలాలను సమీపించడానికే నాకు ధైర్యం రావడం లేదు. ఆ పదాతిబలం చూడు. అగణిత సంఖ్యలో ఉంది. ఆ చతురంగబలాలను తేరిపార చూడడానికి కూడా నాకు ధైర్యం చాలడం లేదు. నా హృదయం దుర్బలమై పోయింది. మహారథికులైన భీష్మ ద్రోణ కృప కర్ణ వికర్ణ వివింశతి సోమ

దుర్యోధనస్తథా వీరో రాజా చ రథినాం వరః
ద్యుతిమంతో మహేష్వాసాః సర్వే యుద్ధవిశారదాః
మత్త ఇవ మహానాగా యుక్తధ్వజపతాకినః
నీతిమంతో మహేష్వాసా సర్వాస్త్రకృత నిశ్చయాః
దుర్జయాః సర్వసైన్యానాం దేవైరపి సవాసవైః
పతాకినశ్చ మాతంగాః సాధ్యజాశ్చ మహారథాః.
విప్రకీర్ణాః కృతోద్యోగా వాజినశ్చిత్రభూషితాః
తాన్ జేతుం సమరే శూరాన్ దుర్బుద్ధిరహమాగతః
దృష్ట్వైవ హి కురూనేతాన్ వ్యూఢానీకాన్ ప్రహారిణః
హృషితాని చ రోమాణి కశ్మలం చాగతం మమ
అవిజాతో విజాతస్య మాత్స్యాద్ధూర్తస్యపశ్యతః
పరిదేవయతే మందః సాకాశే సవ్యసాచినః
త్రిగర్తాన్ మే పితా యాతః శూన్యే సంప్రణిధాయ మాం

సర్వాం సేనాముపాదాయ నమే సంతీహ సైనికాః
సోఽహమేకో బహూన్ బాలః కృతాస్త్రానకృతశ్రమః
ప్రతియోద్ధుం న శక్ష్యామి నివర్తస్వ బృహన్నలే.
భయేన దీనరూపోఽసి ద్విషతాం హర్షవర్ధనః
న చ తావత్ కృతం కర్మ పరైః కించిద్ రణాజిరే.
స్వమయేన చ మామాత్థ వహామాం కౌరవాన్ ప్రతి
సోఽహం త్వాం తత్ర నేష్యామి యత్రైతే బహులా ధ్వజాః.
మధ్యమామిష గృధ్రాణాం కురూణామాతతాయినాం
నేష్యామి త్వాం మహాబాహో పృథివ్యామపి యుధ్యతాం.
తథా స్త్రీషు ప్రతిశ్రుత్య పౌరుషం పురుషేషు చ
కథ్యమానోఽభినిర్యాయ కిమర్థం న యుయుత్ససే.

---

దత్త బాహ్లీక అశ్వత్థామాదులతో భయంకర ధనుర్ధరుడై దుర్యోధనుడెలా విరాజిల్లుతున్నాడో చూడు. ఆ రథాలమీద వారందరూ మత్తేభాల వలె ఉన్నారు. దేవగణాలు ఒక్కుమ్మడిగా వచ్చి పడినా ఈ ధనుర్వేదవేత్తలను ఎదిరించి నిలబడలేరే! ఇంక నేనొకలెక్కా. నా దుర్బుద్ధికి బాల్య చాపల్యానికీ నాకే సిగ్గు కలుగుతోంది – అన్నాడు.

అజ్ఞుడైన ఉత్తరుడు అప్పుడు బృహన్నలను అర్జునునిగా గుర్తుపట్టలేకపోయాడు. వాని ప్రతిభా ప్రభావాలను కూడా గుర్తించలేక పోయాడు.

బృహన్నలా మహావీరులందరినీ వెంటబెట్టుకొని మా తండ్రిగారు త్రిగర్తుని మీదికి దాడి వెడుతూ నన్ను నగర రక్షణకై అంతఃపురంలో ఉంచారు. అస్త్రవిద్యానైపుణ్యం నాకు లేదు. సేనాబలం మన వెంట లేదు. వీరాధివీరులైన కౌరవులను ఇప్పుడు మనం ఎదుర్కోలేము. రథం వెనక్కి పోనియ్యి – అన్నాడు.

రాజపుత్రా – నువ్వు ఆందోళిత భయ హృదయంతో దైన్యంగా మాట్లాడకూడదు. శత్రువులను స్తుతించడం వీరలక్షణం గాదు. కౌరవ వీరులను సమీపిస్తే వారిని ఓడించి తీరతానన్న నువ్వు వారితో యుద్ధం ప్రారంభించకుండానే తిరిగి పోవటం మంచిపని గాదు. కౌరవులను జయించి గోగణాలను తరలించుకొని వెళ్లకపోతే నగర పౌరులతో పాటు అంతఃపుర సుందరీమణులు కూడా నిన్ను చూసి హేళనచేస్తారు. మహావీరులు అపహాసిస్తారు. ఎన్నోవిధాల సైరంధ్రి నన్ను ప్రశంసించింది. ఇప్పుడు నేను గోగణాలను తరలించకుండా నగరంలో ప్రవేశించలేను. నువ్వేమీ భయపడకు. నేనే యుద్ధంచేసి కౌరవులను జయించగలను – అని

న చేద్ విజిత్య గాస్త్వం గృహాన్ వై ప్రతియాస్యసి
ప్రహసిష్యంతి వీరాస్త్వాం నరానార్యశ్చ సంగతాః
అహమప్యత్ర సైరంధ్ర్యా ఖ్యాతా సారథ్యకర్మణి
న చ శక్ష్యామ్యనిర్జిత్య గాః ప్రయాతుం పురం ప్రతి.
స్తోత్రేణ చైవ సైరంధ్ర్యాస్తవ వాక్యేన తేన చ
కథం న యుధ్యేయమహం కురూన్ సర్వాన్ స్థిరో భవ.
కామం హరంతు మత్స్యానాం భూయాంసః కురవో ధనం
ప్రహసంతు చ మాం నార్యో నరా వాపి బృహన్నలే.
సంగ్రామే న చ కార్యం మే గావో గచ్ఛంతు చాపి మే
శూన్యం మే నగరం చాపి పితుశ్చైవ బిభేమ్యహం.
ఇత్యుక్త్వా ప్రాద్రవద్ భీతో రథాత్ ప్రస్కంద్య కుండలీ
త్యక్త్వా మానం చ దర్పం చ విసృజ్య సశరం ధనుః.
నైష శూరైః స్మృతో ధర్మః క్షత్రియస్య పలాయనం
శ్రేయస్తు మరణం యుద్ధే న భీతస్య పలాయనం.

ఏవముక్త్వా తు కౌంతేయః సోఽవప్లుత్య రథోత్తమాత్
తమన్వధావద్ ధావంతం రాజపుత్రం ధనంజయః.
దీర్ఘాం వేణీం విధున్వానః సాధు రక్తే చ వాససీ
విధూయ వేణీం ధావంతమజానంతోఽర్జునం తదా.
సైనికాః ప్రాహసన్ కేచిత్ తథారూపమవేక్ష్య తం
తం శీఘ్రమభిధావంతం సంప్రేక్ష్య కురవోఽబ్రువన్.
క ఏష వేషసంఛన్నో భస్మనేవ హుతాశనః
కించిదస్య యథా పుంసః కించిదస్య యథా స్త్రియః.
సారూప్యమర్జునస్యేవ క్లీబరూపం బిభర్తి చ
తదేవైతచ్ఛిరో గ్రీవం తౌ బాహూ పరిఘోపమా
తద్వదేవాస్య విక్రాంతం నాయమన్యో ధనంజయాత్
అమరేష్వివ దేవేంద్రో మానుషేషు ధనంజయః
ఏకః కోఽస్మానుపాయాయాదన్యో లోకే ధనంజయాత్.
ఏకః పుత్రో విరాటస్య శూన్యే సంనిహితః పురే
స ఏష కిల నిర్యాతో బాలభావాన్న పౌరుషాత్.

ధైర్యం చెప్పడానికి ప్రయత్నించాడు బృహన్నల.

ఉత్తరుని గుండె కుదుట పడలేదు. ధైర్యం చిక్కబట్టలేక పోతున్నాడు. బృహన్నలా – ఈ కురుసేన మామత్స్యదేశమంతా దోచుకుపోయినా సరే. నేను వారిని ఎదిరించను. మా గోధనం వీరి వశమైతే కానియ్యి. పౌర జానపదులందరూ పరిహసించనియ్యి. నేనుమాత్రం యుద్ధం చెయ్యను. నగరంలో వీరు లెవ్వరూ లేరు. నగరరక్షణే నా విధి. ఇంక నే నిక్కడ నిలబడను – అని పలుకుతూనే రథం దిగేసి నగరంవైపు పరుగు ప్రారంభించాడు.

విరటరాజనందనా – యుద్ధభూమినుండి పారిపోవడం క్షత్రియధర్మం కాదు.. రాజపుత్రుడు సమరభూమిలో మరణానైనా కోరతాడుగాని పలాయనానికి అంగీకరించడు – అని రథం దిగి తాను ఉత్తరుని పట్టితేవడానికి బయలుదేరాడు బృహన్నల.

బృహన్నల జుట్టుముడి వీడింది. కట్టిన ఎర్రచీర గాలికి ఎగురుతోంది. ఆ స్త్రీమూర్తినీ ముందుపోయే ఉత్తరునీ చూచి కౌరవ సైనికులు పరిహాసపూర్వకంగా అరువసాగారు. కాని బృహన్నల యొక్క గమనవేగం వారికి ఆశ్చర్యం కలిగించింది. వీ డెవడై వుంటాడు. నివురుగప్పిన నిప్పులా స్త్రీవేషంలో ఉన్న ఈ వ్యక్తి స్త్రీయో పురుషుడో! ఆకారవిశేషాలు అర్జునుని తలపిస్తున్నాయి. వేషభాషలు స్త్రీజనోచితంగా ఉన్నాయి. ఆ విశాల భుజాలుచూస్తే అర్జునుడే అనిపిస్తోంది. దేవతలలో ఇంద్రుని వంటివాడు మానవులలో అర్జును డొక్కడే. మన కౌరవ సేనావాహినిని జయించే ధైర్యంతో

సత్రేణ నూనంచ్ఛన్నం హి చరంతం పార్థమర్జునం
ఉత్తరఃసారథిం కృత్వా నిర్యాతో నగరాద్ బహిః.
స నో మన్యామహే దృష్ట్వా భీత ఏవ పలాయతే
తం నూనమేవ ధావంతం జిఘృక్షతి ధనంజయః.
ఇతి స్మ కురవః సర్వే విమృశంతః పృథక్ పృథక్
న చ వ్యవసితుం కించిదుత్తరం శక్నువంతి తే.
ఛన్నం తథా తం సత్రేణ పాండవం ప్రేక్ష్య భారత
దుర్యోధన ఉవాచేదం సైనికాన్ రథసత్తమాన్.
అర్జునో వాసుదేవో వా రామః ప్రద్యుమ్న ఏవ వా
తేహినః ప్రతిసంయాతుం సంగ్రామేన చ శక్నుయుః
అన్యో వా క్లీబరూపేణ యద్యాగచ్ఛేద్ గవాంపదం
అర్పయిత్వా శరైస్తీక్ష్ణైః పాతయిష్యామి భూతలే.
కథమేకతరస్తేషాం సమస్తాన్ యోధయేత్ కురూన్
అర్జునో నేతి చేత్యేనం న వ్యవస్యంతి తే పునః.
ఇతిస్మ కురవః సర్వే మంత్రయంతో మహారథాః
దృఢవేధీ మహాసత్త్వః శక్రతుల్యపరాక్రమః.
అద్య గచ్ఛతి యే యోద్ధుం సర్వం సంశయితం బలం
న చాప్యన్యం నరం తత్ర వ్యవస్యంతి ధనంజయాత్
ఉత్తరం తు ప్రధావంతమభిద్రుత్య ధనంజయః
గత్వా పదశతం తూర్ణం కేశపక్షే పరామృశత్
సోఽర్జునేన పరామృష్టః పర్యదేవయదార్తవత్
బహుళం కృపణం చైవ విరాటస్య సుతస్తదా.
శృణుయాస్త్వం హి కళ్యాణి బృహన్నలే సుమధ్యమే
నివర్తయ రథం శీఘ్రం జీవన్ భద్రాణి పశ్యతి.
శాతకుంభస్య శుద్ధస్య శతం నిష్కాన్ దదామి తే
మణీనష్టౌ చ వైదూర్యాన్ హేమబద్ధాన్ మహా
ప్రభాన్.
హేమదండప్రతిచ్ఛన్నం రథంయుక్తం చ సువ్రతైః
మత్తాంశ్చ దశ మాతంగాన్ ముంచ మాం
త్వం బృహన్నలే.

---

ఏకైకవీరుడుగా రాగల శక్తి అర్జునునికే ఉంది. విరట నగరంలో ఇప్పుడెవ్వరూ లేరు. ఆ రాకుమారుడు నగరరక్షణలో ఉండి ఉంటాడు. బాల్యచాపల్యం వల్ల వాడే ఈ యుద్ధరంగానికి వచ్చి ఉంటాడు. అంతేగాని వీరుడేం కాడు. మారువేషంలో ఉన్న అర్జునుని సారథిగా ఉంచుకొని వీడు సమరానికి సన్నద్ధుడై వచ్చాడు. రణభూమిలో మనలనుచూచి భయపడి పరుగెత్తుతున్నాడు. వానిని పట్టితేవడానికి అర్జునుడు వెన్నాడుతున్నాడు - అని వారిలో వారు విమర్శించుకోసాగారు.

అప్పుడు దుర్యోధనుడు తన సైనికులవైపు తిరిగి కృష్ణ బలరామ ప్రద్యుమ్న అర్జునాదులలో ఏ ఒక్కరూ యుద్ధభూమిలో మనతో సములు కారు. అటువంటప్పుడు నపుంసకరూపంతో వచ్చే ఈ వ్యక్తి మనల నేమీ చెయ్యలేడు. నా వాడిబాణాలతో వానిని పడగొడతాను చూడండి. ఒక్కడూ వచ్చి ఈ కురుసేనావాహినిని ఏం చేద్దామనుకున్నాడో - అని గర్జించాడు.

కౌరవులకూ వారి సైనికులకూ వచ్చేవాడు అర్జునుడే ననే అనుమానం తగ్గిపోలేదు. ఇంద్ర సమ పరాక్రమోపేతుడైన అర్జునుడు వచ్చేవాడే ఐనట్లైతే మనకు ప్రాణాలమీద ఆశ లేదు - అని కొందరు నిశ్చయించుకొన్నారు.

అర్జునుడు శత పదాలు పరుగుపరుగున పోయి ఉత్తరుని పట్టుకొని నిలబెట్టగా ఉత్తరుడు దీనవదనుడై-బృహన్నలా- నామాట విను. రథం వెనకకు త్రిప్పు. బ్రతికిఉంటే ముందైనా సుఖాలు పొందవచ్చు. నీకు నూరు సువర్ణముద్రికలు ఇస్తాను. వైడూర్యాలతో నిండిన సువర్ణభూషణాలు ఎనిమిది ఇస్తాను. మంచి గుర్రాలతో ఒక రథం ఇస్తాను,

ఏవమాదీని వాక్యాని విలపంతమచేతసం
ప్రహస్యపురుషవ్యాఘ్రోరథస్యాంతికమానయత్
అథైనమబ్రవీత్ పార్థో భయార్తం నష్టచేతసం
యది నోత్సహసే యోద్ధుం శత్రుభిః శత్రుకర్షణ
ఏహి మేత్వం హయాన్యచ్ఛ యుధ్యమానస్య శత్రుభిః.
ప్రయాహ్యేతద్ రథానీకం మద్బాహుబలరక్షితః
అప్రధృష్యతమంఘోరంగుప్తం వీరైర్మహారథైః.
మాభైస్త్వంరాజపుత్రాగ్ర్యక్షత్రియోఽసిపరంతప
కథం పురుషశార్దూల శత్రుమధ్యే విషీదసి.

అహంవై కురుభిర్యోత్స్యే విజేష్యామిచ తేపశూన్
ప్రవిశ్యైతద్ రథానీకమప్రధృష్యం దురాసదం.
యంతాభవనరశ్రేష్ఠ యోత్స్యేఽహంకురుభిఃసహ
ఏవం బ్రువాణోబీభత్సుర్వైరాటిమపరాజితః
సమాశ్వాస్య ముహూర్తం తముత్తరం భరతర్షభ.
తత ఏనం విచేష్టంతమకామం భయపీడితం
రథమారోపయామాస పార్థః ప్రహరతాం వరః.
గాండీవం పునరాదాతుముపాయాత్ తాం శమీంప్రతి
ఉత్తరంస సమాశ్వాస్య కృత్వాయంతారమర్జునః.

---

## ముప్పదితొమ్మిదవ అధ్యాయం

తం దృష్ట్వా క్లీబవేషేణ రథస్థం నరపుంగవం
శమీమభిముఖంయాంతం రథమారోప్యచోత్తరం
భీష్మద్రోణముఖాస్తత్ర కురవో రథిసత్తమాః
విత్రస్తమనసః సర్వే ధనంజయకృతాద్ భయాత్.

తానవేక్ష్యహతోత్సాహానుత్పాతానపిచాద్భుతాన్
గురుః శస్త్రభృతాంశ్రేష్ఠో భారద్వాజోఽభ్యభాషత
చండాశ్చ వాతాఃసంవాంతి రూక్షాఃశర్కరవర్షిణః
భస్మ వర్ణప్రకాశేన తమసా సంవృతం నభః.

---

రెండు మత్తేభాలు ఇస్తాను. నన్ను వదిలెయ్యి-అని విలపిస్తూ ఉత్తరుడు స్తబ్ధుడైపోయాడు. అర్జునుడు వానిని అతికష్టంమీద రథందగ్గరకు తీసికొనివచ్చి-రాకుమారా- నీకు యుద్ధంమీద ఆశక్తి లేకపోతే నేనే యుద్ధం చేస్తాను. నీకేమీ భయంలేదు. నాకు సారథివై రథాన్ని నడుపు. నువ్వు క్షత్రియుడవు. పురుషసింహుడవు. శత్రుసంతాపకరుడవు. నువ్వే ఇలా విలపించడం ఉచితం కాదు. నేను ఈ మహా రథికులతో పోరుసలిపి వారిని ఓడించి మన గోవులను మరలిస్తాను - అని రెండు గడియలకాలం అర్జునుడు ఉత్తరునకు ఉత్సాహం కల్పించడానికి ప్రయత్నించాడు.

యుద్ధ విముఖుడై భయచిత్తంతో ఉన్న ఉత్తరుని రథంమీద ఆసీనునిచేసి తన గాండీవం తెచ్చుకోవడానికి శమీవృక్షం చేరాడు.

---

## ముప్పదితొమ్మిదవ అధ్యాయం

నపుంసక రూపంలో ఉన్న అర్జునుడు రథం మీద ఉత్తరుని కూర్చొబెట్టుకొని శమీవృక్షం వైపు వెళ్లడం భీష్మ ద్రోణాదు లందరూ వీక్షించారు. వారందరూ ఆ నపుంసకుడు అర్జునుడే అని శంకించి భయభ్రాంతు లౌతున్నారు.

అప్పుడు. వారిని ఉద్దేశించి ద్రోణాచార్యుడు –

రూక్షవర్ణాశ్చ జలదా దృశ్యంతేఽద్భుతదర్శనాః
నిఃసరంతి చ కోశేభ్యః శస్త్రాణి వివిధాని చ.
శివాశ్చ వినదంత్యేతా దీప్తాయాం దిశిదారుణాః
హయాశ్చాశ్రూణి ముంచంతి ధ్వజాః కంపత్య
కంపితాః.
యాదృశాన్యత్రరూపాణి సందృశ్యంతేబహూనిచ
యత్తా భవంత స్తిష్ఠంతు సాధ్వసం సముపస్థితం.
రక్షధ్వమపిచాత్మానం వ్యూహధ్వం వాహినీమపి
వైశసం చ ప్రతీక్షధ్వం రక్షధ్వం చాపి గోధనం.
ఏష వీరో మహేష్వాసః సర్వశస్త్రభృతాం వరః
ఆగతః క్లీబవేషేణ పార్థో నాస్త్యత్ర సంశయః.
నదీజ లంకేశ నారికేతు
ర్నగాహ్వయో నామ నగారిసూనుః
ఏషోఽంగనావేషధరః కిరీటీ
జిత్వావ యం నేష్యతి చాద్య గా వః.
స ఏష పార్థో విక్రాంతః సవ్యసాచీ పరంతపః
నాయుద్ధేన నివర్తేత సర్వైరపి సురాసురైః.
క్లేశితశ్చ వనే శూరో వాసవేనాపి శిక్షితః
అమర్షవశమాపన్నో వాసవప్రతిమో యుధి
నేహాస్య ప్రతియోద్ధారమహం పశ్యామి కౌరవాః
మహాదేవోఽపిపార్థేన శ్రూయతే యుధి తోషితః
కిరాతవేషప్రచ్ఛన్నో గిరౌ హిమవతిప్రభుః.
సదాభవాన్ ఫాల్గుణస్య గుణైరస్మాన్ వికత్థసే
న చార్జునః కళాపూర్ణో మమ దుర్యోధనస్య చ.
యద్యేష పార్థో రాధేయ కృతంకార్యంభవేన్మమ
జ్ఞాతాః పునశ్చరిష్యంతిద్వాదశాబ్దాన్విశాంపతే.

---

అదుగో ప్రచండవాయువు రేగుతోంది. కారుమబ్బులతో ఆకాశం నిండుతోంది. ఎన్నో ఉత్పాతాలు గోచరిస్తున్నాయి. కటికిచీకట్లు జగత్తంతా వ్యాపిస్తున్నాయి. దిశాంతాలలో అగ్ని ప్రజ్వలిస్తోంది. గ్రద్దలు భయంకరంగా విరావిస్తున్నాయి. ఉత్తమాశ్వాలు తలలు వంచి కన్నీరు కారుస్తున్నాయి. అకారణంగా రథాలు కంపిస్తున్నాయి. ఇవన్నీ ప్రమాదసూచనలే. మీరందరూ ఈ సంగ్రామంలో ప్రాణరక్షణకు తగు ప్రయత్నాలు చేసుకోండి. నపుంసక వేషంలోఉన్న ఆ ధనుర్ధారి అర్జునుడే. సందేహం లేదు. అని భీష్మునివైపు తిరిగి గాంగేయా-ఇంద్రనందనుడైన కిరీటి స్త్రీవేషంతో ఇక్కడకు వస్తున్నాడు. మనలను జయించి ఈ గోవులను తరలించుకు పోతాడు. సవ్యసాచిని ఎదిరించగల శూరుడు దేవదానవ రాక్షసులలో లేడు. దేవేంద్రునివద్ద అస్త్రవిద్యాభ్యాసం చేసినవాడు ఆ మహావీరుడు. వానితో సమమైన యోధుడు నాకు కనిపించడు. దుర్యోధనుని ప్రాణరక్షణ విషయంలో తగిన శ్రద్ధ వహించండి. హిమాలయాలమీద కిరాతరూపంలో ఉన్న పరమశివుని మెప్పించిన యోధాగ్రేసరుడు సవ్యసాచి – అన్నాడు.

ఆచార్యా – మీరెప్పుడూ మా ముందు అర్జునుని గుణగణాలనే కీర్తిస్తూఉంటారు. నాతో కాని దుర్యోధనునితో కాని వాడు నిలబడలేడు. మాలో షోడశాంశంకూడా వానికి పరాక్రమం లేదు. ఈ విషయాన్ని మీరు గుర్తించడం లేదు – అని కర్ణుడనగా దుర్యోధనుడు – రాధేయా – వచ్చేడివాడు ఫల్గునుడైతే మన కోరిక నెరవేరినట్లే. మళ్లీ

అథైష కశ్చిదేవాన్యః క్లీబవేషేణ మానవః
శరైరేనం సునిశితైః పాతయిష్యామి భూతలే.
తస్మిన్ బ్రువతి తద్వాక్యం ధార్తరాష్ట్రే పరంతప
భీష్మో ద్రోణః కృపో ద్రౌణిః పౌరుషం తదపూజయన్.

## నలుబదియవ అధ్యాయం

తాం శమీముపసంగమ్య పార్థో వైరాటిమబ్రవీత్
సుకుమారం సమాజ్ఞాయ సంగ్రామే నాతికోవిదం.
సమాదిష్టో మయా క్షిప్రం ధనూంష్యవహరోత్తర
నేమాని హి త్వదీయాని సోఢుం శక్ష్యంతి మే బలం
భారం చాపి గురుం వోఢుం కుంజరం వా ప్రమర్దితుం
మమ వా బాహువిక్షేపం శత్రూనిహ విజేష్యతః
నైభిః కామమలం కర్తుం కర్మ వైజయికం త్విహ
అతిసూక్ష్మాణి హ్రస్వాని సర్వాణి చ మృదూని చ
ఆయుధాని మహాబాహో తవైతాని పరంతప
తస్మాద్ భూమింజయారోహ శమీమేతాం పలాశినీం
అస్యాం హి పాండుపుత్రాణాం ధనూంషి నిహితాన్యుత
యుధిష్ఠిరస్య భీమస్య బీభత్సోర్యమయోస్తథా
ధ్వజాః శరాశ్చ శూరాణాం దివ్యాని కవచాని చ
అత్ర చైతన్మహావీర్యం ధనుః పార్థస్య గాండివం.
ఏకం శతసహస్రేణ సమ్మితం రాష్ట్రవర్ధనం
వ్యాయామసహమత్యర్థం తృణరాజసమం మహత్
సర్వాయుధమహామాత్రం శత్రుసంబాధకారకం
సువర్ణవికృతం దివ్యం శ్లక్ష్ణమాయతమవ్రణం.
అలం భారం గురుం వోఢుం దారుణం చారుదర్శనం
తాదృశాన్యేవ సర్వాణి బలవంతి దృఢాని చ
యుధిష్ఠిరస్య భీమస్య బీభత్సోర్యమయోస్తథా.

---

పాండవులు పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేయాలి. కాక వాడెవడో నపుంసకుడే ఐతే మనము అవలీలగా వానిని జయించగలము - అన్నాడు.

## నలుబదియవ అధ్యాయం

అర్జునుడు ఉత్తరకుమారసహితుడై శమీవృక్షం సమీపించాడు. అక్కడ రథమాపి - రాకుమారా-త్వరగా ఈ వృక్షాన్ని ఎక్కి అక్కడ ఉన్న నా ధనస్సు తీసుకురా. నీ బాణాసనం నా బాహుబలానికి చాలదు. అధిక భారాన్ని నీ ధనస్సు భరించలేదు. వీరమత్తేభాలను వేధించడానికి అది ఉపయోగపడదు. శత్రుసంహారసమయంలో నా బాహువిక్షేపం ఈ ధనస్సు భరించలేదు. నీ అస్త్రశస్త్రాలు కోమల సూక్ష్మాలు. ఈ ధనుస్సుతో నేను విజయం సాధించలేను.

ఈ శమీవృక్షంమీద పాండవుల అస్త్రశస్త్రాలూ ధ్వజకవచాలూ ఉన్నాయి. లక్ష ధనస్సులతో సమమైన అర్జునుని గాండీవం అక్కడే ఉంది. పాండవాయుధాలు విజయశ్రీసముపేతాలు. అవి అరిభయంకరాలు. నయనమనోహరాలు - అన్నాడు.

# ఆంధ్రమహాభారతము

## విరాటపర్వము

వ్యాఖ్యాత:

**శ్రీ పురాణపండ రామమూర్తి**

ఎడిటర్:

**పి. యస్. ప్రకాశ దీక్షితులు**

## వి ష య సూ చి








# మ హా భా ర త ప్ర చా ర క సం ఘ ము

కా ర్య ద ర్శి :

జి. సిహెచ్. వెంకటస్వామి

కో శా ధి కా రి :

మాజేటి గోవిందరాజులు

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్॥

భీష్మద్రోణకృపాది ధన్వినికరాభీలంబు దుర్యోధన । గ్రీష్మాదిత్యపటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజాలోష్మస్ఫారచతుర్విధబలాత్యుగ్రంబుదగ్రధ్వజాళిచ్ఛన్నత్వాకలితంబు సైన్యమిది యేజేరంగ శక్తుండనే.

# విరాటపర్వము

## నలుబదిఒకటవ అధ్యాయం

అస్మిన్ వృక్షే కిలోద్బద్ధం శరీరమితి నః శ్రుతం
తదహం రాజపుత్రః సన్ స్పృశేయం పాణినా కథం
నైవంవిధం మయా యుక్తమాలబ్ధుం క్షత్రయోనినా
మహతా రాజపుత్రేణ మంత్రయజ్ఞవిదా సతా.
స్పృష్టవంతం శరీరం మాం శవవాహమివాశుచిం
కథం వా వ్యవహార్యం వై కుర్వీథాస్త్వం బృహన్నలే
వ్యవహార్యశ్చ రాజేంద్ర శుచిశ్చైవ భవిష్యసి
ధనూంష్యేతాని మా భైస్త్వం శరీరం నాత్ర విద్యతే
దాయాదం మత్స్యరాజస్య కులే జాతం మనస్వినాం
త్వాం కథం నిందితం కర్మ కారయేయం నృపాత్మజ

ఏవముక్తః స పార్థేన రథాత్ ప్రస్కంద్య కుండలీ
ఆరురోహ శమీవృక్షం వైరాటిరవశస్తదా.

తమన్వశాసచ్ఛత్రుఘ్నో రథే తిష్ఠన్ ధనంజయః
అవరోపయ వృక్షాగ్రాద్ ధనూంష్యేతాని మాచిరం

పరివేష్టనమేతేషాం క్షిప్రం చైవ వ్యపానుద
సోఽపహృత్య మహార్హాణి ధనూంషి పృథువక్షసాం
పరివేష్టనపత్రాణి విముచ్య సముపానయత్.

తథా సంనహనాన్యేషాం పరిముచ్య సమంతతః
అపశ్యద్ గాండీవం తత్ర చతుర్భిరపరైః సహ.

---

బృహన్నలా— ఈ శమీవృక్షం మీద ఒక శవం బంధింపబడి ఉన్నదని నేను విన్నాను. రాజపుత్రుడనూ క్షత్రియుడనూ ఐన నేను దానిని ముట్టుకోను. వేదవేదాంగా లభ్యసించిన రాజకుమారుడు అపవిత్రమైన పదార్థాలను స్పృశించకూడదు గదా. శవవాహకుడికి ఏ అపవిత్రత సిద్ధిస్తుందో శవాన్ని స్పృశించిన వానికికూడా అదే ప్రాప్తిస్తుంది — అని ఉత్తరుడు సందేహచిత్తంతో నిలబడగా— ఉత్తరా! నువ్వు భయపడకు. అక్కడ నా ధనస్సు ఉంది. అది శవంగాదు. నీ పవిత్రత చెడదు. ఉత్తమ వంశసంజాతుడవూ సదాచారసంపన్నుడవూ మత్స్య రాజపుత్రుడవూ ఐన నీచేత నింద్యకార్యాలు నేను చేయిస్తానా — అని కిరీటి పలకగా ఉత్తరుడు రథందిగి శమీవృక్షం అధిరోహించాడు. అర్జునుడు ఆలసించక గాండీవం త్వరగా తెమ్మని మిగిలిన ఆయుధాలను మామూలుగానే కట్టి ఉంచమని ఆదేశించాడు.

తేషాంవిముచ్యమానానాం ధనుషామర్క వర్చసాం
వినిశ్చేరుః ప్రభా దివ్యా గ్రహాణాముదయేష్వివ.
స తేషాం రూపమాలోక్య భోగినామివజృంభతాం
హృష్టరోమా భయోద్విగ్నః క్షణేన సమపద్యత.
సంస్పృశ్య తాని చాపాని భానుమంతి బృహంతిచ
వైరాటిరర్జునం రాజన్నిదం వచనమబ్రవీత్.

## సలుబది రెండవ అధ్యాయం

బిందవో జాతరూపస్య శతం యస్మిన్ నిపాతితాః
సహస్రకోటి సౌవర్ణాః కస్యైతద్ ధనురుత్తమం.
వారణా యత్ర సౌవర్ణాః పృష్ఠే భాసంతి దంశితాః
సుపార్శ్వంసుగ్రహం చైవకస్యైతద్ధనురుత్తమం
తపనీయస్య శుద్ధస్య షష్టిర్యస్యేంద్రగోపకాః
పృష్ఠే విభక్తాః శోభంతే కస్యైతద్ ధనురుత్తమం
సూర్యాయత్రచసౌవర్ణాస్త్రయో భాసంతిదంశితాః
తేజసా ప్రజ్వలంతో హి కస్యైతద్ ధనురుత్తమం
శలభా యత్ర సౌవర్ణాస్తపనీయవిభూషితాః
సువర్ణమణిచిత్రం చ కస్యైతద్ ధనురుత్తమం.
ఇమే చ కస్య నారాచాః సహస్రా లోమవాహినః
సమంతాత్ కలధౌతాగ్రా ఉపాసంగే హిరణ్యయే
విపాఠాఃపృథవః కస్య గార్ధ్రపత్రాః శిలాశితాః
హారిద్రవర్ణాః సుముఖాః పీతాఃసర్వాయసాః శరాః
కస్యాయమసితశ్చాపః పంచశార్దూలలక్షణః
వరాహకర్ణ వ్యామిశ్రాః శరాన్ ధారయతే దశ.
కస్యేమే పృథవో దీర్ఘాశ్చంద్రబింబార్ధదర్శనాః
శతాని సప్త తిష్ఠంతి నారాచా రుధిరాశనాః
కస్యేమే శుకపత్రాభైః పూర్వైరర్ధైః సువాససః
ఉత్తరైరాయసైః పీతైర్హేమపుంఖైః శిలాశితైః.

---

శమీపత్రాచ్ఛాదితమైన ఆయుధసంచయంలో సూర్యసమ కాంతితో వెలిగే ఐదు ధనుస్సులు ఉత్తరుని కంటపడ్డాయి. ప్రచండ గ్రీష్మభాను దీప్తులతో ఉన్న గాండీవం ఉత్తరునకు భయం కలిగించింది. విహ్వలచిత్తుడైనాడు ఉత్తరుడు.

## నలుబది రెండవ అధ్యాయం

శతకోటి సువర్ణ పుష్పాలంకృతమైన ఈ ఉత్తమ ధనుస్సు ఏ వీరాగ్రేసరునిది బృహన్నలా. ఇది ఎంతో సుందరంగా ఉంది. దీని పీఠం హేమ ద్యుతు లీనుతోంది దీనిఅంచులు పరమరణీయంగా ఉన్నాయి. పృష్ఠభాగం సువర్ణమయమై హరితారుణ కాంతులతో శోభిస్తోంది. మధ్యభాగం దృఢంగాఉంది. సువర్ణమయసూర్యచిహ్నత్రయంతో మిరుమిట్లు గొలుపుతోంది. మణులతోసువర్ణ భూషిత మీనాలతో ఈ ధనుస్సు వెలుగుతోంది. ఇది ఎవరిగో. బంగారు నీరుపూసి బాణ సహస్రంతో నిండిఉన్న ఈ బాణాసనం ఎవరిదో. గ్రద్దరెక్కలు కట్టబడ్డ స్థూలదండంతో కూడిన పదునైన ఈ వాడిబాణా లెవరివో. ఇవి సువర్ణ భ్రాంతిని కలిగిస్తున్నాయి

అయిదు సింహాలుగల ఈధనుస్సు ఎవరిది. దీని నాసిక వరాహకర్ణాకృతిలో ఉంది. దీనినుండి ఏక కాలంలో పదిబాణాలు విడువవచ్చు. ఇక్కడే ఏడు

గురుభారసహో దివ్యః శాత్రవాణాం భయంకరః
కస్యాయం సాయకో దీర్ఘః శిలీపృష్ఠః శిలీముఖః.
వైయాఘ్రకోశే నిహితో హేమచిత్రోదురాసదః
సుఫలశ్చిత్రకోశశ్చ కింకిణీసాయకో మహాన్.
కస్య హేమత్సరుర్దివ్యః ఖడ్గః పరమనిర్మలః
కస్యాయం విమలః ఖడ్గో గవ్యే కోశే సమర్పితః.
హేమత్సరురనాధృష్యో నైషధ్యో భారనాధనః
కస్య పాంచనఖే కోశే సాయకో హేమవిగ్రహః.
ప్రమాణరూపసంపన్నః పీత ఆకాశసంనిభః
కస్య హేమమయే కోశే సుతప్తే పావకప్రభే.
నిస్త్రింశోఽయం గురుః పీతః సాయకః పరనిర్వ్రణః
కస్యాయమసితః ఖడ్గో హేమబిందుభిరావృతః.
ఆశీవిషసమస్పర్శః పరకాయప్రభేదనః
గురుభారసహో దివ్యః సపత్నానాం భయప్రదః.
నిర్దిశస్వ యథాతత్వం మయా పృష్టా బృహన్నలే
విస్మయో మేపరోజాతో దృష్ట్వాసర్వమిదంమహత్

## నలుబది మూడవ అధ్యాయం

యన్మాం పూర్వమిహాపృచ్ఛః శత్రుసేనాపహారిణం
గాండీవమేతత్ పార్థస్య లోకేషు విదితం ధనుః.
సర్వాయుధమహామాత్రం శాతకుంభపరిష్కృతం
ఏతత్ తదర్జునస్యాసీద్ గాండీవం పరమాయుధం
యత్ తచ్ఛతసహస్రేణ సమ్మితం రాష్ట్రవర్ధనం
యేనదేవాన్ మనుష్యాంశ్చ పార్థో విజయతే మృధే
చిత్రముచ్చావచైర్వర్ణైః శ్లక్ష్ణమాయతమవ్రణం
దేవదానవగంధర్వైః పూజితం శాశ్వతీః సమాః.

వందల అర్ధచంద్రాకృతిగల బాణా లున్నాయి. ఇవి శత్రు రుధిరపాన సమర్థాలు ఇవి ఎవరివి?

ఇదిగో పూర్వార్ధం చిలుకవన్నెతో ఉత్తరార్ధం సువర్ణకాంతితో అలరారే రెక్కలు కట్టబడ్డ లోహనిర్మిత బాణాలకట్ట ఎవరిది?

శిలీముఖపృష్ఠాలుగల ఈ ఖడ్గ మెవ్వరిది? వ్యాఘ్రకేశాలతో తయారుచేయిబడిన ఒరలో ఉన్న ఈ బంగారుపిడిగలసువర్ణ చిత్రాలంకృత ఖడ్గ మెవ్వరిది?

నిషధదేశ నిర్మితమైన గోచర్మంలో ఉన్న ఈ నిర్మల ఖడ్గ మెవ్వరిది. పంచనఖచర్మ నిర్మితమైన ఒరలో ఉన్న నీలికాంతులీనే ఈ ఖడ్గ మెవ్వరిది? అగ్ని సముద్యుతు లీనుచూ మూడు అంగుళాల వెడల్పుతో సువర్ణ బిందులాంఛితమై సర్పస్పర్శ సదృశమైన ఈ ఖడ్గ మెవ్వరిది? బృహన్నలా ఈ శస్త్రాస్త్రాలు చూస్తూంటే నాకు భయం వేస్తోంది. నే నడిగిన ప్రశ్న లన్నింటికీ సమాధాన మియ్యి — అన్నాడు ఉత్తరుడు.

## నలుబది మూడవ అధ్యాయం

రాజనాందనా! నీ ప్రశ్నకు సమాధానమిస్తున్నాను విను. నువ్వు మొట్టమొదట చూసిన ధనుస్సు ఉన్నదే — అది గాండీవం. అది కాల స్వరూపిణి. ఎప్పుడూ అర్జునుని హస్తాలలోనే ఉంటుంది ఆ ధనుస్సు లక్ష సామాన్య ధనుస్సులతో సమమైంది. దేవ మానవ సంగ్రామాలలో అది అర్జునున కెంతో ఉపయోగిస్తుంది. విజయుని విజయాలకదే మూలవిరాట్టు దేవదానవగంధర్వులు దాన్ని చిరకాలం అర్చించి పూజించారు. ఈ గాండీవాన్ని బ్రహ్మ వెయ్యిసంవత్సరాలూ ప్రజా

ఏతద్ వర్షసహస్రంతు బ్రహ్మా పూర్వమధారయత్
తతోఽనంతరమేవాథ ప్రజాపతిరధారయత్.
త్రీణి పంచశతం చైవ శక్రోఽశీతి చ పంచ చ
సోమః పంచశతం రాజా తథైవ వరుణః శతం
పార్థః పంచ చ షష్టిం చ వర్షాణి శ్వేతవాహనః.
మహావీర్యం మహాదివ్యమేతత్ తద్ ధనురుత్తమం
ఏతత్ పార్థమనుప్రాప్తం వరుణాచ్చారుదర్శనం.
పూజితం సురమర్త్యేషు బిభర్తి పరమం వపుః
సుపార్శ్వం భీమసేనస్య జాతరూపగ్రహం ధనుః
యేన పార్థోఽజయత్ కృత్స్నాం దిశం ప్రాచీం పరంతపః.
ఇంద్రగోపకచిత్రం చ యదేతచ్చారుదర్శనం
రాజ్ఞో యుధిష్ఠిరస్యైతద్ వైరాటే ధనురుత్తమం.
సూర్యా యస్మింస్తు సౌవర్ణాః ప్రకాశం తే ప్రకాశినః
తేజసా ప్రజ్వలంతో వై నకులస్యైతదాయుధం.
శలభా యత్ర సౌవర్ణాస్తపనీయవిచిత్రితాః
ఏతన్మాద్రీసుతస్యాపి సహదేవస్య కార్ముకం.
యే త్విమే క్షురసంకాశాః సహస్రా లోమవాహినః
ఏతేఽర్జునస్య వైరాటే శరాః సర్పవిషోపమాః.
ఏతే జ్వలంతః సంగ్రామే తేజసా శీఘ్రగామినః
భవంతి వీరస్యాక్షయ్యా వ్యూహతః సమరే రిపూన్
యే చేమే పృథవో దీర్ఘాశ్చంద్రబింబార్ధదర్శనాః
ఏతే భీమస్య నిశితా రిపుక్షయకరాః శరాః.
హారిద్రవర్ణా యే త్వేతే హేమపుంఖాః శిలాశితాః
నకులస్య కలాపోఽయం పంచశార్దూలలక్షణః.
యేనాసౌ వ్యజయత్ కృత్స్నాం ప్రతీచీం దిశమాహవే
కలాపో హ్యేష తస్యాసీన్మాద్రీపుత్రస్య ధీమతః.
యే త్విమే నిశితాః పీతాః పృథవో దీర్ఘవాససః
హేమపుంఖాస్త్రిపర్వాణో రాజ్ఞ ఏతే మహాశరాః.
యస్త్వాయం సాయకో దీర్ఘః శిలీపృష్ఠః శిలీముఖః
అర్జునస్యైష సంగ్రామే గురుభారసహో దృఢః.
వైయాఘ్రకోశః సుమహాన్ భీమసేనస్య సాయకః
గురుభారసహో దివ్యః శాత్రవాణాం భయంకరః
సుఫలశ్చిత్రకోశశ్చ హేమత్సరురనుత్తమః
నిస్త్రింశః కౌరవస్యైష ధర్మరాజస్య ధీమతః.
యస్తు పాంచనఖే కోశే నిహితశ్చిత్రయోధనే
నకులస్యైష నిస్త్రింశో గురుభారసహో దృఢః.
యస్త్వయం విపులః ఖడ్గో గవ్యే కోశే సమర్పితః
సహదేవస్య విద్ధ్యేనం సర్వభారసహం దృఢం.

---

పతి అయిదు వందల మూడు సంవత్సరాలూ ఇంద్రుడు ఎనభై అయిదు సంవత్సరాలూ సోముడు అయిదు వందల సంవత్సరాలూ వరుణుడు నూరు సంవత్సరాలూ ధరించారు. అర్జునుడు దీనిని అరవై అయిదు సంవత్సరాలు ధరిస్తాడు. ఇది వరుణదత్తం.

దేవ మానవ పూజితమైన ఆ రెండవ ధనుస్సు భీమసేనునిది. దాని మధ్యభాగం సువర్ణ వినిర్మితం. ఆ ధనుస్సుతోనే భీముడు తూర్పు దిక్కును జయించాడు. సువర్ణమ్యతులతో ప్రకాశించే ధనుస్సు నకులునిది. సువర్ణఖచితమై చిలుకరంగుతో ప్రకాశించే ధనుస్సు సహదేవునిది. ఖడ్గంతో సమానమైన వాడిగలిగి సర్వవిష ప్రభావంగల బాణాలు అర్జునునివి. అర్ధచంద్రాకృతిగల బాణాలు భీమసేనునివి. పంచసింహ చిహ్నితమైన ధనుస్సుతోనే నకులుడు పశ్చిమ దిక్కును జయించాడు. సూర్య సమ తేజం గల ఆ బాణాలు సహదేవునివి. మూడు కణుపులు కలిగి సుదీర్ఘమై శిలీముఖపృష్ఠాలతో వెలిగే ఆ సువర్ణ వినిర్మిత ధనుస్సు ధర్మజునిది. ఆ ఖడ్గం అర్జుననిది. పులిచర్మపు టొరలో ఉన్న కత్తి భీమునిది. మూడంగుళాలు వెడల్పు ఉన్న ఖడ్గం ధర్మరాజుది. పంచనఖచర్మ నిర్మితమైన ఒరలో ఉన్న ఆ కత్తి నకులునిది. గోచర్మంలో ఉన్న కత్తి సహదేవునిది – అని ముగించాడు అర్జునుడు.

## నలుబది నాలుగవ అధ్యాయం

సువర్ణవికృతానీమాన్యాయుధాని మహాత్మనాం
రుచిరాణి ప్రకాశంతే పార్థానామాశుకారిణాం.
క్వను స్విదర్జునః పార్థః కౌరవ్యో వా యుధిష్ఠిరః
నకులః సహదేవశ్చ భీమసేనశ్చ పాండవః.
సర్వ ఏవ మహాత్మానః సర్వామిత్రవినాశనాః
రాజ్యమక్షైః పరాకీర్య న శ్రూయంతే కథంచన.
ద్రౌపదీ క్వ చ పాంచాలీ స్త్రీరత్నమితి విశ్రుతా
జితానక్షైస్తదా కృష్ణా తానేవాన్వగమద్ వనం.
అహమస్మ్యర్జునః పార్థః సభాస్తారో యుధిష్ఠిరః
బల్లవో భీమసేనస్తు పితుస్తే రసపాచకః.
అశ్వబంధోఽథ నకులః సహదేవస్తు గోకులే
సైరంధ్రీం ద్రౌపదీంవిద్ధి యత్కృతే కీచకాహతాః
దశ పార్థస్య నామాని యాని పూర్వం శ్రుతానిమే
ప్రబ్రూయాస్తాని యది మే శ్రద్దధ్యాం సర్వమేవ తే.

హంత తేఽహం సమాచక్షే దశనామానియానిమే
వైరాటే శృణు తానిత్వం యానిపూర్వంశ్రుతానితే.
ఏకాగ్రమానసో భూత్వా శృణుసర్వంసమాహితః
అర్జునః ఫాల్గునో జిష్ణుః కిరీటీ శ్వేతవాహనః
బీభత్సుర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః.
కేనాసి విజయో నామ కేనాసి శ్వేతవాహనః
కిరీటీ నామ కేనాసి సవ్యసాచీ కథం భవాన్.
అర్జునః ఫాల్గునో జిష్ణుః కృష్ణో బీభత్సురేవ చ
ధనంజయశ్చ కేనాసి బ్రూహి తన్మమ తత్వతః.
శ్రుతా మే తస్య వీరస్య కేవలా నామహేతవః
తత్సర్వం యదిమేబ్రూయాః శ్రద్దధ్యాంసర్వమేవతే
సర్వాన్జనపదాన్జిత్వా విత్తమాదాయ కేవలం
మధ్యేధనస్య తిష్ఠామి తేనాహుర్మాం ధనంజయం

## నలుబది నాలుగవ అధ్యాయం

బృహన్నలా - ఆ వీరాగ్రేసరులు ఆయుధాలన్నీ ఇక్కడపెట్టి ఎక్కడకు వెళ్లారు. కపట ద్యూతంలో రాజ్యసర్వస్వంకోలుపోయి ఎక్కడ ఏ ఇక్కట్లు పడుతున్నారో? పాంచాల రాజపుత్రి ఏ క్లేశాలు అనుభవిస్తోందో? అని ఉత్తరుడు ప్రశ్నించగా బృహన్నల - రాజకుమారా! నేనే అర్జునుడను. మీ రాజభవనంలో ఉన్న కంకభట్టే ధర్మరాజు. వల్లవుడు భీముడు. గ్రంథికుడు నకులుడు. తంతిపాలుడు సహదేవుడు. సైరంధ్రి ద్రౌపది. ఆమెవలననే కీచకుడు యమపురికి పోయాడు - అనగా ఉత్తరుడు తనకు నమ్మకం కలగక అర్జునునికి కల పది పేరులూ చెప్పినట్లైతే వాని మాటలు విశ్వసిస్తా నన్నాడు.

ఉత్తరా - సావధానంగా విను. అర్జున ఫల్గుణ జిష్ణు కిరీటి శ్వేతవాహన భీభత్స విజయ కృష్ణ సవ్యసాచి ధనంజయ - ఈపదీ నాపేర్లు - అని అర్జునుడు చెప్పగా ఆపేర్లకు కారణాలు చెప్పమన్నాడు. రాకుమారా-నేను ఈ భూమండలమంతా జయించి రాజులనుండి ధనరాసులు కప్పంగా గ్రహించడం వల్ల ధనుంజయుడ నయ్యాను. సమరభూమిలో పరాజయం లేకుండా చరించడంవల్ల విజయుడ నయ్యాను. శ్వేతాశ్వాలుపూన్చిన దివ్యరథం మీద చరించడంవల్ల, శ్వేతవాహనుడనీ, ఉత్తర ఫల్గునీనక్షత్రదివసాన జన్మించినందువల్ల ఫల్గుణుడ ననీ, రాక్షస సంహార సమయంలో ఇంద్రునిచేత కిరీట బహూకృతి పొందడంవల్ల కిరీటిననీ, ఉభయ

అభిప్రయామిసంగ్రామే యదహంయుద్ధదుర్మదాన్
నాజిత్వా వినివర్తామి తేన మాం విజయం విదుః.
శ్వేతాః కాంచనసంనాహా రథే యుజ్యంతి మే
హయాః
సంగ్రామేయుధ్యమానస్య తేనాహం శ్వేతవాహనః.
ఉత్తరాభ్యాంఫల్గునీభ్యాంనక్షత్రాభ్యామహందివా
జాతో హిమవతః పృష్ఠే తేనమాం ఫాల్గుణంవిదుః.
పురా శక్రేణ మే దత్తం యుధ్యతో దానవర్షభైః
కిరీటంమూర్ధ్నిసూర్యాభం తేనాహుర్మాంకిరీటినం
న కుర్యాం కర్మ బీభత్సం యుధ్యమానః కథంచన
తేన దేవమనుష్యేషు బీభత్సురితి విశ్రుతః.
ఉభౌ మే దక్షిణౌ పాణీ గాండీవస్య వికర్షణే
తేన దేవమనుష్యేషు సవ్యసాచీతి మాం విదుః.
పృథివ్యాంచతురంతాయాం వర్ణోమేదుర్లభఃసమః
కరోమి కర్మ శుక్లం చ తస్మాన్మామర్జునం విదుః.
అహం దురాపో దుర్ధర్షో దమనః పాకశాసనిః
తేన దేవమనుష్యేషు జిష్ణుర్నామాస్మి విశ్రుతః.
కృష్ణ ఇత్యేవ దశమం నామ చక్రే పితా మమ
కృష్ణావదాతస్య తతః ప్రియత్వాద్ బాలకస్య వై
తతః స పార్థం వైరాటిరభ్యవాదయదంతికాత్
అహం భూమింజయో నామ నామ్నాహమపి
చోత్తరః.

దిష్ట్యా త్వాం పార్థ పశ్యామి స్వాగతం తే ధనంజయ
లోహితాక్ష మహాబాహో నాగరాజకరోపమ.
యదజ్ఞానాదవోచం త్వాం క్షంతుమర్హసి తన్మమ
యతస్త్వయాకృతంపూర్వంచిత్రంకర్మసుదుష్కరం
అతో భయం వ్యతీతం మే ప్రీతిశ్చపరమాత్వయి.
దాసోఽహం తేభవిష్యామి పశ్యమమానుకంపయా
యా ప్రతిజ్ఞా కృతా పూర్వం తవ సారథ్యకర్మణి.
మనఃస్వాస్థ్యం చ మే జాతం జాతం భాగ్యం చ మే
మహత్.

---

హస్తాలతో బాణాలు విడువగలగడంవల్ల సవ్యసాచి ననీ, పరిశుద్ధ కర్మాచరణంవల్ల అద్భుత దేహ కాంతివల్ల అర్జునుడననీ, శత్రు సంతాప సంహార కారుడను కావడంచేత జిష్ణుడననీ, శ్యామవర్ణుడను కావడంచేత కృష్ణుడననీ, సమరభూమిలో భయానకకార్యా లాచరిండంచేత బీభత్సుడననీ పిలువ బడుతున్నాను – అని చెప్పగా ఉత్తరుడు సవ్యసాచి పాదాలనుస్పృశించి – మహావీరా – నన్ను ఉత్తరు డనీ భూమింజయుడనీ లోకులు పిలుస్తారు. నీ దర్శనంవల్ల నాకు సర్వసుఖాలూ చేకూరుతాయి. అరుణ నేత్రద్వయంతో మత్తకరికర సదృశహస్తాలతో అలరారే నీ పరాక్రమాన్ని నేను వర్ణించ లేను. ఇతఃపూర్వం నే నేవో అనుచిత ప్రసంగాలు చేసాను. నన్ను క్షమించండి. ఇప్పుడు నా కే భయమూ లేదు. ఇదివరలో ఎన్నో అద్భుతాలు చేసినవారు మీరు. నేను మీ దాసుడను. నన్ను మన్నించండి. స్వస్థచిత్తంతో మిమ్ము సేవిస్తాను. ఇంతకు ముందే మీకు సారథిగా ఉండడానికి ఒప్పుకున్నాను. ఇప్పు డాకార్యం సంతోషంతో నెర వేరుస్తాను – అని పరిపరి విధాల కీర్తించాడు.

## నలుబది ఐదవ అధ్యాయం

ఆస్థాయ రుచిరం వీర రథం సారథినా మయా
కతమం యాస్యసేఽనీకముక్తో యాస్యామ్యహం త్వయా.
ప్రీతోఽస్మి పురుషవ్యాఘ్ర న భయం విద్యతే తవ
సర్వాన్నుదామి తే శత్రూన్ రణే రణవిశారదః.
స్వస్థో భవ మహాబాహో పశ్యమాం శత్రుభిః సహ
యుధ్యమానం విమర్దేఽస్మిన్ కుర్వాణం భైరవం మహత్.
ఏతాన్ సర్వానుపాసంగాన్ క్షిప్రం బధ్నీహి మే రథే
ఏకం చాహర నిస్త్రింశం జాతరూపపరిష్కృతం.
అర్జునస్య వచః శ్రుత్వా త్వరావానుత్తరస్తదా
అర్జునస్యాయుధాన్ గృహ్య శీఘ్రేణావాతరత్ తతః.
అహం వై కురుభిర్యోత్స్యామ్యవజేష్యామి తే పశూన్
సంకల్పపక్షవిక్షేపం బాహుప్రాకారతోరణం.
త్రిదండతూణసంబాధమనేకధ్వజసంకులం
జ్యాక్షేపణం క్రోధకృతం నేమినినదదుందుభి
నగరం తే మయా గుప్తం రథోపస్థం భవిష్యతి.
అధిష్ఠితో మయా సంఖ్యే రథో గాండీవధన్వనా
అజేయః శత్రుసైన్యానాం వైరాటే వ్యేతు తే భయం.
బిభేమి నాహమేతేషాం జానామి త్వాం స్థిరం యుధి
కేశవేనాపి సంగ్రామే సాక్షాదింద్రేణ వా సమం.
ఇదం తు చింతయన్నేవం పరిముహ్యామి కేవలం
నిశ్చయం చాపి దుర్మేధా న గచ్ఛామి కథంచన.
ఏవం యుక్తాంగరూపస్య లక్షణైః సూచితస్య చ
కేన కర్మవిపాకేన క్లైబత్వమిదమాగతం.
మన్యే త్వాం క్లీబవేషేణ చరంతం శూలపాణినం
గంధర్వరాజప్రతిమం దేవం వాపి శతక్రతుం.

---

## నలుబది ఐదవ అధ్యాయం

మహావీరుడా - నీ ఆజ్ఞానుసారం రథం నడుపుతాను. ఇప్పుడు మనం ఏ దిక్కుగా పోవాలో చెప్పండి - అని ఉత్తరుడు ప్రశ్నించగా పురుషసింహా! నీభయరాహిత్యంచూస్తే నాకు సంతోషం కలుగుతోంది. స్వస్థచిత్తంతో నా పరాక్రమం చూద్దువుగాని. నువు కూడా యుద్ధకుశలుడవే కదా ఆ వృక్షంమీది నా ఖడ్గమూ గాండీవమూ బాణాసనమూ తీసికొని త్వరగా రా - అని అర్జును డనగా ఉత్తరుడు - ఉత్తర క్షణంలో గాండీవ బాణాసనాలతో దిగి వచ్చాడు.

ఉత్తరకుమారా - నేను కౌరవసేనావాహినితో సమరం సాగిస్తూఉన్నప్పుడు నువ్వు గోగణాలను మరలించు. ఈరథోపరిభాగం నగర సదృశంగా నిన్ను రక్షిస్తుంది. దీని పార్శ్వాలు ప్రతోళికల ప్రక్కనున్న గృహాలవలె నాభుజాలు నగర ద్వార ప్రాకార తోరణాలవలె నిన్ను రక్షిస్తాయి. దీని మీద త్రిదండ తూణీరాలు ఎవరికీ ప్రవేశార్హత నివ్వవు. నగరంలోని పతాకాలంకారాలవలె ఈ రథాలంకారాలు శోభిస్తున్నాయి. నా ధనుష్టంకారమే భేరీ భాంకార మౌతుంది. రథనేమినిస్వనాలే మంగళతూర్య ఘోషాలౌతాయి. గాండీవం ధరించి నేను నిలబడితే నా ఎదుట నిలువగల వీరుడు లేడు. ఇంక నువ్వుభయపడకు - అని అర్జును డనగా ఉత్తరుడు - పార్థా - నాకింక ఏ భయమూ లేదు. నువ్వు. కృష్ణునితో ఇంద్రునితో సమమైనవీరుడవని నే నెరుగుదును. నాబుద్ధి వక్రించడంవల్ల సక్ర

ఊర్వశీశాపసంభూతం క్లైబ్యం మాం సముపస్థితం
పురాహమాజ్ఞయా భ్రాతుర్జ్యేష్ఠస్యాస్మి సురాలయం
ప్రాప్తవానుర్వశీ దృష్ట్వా సుధర్మాయాం మయా తదా
నృత్యంతీ పరమం రూపం బిభ్రతీ వ్రజసంనిధౌ.
అపశ్యంస్తామనిమిషం కూటస్థామన్వయస్య మే
రాత్రౌ సమాగతా మహ్యాం శయానం
రంతుమిచ్ఛయా.
అహం తామభివాద్యైవ మాతృసత్కారమాచరం
సా చ మామపశ్యత్ క్రుద్ధా శిఖండీత్వం భవేరితి.
శ్రుత్వా తమింద్రో మామాహ మా భైస్త్వం
పార్థ షండతః
ఉపకారో భవేత్ తుభ్యమజ్ఞాతవసతౌ పురా.
ఇతీంద్రో మామనుగ్రాహ్య తతః ప్రేషితవాన్ వృషా
తదిదం సమనుప్రాప్తం వ్రతం తీర్ణం మయానఘ.
భ్రాతుర్నియోగాజ్జ్యేష్ఠస్య సంవత్సరమిదం వ్రతం
చరామి వ్రతచర్యాం చ సత్యమేతద్ బ్రవీమి తే-
నాస్మి క్లీబో మహాబాహో పరవాన్ ధర్మసంయుతః.
సమాప్తవ్రతముత్తీర్ణం విద్ధి మాం త్వం నృపాత్మజ.
పరమోఽనుగ్రహో మేఽద్య యత స్తర్కో
న మే వృథా
న హీదృశాః క్లీబరూపా భవంతి తు నరోత్తమ.
సహాయవానస్మి రణే యుధ్యేయమమరైరపి
సాధ్వసం హి ప్రణష్టం మే కిం కరోమి బ్రవీహి మే.
అహం హ్యసంగృహీష్యామి హయాన్ శత్రు
రథారుజాన్
శిక్షితో హ్యస్మి సారథ్యే తీర్థతః పురుషర్షభ.
దారుకో వాసుదేవస్య యథా శక్రస్య మాతలిః
తథా మాం విద్ధి సారథ్యే శిక్షితం నరపుంగవ.
యస్య యాతేన పశ్యంతి భూమావాక్షిప్తం పదంపదం
దక్షిణాం యో ధురం యుక్తః సుగ్రీవసదృశో హయః.

---

మంగా నిన్ను గుర్తించలేకపోయాను. అందుకు విచారిస్తున్నాను. సర్వాంగస్ఫూర్తితో సర్వశుభ లక్షణ లక్షితుడవై అలరారే నీకు ఈ నపుంసక స్థితి ఎందుకు కల్గిందా అని విచారిస్తున్నాను. నిన్ను చూస్తూంటే గంధర్వాధిపుడూ, అమరేంద్రుడూ, శూలపాణీ నాకు గుర్తుకు వస్తున్నారు. వారివలెనే నేను నిన్ను గౌరవిస్తాను. అని ఉత్తరుడు తన మనోభావం ప్రకటించాడు

ఉత్తరా-ఊర్వశీశాప కారణంగా నాకీరూపం సిద్ధించింది. ఆ కథ చెబుతాను విను — మా అగ్రజుని ఆదేశానుసారం నేను దేవలోకం వెళ్ళాను. సుధర్మసభామధ్యంలో ఊర్వశి నృత్యంచేయడం చూసాను. మా వంశానికి మూలమాతృస్థానీయురాలైన ఆమెను తదేకదృష్టితో వీక్షించడంవల్ల ఆమె నాయందు అనురాగం కల్గించుకొని అర్ధరాత్రి నాదగ్గరకువచ్చి నన్ను కోరింది. నేను తిరస్కరించాను, మాతృదేవిగా ఆమెను భావించి గౌరవించడంవల్ల నాపై ఆగ్రహంతో నపుంసకుడవు కమ్మని శపించింది. అది తెలిసి ఇంద్రుడు అజ్ఞాతవాససమయంలో ఊర్వశీశాపం వరంగా ఉపకరిస్తుందని ధైర్యం చెప్పాడు. ఇంద్రుని అనుగ్రహ విశేషంవల్ల నేనీ రూపంతో అజ్ఞాతవాసం పూర్తిచేసాను. అంతేకాని నేను నపుంసకుడను కాను. అగ్రజుడైన ధర్మజుని ఆజ్ఞానుసారం ధర్మపరిపాలనదీక్ష సాగిస్తున్నాను. అజ్ఞాతవాసవ్రత సమయం పరిసమాప్తమైంది. నాకిప్పుడు నపుంసకత్వ విముక్తి కలిగింది — అన్నాడు.

కౌంతేయా-నేను నీ అనుగ్రహానికి పాత్రుడనై సర్వవిషయాలూ గ్రహించాను. నా సందేహాలన్నీ తీరిపోయాయి. నీ సహాయంతో దేవతలనైనా

యోఽయం ధురం ధుర్యవరో వామాం
వహతి శోభనః
తం మన్యే మేఘపుష్పస్య జవేన సదృశం హయం.
యోఽయం కాంచనసంనాహః పార్ష్ణిం వహతి శోభనః
సమం శైబ్యస్య తం మన్యే జవేన బలవత్తరం.
యోఽయం వహతి మే పార్ష్ణిం దక్షిణామభితః స్థితః
బలాహకాదపి మతః స జవే వీర్యవత్తరః.
త్వామేవాయం రథో వోఢుం సంగ్రామేఽర్హతి
ధన్వినం
త్వం చేమం రథమాస్థాయ యోద్ధుమర్హో మతో మమ
తతో విముచ్య బాహుభ్యాం వలయాని స వీర్యవాన్
చిత్రే కాంచనసంనాహే ప్రత్యముంచత్ తదా తలే.
కృష్ణాన్ భంగిమతః కేశాన్ శ్వేతేనోద్గ్రథ్య వాససా
అథాసౌ ప్రాఙ్ముఖో భూత్వా శుచిః ప్రయత
మానసః
అభిదధ్యౌ మహాబాహుః సర్వాస్త్రాణి రథోత్తమే.
ఊచుశ్చ పార్థం సర్వాణి ప్రాంజలీని నృపాత్మజం
ఇమే స్మ పరమోదారాః కింకరాః పాండునందన.
ప్రణిపత్య తతః పార్థః సమాలభ్య చ పాణినా
సర్వాణి మానసానీహ భవతేత్యభ్యభాషత.
ప్రతిగృహ్య తతోఽస్త్రాణి ప్రహృష్టవదనోఽభవత్
అధిజ్యం తరసా కృత్వా గాండీవం వ్యాక్షిపద్ ధనుః.
తస్య విక్షిప్యమాణస్య ధనుషోఽభూన్మహాధ్వనిః
యథా శైలస్య మహతః శైలేనైవావజఘ్నతః.
స నిర్ఘాతోఽభవద్ భూభిద్ దిక్షు
వాయుర్వవౌ భృశం
పపాత మహతీ చోల్కా దిశో న ప్రచకాశిరే
భ్రాంతధ్వజం ఖం తదాసీత్ ప్రకంపితమహాద్రుమం.
తం శబ్దం కురవోఽజానన్ విస్ఫోటమశనేరివ
యదర్జునో ధనుః శ్రేష్ఠం బాహుభ్యామాక్షిపద్ రథే.

---

జయించగలను. మరణభయం నాకు అణుమాత్ర మైనా లేదు. నా గురువులు సారథ్యంలోకూడా నాకు మంచి శిక్షణ ఇచ్చారు. సంగరరంగ భూమిలో వివిధగతులతో నేను రథం నడుపుతాను. మాతలి దారుకులను తలపుకు తేగల సారథ్య సామర్థ్యం నాకు ఉంది. ఈ రథానికి దక్షిణభాగాన ఉన్న అశ్వం భూమిపై కాలు మోపడంకూడా ఇతరులు గుర్తించలేనంత వేగంగా పోగలదు. ఇది సుగ్రీవజాతికి చెందినదని అశ్వశాస్త్రజ్ఞు లంటు న్నారు. ఈ వామపార్శ్వాన ఉన్న అశ్వం కృష్ణుని మేఘపుష్పాశ్వంతో సమమైంది. వెనుకభాగంలో ఉన్న రెండు అశ్వాలు శైబ్యవలాహకాలను మించిన వేగంతో పోగలవు. వీరాధివీరులు అధిరో హించడానికి యోగ్యమైన రథ మిది. మీరు రథికులై యుద్ధ సన్నద్ధులు కండి — అన్నాడు ఉత్తరుడు.

అర్జునుడు కంచక కంచణాది నారీజనోచితాలం కారాలు విడిచి తన కవచం ధరించాడు. సుదీర్ఘ కేశపాశం శ్వేతవస్త్రంతో బంధించి పూర్వాభి ముఖంగా రథారోహణంచేసి ఆసీనుడై ఏకాగ్ర చిత్తంతో శస్త్రాస్త్రాలను స్మరించగా ఆ దివ్యాస్త్రాలు స్వస్వరూపాలతో సాక్షాత్కరించి — పాండురాజ నందనా-నేడు మేము నీ వశవర్తులమై చరిస్తాము— అని పలకగా అర్జునుడు వాటికి ప్రణతు లర్పించి— మీ రందరూ నా అంతరంగంలో అధివసించండి— అని ప్రార్థించాడు.

సర్వాస్త్రవశీభూతహృదయుడైన సవ్యసాచి ప్రసన్నచిత్తుడై గాండీవం ధరించి నారి సంధించి

ఏకస్త్వం పాండవశ్రేష్ఠ బహూనేతాన్ మహారథాన్
కథం జేష్యసి సంగ్రామే సర్వశస్త్రాస్త్రపారగాన్
అసహాయోఽసి కౌంతేయ ససహాయాశ్చ కౌరవాః
అత ఏవ మహాబాహో భీతస్తిష్ఠామి తేఽగ్రతః.
ఉవాచ పార్థో మాభైషీః ప్రహస్యస్వనవత్ తదా
యుధ్యమానస్య మే వీర గంధర్వైః సుమహాబలైః
సహాయో ఘోషయాత్రాయాం కస్తదాఽఽసీత్ సఖా మమ.
తథా ప్రతిభయే తస్మిన్ దేవదానవసంకులే
ఖాండవేయుధ్యమానస్య కస్తదాఽఽసీత్ సఖా మమ.
నివాతకవచైః సార్థం పౌలోమైశ్చ మహాబలైః
యుధ్యతో దేవరాజార్థే కః సహాయస్తదాభవత్.
స్వయంవరే తు పాంచాల్యా రాజభిః సహసంయుగే
యుధ్యతో బహుభిస్తాత కః సహాయస్తదాభవత్.
ఉపజీవ్యగురుం ద్రోణం శక్రం వైశ్రవణం యమం
వరుణం పావకం చైవ కృపం కృష్ణంచ మాధవం.
పినాకపాణినం చైవ కథమేతాన్ న యోధయే
రథంవాహయమేశీఘ్రం వ్యేతు తే మానసోజ్వరః.



---

శంకారం చేసేసరికి రెండు భూధరాలు ఢీకొన్నట్లు భయానకశబ్దం బయలుదేరి భూమండలాన్ని దద్దరిల్ల చేసింది. ప్రచండవాయువు రేగి ఆకాశము ధూళి ధూసరితమై అంధకారబంధుర మైంది. పుంఖాను పుంఖంగా ఉల్కలు పడ్డాయి. మహావృక్షాలు సమూలంగా నేల కూలాయి. శత్రు సేన లోని ధ్వజాలు అకారణంగా కంపించాయి. ఆ ధ్వని ప్రావృణ్మేఘగర్జనగా వినిపించగా కౌరవులు విస్తు పోయి చూడసాగారు.

పాండురాజనందనా – శస్త్రాస్త్రవేత్తలైన ఈ కురువీరు లందరినీ మీరు ఏకాకిగా జయించ గలరా? వారికి అపారమైన సైన్యంకూడా ఉన్న దే! ఈ స్థితి చూస్తూంటే నాకు కొంత భయం కలుగు తోంది — అని ఉత్తరు డనగా, అర్జునుడు నవ్వుతూ – ఉత్తరా నువ్వేమీ భయపడకు. ఘోషయాత్రా సమయంలో ఇతర సహాయం అపేక్షించకుండా నేనొక్కడనే గంధర్వులను జయించాను. ఖాండవవన దహనవేళ దేవదానవు లను ఒంటరిగానే జయించాను. దేవేంద్రునికి లొంగని నివాతకవచ కాలకేయులను ఏకాకిగా సంహరించాను. ద్రౌపదీస్వయంవర సమయంలో నానాదేశాధీశులనూ ఓడించిననాడు నా కెవరి సహాయమూ లేదు. కృప ద్రోణ కృష్ణ శంకరాదు లనూ దిక్పాలకులనూ ఆశ్రయించి వారి అను గ్రహంపొందిన నేను ఈ కౌరవ యోధులతో యుద్ధం చెయ్యలేకపోలేను. రథం పోనియ్యి. ఏమీ భయపడకు – అనగా ఉత్తరుడు భయరహితుడై నిలబడ్డాడు.



## నలుబది ఆఱవ అధ్యాయం

ఉత్తరంసారథిం కృత్వాశమీంకృత్వాప్రదక్షిణం
ఆయుధంసర్వమాదాయప్రయయౌ పాండవర్షభః.
ధ్వజం సింహం రథాత్ తస్మాదపనీయమహారథః
ప్రణిధాయ శమీమూలే ప్రాయాదుత్తరసారథిః.
దైవీం మాయాం రథే యుక్తాం విహితాం విశ్వకర్మణా
కాంచనం సింహలాంగలం ధ్వజం వానరలక్షణం.
మనసా చింతయామాస ప్రసాదం పావకస్య చ
స చ తచ్చింతితం జ్ఞాత్వా ధ్వజే భూతాన్యదేశయత్.
సపతాకం విచిత్రాంగం సోపాసంగం మహాబలం
ఖాత్ పపాత రథేతూర్ణం దివ్యరూప మనోరమం.
రథంతమాగతం దృష్ట్వా దక్షిణంప్రాకరోత్ తదా
రథమాస్థాయబీభత్సుః కౌంతేయః శ్వేతవాహనః
బద్ధగోధాంగుళిత్రాణః ప్రగృహీతశరాసనః.
తతః ప్రాయాదుదీచీం చ కపిప్రవరకేతనః.
స్వనవంతం మహాశంఖం బలవానరిమర్దనః
ప్రాధమద్ బలమాస్థాయ ద్విషతాంలోమహర్షణం
శశాంకరూపం బీభత్సుః ప్రాధ్మాపయదరిందమః
శంఖశబ్దోఽస్యసోఽత్యర్థం శ్రూయతే కాల మేఘవత్.
తస్య శంఖస్య శబ్దేన ధనుషో నిస్వనేన చ
వానరస్య చ నాదేన రథనేమిస్వనేన చ.
జంగమస్య భయం ఘోరమకరోత్ పాకశాసనిః
తతస్తే జవనా ధుర్యా జానుభ్యామగమన్మహీం
ఉత్తరశ్చాపి సంత్రస్తో రథోపస్థ ఉపావిశత్.
సంస్థాప్య చాశ్వాన్ కౌంతేయః సముద్యమ్య చ రశ్మిభిః.
ఉత్తరం చ పరిష్వజ్య సమాశ్వాసయదర్జునః.

## నలుబది ఆఱవ అధ్యాయం

అర్జునుడు అస్త్రశస్త్రాలు గ్రహించి శమీవృక్షానికి ప్రదక్షిణనమస్కారాలుచేసి రథంమీద ఉన్న సింహలాంఛితపతాకం తీసివేసి అగ్నిదేవతాదత్తమూ, విశ్వకర్మవినిర్మితమూ ఐన దివ్యపతాకం ప్రతిష్ఠించాడు. తేజోమయుడైన హనుమంతుడు దీర్ఘవాలంతో దానిమీదప్రకాశిస్తున్నాడు. ప్రదక్షిణ పూర్వకంగా రథాన్ని నడిపి గోచర్మనిర్మితమైన అంగుళిత్రాణాలు బంధించుకొని కపిధ్వజశోభితమైన రథాన్ని ఉత్తర దిశగా పోనిమ్మన్నాడుఅర్జునుడు. దేవదత్తంపూరించాడు దేవేంద్రసూనుడు. చిత్రప్రతిమ లయారు శత్రుసైనికులు. వర్షామేఘగర్జాసదృశమైన ఆ దేవదత్తధ్వని శత్రువుల హృదయాలను కంపింపచేసింది. గాండీవధనుష్టంకారమూ దేవదత్తశంఖధ్వానమూ ఆంజనేయ సింహనాదమూ ఏకమై ప్రళయకాల మేఘ గర్జనవలె కాగా భూమండలం స్థావరజంగమాత్మకప్రాణికోటితో భయకంపితమైంది. దేవదత్తధ్వనికి ఉత్తరుని రథాశ్వాలు మోకాళ్ళమీద వాలిపోయాయి. ఉత్తరుడు సారథిస్థానంనుండి రథికపీఠానికివాలాడు. కౌంతేయుడు కళ్ళాలు పట్టి గుర్రాలను నిలబెట్టి ఉత్తరుని లేవనెత్తి హృదయమార కౌగలించుకొని — రాజకుమారశిరోమణీ నువ్వుభయపడకు; పురుషసింహుడవై చరించు. శత్రుమధ్యంలో నిలిచి రాజవంశీయులు బేజారు

మాభైస్త్వం రాజపుత్రాగ్ర్య క్షత్రియోఽసి పరంతప
కథం ను పురుషవ్యాఘ్ర శత్రుమధ్యే విషీదసి.
శ్రుతా స్తే శంఖశబ్దాశ్చ భేరీశబ్దాశ్చ పుష్కలాః
కుంజరాణాం చ నదతాం వ్యూఢానీకేషు తిష్ఠతాం
స త్వం కథమిహానేన శంఖశబ్దేన భీషితః.
వివర్ణరూపో విత్రస్తః పురుషః ప్రాకృతో యథా.
శ్రుతా మే శంఖశబ్దాశ్చ భేరీశబ్దాశ్చ పుష్కలాః
కుంజరాణాం వినదతాం వ్యూఢానీకేషు తిష్ఠతాం
నైవంవిధః శంఖశబ్దః పురా జాతు మయా శ్రుతః.
ధ్వజస్యచాపిరూపంమే దృష్టపూర్వం నహీదృశం
ధనుషశ్చైవ నిర్ఘోషః శ్రుతపూర్వో న మే క్వచిత్
అస్య శంఖస్య శబ్దేన ధనుషో నిస్వనేన చ.
అమానుషాణాం శబ్దేన భూతానాం ధ్వజవాసినాం
రథస్య చ నినాదేన మనో ముహ్యతి మే భృశం.
వ్యాకులాశ్చ దిశః సర్వా హృదయం వ్యథతీవ మే
ధ్వజేన పిహితాః సర్వా దిశో న ప్రతిభాంతి మే-
గాండీవస్య చ శబ్దేన కర్ణౌ మే బధిరీకృతౌ.
స ముహూర్తం ప్రయాతం తు పార్థో వైరాటి మబ్రవీత్.
ఏకాంతం రథమాస్థాయ పద్భ్యాంత్వమవపీడయన్
దృఢం చ రశ్మీన్ సంయచ్ఛ శంఖం ధ్మాస్యామ్యహం పునః.
తతః శంఖముపాధ్మాసీద్ దారయన్నివ పర్వతాన్
గుహా గిరీణాం చ తదా దిశః శైలాం స్తథైవ చ.
ఉత్తరశ్చాపి సంలీనో రథోపస్థ ఉపావిశత్.
తస్య శంఖస్య శబ్దేన రథనేమిస్వనేన చ
గాండీవస్య చ ఘోషేణ పృథివీ సమకంపత
తం సమాశ్వాసయామాస పునరేవ ధనంజయః.
యథా రథస్య నిర్ఘోషో యథా మేఘ ఉదీర్యతే
కంపతేచ యథా భూమిర్నైషోఽన్యః సవ్యసాచినః

పడకూడదు. యుద్ధభూమిలో ఎన్నోమారులు ఇటువంటి శంఖధ్వానాలు వినిపిస్తాయి. గజ ఘీంకారాలు దూసుకువస్తాయి. ఈశంఖనాదానికే భయపడితే యుద్ధభూమిలో ఏలానిలబడగలవో—అని పార్థుడు ప్రశ్నించగా—వీరశిరోమణీ, ఎన్నో యుద్ధాలలో శంఖధ్వానాలు రణభేరీనాదాలూ గజఘీంకారాలూ విన్నాను. కాని ఇంతటి భయానక శబ్దం ఎప్పుడూ వినలేదు. ఇటువంటి రథ ధ్వజమూ చూడలేదు. ఇంత భయానకంగా ధనుష్టంకారము ఎప్పుడూ నాచెవికి సోకలేదు. ఈ ధ్వజమధిష్ఠించిన వానరుని భయంకరశబ్దం చాలా విచిత్రంగా ఉంది. ధ్వజచిహ్నాలు గర్జించడం నేను వినలేదు కనలేదు. దిగ్దిగంతాలను దద్దరిల్లిచేసే ఈ నాదాలు నన్ను కంపింపచేస్తున్నాయి. నీ కపికేతనకాంతులు దిశాంతాలను ప్రకాశింపచేస్తున్నాయి. ఆ కాంతిలో నాకు దిక్కులు కనిపించడం లేదు. నీ ధనుష్టంకారంలో నాచెవులు శ్రవణశక్తిని కోల్పోయాయి — అని రెండుఘడియ లాగాడు.

అప్పుడు అర్జునుడు – రాజనందనా—నువ్వు నీ పాదాలనుబంధించుకొని స్థిరాసనంమీద కూర్చో. కళ్ళాలు బిగించిపట్టుకో. మళ్ళీ శంఖం పూరిస్తున్నాను—అని దేవదత్తం పూరించాడు. ఉత్తరుడు భయంతో రథాంతర్భాగంలోకి వచ్చేసాడు. అర్జునుడు మరొకమారు ఉత్తరునికి ధైర్యం పురికొలిపాడు.

ఆశంఖధ్వనీ, ధనుష్టంకారమూ, రథనేమినిస్వనమూ ఆకర్ణించి ఆచార్యద్రోణుడు కురుసేనవైపు తిరిగి — మహావీరులారా అర్జునుడు వస్తున్నాడు.

శస్త్రాణి న ప్రకాశంతే న ప్రహృష్యంతి వాజినః
అగ్నయశ్చ న భాసంతే సమిద్ధాస్తన్న శోభనం.
ప్రత్యాదిత్యంచ నః సర్వే మృగా ఘోరప్రవాదినః
ధ్వజేషు చ నిలీయంతే వాయసాస్తన్న శోభనం.
శకునాశ్చాపసవ్యా నో వేదయంతి మహద్భయం
గోమాయురేష సేనాయాం రుదన్ మధ్యేనధావతి
అనాహతశ్చనిష్కాంతో మహద్ వేదయతేభయం
భవతాం రోమకూపాణి ప్రహృష్టాన్యుపలక్షయే
ధ్రువంవినాశోయుద్ధేన క్షత్రియాణాం ప్రదృశ్యతే
జ్యోతీంషి న ప్రకాశంతే దారుణా మృగపక్షిణః
ఉత్పాతావివిధాఘోరాదృశ్యంతే క్షత్రనాశనాః.
విశేషత ఇహాస్మాకం నిమిత్తాని వినాశనే
ఉల్కాభిశ్చ ప్రదీప్తాభిర్బాధ్యతే పృతనా తవ
వాహనాన్యప్రహృష్టాని రుదంతీవ విశాంపతే.
ఉపాసతే చ సైన్యాని గృధ్రాస్తవ సమంతతః
తప్స్యసే వాహినీం దృష్ట్వా పార్థబాణ ప్రపీడితాం
పరాభూతా చ వః సేనా నకశ్చిద్ యోద్ధుమిచ్ఛతి
వివర్ణముఖ భూయిష్ఠాః సర్వే యోధా విచేతసః
గాఃసంప్రస్థాప్యతిష్ఠామోవ్యూఢానీకాః ప్రహారిణః.

## నలుబది ఏడవ అధ్యాయం

అథ దుర్యోధనో రాజా సమరే భీష్మమబ్రవీత్.
ద్రోణం చ రథశార్దూలం కృపంచ సుమహారథం.
ఉక్తోఽయమర్థఆచార్యో మయాకర్ణేన చాసకృత్
పునరేవ ప్రవక్ష్యామి న హి తృప్యామి తం బ్రువన్
పరాభూతైర్హి వస్తవ్యం తైశ్చ ద్వాదశవత్సరాన్
వనే జనపదే జ్ఞాతైరేష ఏవ పణో హి నః.

మన శస్త్రాస్త్రాల తేజం నశించింది. గుర్రాల జవసత్వాలుతగ్గాయి. అగ్నిజ్వలించడం మానేసాడు. ఇవన్నీ మనకు అశుభన్నే సూచిస్తున్నాయి. మన పశువులు సూర్యునివేపు చూస్తూ భయంతో పోరుతున్నాయి. మన రథ పతాకలమీద కాకులు వాలుతున్నాయి పక్షులు ఆభాగానపోతూ భయంకరంగా కూస్తున్నాయి. నక్కలు సేనామధ్యంలోకి వచ్చి అరుస్తున్నాయి. మీ శరీరాలు కంపిస్తున్నాయి. ఈ లక్షణా లన్నీ చూస్తూంటే ఏదో వినాశనంతప్పదనిపిస్తోంది. తేజోమండలాలుకాంతి విహీనా లౌతున్నాయి. మృగపక్షి సంఘాలు దారుణ ధ్వనులు చేస్తున్నాయి. ఇవన్నీ క్షత్రియ వీరులకు ఉపద్రవాలను సూచించేలక్షణాలే. దుర్యోధనా — మన సేనలపై విపరీతంగా ఉల్కలు పడుతున్నాయి. నీ గజాశ్వబలాలు తలలువంచి ఏడుస్తున్నాయి. మన సేనలకు నలువంకలా గ్రద్దలు కూర్చున్నాయి. సవ్యసాచిశరవర్షానికి భయపడి నీ సైనికులు యుద్ధవిముఖు లౌతున్నారు. చిత్రప్రతిమలవలె ఎలా ఉన్నారో చూడు. ఒక్కరి ముఖంలోనూ ఉత్సాహం లేదు. అందుచేత ముందుగా గోగణాలను హస్తిపురినైపు నడిపించి మన సేనా రక్షణకు వ్యూహనిర్మాణం చేసుకొని అప్రమత్తులమై నిలబడాలి — అన్నాడు.

## నలుబది ఏడవ అధ్యాయం

ద్రోణుని ప్రసంగం ఆకర్ణించి దుర్యోధనుడు కురుగురువృద్ధుల నవలోకిస్తూ—మహారథికులారా కర్ణుడూ నేనూ కూడా మీకు ఎన్నోమారులు ఈ విషయమై చెప్పి ఉన్నాము. అదే మళ్లీ చెపు

తేషాంచ తావన్నిర్వృత్తం వర్తతే తు త్రయోదశం
అజ్ఞాతవాసో బీభత్సురథాస్మాభిః సమాగతః
అనివృత్తే తు నిర్వాసే యది బీభత్సురాగతః
పునర్ద్వాదశ వర్షాణి వనే వత్స్యంతి పాండవాః.
లోభాద్వా తేనజానీయురస్మాన్ వా మోహ ఆవిశత్
హీనాతిరిక్తమేతేషాం భీష్మో వేదితుమర్హతి.
అర్థానాం చ పునర్ద్వైధే నిత్యం భవతి సంశయః
అన్యథా చింతితోహ్యర్థః పునర్భవతి సోఽన్యథా
ఉత్తరం మార్గమాణానాం మత్స్యానాం చ
యుయుత్సతాం
యది బీభత్సురాయాత స్తదా కస్యాపరాధ్నుమః.

త్రిగర్తానాం వయం హేతోర్మత్స్యాన్
యోద్ధుమిహాగతాః
మత్స్యానాం విప్రకారాంస్తే
బహూనస్మానకీర్తయన్.
తేషాం భయాభిభూతానాం తదస్మాభిః ప్రతిశ్రుతం
ప్రథమం తైర్గ్రహీతవ్యం మత్స్యానాం గోధనం
మహత్
సప్తమ్యామపరాహ్ణే వై తథా తైస్తు సమాహితం.
అష్టమ్యాం పునరస్మాభిరాదిత్యస్యోదయం ప్రతి
ఇమా గావో గ్రహీతవ్యా గతేమత్స్యగవాంపదం.
తే వా గాశ్చానయిష్యంతి యది వాస్యుః పరాజితాః
అస్మాన్ వాప్యుపసంధాయ కుర్యుర్మత్స్యేన సంగతం

తున్నాను. జూదంలో ఓడినవారు పన్నెండేళ్లు అరణ్యవాసం ఒక యేడజ్ఞాతవాసం సాగించాలని నిర్ణయించుకున్నాము. ఇప్పుడా అజ్ఞాతవాసం పరిసమాప్తి కాకుండానే అర్జునుడు మనతో యుద్ధానికి సన్నద్ధుడౌతున్నాడు. ఇప్పుడు మన మర్జునుని గుర్తించామంటే పాండవులు మళ్ళీ పన్నెండు సంవత్సరాలు అరణ్యాలలో చరించాలి. రాజ్యలోభంతో వీరు తమ ప్రతిజ్ఞను విస్మరించారు మనతో యుద్ధం చేయ్యాలనే ఊహ వీరిని మోహపరవశులను చేసింది. వీరు మళ్ళీ మహాప్రమాదంలో పడిపోయారు. ఇప్పుడు పదమూడో సంవత్సరం గతించిందో లేదో భీష్మాచార్యులవారు నిర్దేశించాలి.

మనము మత్స్యదేశ ఉత్తరభూములలో ఉండే గోవులను హరించడానికి వచ్చాము. అవసరమైతే ఆ దేశ సేనలతో యుద్ధం చెయ్యాలనుకున్నాం. అంతేగాని పాండవులమీద దాడిచెయ్యాలని మనం రాలేదు. ఈమాత్స్యులు బలదర్పితులై త్రిగర్తునిపై అనేక అత్యాచారాలు జరిపి హింసించినట్లు మనతో చెప్పుకున్నాడు. త్రిగర్తుడు మనమిత్రుడు. వానికి ఉపకారం చేదామనే ఉద్దేశంతో అభయమిచ్చి వచ్చాం. మన నిర్ణయాను సారం త్రిగర్తుడు సప్తమినాడు మత్స్యదేశ దక్షిణ దిగ్భాగంలో ఉన్న గోవులను హరిస్తాడు. అష్టమి నాటి సూర్యోదయానికి మనము ఈ గోవులను గ్రహించాము. త్రిగర్తుడు మత్స్యగోగణాలను హరించిన విషయం తెలిసి విరటుడు సేనాసహితుడై వానిని వెంటాడతాడు. త్రిగర్తుడు పరాజితుడైతే విరటుడు మనమీదికి యుద్ధానికి వస్తాడు. అలా అయినా విరటుడు ఈ రాత్రికిగాని రాలేడు ఈవచ్చేవాడు విరటసేనలో మహాయోధుడేనా కావలి లేదా విరటుడైనా వాని తరపున అర్జునుడైనా ఎవరైనా కావచ్చు. మనము త్రిగర్తునకు చేసిన వాగ్దానం ప్రకారం వచ్చే వానిని ఎదిరించి యుద్ధం చేసితీరాలి. ఈ విషయం తెలిసి కూడా మహారథికులైన భీష్మ ద్రోణ కృప

అథవా తానపహాయ మత్స్యో జానపదైస్సహ
సర్వయా సేనయా సార్ధం సంవృతో భీమరూపయా
ఆయాతః కేవలం రాత్రిమస్మాన్ యోద్ధుమిహాగతః
తేషామేవ మహావీర్యః కశ్చిదేష పురస్సరః
అస్మాన్ జేతుమిహాయాతో మత్స్యో వాపి స్వయం
భవేత్.
యద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సురాగతః
సర్వైర్యోద్ధవ్యమస్మాభిరితి నః సమయః కృతః.
అథ కస్మాత్ స్థితా హ్యేతే రథేషు రథసత్తమాః
భీష్మో ద్రోణః కృపశ్చైవ వికర్ణో ద్రౌణిరేవ చ.
సంభ్రాంతమనసస్సర్వే కాలేఽస్మిన్ మహారథాః
నాన్యత్ర యుద్ధాచ్ఛ్రేయోఽస్తి తథాఽఽత్మా
ప్రణిధీయతాం.

ఆచ్ఛిన్నే గోధనేఽస్మాకమపి దేవేన వజ్రిణా
యమేన వాపి సంగ్రామే కో హాస్తినపురం వ్రజేత్.
శరైరేభిః ప్రణున్నానాం భగ్నానాం గహనే వనే
కో హి జీవేత్ పదాతీనాం భవేదశ్వేషు సంశయః
దుర్యోధనవచః శ్రుత్వా రాధేయస్త్వబ్రవీద్వచః
ఆచార్యం పృష్ఠతః కృత్వా తథా నీతిర్విధీయతాం.
జానాతి హి మతం తేషామతస్త్రాసయతీహ నః
అర్జునే చాస్య సంప్రీతిమధికాముపలక్షయే
తథా హి దృష్ట్వా బీభత్సుముపాయాంతం ప్రశంసతి
యథా సేనా న భజ్యేత తథా నీతిర్విధీయతాం.
హ్రేషితం హ్యుపశృణ్వానే ద్రోణే సర్వం విఘట్టితం
అదేశికా మహారణ్యే గ్రీష్మే శత్రువశం గతాః
యథా న విభ్రమేత్ సేనా తథా నీతిర్విధీయతాం.

---

వికర్ణ అశ్వత్థామాదులు భయభ్రాంతచిత్తులై చిత్రప్రతిమలవలె రథాలమీద కూర్చోవడం ఉచితంగా లేదు. యుద్ధంకంటె మనకు లాభదాయకమైనది లేదు. మనకు అనుకూల సమయ మిది. సానుకూల విధానం ఆలోచించండి. వజ్రపాణియైన ఇంద్రుడు వచ్చినా పాశహస్తుడై యముడు వచ్చినా మనము వెనుదిరుగము మననుండి వారు గోవులను మరలించలేరు. ఏమైనా గోగణాలు హస్తినాపురం చేరవలసిందే. ప్రాణరక్షణార్థం అడవులలోకి పారిపోయినవాడుకూడా బాణాలకు గురికాక తప్పదు. పలాయనంపఠించే పదాతులు ప్రాణాలతో జీవించలేరు. ఆశ్వికదళం మాత్రం పలాయన సమయంలో బ్రతకడానికి ఎంత అవకాశముందో మరణించడానికీ అంత అవకాశముంది — అని తీవ్రంగా అన్నాడు.

మహారాజా! ధనురాచార్యుడైన ద్రోణుని వాక్యానుసారం నడిస్తే జయలక్ష్మి మనలనే వరిస్తుంది. ఆయన పాండవ పక్షపాతంతో ప్రసంగిస్తూ మనకు భయం కలిగిస్తున్నాడు. అర్జునునిపై ఆచార్యునికి అపారమైన అభిమానం. అందు చేతనే అభినందనగీతాలు ఆలాపిస్తున్నాడు. ఆయన ప్రసంగంపై మన సైనికులు నిరుత్సాహపూరితులు కాకుండా చూచుకోవలసిన బాధ్యత మనమీద ఉంది. తదనురూపమైన విధానం మన మవలంబించాలి. అలా కాక ఈ యుద్ధంలో ద్రోణాచార్యులే ముందు నిలిస్తే అర్జున రథధ్వానం వింటూనే ఆయన మన సైనికులలో భీతిని రేకెత్తిస్తాడు. అప్పుడు మన సేనలు కంపించి చలించిపోతాయి.

ఇప్పుడు మనము పరదేశంలో అరణ్య మధ్యంలో ఉన్నాము. గ్రీష్మము ప్రారంభ మవుతోంది. ఇది శత్రుస్థానం. ఈ విషయాలు మన సేనలకు తెలిస్తే వారు భయభీతులౌతారు. ఆచార్యద్రోణులకు పాండవపక్షపాతం అధికం.

ఇష్టా హి పాండవా నిత్యమాచార్యస్య విశేషతః
ఆసయన్నపరార్థాశ్చ కథ్యతే స్మ స్వయం తథా.
అశ్వానాం హ్రేషితం శ్రుత్వా కః ప్రశంసాపరో భవేత్
స్థానే వాపి వ్రజంతో వా సదా హ్రేషంతి వాజినః
సదా చ వాయవో వాంతి నిత్యం వర్షతి వాసవః
స్తనయిత్నోశ్చనిర్ఘోషః శ్రూయతే బహుశ స్తథా.
కిమత్ర కార్యం పార్థస్య కథం వా స ప్రశస్యతే
అన్యత్ర కామాద్ ద్వేషాద్ వా రోషాదస్మాసు కేవలాత్.

ఆచార్యా వై కారుణికాః ప్రాజ్ఞాశ్చాపాపదర్శినః
నైతే మహాభయే ప్రాప్తే సంప్రష్టవ్యాః కథంచన.
ప్రాసాదేషు విచిత్రేషు గోష్ఠీషూపవనేషు చ
కథా విచిత్రాః కుర్వాణాః పండితా స్తత్రశోభనాః.
బహూన్యాశ్చర్యరూపాణి కుర్వాణా జనసంసది
ఇజ్యాస్త్రే చోపసంధానే పండితా స్తత్ర శోభనాః.
పరేషాం వివరజ్ఞానే మనుష్యచరితేషు చ
హస్త్యశ్వరథచర్యాసు ఖరోష్ట్రాజావికర్మణి.
గోధనేషు ప్రతోలీషు వరద్వారముఖేషు చ
అన్నసంస్కారదోషేషు పండితా స్తత్ర శోభనాః.
పండితాన్ పృష్ఠతః కృత్వా పరేషాంగుణవాదినః
విధీయతాం తథా నీతిర్యథా వధ్యో భవేత్ పరః.
గావశ్చసంప్రతిష్ఠాప్య సేనాం వ్యూహ్యాసమంతతః
ఆరక్షాశ్చ విధీయంతాం యత్ర యోత్స్యామహే పరాన్.

స్వార్థచిత్తులైన పాండవులు స్వకార్యసిద్ధ్యర్థమే ద్రోణాచార్యులను మీదగ్గర ఉంచారు. గుర్రాలు సకిలిస్తూన్నంత మాత్రం చేత శత్రువును ప్రశంసించేవా డుంటాడా ? సకిలించడం అశ్వానికి సహజలక్షణం. అది గ్రహించక ఆ సకిలింపులు రోదనంగా భావించి ఈయన భీతి రేకొల్పుతున్నాడు. వాయువువీస్తూంటే మేఘాలుగర్జిస్తూంటే భయపడటం దేనికి? కదలిక గాలికి లక్షణం; గర్జన మేఘలక్షణం. వర్షప్రదానం ఇంద్రుని ధర్మం. ఈప్రాకృతికవిషయాలను అపశకునాలుగాభావించడంలో అర్థం లేదు. పైగా వీటితో అర్జునాగమనానికి సంబంధ మేమిటో తెలియదు. అర్జునునిపై వాత్సల్యం మనపై ద్వేషం ఈ ఆచార్యునికి నేడు క్రొత్తగాదు. ఆచార్యపీఠం అధిష్ఠించేవారు ధీయుతులూ, పాపదూరులూ, దయాపరులూ, ఐ ఉండాలి. అపాయ సమయంలో సముచితమైన సలహాలివ్వాలి. అంతేగాని ఇటువంటి ప్రసంగాలు చెయ్యకూడదు. అంతఃపురాలలో ఆలయాలలో అభ్యంతరమందిరాలలో సభలలో గోష్ఠులలో పాల్గొని వినోదం చేకూర్చడం పండితులలక్షణం. వారికి యజ్ఞయాగాదులూ చిత్రకథలూ ప్రీతికరాలు. ఇతరుల గుణదోషాన్వేషణలో దినచర్యాప్రబోధంలో రథ గజ తురగాది వాహన యానాలకు ముహూర్తం నిర్ణయించడంలో ఉష్ట్రఖర అజాది జంతువుల గుణదోషాలు నిర్ణయించడంలో వాటి చికిత్సావిషయంలో గో ధన రక్షణ సంగ్రహాలలో గృహద్వారాలంకరణలో నూతన భోజనాలలో అన్నాదులలోపడిన కేశ కీటక దోషపరిహార విషయంలో పండితులతో ప్రస్తావించాలి. అప్పుడే వారిమాటకు విలువఉంటుంది. శత్రుగుణగణాలను ప్రశంసించే పండితులను వెనుక వెనుకగా ఉంచాలి. లేకపోతే జయాన్ని సాధించలేము. ఇప్పుడు మనం గోగణాలను సేనామధ్యంలోఉంచి వ్యూహనిర్మాణం చెయ్యాలి. అప్పుడుగాని శత్రువును ఎదుర్కోలేము.— అని కర్ణుడు తన ప్రసంగాన్ని ఇంకా కొనసాగిస్తున్నాడు.

## నలుబది ఎనిమిదవ అధ్యాయం

।ర్వానాయుష్మతో భీతాన్ సంత్రస్తానివ లక్షయే
ఽయుద్ధమనసశ్చైవ సర్వాంశ్చైవానవస్థితాన్.
ము ద్యేషరాజామత్స్యానాం యదిబీభత్సురాగతః
అహమావారయిష్యామి వేలేవ మకరాలయం.
మమ చాపప్రయుక్తానాం శరాణాం నతపర్వణాం
నావృత్తిర్గచ్ఛతాం తేషాం సర్పాణామివసర్పతాం
రుక్మపుంఖాః సుతీక్ష్ణాగ్రా ముక్తాహస్తవతామయా
చ్ఛాదయంతు శరాః పార్థం శలభా ఇవ పాదపం.
శరాణాం పుంఖసక్తానాం మౌర్వ్యాభిహతయా దృఢం
శ్రూయతాంతలయోః శబ్దో భేర్యోరాహతయోరివ.
సమాహితో హి బీభత్సుర్వర్షాణ్యష్టౌ చ పంచ చ
జాతస్నేహశ్చ యుద్ధేఽస్మిన్ మయి సంప్రహరిష్యతి
పాత్రీభూతశ్చ కౌంతేయో బ్రాహ్మణో గుణవానివ
శరౌఘాన్ ప్రతిగృహ్ణాతు మయాముక్తాన్ సహస్రశః
ఏష చైవ మహేష్వాసస్త్రిషు లోకేషు విశ్రుతః
అహం చాపి నరశ్రేష్ఠాదర్జునాన్నా నరః క్వచిత్.
ఇతశ్చేతశ్చ నిర్ముక్తైః కాంచనైర్గార్ధ్రవాజితైః
దృశ్యతామద్య వై వ్యోమ ఖద్యోతైరివసంవృతం.
అద్యాహమృణమక్షయ్యం పురావాచా ప్రతిశ్రుతం
ధార్తరాష్ట్రాయ దాస్యామి నిహత్యసమరేఽర్జునం
అంతరాచ్ఛిద్యమానానాం పుంఖానాం వ్యతిశీర్యతాం
శలభానామివాకాశే ప్రచారః సంప్రదృశ్యతాం.
ఇంద్రాశనిసమస్పర్శం మహేంద్రసమతేజసం
అర్దయిష్యామ్యహం పార్థముల్కాభిరివ కుంజరం.

---

## నలుబది ఎనిమిదవ అధ్యాయం

దుర్యోధన మహారాజా – మన సైన్యంలోని వీరు లందరూ భయకంపితచిత్తులై యుద్ధవిముఖులుగా గోచరిస్తున్నారు. ఇప్పుడు నేనొక్కడనే చెలియలకట్టలా నిలిచి వచ్చే వానిని ఎదిరిస్తాను. నేను విడిచే బాణాలు ఎదిరిని నిలబడనివ్వవు. ఘోరకాకోలవిషసదృశాలైన నా బాణాలెన్నడూ వృథాపోవు. శలభాలు మొక్కలను ఆచ్ఛాదించినట్లు నా బాణాలు ఈ అర్జునుని కప్పివేస్తాయి. భేరీద్వయం మ్రోగినట్లు నా ధనుస్సు ఝుంకారం చేస్తూంటే నిలబడగల వీరు డెవడు? పదమూడు సంవత్సరాలనుండి తపోనిష్ఠలో ఉన్నాడు అర్జునుడు. ఈ నాడు నాతో సరదాపడి యుద్ధానికి వస్తే ప్రయోజన మేమిటి? గుణవంతుడైన బ్రాహ్మణునివలె నేనా అర్జునుని గౌరవిస్తాను. అంతే. నేను విడిచే బాణాలను ప్రతిగ్రహించి అనుభవించగలడు. త్రిలోక విఖ్యాతి పొందిన అర్జున మహారథికునికి నేనేమీ తీసిపోను. ఈరోజున ఉభయ పక్షాల నుండీ వెలువడే బాణాలతో ఆకాశం నక్షత్రకాంతితో ప్రకాశిస్తుంది. నా ప్రతిజ్ఞను నెరవేర్చుకొని ఈ నాడు అర్జునుని సంహరించి దుర్యోధనఋణవిముక్తి పొందుతాను. ఉల్కాపీడితమైన మత్తేభంవలె నా బాణాలతో అర్జునుడు వ్యథపడతాడు. అతిరథుడూ శస్త్రాస్త్ర విదుడూ ఐన అర్జునసర్పం ఈ కర్ణగరుడునిచేత నేడు పీడింపబడకతప్పదు. ఖడ్గ శక్తి బాణ రూపమైన ఇంధనాలతో ప్రజ్వలించే అర్జునాగ్ని కర్ణ

రథాదతిరథం శూరం సర్వశస్త్రభృతాం వరం
వివశం పార్థమాదాస్యే గరుత్మానివ పన్నగం.
తమగ్నిమివ దుర్ధర్షమసిశక్తిశరేంధనం
పాండవాగ్నిమహం దీప్తం ప్రదహంతమివాహితం
అశ్వవేగపురోవాతో రథౌఘస్తనయిత్నుమాన్
శరధారో మహామేఘః శమయిష్యామి పాండవం.
మత్కార్ముకవినిర్ముక్తాః పార్థమాశీవిషోపమాః
శరాః సమభిసర్పంతు వల్మీకమివ పన్నగాః.
సుతేజనై రుక్మపుంఖైః సుధౌతైర్నతపర్వభిః
ఆచితం పశ్య కౌంతేయం కర్ణికారైరివాచలం.
జామదగ్న్యాన్మయా హ్యస్త్రం యత్ ప్రాప్తమృషిసత్తమాత్
తదుపాశ్రిత్య వీర్యం చ యుధ్యేయమపి వాసవం.
ధ్వజాగ్రే వానరస్తిష్ఠన్ భల్లేన నిహతో మయా
అద్యైవ పతతాం భూమౌ వినదన్ భైరవాన్ రవాన్
శత్రోర్మయా విపన్నానాం భూతానాం ధ్వజవాసినాం
దిశః ప్రతిష్ఠమానానామస్తు శబ్దో దివంగమః.
అద్య దుర్యోధనస్యాహం శల్యం హృది చిరస్థితం
సమూలముద్ధరిష్యామి బీభత్సుం పాతయన్ రథాత్.
హతాశ్వం విరథం పార్థం పౌరుషే పర్యవస్థితం
నిఃశ్వసంతం యథా నాగమద్య పశ్యంతు కౌరవాః.
కామం గచ్ఛంతు కురవో ధనమాదాయ కేవలం
రథేషు వాపి తిష్ఠంతో యుద్ధం పశ్యంతు మామకం.



మేఘాలతో చల్లారుతుంది. నా రథనేమినిస్వనం మేఘగర్జనగా అశ్వసంచారమే వాయువేగంగా బాణాలే వర్షధారగా అర్జునాగ్నిని ఆర్పుతాను. పుట్టలోకిపోయే నాగసర్పాలవలె నా బాణాలు అర్జునుని శరీరంలో ప్రవేశిస్తాయి. శ్వేతపుష్పాచ్ఛాదితమైన ఉన్నత పర్వతశిఖరంలాగా సువర్ణబాణాలు అర్జున శరీరాన్ని కప్పివేస్తాయి. మునిశ్రేష్ఠుడూ పరమగురువూ అయిన పరశురాముని వల్ల నేను గ్రహించిన దివ్యాస్త్రాల సహాయంతో ఇంద్రుని గూడా జయించగలను.

మహారాజా—అర్జున రథధ్వజాగ్రంలో వసించి సింహగర్జనలు చేసే వానరం నా బాణఘాటికి మరణించి నేల గూలుతుంది. దానిమీది భూతగణాలన్నీ హాహా రవాలతో దిశాంతాలకు పోతాయి. నీకు హృదయశల్యంగా ఉన్న అర్జున కంటకాన్ని నేడే ఊడ పెరుకుతాను. అర్జున పౌరుషానికి ఉపయుక్తమైన రథాశ్వాలు నేడు నేలకూలతాయి. నేనొక్కడనే ఈపనులన్నీ చేయగలను. తక్కిం గల కౌరవయోధు లందరూ గోవులను తరలించుకొని హస్తిపురికి పోయినా పోవచ్చును లేదా ఇక్కడ ఉండి నా అస్త్రకౌశలం వీక్షించవచ్చు—అన్నాడు కర్ణుడు.



## నలుబదితొమ్మిదవ అధ్యాయం

సదైవ తవ రాధేయ యుద్ధే క్రూరతరా మతిః
నార్థతానాం ప్రకృతిం వేత్సి నానుబంధమవేక్షసే
మాయాహి బహవః సంతి శాస్త్రమాశ్రిత్య చింతితాః
తేషాం యుద్ధం తు పాపిష్ఠం వేదయంతి పురావిదః.
దేశకాలేన సంయుక్తం యుద్ధం విజయదం భవేత్
హీనకాలం తదేవేహ ఫలం న లభతే పునః.
దేశే కాలే చ విక్రాంతం కళ్యాణాయ విధీయతే
ఆనుకూల్యేన కార్యాణామంతరం సంవిధీయతే
భారం హి రథకారస్య న వ్యవస్యంతి పండితాః
పరిచింత్య తు పార్థేన సంనిపాతో న నః క్షమః.
ఏకః కురూనభ్యగచ్ఛ దేశశ్చాగ్నిమతర్పయత్
ఏకశ్చ పంచవర్షాణి బ్రహ్మచర్యమధారయత్
ఏకఃసుభద్రామారోప్యద్వైరథే కృమాహ్వాయత్.
ఏకః కిరాతరూపేణ స్థితం రుద్రమయోధయత్
అస్మిన్నేవ వనే పార్థో హృతాంకృష్ణామవాజయత్.
ఏకశ్చ పంచ వర్షాణి శక్రాదస్త్రాణ్యశిక్షత
ఏకః సోఽయమరింజిత్వా కురూణామకరోద్యశః
ఏకో గంధర్వరాజానం చిత్రసేనమరిందమః
విజిగ్యే తరసా సంఖ్యే సేనాం ప్రాప్యసుదుర్జయాం.
తథా నివాతకవచాః కాలఖంజాశ్చ దానవాః
దైవతైరప్యవధ్యాస్తే ఏకేన యుధి పాతితాః.
ఏకేన హి త్వయా కర్ణ కిం నామేహ కృతంపురా
ఏకైకేన యథా తేషాం భూమిపాలా వశేకృతాః.
ఇంద్రోఽపి హి న పార్థేన సంయుగే యోద్ధుమర్హతి

---

## నలుబదితొమ్మిదవ అధ్యాయం

రాధేయా – సంగ్రామ విషయంలో నీ బుద్ధి ఎప్పుడూ క్రూరంగానే చరిస్తోంది. విషయం యొక్క యథార్థజ్ఞానశక్తి నీకు లేదు. ఏ కార్యం వల్ల ఏపరిణామం వస్తుందో ఊహించే శక్తికూడా నీకు లేదు. అనేక శాస్త్రాలు అవలోడించి శస్త్రాస్త్ర విషయమర్మాలు నేను గ్రహించాను. ఏ శాస్త్రమైనా సమరం పాపపూర్ణమైన కర్మ అని చెప్తోంది. దేశకాలాలను గుర్తించి యుద్ధంచేసినట్లైతే విజయలక్ష్మి వరిస్తుందని శాస్త్రజ్ఞులు ఘోషిస్తున్నారు. సర్వకార్యసాఫల్యానికి అదే మంచి విధానం. సూతునిమీద విశ్వాసముంచి వానిమాట ప్రకారం నడిచే రథికుడు విజయం సాధించలేదు.

ఆలోచించి చూస్తే అర్జునునితో యుద్ధం మాకెవరికీ ఉచితంగా కనిపించటం లేదు. ఏకాకియై ఉత్తర కురుభూములను జయించిన మహావీరుడు. దేవదానవులను నిరోధించి అగ్నికి ఖాండవవనం ఆతిథ్యమిచ్చిన శూరుడు. అటువంటివాడు మనలనందరనూ జయించగలడు. బ్రహ్మచర్యవ్రత నియమాలను పాలించినవాడు. యాదవవీరులను జయించి సుభద్రను కొని వచ్చిన యోధుడు. శ్రీకృష్ణుని ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించినవాడు. కిరాతరూపంతో ఉన్న శంకరునితో పోరాడినవాడు. వనవాసవేళ జయద్రథుని ఓడించినవాడు. స్వర్గలోకంవెళ్ళి బ్రహ్మచర్య దీక్షతో ఐదు సంవత్సరాలు అక్కడ ఉండి అస్త్రశస్త్రమర్మాలు గ్రహించినవాడు. ఘోషయాత్రలో గంధర్వులను జయించి కురువంశ ప్రతిష్ఠను కాపాడినవాడు. దేవతాగణాలకు అసాధ్యులైన నివాతకవచ కాలకేయాదులను ఒంటరిగా సంహరించినవాడు.

రాధేయా – ఎన్నడైనా నీవు ఒంటరిగా ఏ కార్యమైనా సాధించావేమో ఇప్పుడు చెప్పు. ఏకైకవీరులుగా పోయి పాండవులు నాలుగు

యస్తేనాశంసతే యోద్ధుం కర్తవ్యం తస్య భేషజం.
ఆశీవిషస్య క్రుద్ధస్య పాణిముద్యమ్య దక్షిణం
అవముచ్య ప్రదేశిన్యా దంష్ట్రామాదాతుమిచ్ఛసి.
అథవా కుంజరం మత్తమేక ఏవ చరన్ వనే
అనంకుశం సమారుహ్య నగరం గంతుమిచ్ఛసి.
సమిద్ధం పావకం చైవ ఘృతమేదోవసాహుతం
ఘృతాక్తశ్చీరవాసాస్త్వం మధ్యేనోత్తర్తుమిచ్ఛసి.
ఆత్మానం కః సముద్బధ్య కంఠే బద్ధ్వా మహాశిలాం
సముద్రం తరతే దోర్భ్యాం తత్ర కిం నామ పౌరుషం.
అకృతాస్త్రః కృతాస్త్రం వై బలవంతం సుదుర్బలః
తాదృశం కర్ణ యః పార్థం యోద్ధుమిచ్ఛేత్ స దుర్మతిః
అస్మాభిర్హ్యేష నికృతో వర్షాణీహ త్రయోదశ
సింహః పాశవినిర్ముక్తో న నః శేషం కరిష్యతి.
ఏకాంతే పార్థమాసీనం కూపేఽగ్నిమివ సంవృతం
అజ్ఞానాదభ్యవస్కంద్య ప్రాప్తాః స్మో భయముత్తమం.
సహ యుధ్యామహే పార్థమాగతం యుద్ధదుర్మదం
సైన్యాస్తిష్ఠంతు సంనద్ధా వ్యూఢానీకాః ప్రహారిణః
ద్రోణో దుర్యోధనో భీష్మో భవాన్ ద్రౌణిస్తథా వయం
సర్వే యుధ్యామహే పార్థం కర్ణ మా సాహసం కృథాః.
వయం వ్యవసితం పార్థం వజ్రపాణిమివోద్యతం
షడ్రథాః ప్రతియుధ్యేమ తిష్ఠేమ యది సంహతాః
వ్యూఢానీకాని సైన్యాని యత్తాః పరమధన్వినః
యుధ్యామహేఽర్జునం సంఖ్యే దానవా ఇవ వాసవం

దిక్కులూ జయించివచ్చారు. సంగ్రామరంగంలో అమరేంద్రుడు కూడా అర్జునుని ముందు నిలబడలేడు. అటువంటి అర్జునుని జయిస్తానని నువ్వు ప్రలాపిస్తున్నావు. క్రోధపూరితమైన నీ మనస్సు ముందువెనుకలు ఆలోచించలేకపోతోంది. కాకోలవిషభరితమైన సర్పముఖంలో చెయ్యిపెట్టి దాని దంతాలను లెక్కపెట్టడం ఎటువంటిదో నువ్వు చెయ్యబోయేపనీ అటువంటిదే. అంకుశరహితంగా మదోన్మత్తగజాన్ని అధిరోహించి దానిని అరణ్యమధ్యంనుండి నగరానికి తరలించడానికి చేసే ప్రయత్నంవంటిది నీ యత్నం. శరీరమంతా నెయ్యి పూసుకొని నేతితో తడిపినబట్టలు కట్టుకొని అగ్నిహోత్రంలో దూకి పైకి రావడానికి యత్నించడం వంటిదే నీ ఊహ. కాళ్లూ చేతులూ బంధించుకొని బండరాయి మెడకుగట్టుకొని సముద్రతరణానికి ప్రయత్నించడం కంటె మూర్ఖత్వం లేదు. శస్త్రాస్త్రజ్ఞానశూన్యుడైనదుర్బలుడు ధనురాచార్యుని ఎదుర్కోవడం ఎటువంటిదో నువ్వు అర్జునునిపై తిరగబడటమూ అంతే. కపటబాషణాలతో వారిని పదమూడు సంవత్సరాలు అరణ్యాజ్ఞాతవాసాల పాలు చేసాము. ప్రతిజ్ఞాబద్ధులై చరించి బంధవిముక్తులైన వారు కట్లుత్రెంచుకున్న కుపితసింహాలవలె మనల నెందుకు సంహరించరు. ఇంత కాలమూ వారు నివురు కప్పిన నిప్పులా ఉన్నారు. ఇప్పుడది ప్రజ్వలిస్తూంటే మనము మోహావశులమై పోతున్నాము. ఒకేఒక ఉపాయమున్నది. మన మందరం కలిసి అర్జునుని ఎదిరించి నిలబడాలి. అంతేగాని అజ్ఞానంతో దుస్సాహసం చేస్తే నువ్వు వృథాశ్రమ పడవలసివస్తుంది. భీష్మద్రోణాది వీరు లందరనీ సహాయంగా ఉంచుకొని అర్జునుని ఎదిరిద్దాము. మన యూథంలోని ఆరుగురు మహారథికులు కంటె అర్జునుడు మిన్న. దృఢసంకల్పంతో పార్థుడు నిలిస్తే ఈ ఆరుగురూ ఏకమైనా వానిని ఏం చెయ్యలేరు. అందుచేత ఉత్తమ వ్యూహనిర్మాణం చేసి దానవ సంఘాలు ఇంద్రుని ఎదిరించినట్లు మనం అర్జునునిపై తిరగబడాలి – అని కృపాచార్యుడు తన అభిప్రాయం ప్రకటించాడు.

## ఏబదియవ అధ్యాయం

న తావజ్జితా గావో న చ సీమాంతరం గతాః
న హాస్తినపురం ప్రాప్తాస్త్వం చ కర్ణ వికత్థసే.
సంగ్రామాంశ్చబహూన్జిత్వా లబ్ధ్వాచవిపులంధనం
విజిత్య చ పరాం సేనాం నాహుఃకించన పౌరుషం.
దహత్యగ్నిరవాక్యస్తు తూష్ణీం భాతి దివాకరః
తూష్ణీంధారయతే లోకాన్ వసుధాసచరాచరాన్.
చాతుర్వర్ణ్యస్య కర్మాణి విహితాని స్వయంభువా
ధనం యైరధిగంతవ్యం యచ్చ కుర్వన్ న దుష్యతి.
అధీత్య బ్రాహ్మణో వేదాన్ యాజయేత యజేత వా
క్షత్రియో ధనురాశ్రిత్య యజేచ్చైవనయాజయేత్
వైశ్యోఽధిగమ్యవిత్తాని బ్రహ్మకర్మాణి కారయేత్
శూద్రఃశుశ్రూషణంకుర్యాత్ త్రిషువర్ణేషునిత్యశః

వందనాయోగవిధిభిర్వైతసీం వృత్తిమాస్థితాః
వర్తమానా యథాశాస్త్రం ప్రాప్య చాపి మహీమిమాం
సత్కుర్వంతి మహాభాగా గురూన్ సువిగుణానపి.
ప్రాప్య ద్యూతేన కో రాజ్యం క్షత్రియస్తోష్టుమర్హతి
తథా నృశంసరూపోఽయం ధార్తరాష్ట్రశ్చ నిర్ఘృణః
తథావగమ్య విత్తాని కో వికత్థేద్ విచక్షణః
నికృత్యా వంచనాయోగైశ్చరన్ వైతంసికో యథా.
కతమద్ ద్వైరథం యుద్ధం యత్రాజైషీర్ధనంజయం
నకులం సహదేవం వా ధనం యేషాం త్వయా హృతం.
యుధిష్ఠిరో జితః కస్మిన్ భీమశ్చ బలినాం వరః
ఇంద్రప్రస్థం త్వయా కస్మిన్ సంగ్రామే నిర్జితం పురా.

## ఏబదియవ అధ్యాయం

**రాధేయా** – మన మీ గోవులను జయించ లేదు. మత్స్యదేశ సరిహద్దులను ఇంకా దాటనే లేదు. హస్తిపురికి చేరలేదు. ఈస్థితిలో ఎందుకీ వ్యర్థప్రసంగాలు. వీరులూ విద్వాంసులూ ఐన మహాపురుషులు ఘోరసంగ్రామాలలో విజయాలు సాధించినా శత్రువులను నిర్మూలించినా ఇటువంటి ప్రసంగాలు చెయ్యరు. ప్రాపంచికవస్తుజాలాన్ని నిమేషకాలంలో భస్మీపటలం చేయగల అగ్ని కానీ ఈ భువనభవనాన్ని తనకాంతితో ఉద్దీపింప చేసే సూర్యుడుగాని చరాచరభూతకోటిని భరించే పృథ్విగాని ఆత్మస్తుతి చేసుకోవడం మనం వినలేదు. ఏసత్కర్మాచరణవల్ల దోషాలు నశించి సుఖాలు ప్రాప్తిస్తాయో ఆయాకర్మలను విధి నిర్ణయించి ఉన్నాడు. బ్రాహ్మణులు వేదాధ్యయనం చేసి యజ్ఞకర్మలు నిర్వర్తించుకొంటూ నిర్వర్తింప చెయ్యాలి. క్షత్రియులు ఆయుధధరులై ధనం సేకరించి యాగాదులు నిర్వర్తించాలి. అంతేగాని అది నిర్వహింపచేసే బాధ్యత వారికి లేదు. వైశ్యులు కృషి వాణిజ్యాలతో ధనార్జనచేసి బ్రాహ్మణుల చేత విధ్యుక్త కర్మలు నిర్వర్తింప చేసుకోవాలి. నాల్గవజాతి వారు సేవాధర్మంతో అగ్రశ్రేణి వారిని సేవించాలి. ఉత్తమ పురుషులు శాస్త్రవిధి ననుసరించి భూమండలం జయించి దర్పరహితులై పెద్దలను గౌరవిస్తూ సత్కరించి జీవించాలి. ఇది సనాతనధర్మవిషయం.

కర్ణా – అన్యాయంగా వారి రాజ్యం హరించారు. గుణశ్రేష్ఠులైన పెద్దలను తిరస్కరిస్తున్నారు. ద్యూతక్రీడలో సాధించిన రాజ్యం హృదయానికి శాంతినివ్వడం అసంభవం. ఐనా ఇటువంటి అనుచితకార్యాలే ఈ ధార్తరాష్ట్రునికి తృప్తి కల్గిస్తు

'తథైవకతమద్ యుద్ధంయస్మిన్ కృష్ణాజితాత్వయా
ఏకవస్త్రా సభాం నీతా దుష్టకర్మన్ రజస్వలా.
మూలమేషాం మహత్ కృత్తం సారార్థీ
చందనం యథా
కర్మకారయిథాఃసూత తత్ర కిం విదురోఽబ్రవీత్.
యథాశక్తి మనుష్యాణాం శమమాలక్షయామహే
అన్యేషామపి సత్వానామపి కీట పిపీలికైః
ద్రౌపద్యాః సంపరిక్లేశంనక్షంతుంపాండవోఽర్హతి
క్షయాయ ధార్తరాష్ట్రాణాం ప్రాదుర్భూతో
ధనంజయః
త్వంపునఃపండితోభూత్వావాచంవక్తుమిహేచ్ఛసి
వైరాంతకరణో జిష్ణుర్న నః శేషం కరిష్యతి

నైష దేవాన్ న గంధర్వాన్ నాసురాన్ న చ
రాక్షసాన్
భయాదిహ న యుధ్యేత కుంతీపుత్రో ధనంజయః.
యం యమేషోఽతిసంక్రుద్ధః సంగ్రామే నిపతిష్యతి
వృక్షం గరుత్మాన్ వేగేన వినిహత్య తమేష్యతి.
త్వత్తో విశిష్టం వీర్యేణ ధనుష్యమరరాట్సమం
వాసుదేవసమం యుద్ధే తంపార్థంకోనపూజయేత్.
దేవం దైవేన యుధ్యేత మానుషేణచ మానుషం
అస్త్రం హ్యస్త్రేణయో హన్యాత్ కోఽర్జునేనసమః
పుమాన్.
పుత్రాదనంతరం శిష్య ఇతి ధర్మవిదో విదుః
ఏతేనాపి నిమిత్తేన ప్రియో ద్రోణస్య పాండవః.

---

స్నాయి. వాని క్రూరస్వాభావమే దీనికి మూల కారణం. వేటకాడు క్రూరబుద్ధితో కపటోపాయంతో జీవనం సాగిస్తూంటే దానిని ప్రశంసించలేము - అని అశ్వత్థామ తీవ్రంగా పలికి దుర్యోధనునివైపు తిరిగి - మహారాజా ! కపటద్యూతం సాగించి పాండవరాజ్యలక్ష్మిని హరించిన నీవు వారిలో ఏ ఒక్కరినైనా ఎప్పుడైనా యుద్ధంలో జయించావా? నకుల సహదేవులనైనా కనీసం ద్వంద్వయుద్ధంలో కూడా నువ్వు జయించలేవు. ధర్మజభీమార్జును లేనాడైనా నీచేతులలో పరాజితులయ్యారా ? ఏ యుద్ధంలో నువ్వు ద్రౌపదిని జయించావు ? రజస్వలావస్థలో ఏకవస్త్రమైన యాజ్ఞసేనిని కురుసభామధ్యంలోకి ఈడ్చుకొని రాగల అధికారాన్ని నీకిచ్చిన సంగ్రామ మేమి- అని ఎర్రవారిన కన్నులతో కర్ణునివైపు తిరిగి- సూతపుత్రా - ధనాశతో చందన వృక్షాన్ని సమూలంగా నరికినట్లు కపటద్యూతంతో, ద్రౌపదీ మానభంగయత్నంతో పాండవ వీరనాశనానికి నీవు ప్రయత్నించావు. పాండవులను మీ దాసులుగా చేసుకోవడానికి మీరు ప్రయత్నించిననాడు మహామంత్రి విదురుడు ఏమన్నాడో స్మృతిలో ఉందా ? గుర్తుతెచ్చుకోండి. కురువంశ నాశనానికిది నాంది-అన్నా డాయన. మనుష్యుడేకాదు ప్రతిజీవీ తనశక్తిపై ఎంత విశ్వాసమున్నా సహన శక్తిని విడిచిపెట్టదు. ద్రౌపదీమానభంగయత్న సమయంలో పాండవుల సహనం ఎంతగాడున్నదో గుర్తు ఉంచుకోండి.

కౌరవ సంహారార్థమే అర్జునుడు ప్రభవించాడు- అని తెలియక నువ్వ విజ్ఞునివలె ప్రసంగిస్తున్నావు. శత్రు నిశ్శేషం కానిదే అర్జునవైరాగ్ని చల్లారదు. దేవదానవ గంధర్వరాక్షస గణాలలో ఎవరు ఎదురు వచ్చినా యుద్ధభూమిలో అర్జునుడు వెనుదిరుగడు. గరుత్మంతుని పక్షవేగానికి కూలిపోయే మహావృక్షాలవలె అర్జున క్రోధతీవ్రతలో ఈమహారథికులందరూ నశిస్తారు.

యథా త్వమకరోర్ద్యూత మింద్రప్రస్థం యథాఽఽహారః.
యథాఽఽనైషీః సభాం కృష్ణాం తథా యుధ్యస్వ పాండవం.

అయం తే మాతులః ప్రాజ్ఞః క్షత్రధర్మస్య కోవిదః
దుర్ద్యూతదేవీ గాంధారః శకునిర్యుధ్యతామిహ.
నాక్షాన్ క్షిపతి గాండీవం నకృతం ద్వాపరం న చ
జ్వలతో నిశితాన్ బాణాంస్తాంస్తాన్ క్షిపతి గాండివం
న హి గాండీవ నిర్ముక్తా గార్ధ్రపత్రాః సుతేజనాః
నాంతరేష్వవతిష్ఠంతే గిరీణామపి దారణాః.

అంతకః పవనో మృత్యుస్తథాగ్నిర్వడవాముఖః.
కుర్యురేతే క్వచిచ్ఛేషం న తు క్రుద్ధో ధనంజయః.
యథా సభాయాం ద్యూతం త్వం మాతులేన సహాకరోః.

తథా యుధ్యస్వ సంగ్రామే సౌబలేన సురక్షితః.
యుధ్యంతాం కామతో యోధా నాహం యోత్స్యే ధనంజయం.
మత్స్యో హ్యస్మాభిరాయోధ్యో యద్యాగచ్ఛేద్ గవాం పదం.

---

రాధానందనా శౌర్యంలో పరాక్రమంలో అర్జునుడు నీకంటె ఎన్నోరెట్లు శ్రేష్ఠుడు. ధనుర్విద్యలో ఇంద్రసముడు. యుద్ధభూమిలో వాసుదేవునితో ఉపమింపదగ్గవాడు. అటువంటి మహావీరుని ప్రశంసించడానికి ఎవరికీ అభ్యంతరం ఉండకూడదు. దేవతలతో దేవయుద్ధమూ మానవులతో మానవోచితయుద్ధమూ సాగించగల శస్త్రాస్త్ర విద్యాకౌశలం అర్జునునిసొత్తు అని నీ వెరుగుదువు. పుత్రుని అనంతరం శిష్యుడు ప్రియతముడైనవాడు గనకనే అర్జునుడు ద్రోణాచార్యునికి అత్యంత ప్రియుడయ్యాడు. అందుచేత అర్జున ప్రశంసలో అనౌచిత్య మేమీ లేదు. అని దుర్యోధనుని వేపు తిరిగి మహారాజా—కపటద్యూతంలో ఇంద్రప్రస్థం హరించారు. కురుసభామధ్యంలో ద్రౌపదిని పరాభవించారు. ఇప్పుడు అర్జునునితో యుద్ధానికి సిద్ధంగా ఉండండి. మీరు అన్యాయాలు సాగించేటప్పుడు మా అవసరంలేకపోయింది. ఈయుద్ధంలో కూడ మా సహాయాన్ని అపేక్షించకండి. మా మీద ఆశపెట్టుకొన్న ప్రయోజనం లేదు. మీ మేనమామ శకుని మహామేధావి. రాజ్యతంత్రజ్ఞుడు. కపటద్యూతవిద్యాకుశలుడైన ఆ మామయే ఈ యుద్ధంలో మీకు విజయం ప్రసాదించగలడు. కృత, త్రేతా, ద్వాపర నామాంకితమైన పాచికలను విడువదు గాండీవం. భీకరవిషాగ్నిజ్వాలలను క్రక్కే వాడిబాణాలవర్షమే కురిపిస్తుంది. ఆ బాణవర్షం పర్వతాలనైనా నేలమట్టంచెయ్యగలదని మరిచి పోకండి. శత్రువుల గుండెలలో తూట్లుకొట్టి చీల్చే వరకూ ఆబాణాలకు వాడి తగ్గదు. యమ వాయు మృత్యు బడబానలాదులు అన్ని ఏకమైనా ఈ వస్తుజాలాన్ని ఏకం చెయ్యలేక పోవచ్చునేమో కాని అర్జునుడు ఆగ్రహిస్తే మాత్రం ఈ దృశ్యమాన వస్తుజగత్తంతా నశిస్తుంది.

మన సైన్యంలోని యోధులందరూ యుద్ధానికి సిద్ధంగా ఉంటే నాకేమీ అభ్యంతరంలేదు. నేను మాత్రం వానితో యుద్ధంచెయ్యను. ఈ గోగణాల కోసం మత్స్యభూపతితో యుద్ధం చెయ్యడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అంతే - అని అశ్వత్థామ మౌనం వహించాడు.

---

## ఏబదిఒకటవ అధ్యాయం

సాధు పశ్యతి వై ద్రౌణిః కృపః సాధ్వనుపశ్యతి.
కర్ణస్తు క్షత్రధర్మేణ కేవలం యోద్ధు మిచ్ఛతి.
ఆచార్యో నాభిషక్తవ్యః పురుషేణ విజానతా
దేశకాలౌ తు సంప్రేక్ష్య యోద్ధవ్యమితి మే మతిః
యస్యసూర్యసమాఃపంచసపత్నాఃస్యుఃప్రహారిణః
కథమభ్యుదయే తేషాం న ప్రముహ్యేత పండితః.
స్వార్థే సర్వే విముహ్యంతి యేఽపి ధర్మవిదో జనాః
తస్మాద్ రాజన్ బ్రవీమ్యేష వాక్యం తే యది రోచతే.
కర్ణోహియదవోచత్ త్వాం తేజః సంజననాయ తత్
ఆచార్యపుత్రఃక్షమతాంమహత్ కార్యముపస్థితం
నాయం కాలో విరోధస్య కౌంతేయే సముపస్థితే
క్షంతవ్యం భవతా సర్వమాచార్యేణ కృపేణ చ.
భవతాం హి కృతాస్త్రత్వం యథాఽఽదిత్యే
ప్రభాతథా
యథా చంద్రమసో లక్ష్మీః సర్వథానాపకృష్యతే.
ఏవం భవత్సు బ్రాహ్మణ్యం బ్రహ్మాస్త్రం
చ ప్రతిష్ఠితం
చత్వార ఏకతో వేదాః క్షాత్రమేకత్ర దృశ్యతే.
నైతత్ సమస్తముభయం కస్మింశ్చిదనుశుశ్రుమ
అన్యత్ర భారతాచార్యాత్ సపుత్రాదితి మే మతిః.
వేదాంతాశ్చ పురాణాని ఇతిహాసం పురాతనం
జామదగ్న్యమృతేరాజన్ కో ద్రోణాధికో భవేత్.
బ్రహ్మాస్త్రంచైవ వేదాశ్చ నైతదన్యత్ర దృశ్యతే
ఆచార్యపుత్రః క్షమతాం నాయంకాలో విభేదనే.

## ఏబదిఒకటవ అధ్యాయం

ద్రోణుడూ కృపాచార్యులు అశ్వత్థామా తమ తమ అభిమతాలను అభివ్యక్తీకరించడంతో భీష్మాచార్యుడు తన కర్తవ్యాన్ని నిర్వర్తించే సంకల్పంతో ప్రసంగిస్తున్నాడు.

దుర్యోధనా ! కృపాచార్యుడూ అశ్వత్థామా వాస్తవమే చెప్పారు. కర్ణుని ప్రసంగం మాత్రం సక్రమంగా ఉన్నట్లు కనిపించదు. క్షత్రియధర్మ దృష్ట్యా యుద్ధం చెయ్యాలనే రాధేయుడు చెప్పుతున్నాడు. అది న్యాయసంగతం కాదు. మరొక విషయం - గురుతిరస్కారం విజ్ఞలక్షణం గాదు. దేశకాలానుసారమే సమరం సాగించడం నాకు ఉచితమని అనిపిస్తోంది. సూర్యసమ తేజస్కులైన శత్రువీరులు పరాక్రమిస్తూంటే చిత్తవిభ్రాంతి కలగడంలో ఆశ్చర్యమేమీ లేదు. స్వార్థపరత్వం ధర్మతత్పరతనూ విజ్ఞానాన్ని సమ్మోహింప చేస్తుంది.

నీ అభిమత మంగీకరిస్తే ఒక్క విషయం చెపుదామనుకుంటున్నాను. కర్ణప్రబోధం నీకు ఉత్సాహ తేజాలను కల్గించవచ్చు. కాని ఇప్పుడు నీకు హితవు చెప్పినవాడు అశ్వత్థామ. అది సరే. అలా ఉంచు. ఈ ఉపద్రవసమయంలో వారితో విరోధం ఏమాత్రం మంచిదిగాదు. అర్జునుడు ప్రత్యర్థియై యుద్ధానికి వస్తున్నాడు. పూజ్యులైన కృపద్రోణులు సర్వాపరాధాలనూ క్షమించాలి. సూర్యకాంతి అక్షీణంగా చంద్రునిలో ప్రతిఫలించేటట్లు మీ అస్త్రవిద్యాపాటవం అక్షయమైంది – అని కృప ద్రోణులవైపు తిరిగి ఆర్యా! మీలో బ్రహ్మత్వమూ బ్రహ్మాస్త్రమూ మూర్తీభవించి ఉన్నాయి

సర్వే సంహత్య యుధ్యామః పాకశాసనిమాగతం
బలస్య వ్యసనానీహ యాన్యుక్తాని మనీషిభిః
ముఖ్యో భేదో హి తేషాం తు పాపిష్ఠో విదుషాం మతః.

నైవ న్యాయ్యమిదం వాచ్యమస్మాకం పురుషర్షభ
కిం తు రోషపరీతేన గురుణా భాషితా గుణాః.

శత్రోరపి గుణా గ్రాహ్యా దోషా వాచ్యా గురోరపి
సర్వథా సర్వయత్నేన పుత్రే శిష్యే హితం వదేత్.

ఆచార్య ఏవ క్షమతాం శాంతిరత్ర విధీయతాం
అభిద్యమానే తు గురౌ తద్ వృత్తం రోషకారితం.

తతో దుర్యోధనో ద్రోణం క్షమయామాస భారత
సహ కర్ణేన భీష్మేణ కృపేణ చ మహాత్మనా.
యదేతత్ ప్రథమం వాక్యం భీష్మః శాంత
నవోఽబ్రవీత్

తేనైవాహం ప్రసన్నో వై నీతిరత్ర విధీయతాం.
యథా దుర్యోధనం పార్థో నోపసర్పతి సంగరే
సాహసాద్ యది వా మోహాత్ తథా నీతి
ర్విధీయతాం
వనవాసే హ్యనిర్వృత్తే దర్శయేన్న ధనంజయః
ధనంచాలభమానోఽత్ర నాద్యతత్ క్షంతుమర్హతి

---

ఒకరిలో వేదవిజ్ఞానమూ మరొకరిలో క్షత్రియ ధర్మమూ గోచరిస్తున్నాయి. ఇంతటి ప్రతిభా వంతులనుగూర్చి నేను వినలేదు కనలేదు. భరత వంశానికి ఆచార్యపీఠం అధిష్ఠించిన కృపద్రోణులను బ్రహ్మక్షత్రబలాలు సన్నికర్షపొంది ఉన్నాయి. వేదవేదాంగాలలో - పురాణేతిహాసాలలో కీర్తింప బడిన మా పరమగురువైన జమదగ్నినందనుడైన పరశురాముడు వినా ఇతరు లెవరూ ద్రోణాచా ర్యుని మించలేరు. ఆచార్యపుత్రులైన అశ్వత్థామ కూడా ప్రస్తుతం ఓరిమి వహించాలి. ఇది విభే దాలకు సమయంగాదు. సంగ్రామవేళ స్పర్థలు సైన్యనాశనహేతువులు — అని భీష్ముడు మృదు వుగా ప్రసంగించాడు.

భీష్మాచార్యా — న్యాయసంగతమైన మా ప్రసంగాలను నిందాయుతాలుగా భావించకండి. అస్త్రాచార్యుడైన ద్రోణుడు పాండవులకు కలిగిన క్లేశాలను స్మరించి ఆవేదనతో అర్జునుని గుణ గణాలను కీర్తించాడేకాని మరొకదృష్టితోమాత్రం కాదు. శత్రువైనంతలో గుణవంతుని కీర్తించ కుండా ఉండగలమా. దోషయుతుడైన గురువుని నిందించడానికికూడా సంకోచించకూడదే ! ఆత్మజునికి అంతేవాసికీ ఆచార్యుడు హితవే ప్రబోధిస్తాడు-అని అశ్వత్థామ అనగా - దుర్యోధ నాదులు లేచి ఆచార్యా - క్షమించి శాంతహృద యంతో కార్య నిర్వహణకు ఉపక్రమించండి. మా మాటలు మీకు బాధకలిగిస్తే వాటిని విస్మ రించి మమ్ముల ననుగ్రహించండి - అని ద్రోణుని అర్థించాడు.

అనంతరం దుర్యోధన కర్ణ భీష్మాదులందరూ ద్రోణాచార్యుని సమీపించి క్షమాభిక్ష నర్థించారు. అప్పుడు ద్రోణుడు లేచి - గాంగేయుని ప్రసంగం మాకు సంతోషం కలిగించింది. ఇక మన అద్య తన కర్తవ్యం వినండి. అర్జునుడు ఏవిధంగానూ దుర్యోధనుని సమీపించకుండా చూసుకోవాలి. ఇప్పుడు ఒక్కటిమాత్రం మరిచిపోకండి. అజ్ఞాత వాస కాలం పరిసమాప్తి కాకుండా అర్జునుడు బయలుపడడు. అది సరే. వారు వచ్చి గోధనాన్ని విడిపించుకోకపోతే వారికి క్షమాభిక్ష లేదు. కురు

యథా నాయం సమాయుంజ్యాద్ ధార్తరాష్ట్రః కథంచన
నచ సేనాః పరాజయ్యాత్ తథానీతిర్విధీయతాం.

ఉక్తం దుర్యోధనేనాపి పురస్తాద్ వాక్యమీదృశం
తదనుస్మృత్య గాంగేయ యథావద్ వక్తుమర్హసి.

## ఏబది రెండవ అధ్యాయం

కలాఃకాష్ఠాశ్చయుజ్యంతేముహూర్తాశ్చదినానిచ
అర్థమాసాశ్చ మాసాశ్చ నక్షత్రాణి గ్రహాస్తథా.
ఋతవశ్చాపి యుజ్యంతే తథా సంవత్సరా అపి
ఏవం కాలవిభాగేన కాలచక్రం ప్రవర్తతే.
తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచవ్యతిక్రమాత్
పంచమే పంచమే వర్షే ద్వౌమాసావుపజాయతః.
ఏషామభ్యధికా మాసాః పంచ చ ద్వాదశక్షపాః
త్రయోదశానాం వర్షాణామితి మే వర్తతే మతిః.
సర్వం యథావచ్చరితం యద్ యదేభిః ప్రతిశ్రుతం
ఏవమేతద్ ధ్రువం జ్ఞాత్వా తతో బీభత్సురాగతః.

సర్వే చైవ మహాత్మానః సర్వే ధర్మార్థకోవిదాః
ఏషాం యుధిష్ఠిరో రాజా కస్మాద్ ధర్మేఽపరాధ్నుయుః.
అలుబ్ధాశ్చైవకౌంతేయాః కృతవంతశ్చ దుష్కరం
న చాపి కేవలం రాజ్యమిచ్ఛేయుస్తేఽనుపాయతః.
తదైవ తే హి విక్రాంతుమీషుః కౌరవనందనాః
ధర్మపాశనిబద్ధాస్తు న చేలుః క్షత్రియవ్రతాత్.
యచ్చానృత ఇతి ఖ్యాయాద్ యః స గచ్ఛేత్ పరాభవం
వృణుయుర్మరణం పార్థా నానృతత్వం కథంచన.

---

సేనకు కౌరవజ్యేష్ఠునికీ ఏ ప్రమాదమూ లేకుండా మన మిప్పుడు ప్రవర్తించాలి. ఐతే అజ్ఞాతవాసం పరిసమాప్తం కాలేదేమోనని దుర్యోధనుడు ఒక సందేహం వెలిబుచ్చాడు. ఆ విషయమై భీష్మాచార్యులే నిర్ణయం చెయ్యాలి - అని ద్రోణుడు తన ప్రసంగం ముగించాడు.

## ఏబది రెండవ అధ్యాయం

కళ కాష్ఠ ముహూర్త దిన పక్ష మాస ఋతు సంవత్సరభేదంతో కాలం విభజింపబడింది. కాల గమనంలో పక్షమాసాల హెచ్చుతగ్గులు జ్యోతిషశాస్త్రానుసారం పరిగణిస్తే ఇలా కనిపిస్తుంది. ప్రతి రెండున్నర సంవత్సరాలకీ ఒక అధికమాసం వస్తుంది. అలా లెక్కిస్తే పదమూడు సంవత్సరాలూ గతించగా అయిదు మాసాల పంద్రెండు రోజులు అధికంగా నడిచాయి. పాండవులు తమ ప్రతిజ్ఞను సక్రమంగానే నిర్వర్తించారు. ఈ విషయాలన్నీ తెలుసును గనకనే అర్జునుడు ఇలా వస్తున్నాడు. పాండవులందరూ సజ్జనులు. వారిలో ధర్మజుడు మహావిజ్ఞుడు. ధర్మతత్పరుడైన పాండవాగ్రజుడు అధర్మకార్యాచరణకు అనుమతించడు. పాండవులు తపోదీక్షితులు. లోభరహితులు. అనుచితంగా అధర్మంగా రాజ్యలక్ష్మిని చేపట్టడానికి వారు ప్రయత్నించరు. అవక్రపరాక్రమోపేతులై విక్రమించి క్షాత్రతేజం ప్రదర్శిస్తారు. అర్జునుడు అసత్యవాది కాడు. అసత్యానికి అర్జునుడే ఒడిగడితే వానికి అపజయమే సిద్ధిస్తుంది. వారు ముక్తాహారాలు ధరిస్తారేగాని అసత్యాన్ని ధరించరు.

ప్రాప్తకాలేతుప్రాప్తవ్యం నోత్సృజేయుర్నరర్షభాః
అపి వజ్రభృతాగుప్తం తథావీర్యాహిపాండవాః.
ప్రతియుధ్యేమ సమరే సర్వశస్త్రభృతాం వరం
తస్మాద్ యదత్ర కళ్యాణం లోకే సద్భిరనుష్ఠితం
తత్ సంవిధీయతాం శీఘ్రం
మా వో హ్యర్థోఽభ్యగాత్ పరం.
నహి పశ్యామి సంగ్రామే కదాచిదపి కౌరవ
ఏకాంతసిద్ధిం రాజేంద్ర సంప్రాప్తశ్చ ధనంజయః.
సంప్రవృత్తేతుసంగ్రామే భావాభావౌజయాజయౌ
అవశ్యమేకం స్పృశతో దృష్టమేతదసంశయం.
తస్మాద్ యుద్ధోచితంకర్మ కర్మవాధర్మసంహితం
క్రియతామాశురాజేంద్ర సంప్రాప్తశ్చధనంజయః
ఏకోఽపి సమరే పార్థః పృథివీం నిర్దహేచ్ఛరైః
భ్రాతృభిస్సహితస్త్వాత కిం పునః కౌరవాన్ రణే
తస్మాత్ సంధిం కురుశ్రేష్ఠ కురుష్వయదిమన్యసే.

సమయ మాసన్నమైతే ఇంద్రుడు ఎదురువచ్చినా తమ రాజ్యభాగం విడిచిపెట్టరు.

శస్త్రాస్త్ర వేత్తలలో అగ్రేసరుడైన అర్జునుడు మనకు ఎదురు వస్తున్నాడు. కనుక ఈ గోధనం శత్రుహస్తగతం గాకుండా మనం చూసుకోవాలి. యుద్ధసమయంలో విజయం ఏపక్షాన్ని వరిస్తుం దనేది నేనిదివరలో ఎప్పుడూ నిర్ణయించలేదు. కాని ఒక్కటిమాత్రం చెప్పగలను. అర్జునుడు విజయలక్ష్మిని వరించి తీరతాడు. జయాపజయాలు ఎలా ఉన్నా ఇప్పుడు యుద్ధం చెయ్యకతప్పదు. అదుగో అర్జునుడు వస్తున్నాడు. అవసర కార్య క్రమం పూర్తిచెయ్యి. లేదా వారి రాజ్యభాగం వారికిచ్చి సంధికి సిద్ధపడు. ఏదైనా త్వరగా నిర్ణ యించు. వాడు వచ్చేస్తున్నాడు. ఏకైకవీరుడుగా నిలిచి ఈ భూమండలాన్ని దగ్ధంచేయగల వీరుడు

నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం
పితామహ
యుద్ధోపచారికంయత్తు తచ్ఛీఘ్రంప్రవిధీయతాం
అత్ర యా మామికా బుద్ధిః శ్రూయతాం
యది గోచతే
సర్వథాహి మయాశ్రేయో వక్తవ్యంకురునందన.
క్షిప్రం బలచతుర్భాగం గృహ్యా గచ్ఛ పురంప్రతి
తతోఽపరశ్చతుర్భాగో గాఃసమాదాయగచ్ఛతు.
వయంచార్థేనసైన్యస్యప్రతియోత్స్యామపాండవం
అహం ద్రోణశ్చ కర్ణశ్చ అశ్వత్థామా కృపస్తథా
ప్రతియోత్స్యామబీభత్సుమాగతంకృతనిశ్చయం
మత్స్యం వా పునరాయాతమాగతం వా శతక్రతుం
అహమావారయిష్యామి వేలేవ మకరాలయం.
తద్వాక్యంరురుచే తేషాంభీష్మేణోక్తంమహాత్మనా
తథా హి కృతవాన్ రాజా కౌరవాణామనంతరం.

వాడు. బాగా ఆలోచించుకో - అని భీష్ముడు అనగా - పితామహా - పాండవులకు రాజ్యమిచ్చే ప్రసక్తే లేనప్పుడు సంధిప్రస్తావన దేనికి ? యుద్ధా వసర కార్యాలు సాగుతాయి - అని దుర్యోధను డనగా - కురునందనా - నేను నీ మంచిని కోరి చెపుతున్నాను. ఈ సైన్యంలో నాల్గవభాగాన్ని హస్తినకి పంపెయ్యి - మరొక భాగాన్ని గో సంపదను హస్తినాపురానికి చేర్చే ఏర్పాటులో ఉంచు. శేష సైన్యంతో మనం అర్జునుని ఎదు ర్కోవాలి. నేనూ కర్ణ కృప ద్రోణ అశ్వత్థా మలూ అర్జునునితో యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాం. మత్స్యనరేంద్రుడు వచ్చినా నే నెదు ర్కొని నిలబెట్టగలను - అని భీష్ముడనడంతో దుర్యోధనాదులందరూ ఆనందించారు.

భీష్మః ప్రస్థాప్య రాజానం గోధనం తదనంతరం
సేనాముఖ్యాన్ వ్యవస్థాప్య వ్యూహితుం
సంప్రచక్రమే.

ఆచార్య మధ్యే తిష్ఠ త్వమశ్వత్థామాతు సవ్యతః
కృపః శారద్వతో ధీమాన్ పార్శ్వం రక్షతు దక్షిణం.

అగ్రతః సూతపుత్రస్తు కర్ణస్తిష్ఠతు దంశితః
అహం సర్వస్య సైన్యస్య పశ్చాత్ స్థాస్యామి
పాలయన్.

సర్వే మహారథాః శూరా మహేష్వాసా మహాబలాః
యుద్ధ్యంతు పాండవశ్రేష్ఠమాగతం
యత్నతో యుధి.

అభేద్యం సర్వసైన్యానాం వ్యూహ్యా వ్యూహం
కురూత్తమః
వజ్రగర్భం వ్రీహిముఖమర్ధచక్రాంతమండలం.
తస్య వ్యూహస్య పశ్చార్ధే భీష్మశ్చాథో
ద్యతాయుధః
సౌవర్ణం తాలముచ్ఛ్రిత్య రథే తిష్ఠన్నశోభత.

## ఏబదిమూడవ అధ్యాయం

తథా వ్యూఢేష్వనీకేషు కౌరవేయేషు భారత
ఉపాయాదర్జునస్తూర్ణం రథఘోషేణ నాదయన్.
దదృశుస్తే ధ్వజాగ్రం వై శుశ్రువుశ్చమహాస్వనం
దోధూయమానస్య భృశం గాండీవస్య చ నిస్వనం
తతస్తు సర్వమాలోక్య ద్రోణో వచనమబ్రవీత్
మహారథమనుప్రాప్తం దృష్ట్వా గాండీవధన్వినం.
ఏతద్ ధ్వజాగ్రం పార్థస్య దూరతః సంప్రకాశతే
ఏష ఘోషః స రథజో రోరవీతి చ వానరః.

---

గోగణాలను రాజధానికి చేర్చే ఏర్పాట్లు పూర్తిచేసి దుర్యోధనుడు భీష్ముని సమీపించి వ్యూహరచన సాగించమన్నాడు.

భీష్ముడు సేననూ ద్రోణునీ అవలోకించి - ఆచార్యా - మీరు సేనామధ్యంలో ఉండండి. అశ్వత్థామ వామపార్శ్వంలో ఉంటాడు. కృపాచార్యుడు దక్షిణ పార్శ్వాన్ని రక్షిస్తాడు. కవచధారియై కర్ణుడు సేనాగ్రభాగంలో ఉంటాడు, వెనుక నే నుండి అందరినీ రక్షిస్తాను. యోధులందరూ అర్జునుని ఎదిరించి పోరుతారు - అని పలికి భీష్ముడు వజ్రగర్భ వ్రీహిముఖ అర్ధచక్రాంత మండల వ్యూహాలతో సేనలను నిలబెట్టాడు. ఇన్ని వ్యూహాలకూ వెనుక కవచధారియై సువర్ణతాళధ్వజ శోభితమైన రథంమీద కురువృద్ధుడు శోభిస్తున్నాడు - అని వైశంపాయనుడు జనమేజయునికి ఉత్తర గోగ్రహణవేళ జరిగిన యుద్ధాన్ని వర్ణించడానికి ఉద్యుక్తుడవుతున్నాడు.

## ఏబది మూడవ అధ్యాయం

జనమేజయ మహారాజా ఈ ప్రకారంగా వ్యూహ నిర్మాణం చేసి కౌరవసేన నిలబెట్టగా దిగ్దిగంతాలలో ప్రతిధ్వనిస్తూ అర్జునరథధ్వానం వారిని సమీపిస్తోంది. ఆ రథ పతాకం మీద లాంఛనం కూడా వారికి గోచరిస్తోంది. దాని భయంకర విరావంతో అర్జున గాండీవ ధనుష్టం

ఏష తిష్ఠన్ రథశ్రేష్ఠే రథే చ రథినాం వరః
ఉత్కర్షతి ధనుఃశ్రేష్ఠం గాండీవమశనిస్వనం.
ఇమౌ చ బాణౌ సహితౌ పాదయోర్మే వ్యవస్థితౌ
అపరౌ చాప్యతిక్రాంతౌ కర్ణౌ సంస్పృశ్య మేశరా.
నిరుష్య హి వనే వాసం కృత్వా కర్మాతిమానుషం
అభివాద యతే పార్థః శ్రోత్రే చ పరిమృచ్ఛతి.
చిరదృష్టోఽయమస్మాభిః ప్రజ్ఞావాన్ బాంధవప్రియః
అతీవ జ్వలితో లక్ష్మ్యా పాండుపుత్రో ధనంజయః.
రథీ శరీ చారుతలీ నిషంగీ
శంఖీ పతాకీ కవచీ కిరీటీ
ఖడ్గీ చ ధన్వీ చ విభాతి పార్థః
శిఖీ వృతః స్రుగ్భిరివాజ్యసిక్తః.

తమదూరముపాయాంతం దృష్ట్వా పాండవమర్జునం
నారయః ప్రేక్షితుం శేకు స్తపంతంహియథారవిం
స తం దృష్ట్వా రథానీకం పార్థః సారథిమబ్రవీత్
ఇషుపాతేచ సేనాయా హయాన్ సంయచ్ఛ సారథే
యావత్ సమీక్షే సైన్యేఽస్మిన్ క్వాసౌ
కురుకులాధమః.
సర్వానేతానానాదృత్య దృష్ట్వా తమతిమానినం
తస్య మూర్ధ్ని పతిష్యామి తత ఏతే పరాజితాః.
ఏష వ్యవస్థితో ద్రోణో ద్రౌణిశ్చ తదనంతరం
భీష్మః కృపశ్చ కర్ణశ్చ మహేష్వాసాః సమాగతాః
రాజానం నాత్ర పశ్యామి గాః సమాదాయ గచ్ఛతి
దక్షిణం మార్గమాస్థాయ శంకే జీవపరాయణః.

---

కారము కురుసేనను వికలపరుస్తోంది. గాండీవి సమీపిస్తున్నాడు. అప్పుడు ద్రోణుడు అందరిని తిలకిస్తూ అంటున్నాడు.

అదుగో అర్జునరథధ్వజం ఎంతగా ప్రకాశిస్తోందో దూరంనుండే చూడండి. ఆ రథ ధ్వానం ఆలకించండి. పతాకంమీది వానరుని సింహనాదం కూడా వినండి. ఆ రథంమీద కూర్చున్న మహారథికుడు పార్థుడే – అదుగో వానిచేతిలోని గాండీవం. వజ్రధ్వనులను పరిహసిస్తూ అది ఎలా మ్రోగుతోందో వినండి. ఇవిగో అప్పుడే రెండు బాణాలు నా పాదాలముందుకు వచ్చి పడ్డాయి. మరొక రెండు బాణాలు నా శ్రవణ పుటాల ప్రక్కగా పోయాయి. ఇంతకాలమూ అరణ్యాలలో తపస్సుచేసి అమానుష శక్తులను సాధించిన అర్జునుడు ఈనాడు మన ఎదుటకు వస్తున్నాడు. ఆచార్యులమీద ఉండే ఆదరగౌరవాలు ప్రదర్శించడానికి ముందుగా నా పాదాలమీదకు నమస్కార బాణాలు విడిచాడు. యుద్ధానికి అనుజ్ఞ కోరుతూ నా కర్ణరంధ్రాలమీదుగా రెండు బాణాలు పోనిచ్చాడు. సోదర బంధుమిత్రుల శ్రేయస్సునే సదా కాంక్షించే అర్జునుడు ఎంతకాలానికి కనిపించాడు. పాండురాజనందనుడైన ధనంజయుడు దివ్య శోభామయ కాంతులతో ఎలా ప్రకాశిస్తున్నాడో చూడండి. ధనంజయుడు బాణ శరాసన ఖడ్గ శంఖ హస్తుడై కవచధారియై రథారూఢుడై వస్తున్నాడు. ఈ సాధన సామగ్రియే యజ్ఞావసర వస్తు సముదాయంగా ప్రజ్వలితాగ్నిహోత్రునివలె ఎంతగా విరాజిల్లుతున్నాడో చూడండి – అని అభినందించాడు.

గ్రీష్మభానునివలె ప్రచండ ద్యుతులతో వెలిగే అర్జునుడు సమీపించేకొద్దీ వారటువైపు చూడలేక పోయారు. రథికవరులతో నిండిన కురుసేనా వాహినిని సమీపించి అర్జునమహారథికుడు తన సారథియైన ఉత్తరునివైపు తిరిగి – సారథీ ఎంత దూరంలో మనమాగితే మన బాణాలు కౌరవ సేనను తాకగలవో అంత దూరంలో మన

ఉత్సృజ్యైతద్ రథానీకం గచ్ఛయత్ర సుయోధనః
తత్రైవ యోత్స్యే వైరాటే నాస్తి యుద్ధం నిరామిషం
తం జిత్వా వినివర్తిష్యే గాః సమాదాయ వై పునః
ఏవముక్తః స వైరాటిర్హయాన్ సంయమ్య యత్నతః
నియమ్య చ తతో రశ్మీన్ యత్ర తే కురుపుంగవాః
అచోదయత్ తతో వాహాన్ యత్ర దుర్యోధనో గతః
ఉత్సృజ్య రథవంశం తు ప్రయాతే శ్వేతవాహనే
సాభిప్రాయం విదిత్వా చ కృపో వచనమబ్రవీత్.
నైషోఽన్తరేణ రాజానం బీభత్సుః స్థాతుమిచ్ఛతి
తస్య పార్ష్ణిం గ్రహేష్యామో జవేనాభిప్రయాస్యతః
న హ్యేనమతిసంక్రుద్ధమేకో యుధ్యేత సంయుగే
అన్యో దేవాత్ సహస్రాక్షాత్ కృష్ణాద్ వా దేవకీసుతాత్
ఆచార్యాచ్చ సపుత్రాద్ వా భారద్వాజాన్మహారథాత్.
కిం నో గావః కరిష్యంతి ధనం వా విపులం తథా
దుర్యోధనః పార్థజలే పురా నౌరివ మజ్జతి.
తథైవ గత్వా బీభత్సుర్నామ విశ్రావ్య చాత్మనః
శలభైరివ తాం సేనాం శరైః శీఘ్రమవాకిరత్.

---

రథాన్ని అపుచెయ్యి. ఈ కురుసేనలో దుర్యోధను డెక్కడున్నాడో కనుపించటంలేదు. దురభిమానియైన దుర్యోధనుడు కనిపిస్తే నేను వానిమీదనే అస్త్రం ప్రయోగిస్తాను. దుర్యోధనుడు పరాజితుడైతే వీరందరూ ఓడినట్లే. అదుగో అక్కడ ఆచార్య ద్రోణులు నిలబడ్డారు. వారి వెనుకనే అశ్వత్థామ ఉన్నాడు. ఇంకా ఆపైన భీష్మపితామహుడు కనుపిస్తున్నాడు – ఇదుగో ఈ ప్రక్క కృపాచార్యులు అటు కర్ణుడు. ఈ మహారథికులందరూ యుద్ధోన్ముఖులై వచ్చారు. వీరిలో దుర్యోధనుడు కనిపించడంలేదు. బహుశః ఆ కౌరవ జ్యేష్ఠుడు ప్రాణరక్షణదృష్టితో దక్షిణదిశగా పోయి ఉంటాడు. ఐనా ఈ రథికులందరినీ విడిచి మన రథం దుర్యోధనుడున్నవైపు పోనియ్యి. నేను వాడితోనే యుద్ధం చెయ్యాలి. వీరందరితో యుద్ధ మనవసరం. గాంధారేయుని ఓడించి మన గోగణాలను మరలించుకుపోదాము – అన్నాడు.

ఉత్తరుడు మహారథికులవైపు తీవ్రవేగంతో పోయే అశ్వాలను అతిప్రయత్నంమీద నిలిపి అర్జునుని ఆజ్ఞానుసారం దుర్యోధను డున్నవైపు రథాన్ని నడపడానికి ప్రయత్నిస్తున్నాడు.

అర్జునుడు రథాన్ని ప్రక్కకు మళ్లించడం చూసి కృపాచార్యుడు దగ్గరవారితో అంటున్నాడు.

పార్థుడు దుర్యోధనునికోసం వెదుకుతున్నాడు. మనం వేగంగా వెళ్ళి వానిని వెనుదిప్పాలి. పార్థుడు తీవ్రక్రోధంలో ఉన్నాడు. ఇప్పుడు వానితో దేవేంద్రుడో దేవకీనందనుడో ద్రోణుడో పోరాడాలేగాని ఇతరులెవ్వరూ వానిముందు నిలబడలేరు. ఈ గోధనం మనం తెచ్చిన లాభ మేమి? ఈ దుర్యోధనుడు అర్జునసాగరంలో శిథిలనౌకలా మునిగిపోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అదుగో అప్పుడే అర్జునుడు దుర్యోధనుని సమీపించాడు. ఉచ్చైశ్శ్వరంతో తనపేరు చెప్పి మిడతలదండువలె కౌరవసేనమీద బాణవర్షం కురిపిస్తున్నాడు. అర్జున కరవిముక్తబాణాలతో భూమ్యాకాశాలు నిండిపోయాయి. మన సేనలకు మన్నూ మిన్నూ కానరావడంలేదు. ఆ బాణఘాతాలతో మనసైనికులు నేలకూలుతున్నారు. కాని విచేతస్కులు

కీర్యమాణాః శరౌఘైస్తు యోధాస్తే పార్థచోదితైః
నాపశ్యన్నావృతాం భూమిం నాంతరిక్షం చ పత్రిభిః
తేషామాపతతాం యుద్ధే నాపయానేఽభవన్మతిః
శీఘ్రత్వమేవ పార్థస్య పూజయంతి స్మ చేతసా.
తతః శంఖం ప్రదధ్మౌ స ద్విషతాం లోమహర్షణం
విస్ఫార్య చ ధనుః శ్రేష్ఠం ధ్వజే
భూతాన్యచోదయత్.

తస్య శంఖస్య శబ్దేన రథనేమిస్వనేన చ
గాండీవస్య చ ఘోషేణ పృథివీ సమకంపత.
అమానుషాణాం భూతానాం తేషాం చ
ధ్వజవాసినాం
ఊర్ధ్వం పుచ్ఛాన్ విధున్వానా రేభమాణాః
సమంతతః
గావః ప్రతిన్యవర్తంత దిశమాస్థాయ దక్షిణాం.

---

## ఏబదినాలుగవ అధ్యాయం

స శత్రుసేనాం తరసా ప్రణుద్య
గాస్తా విజిత్యాథ ధనుర్ధరాగ్ర్యః
దుర్యోధనాయాభిముఖం ప్రయాతో
భూయో రణం సోఽభిచికీర్షమాణః.

గోషు ప్రయాతాసు జవేన మత్స్యాన్
కిరీటినం కృతకార్యం చ మత్వా
దుర్యోధనాయాభిముఖం ప్రయాతం
కురుప్రవీరాః సహసా నిపేతుః.

---

కావటం లేదు. వారు అంతరాంతరాలలో అర్జునుని అభినందిస్తున్నారు. అప్పుడు అర్జునుడు పాంచజన్యం పూరించాడు. అది శాత్రవులకు రోమాంచం కలిగించింది. ధనుష్టంకారం చేసి తన ధ్వజంమీద ఉన్న భూతగణాలను సింహనాదం చెయ్యమని ప్రేరేపించాడు. శంఖనాదమూ, గాండీవజ్యానినాదమూ, భూతగణకోలాహలమూ, రథసస్వనమూ, నాలుగువైపులనుండీ వచ్చి కురుసేనను కంపింపచేసాయి. ఆ సమయంలో గోవులు తోకలపైకెత్తి అంభారవాలతో దక్షిణదిశాముఖంగా పరుగుతీశాయి.

---

## ఏబదినాలుగవ అధ్యాయం

ఈ విధంగా సైనికులను సమ్మోహపరచి గోగణాలను రక్షించి తరలించి యుద్ధకుతూహలుడైన అర్జునుడు తిరిగి దుర్యోధనునివైపు నడిచాడు. గోవులు విరాటనగరంవైపు పోయే సమయంలో అర్జునుడు దుర్యోధనునిమీదికి నడవడం గ్రహించిన కౌరవవీరులందరూ ఒక్కసారిగా అర్జునునివైపు వచ్చారు. వారి అసంఖ్యాక సేనాబలం విచిత్రవ్యూహబంధితమై ఉంది. ఆ సేనలను ఉత్తరునకు చూపిస్తూ అర్జునుడు – రాజనందనా – సువర్ణద్యుతులీనే నా శ్వేతాశ్వాలను ఈ మార్గంగుండా దుర్యోధనునివైపు వేగంగా నడిపించు. ఏనుగు ఏనుగుతో తలపడడానికి ప్రయత్నించేటట్లు ఈ సూతపుత్రుడు నాతో యుద్ధానికి ఎంత కుతూహలపడుతున్నాడో చూశావా? వీడు దుర్యోధనుని ఆశ్రయించి తీవ్ర దర్పితుడై ఉన్నాడు. వీని ఉత్సాహపు పొంగు చూద్దాం నడు.

తేషామనీకాని బహూని గాఢం
వ్యూఢాని దృష్ట్వా బహులధ్వజాని
మత్స్యస్య పుత్రం ద్విషతాం నిహంతా
వైరాటిమామంత్ర్య తతోఽభ్యువాచ
ఏతేన తూర్ణం ప్రతిపాదయేమాన్
శ్వేతాన్హయాన్ కాంచనరశ్మియోక్త్రాన్
జవేన సర్వేణ కురు ప్రయత్న
మాసాదయేఽహం కురుసింహవృందం.
గజో గజేనేవ మయా దురాత్మా
యోద్ధుం సమాకాంక్షతి సూతపుత్రః
తమేవ మాం ప్రాపయ రాజపుత్ర
దుర్యోధనాపాశ్రయజాతదర్పం.
స తైర్హయైర్వాతజవైర్బృహద్భిః
పుత్రో విరాటస్య సువర్ణకక్ష్యైః
వ్యధ్వంసయత్ తద్ రథినామనీకం
తతోఽవహత్ పాండవమాజిమధ్యే.
తం చిత్రసేనో విశిఖైర్విపాఠైః
సంగ్రామజిచ్ఛత్రుసహో జయశ్చ
ప్రత్యుద్యయుర్భారతమాపతంతం
మహారథాః కర్ణమభీప్సమానాః.

తతః స తేషాం పురుషప్రవీరః
శరాసనార్చిః శరవేగతాపః
వ్రాతం రథానామదహత్ సమన్యు
ర్వనం యథాగ్నిః కురుపుంగవానాం.
తస్మింస్తు యుద్ధే తుములే ప్రవృత్తే
పార్థం వికర్ణోఽతిరథం రథేన
విపాఠవర్షేణ కురుప్రవీరో
భీమేన భీమానుజమాససాద.
తతో వికర్ణస్య ధనుర్వికృష్య
జాంబూనదాగ్ర్యోపచితం దృఢజ్యం
అపాతయత్ తం ధ్వజమస్య మధ్య
చ్ఛిన్నధ్వజః సోఽప్యపయాజ్జవేన.
తం శాత్రవాణాం గణబాధితారం
కర్మాణి కుర్వంతమమానుషాణి
శత్రుంతపః పార్థమమృష్యమాణః
సమార్దయచ్ఛరవర్షేణ పార్థం.
స తేన రాజ్ఞాతిరథేన విద్ధో
విగాహమానో ధ్వజినీం కురూణాం
శత్రుంతపం పంచభిరాశు విద్ధ్వా
తతోఽస్య సూతం దశభిర్జఘాన.

---

సర్వాంగాలంకృతాలూ సర్వాలక్షణ సంపన్నాలూ వాయుసమవేగ శక్తియుతాలూ ఐన రథాశ్వాలను ఉత్తరుడు తీవ్రవేగంతో నడిపి కురుసేనా మధ్యంలో నిలబెట్టాడు. చిత్రసేన సంగ్రామజిత్తు శత్రుసహ ఆదిగాగల మహారథికులు కర్ణునికి ఏవిధమైన ప్రమాదమూ కలగకుండా చూసే ఉద్దేశంతో అర్జునుని చుట్టుముట్టి విపాఠ నామక బాణాలు వర్షించసాగారు. అర్జునుని క్రోధం హెచ్చింది. ఆ తీవ్రక్రోధంతో అర్జునబాణాగ్ని కౌరవసేనావనాన్ని దగ్ధంచెయ్యడం మొదలుపెట్టింది. మహారథికుల రథాలన్నీ భస్మం అవుతున్నాయి. ఆ సమయంలో వికర్ణుడు విపాఠబాణాలను విరివిగా వర్షిస్తూ అర్జునునిమీదికి దూసుకు వచ్చాడు. అర్జునుడు సువర్ణమయబాణాలతో వికర్ణుని ధనుస్సును ఖండించి వానిపతాకం ముక్కలు చేసాడు. వికర్ణుడు పలాయనం పఠించాడు. అది చూసి శత్రుంతపవీరుడు అర్జునునిమీదికి వచ్చి తన బాణాలతో అర్జునుని వేధించసాగాడు. అప్పుడర్జునుడు ఐదు బాణాలతో వానిని వేధించి బాణదశకంతో సారథిని యమసదనానికి పంపాడు.

తతః స విద్ధో భరతర్షభేణ బాణేన
బాణేన గాత్రావరణాతిగేన
గతాసురాజౌ నిపపాత భూమౌ
నగో నగాగ్రాదివ వాతరుగ్ణః.

నరర్షభాస్తేన నరర్షభేణ
వీరా రణే వీరతరేణ భగ్నాః
చకంపిరే వాతవశేన కాలే
ప్రకంపితానీవ మహావనాని.

హతాస్తు పార్థేన నరప్రవీరా
గతాసవోర్వ్యాం సుషుపుః సువేషాః
వసుప్రదా వాసవతుల్యవీర్యాః
పరాజితా వాసవజేన సంఖ్యే.

సువర్ణకార్ష్ణాయసవర్మనద్ధా
నాగా యథా హైమవతాః ప్రవృద్ధాః
తథా స శత్రూన్ సమరే వినిఘ్నన్
గాండీవధన్వా పురుషప్రవీరః.

చచార సంఖ్యే విదిశో దిశశ్చ
దహన్నివాగ్నిర్వనమాతపాంతే
ప్రకీర్ణపర్ణాని యథా వసంతే
విశాతయిత్వా పవనోఽంబుదాంశ్చ.

తథా సపత్నాన్ వికిరన్ కిరీటీ
చచార సంఖ్యేఽతిరథో రథేన
శోణాశ్వవాహస్య హయాన్ నిహత్య
వైకర్తనభ్రాతురదీనసత్త్వః

ఏకేన సంగ్రామజితః శరేణ
శిరో జహారాథ కిరీటమాలీ.
తస్మిన్ హతే భ్రాతరి సూతపుత్రో
వైకర్తనో వీర్యమథాదదానః

ప్రగృహ్య దంతావివ నాగరాజో
మహర్షభం శీఘ్ర ఇవాభ్యధావత్.
స పాండవం ద్వాదశభిః పృషత్కై-
ర్వైకర్తనః శీఘ్రమథో జఘాన
వివ్యాధ గాత్రేషు హయాంశ్చ సర్వాన్
విరాటపుత్రం చ కరే నిజఘ్నే.

---

అర్జునుని వాడి బాణాలు ప్రతియోధుని కవచాన్ని భేదించి శరీరాన్ని చీల్చాయి. శత్రుంతపుడు రథంనుండి నేల గూలాడు.

ఆ సమరంలో అర్జునుని ద్వారా నేల కూలిన మహావీరులందరూ వేషభూషణాలతో ప్రాణశూన్యులై భూమిపై శయనిస్తున్నారు. మహాదాతలూ ఇంద్రసమ పరాక్రమోపేతులైన వీరులందరూ ఇంద్రనందనుని చేతిలో పరాజితులౌతున్నారు. వారిలో సువర్ణకవచధారులుకొందరూ లోహబద్ధాంగుళిత్రాణులు కొందరూ ఉన్నారు. హిమవన్నగ ప్రాంతాలలో విహరించే మత్తేభాలవలె కనిపించే మహావీరు లెందరో అక్కడ భూ శయనం చేస్తున్నారు.

గ్రీష్మాతపం అరణ్యాన్ని చుట్టుముట్టినట్లు సవ్యసాచి కౌరవసేనా వనంలో విహరిస్తూ దగ్ధం చేస్తున్నాడు. వసంతం జీర్ణపత్రాలను రాల్చి మేఘాలను చిన్నాభిన్నం చేసేటట్లు అర్జున వసంతుడు రణారణ్యభూమిలోని కౌరవవీర తరుశాఖలను ఖండించి నేల గూలుస్తున్నాడు! ఏమాత్రం చలించకుండా అర్జునుడు పరాక్రమిస్తున్నాడు. అరుణాశ్వాలను పూన్చిన రథంమీద తను నెదిరంప వచ్చిన సంగ్రామ జిత్తుయొక్క రథాశ్వాలను నేలకూల్చి శిరస్సును దేహంనుండి వేరుచేశాడు. తన సోదరుడైన సంగ్రామజిత్తు పార్థుని హస్తాలలో నిహతుడు కావడంచూసి కర్ణుడు కుపితుడై తీవ్రవేగంతో అర్జునునిమీదికి వచ్చాడు. పర్వత

తమాపతంతం సహసా కిరీటీ
వైకర్తనం వై తరసాభిపత్య
ప్రగృహ్య వేగం న్యపతజ్జవేన
నాగం గరుత్మానివ చిత్రపక్షః

తావుత్తమౌ సర్వధనుర్ధరాణాం
మహాబలౌ సర్వసపత్నసాహౌ
కర్ణస్య పార్థస్య నిశమ్య యుద్ధం
దిదృక్షమాణాః కురవోఽభితస్థుః.

స పాండవస్తూర్ణముదీర్ణకోపః
కృతాగసం కర్ణముదీక్ష్య హర్షాత్
క్షణేన సాశ్వం సరథం ససారథి
మంతర్దధే ఘోరశరౌఘవృష్ట్యా.

తతః సువిద్ధాః సరథాః సనాగా
యోధా వినేదుర్భరతర్షభాణాం
అంతర్హితాభీష్మముఖాః సహాశ్వాః
కిరీటినా కీర్ణరథాః పృషత్కైః.

స చాపి తానర్జునబాహుముక్తా
న్ఛరాన్ఛరౌఘైః ప్రతిహత్య వీరః
తస్థౌ మహాత్మా సధనుః సబాణః
సవిస్ఫులింగోఽగ్నిరివాశు కర్ణః.

తతస్త్వభూద్ వై తళతాళశబ్దః
సశంఖభేరీపణవప్రణాదః
ప్రక్ష్వేడితజ్యాతలనిస్వనం తం
వైకర్తనం పూజయతాం కురూణాం.

ఉద్ధూతలాంగూలమహాపతాక
ధ్వజోత్తమాంసాకులభీషణాంతం
గాండీవనిర్హ్రాదకృతప్రణాదం
కిరీటినం ప్రేక్ష్య ననాద కర్ణః.

స చాపివైకర్తనమర్దయిత్వా
సాశ్వం ససూతం సరథం పృషత్కైః
తమావవర్ష ప్రసభం కిరీటీ
పితామహం ద్రోణకృపౌ చ దృష్ట్వా.

---

శిఖరాన్ని ఢీకొనే ఏనుగువలె వృషభంమీదికి లఘించే పులివలె ఉన్నాడు కర్ణుడు.

కర్ణుడు వస్తూనే పన్నెండు బాణాలు విడిచి గుర్రాలను వేధించి ఉత్తరుని హస్తాలమీదకు బాణాలు విడిచాడు. కర్ణార్జునులు వీరశ్రేష్ఠులు. బలిష్ఠులు. మహాధనుర్ధరులైన కర్ణార్జునులు పరస్పర యుద్ధం సాగిస్తూంటే కౌరవవీరులందరూ కుతూహలచిత్తులై అటే చూడసాగారు. అర్జునుడు నాగసర్పంమీదికి లఘించే గరుడపక్షివలె కర్ణుని మీదికి వస్తున్నాడు. అర్జునుని క్రోధాగ్ని ప్రజ్వలించ సాగింది. హర్షోత్సాహాలతో భయంకర బాణాలు విడిచి కొద్ది క్షణాలలో అశ్వాలనూ సారథినీ వేధించి కర్ణుని నిరోధించాడు. కౌరవ సేనలోని రథ గజ బలాలు హాహారవాలు చేయసాగాయి. అర్జునుని బాణాలు భీష్మాది మహారథికులందరినీ కప్పివేసి అదృశ్యం చేశాయి. కర్ణుడు వాడి బాణాలు విడుస్తూ అర్జునుడు విడిచే బాణాలను దారిలోనే ఖండిస్తున్నాడు. ఆ సమయంలో కర్ణుడు విస్ఫులింగాలతో నిండిన అగ్నివలె ప్రకాశిస్తున్నాడు. అనవరత ధనుష్టంకారంతో అర్జునుని వేధిస్తూంటే కౌరవవీరు లందరూ శంఖభేరీనినాదాలతో కర్ణునకు ఉత్సాహం పురికొల్పసాగారు. అది విని అర్జునుడు శంఖనాదం చేశాడు. పతాకంమీది వానరుడూ, పరివేష్టిత భూతగణాలూ సింహభైరవనాదాలు చేస్తూంటే వజ్రధ్వనిసదృశంగా గాండీవం శబ్దిస్తూంటే కర్ణుడునిర్విరామ సింహనాదం ప్రారంభించాడు. అర్జునుడు పుంఖానుపుంఖంగా బాణాలు విడిచి

స చాపి పార్థం బహుభిః పృషత్కై-
ర్వైకర్తనో మేఘ ఇవాభ్యవర్షత్
తథైవ కర్ణం చ కిరీటమాలీ
సంఛాదయామాస శితైః పృషత్కైః.
తయోః సుతీక్ష్ణాన్ సృజతోః శరౌఘాన్
మహాశరౌఘాస్త్రవివర్ధనే రణే
రథే విలగ్నావివ చంద్రసూర్యౌ
ఘనాంతరేణానుదదర్శ లోకః.
అథాశుకారీ చతురో హయాంశ్చ
వివ్యాధ కర్ణో నిశితైః కిరీటినః
త్రిభిశ్చ యంతార మమృష్యమాణో
వివ్యాధ తూర్ణం త్రిభిరస్య కేతుం.
తతో౽భివిద్ధః సమరావమర్దీ
ప్రబోధితః సింహ ఇవ ప్రసుప్తః
గాండీవధన్వా ఋషభః కురూణా
మజిహ్మగైః కర్ణమియాయ జిష్ణుః.
శరాస్త్రవృష్ట్యా నిహతో మహాత్మా
ప్రాదుశ్చకారాతి మనుష్యకర్మ
ప్రాచ్ఛాదయత్ కర్ణరథం పృషత్కై-
ర్లోకానిమాన్ సూర్య ఇవాంశుజాలైః.
స హస్తినే వాభిహతో గజేంద్రః
ప్రగృహ్య భల్లాన్ నిశితాన్ నిషంగాత్
ఆకర్ణపూర్ణం చ ధనుర్వికృష్య
వివ్యాధ గాత్రేష్వథ సూతపుత్రం.
అథాస్య బాహూరుశిరోలలాటం
గ్రీవాం వరాంగాని పరావమర్దీ
శితైశ్చ బాణైర్యుధి నిర్బిభేద
గాండీవముక్తైరశనిప్రకాశైః.
స పార్థముక్తైరిషుభిః ప్రణున్నో
గజో గజేనేవ జితస్తరస్వీ
విహాయ సంగ్రామశిరః ప్రయాతో
వైకర్తనః పాండవబాణతప్తః.

కర్ణుని సారథినీ అశ్వాలనూ హింసించాడు కర్ణుడు భీష్మ ద్రోణ కృపాచార్యాదులవైపు చూస్తూండగా అర్జునుడు అకస్మాత్తుగా వానిపై బాణవర్షం కురిపించాడు. కర్ణుడు మేఘమాలలవలె బాణాలు వదులుతున్నాడు. అర్జునుడు నిర్విరామంగా బాణాలు విడుస్తూనే ఉన్నాడు. మేఘవినిర్ముక్త సూర్యచంద్రులవలె ఆ మహారథికులిద్దరూ ప్రకాశిస్తున్నారు. అర్జునపరాక్రమానికి కర్ణుడు తట్టుకోలేకపోయాడు. ప్రవాహ వేగంతో బాణాలు విడిచి అర్జునుని గుర్రాలనూ సారథిని వేధించి ధ్వజం ఛిన్నంచేశాడు. నిద్రలేచిన సింహంవలె అర్జునుడు కుపితుడై కర్ణుని పీడించసాగాడు. సూర్యుడు కిరణసమూహంతో ప్రపంచాన్ని ఆచ్ఛాదించేటట్లు అర్జునుడు బాణజాలంతో కర్ణుని రథాన్ని కప్పివేసాడు. ఆకర్ణాంతం ధనుస్సు లాగి బాణాలు విడిచి కర్ణుని సర్వావయవాలలో తూట్లుకొట్టాడు. దెబ్బతిన్న ఏనుగులా కర్ణుడు యుద్ధభూమి విడిచి పోయాడు.

## ఏబది అయిదవ అధ్యాయం

అపయాతే తు రాధేయే దుర్యోధన పురోగమాః
అనీకేన యథాస్వేన శనైరార్ఛంత పాండవం.

బహుధా తస్య సైన్యస్య వ్యూఢస్యాపతతః శరైః
అధారయత వేగం స వేలేవ తు మహోదధేః.

తతః ప్రహస్య బీభత్సుః కౌంతేయః శ్వేతవాహనః
దివ్యమస్త్రం ప్రకుర్వాణః ప్రత్యాయాద్ రథసత్తమః

యథా రశ్మిభిరాదిత్యః ప్రచ్ఛాదయతి మేదినీం
తథా గాండీవనిర్ముక్తైః శరైః పార్థో దిశో దశ.

నరథానాం నాచాశ్వానాం న గజానాం న వర్మణాం
అనివిద్ధం శితైర్బాణై రాసీద్ద్వ్యంగుళమంతరం.

దివ్యయోగాచ్చ పార్థస్య హయానాముత్తరస్య చ
శిక్షాశిల్పోపపన్నత్వాదస్త్రాణాం చ పరిక్రమాత్
వీర్యవత్వం ద్రుతం చాగ్ర్యం దృష్ట్వా జిష్ణోర
పూజయన్.

కాలాగ్నిమివ బీభత్సుం నిర్దహంతమివ ప్రజాః
నారయః ప్రేక్షితుం శేకుర్జ్వలంతమివ పావకం.

తాని గ్రస్తాన్యనీకాని రేజురర్జునమార్గణైః
శైలం ప్రతి బలాభ్రాణి వ్యాప్తానీవార్కరశ్మిభిః.

అశోకానాం వనానీవచ్ఛన్నాని బహుశః శుభైః
రేజుః పార్థశరైస్తత్ర తదా సైన్యాని భారత.

"స్రజోఽర్జునశరైః శీర్ణం శుష్యత్పుష్పం హిరణ్యం
ఛత్రాణి చ పతాకాశ్చ ఖే దధార సదాగతిః."

స్వబలత్రాసనాత్ త్రస్తాః పరిపేతుర్దిశో దశ
రథాంగదేశానాదాయ పార్థచ్ఛిన్నయుగా హయాః

కర్ణకక్షవిషాణేషు అంతరోష్ఠేషు చైవ హ
మర్మఖడ్గేషు చాహత్యాపాతయత్ సమరే గజాన్.

---

## ఏబది అయిదవ అధ్యాయం

కర్ణుడు పలాయనం పఠించడంతో దుర్యోధనాది కౌరవయోధు లందరూ అర్జునునిచుట్టుముట్టారు ఆ సముద్రాన్ని అర్జున బాణాలనే చెలియలకట్ట మీదికిరాకుండా నిలబెట్టింది. దివ్యాస్త్రాలు విడిచి దశదిశలనూ నిరోధించాడు అర్జునుడు. చతురంగబలాలలో అర్జునబాణం తగలని ప్రాణి లేదు. అర్జునయుద్ధకౌశలమూ, ఉత్తర సారధ్యమూ శత్రుసేనకు ప్రశంసాయోగ్యంగా గోచరించింది. ప్రళయకాలాగ్నిలా ఉన్న అర్జునునివైపు వారు కన్నెత్తి చూడలేకపోతున్నారు. అర్జునుని బాణాలు గజబలాన్ని నానావిధాలా హింసించి నేల కూలుస్తున్నాయి. సంవర్తకాగ్ని చరాచరజగత్తునూ భస్మంచేసేటట్లు కౌంతేయుని బాణాలు కౌరవ సేనను దగ్ధంచేస్తున్నాయి. అర్జునగాండీవధ్వానము దుర్యోధనుని గుండెలో భయం కలిగించింది. అప్పటికే వారి రథబలం క్షీణించి పోయింది. అసమర్థులను వధించటం ఉచితంకాదని అర్జును డాగగా ఆ సైనికులు అర్జునుని మీదిమీదికి రా సాగారు. తనవైపు వచ్చేవా రందరినీ ఉత్తర క్షణంలో యమసదనానికి పంపుతున్నాడు పార్థుడు. శేషుడు సాగరంలో విహరించినట్లు అర్జునుడు శత్రువాహినిలో చరిస్తున్నాడు.

అర్జునుని బాణాలు పోయినంతదూరమూ వాని మార్గం సుగమ మాతోంది. కౌరవసేన శక్తి నశించింది. శాత్రవవనం అర్జున ప్రచండవాయువుతో ఛిన్నాభిన్నమైంది. సూర్యుడు అస్తాచలం

కౌరవాగ్రగజానాం తు శరీరైర్గతచేతసాం
క్షణేన సంవృతా భూమిర్మేఘైరివ నభస్థలం.
యుగాంతసమయే సర్వం యథా స్థావరజంగమం
కాలకీ(?)యమశేషేణ దహత్యగ్రశిఖః శిఖీ
తద్వత్ పార్థో మహారాజ దదాహసమరేరిపూన్.
తతః సర్వాస్త్రతేజోభిర్ధనుషో నిస్వనేన చ
శబ్దేనామానుషాణాం చ భూతానాంధ్వజవాసినాం
భైరవం శబ్దముత్యర్థం వానరస్య చ కుర్వతః.
దైవారిపాచ్చ బీభత్సుస్తస్మిన్ దారుణే ఘనే వనే
భయముత్పాదయామాస బలవానరిమర్దనః.
రథశక్తిమమి తానాం ప్రాగేవ నిపతద్భువి
సోఽపయాత్ సహసా పశ్చాత్ సాహసాచ్ఛా
భ్యుపేయివాన్.
శరవ్రాతైః సుతీక్ష్ణాగ్రైః సమాదిష్టైః ఖగైరివ
అర్జునస్తు ఖమావవ్రే లోహితప్రాశనైః ఖగైః.
అత్ర మధ్యే యథార్కస్య రశ్మయస్తిగ్మతేజసః
దిశాసు చ తథా రాజన్నసంఖ్యాతాః శరాస్తదా.
సకృదేవానతం శేకూ రథమభ్యసితుం పరే
అలభ్యాః పునరశ్వైస్తు రథాత్ సోఽతి ప్రసాదయేత్.
తే శరా ద్విట్ శరీరేషు యథైవ న ససజ్జిరే
ద్విడనీకేషు బీభత్సోర్న ససజ్జే రథస్తదా.
స తద్ విక్షోభయామాస వ్యారాతిబలమంజసా
అనంతభోగో భుజగః క్రీడన్నివ మహార్ణవే.
అస్యతో నిత్యమత్యర్థం సర్వానేవాతిగస్తథా
అశ్రుతః శ్రూయతే భూతైర్ధనుర్ఘోషః కిరీటినః.
సంతతాస్తత్ర మాతంగా బాణైరల్పాంతరాంతరే
సంవృతాస్తేన దృశ్యంతే మేఘా ఇవ గభస్తిభిః.
దిశోఽనుభ్రమతః సర్వాః సవ్యదక్షిణమస్యతః
సతతం దృశ్యతే యుద్ధే సాయకాసనమండలం.
పతంత్యరూపేషు యథా చక్షూంషి న కదాచన
నాలక్ష్యేషు శరాః పేతుస్తథా గాండీవధన్వనః.
మార్గో గజసహస్రస్య యుగపద్ గచ్ఛతో వనే
యథా భవేత్ తథా జజ్ఞే రథమార్గః కిరీటినః.
నూనం పార్థజయైషిత్వాచ్ఛక్రః సర్వామరైస్సహ
హంత్యస్మానిత్యమన్యంత పార్థేన నిహతాః పరే.
ఘ్నంతమత్యర్థమహితాన్ విజయం తత్ర మేనిరే
కాలమర్జునరూపేణ సంహరంతమివ ప్రజాః.
కురుసేనాశరీరాణి పార్థేనైవాహతాన్యపి
సేదుః పార్థహతానీవ పార్థకర్మానుశాసనాత్.
ఓషధీనాం శిరాంసీవద్విషాంస్ఛిన్నాణిసోఽన్వయాత్
అవనేశుః కురూణాం హి వీర్యాణ్యర్జునజాద్
భయాత్.
అర్జునానిలభిన్నాని వనాన్యర్జునవిద్విషాం
చక్రుర్లోహితధారాభిర్ధరణీం లోహితాంతరాం.

---

చేసుతున్నాడు. అర్జునుడు తన పరాక్రమాన్ని ఇంకా సాగిస్తూనే ఉన్నాడు. డెబ్భైమూడు బాణాలతో ద్రోణునీ పదింటితో దుస్సహునీ ఎనిమిదింటితో అశ్వత్థామనూ పన్నెండు బాణాలతో దుశ్శాసనునీ మూడు బాణాలతో కృపునీ అరవై బాణాలతో భీష్మునీ నూరు బాణాలతో దుర్యోధనునీ కర్ణినామక అస్త్రంతో కర్ణునీ వేధించి, కర్ణుని రథాశ్వాలనూ సారథినీ యమపురికి అతిథులుగా పంపాడు. అప్పుడు ఉత్తరుడు పరమ సంతోషంతో - మహారథుడా! ఇప్పుడు మన రథం ఎటుపోనివ్వమన్నావు అని ప్రశ్నించగా అర్జునుడు - ఉత్తరా! నీలపతాకంతో ఎర్రగుర్రాలతో అలరారే కృపాచార్యుని రథంవైపు పోనియ్యి. ఇదిగో అస్మదాదులందరికీ ఆరాధ్యుడైన ద్రోణాచార్యుడు ఆ సువర్ణమయకమండలు చిహ్నితపతాకంతో ఉన్నదే వారి రథం. దానికి

లోహితేన సమాయుక్తైః పాంసుభిః పవనోద్ధృతైః
బభూవుర్లోహితాస్తత్ర భృశమాదిత్యరశ్మయః.
సారక్తం ఖం తతస్తేనాసీత్ సంధ్యామివ లోహితం
అప్యస్తం ప్రాప్య సూర్యోఽపి నివర్తేత న పాండవః
తాన్ సర్వాన్ సమరే శూరః పౌరుషే సమవస్థితాన్
దివ్యైరస్త్రైరచింత్యాత్మా సర్వానార్ఛద్ ధనుర్ధరాన్.
స తు ద్రోణం త్రిసప్తత్యా క్షురప్రాణాం సమార్పయత్
దుఃసహం దశభిర్బాణైర్ద్రౌణిమష్టభిరేవ చ.
దుశ్శాసనం ద్వాదశభిః కృపం శారద్వతం త్రిభిః
భీష్మం శాంతనవం షష్ట్యా రాజానం చ శతేన హ
కర్ణం చ కర్ణినా కర్ణే వివ్యాధ పరవీరహా.
తస్మిన్ విద్ధే మహేష్వాసే కర్ణే సర్వాస్త్రకోవిదే
హతాశ్వసూతే విరథే తతోఽనీకమభజ్యత.
తత్ ప్రభగ్నం బలం దృష్ట్వా పార్థమాజిస్థితం పునః
అభిప్రాయం సమాజ్ఞాయ వైరాటిరిదమబ్రవీత్.
ఆస్థాయ రుచిరం జిష్ణో రథం సారథినా మయా
కతమం యాస్యసేఽనీకముక్తో యాస్యామ్యహం త్వయా.
లోహితాశ్వమరిష్టం యం వైయాఘ్రమనుపశ్యసి
నీలాం పతాకామాశ్రిత్య రథే తిష్ఠంతముత్తర.
కృపస్యైతదనీకాగ్ర్యం ప్రాపయస్వైతదేవ మాం
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం దృఢధన్వినః.
ధ్వజే కమండలుర్యస్య శాతకౌంభమయః శుభః
ఆచార్య ఏష హి ద్రోణః సర్వశస్త్రభృతాం వరః.
సదా మమైష మాన్యస్తు సర్వశస్త్రభృతామపి
సుప్రసన్నం మహావీరం కురుష్వైనం ప్రదక్షిణం.
అత్రైవ చావరోహైనమేష ధర్మః సనాతనః
యది మే ప్రథమం ద్రోణః శరీరే ప్రహరిష్యతి
తతోఽస్య ప్రహరిష్యామి నాస్య కోపో భవేదితి.
అస్యావిదూరే హి ధనుర్ధ్వజాగ్రే యస్య దృశ్యతే
ఆచార్యస్యైష పుత్రో వై అశ్వత్థామా మహారథః
సదా మమైష మాన్యస్తు సర్వశస్త్రభృతామపి
ఏతస్య త్వం రథం ప్రాప్య నివర్తేథాః పునఃపునః.
య ఏష తు రథానీకే సువర్ణకవచావృతః
సేనాగ్ర్యేణ తృతీయేన వ్యావహార్యేణ తిష్ఠతి.
యస్య నాగో ధ్వజాగ్రేఽసౌ హేమకేతనసంవృతః
ధృతరాష్ట్రాత్మజః శ్రీమానేష రాజా సుయోధనః
ఏతస్యాభిముఖం వీర రథం పరరథారుజం
ప్రాపయస్వైష రాజా హి ప్రమాథీ యుద్ధదుర్మదః.
ఏష ద్రోణస్య శిష్యాణాం శీఘ్రాస్త్రే ప్రథమో మతః
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం విపులం రణే
నాగకక్ష్యా తు రుచిరా ధ్వజాగ్రే యస్య తిష్ఠతి

---

ప్రదక్షిణంచేసి ముందుకు సాగనియ్యి. అది సనాతన యుద్ధ ధర్మం. ఇచార్య ద్రోణులు ముందుగా నాపై బాణం విడిస్తే అప్పుడు నేను విడుస్తాను. బాణ చిహ్నం కితధ్వజంతో ఉన్న రథమే అశ్వత్థామది. ఆయనకూడా మనకు పూజ్యులే· ఆ నాగ ధ్వజమే దుర్యోధనునిది. మన రథాన్ని ఇన్నిటి ముందుగానూ పోనియ్యి. శీఘ్రవేగంతో అస్త్రాలను విడిచే కళలో శిక్షణ గరపిన ద్రోణాచార్యుని ముందు ఈనాడు కౌశలం ప్రదర్శించాలి నాగకక్ష్యాంకితమైన ధ్వజాగ్రంకల రథం కర్ణునిదని నీవెరుగుదువు. వాడు నిరంతరం మనయందు స్పర్ధతోనే ఉంటాడు. నీలవర్ణశోభిత నక్షత్ర పంచకంతో అలరారే పతాకంగల రథంమీద విశాలమైన ధనుస్సుతో ఉపవిష్టుడై సూర్య ముద్రా

ఏష వైకర్తనః కర్ణో విదితః పూర్వమేవ తే.
ఏతస్య రథమాస్థాయ రాధేయస్య దురాత్మనః
యత్తో భవేథాః సంగ్రామే స్పర్ధతే హి సదా మయా.
యస్తు నీలానుసారేణ పంచతారేణ కేతునా
హస్తావాపీ బృహద్ధన్వా రథే తిష్ఠతి వీర్యవాన్.
యస్య తారార్కచిత్రోఽసౌ ధ్వజో రథవరే స్థితః
యస్యైతత్ పాండురం ఛత్రం విమలం మూర్ధ్ని తిష్ఠతి.
మహతో రథవంశస్య నానాధ్వజపతాకినః
బలాహకాగ్రే సూర్యో వా య ఏష ప్రముఖే స్థితః
హైమం చంద్రార్కసంకాశం కవచం యస్య దృశ్యతే
జాతరూపశిరస్త్రాణం మనస్తాపయతీవ మే.
ఏష శాంతనవో భీష్మః సర్వేషాం నః పితామహః
రాజశ్రియాభివృద్ధశ్చ సుయోధనవశానుగః.
పశ్చాదేష ప్రయాతవ్యో న మే విఘ్నకరో భవేత్
ఏతేన యుధ్యమానస్య యత్తః సంయచ్ఛ మే హయాన్.
తతోఽభ్యవహదవ్యగ్రో వైరాటిః సవ్యసాచినం
యత్రాతిష్ఠత్ కృపో రాజన్ యోత్స్యమానో ధనంజయం.

## ఏబది ఆఱవ అధ్యాయం

తాన్యనీకాన్యదృశ్యంత కురూణాముగ్రధన్వినాం
సంసర్పంతే యథా మేఘా ఘర్మాంతే మందమారుతాః.
అభ్యాశే వాజినస్తస్థుః సమారూఢాః ప్రహారిణః
భీమరూపాశ్చ మాతంగాస్తోమరాంకుశనోదితాః
మహామాత్రైః సమారూఢా విచిత్రకవచోజ్జ్వలాః.

---

శోభితుడై శ్వేతచ్ఛత్ర లాంఛనుడై సేనాగ్రభాగంలో మేఘమండలంముందు సూర్యునివలె ప్రకాశిస్తూ సూర్యచంద్ర ముద్రిత కవచంతో సువర్ణ శిరస్త్రాణంతో నయన మనోహరంగా గోచరించే ఆ పురుష పుంగవుడే మా పితామహుడైన భీష్ముడు. ఈయనతో యుద్ధం జరిగేటప్పుడు నీవు సావధాన చిత్తంతో గుర్రాలను నడపాలి — అనగా ఉత్తరుడు సావధానచిత్తుడై నిర్భయంగా రథాన్ని కృపాచార్యునివైపు సాగిస్తున్నాడు.

## ఏబది ఆఱవ అధ్యాయం

ఉత్తరుడు రథం కృపాచార్యునివైపు సాగిస్తున్నాడు. అదిచూసి కౌరవ వీరులందరూ వర్షప్రారంభవేళ మేఘాలవలె నెమ్మది నెమ్మదిగా అర్జునునివైపు రాసాగారు. అంకుశతోమరాద్యాయుధాలు విడువడానికి సన్నద్ధులౌతున్నారు. ఆ సంగ్రామం చూడ్డానికి దేవతాసహితుడై ఇంద్రుడూ మరుద్గణాలూ విశ్వేదేవతలూ అశ్వినీకుమారులూ యక్ష గంధర్వ నాగగణాలూ విమానచారులై విచ్చేసారు. అర్జున కృపాచార్యుల మధ్య సంగ్రామం వారందరికీ విభ్రమం కలిగిస్తోంది ఇంద్రుని విమానంమీద దేవ గంధర్వ రాక్షససర్పగణాలతోపాటు పితృమహర్షి గణాలూ వసుమాన బలాక్ష సుప్రతర్దన అష్టక శిబి యయాతి నహుష గయ మను కురు రఘు భాను సగరనలాది

తతః శక్రః సురగణైః సమారుహ్య సుదర్శనం
సహోపాయాత్ తదా రాజన్ విశ్వాశ్వి మరుతాంగణైః.
తద్ దేవయక్షగంధర్వమహోరగసమాకులం
శుశుభేఽభ్రవినిర్ముక్తం గ్రహాణామివ మండలం.
అస్త్రాణాం చ బలం తేషాం మానుషేషు ప్రయుంజతాం
తచ్చ భీమం మహద్ యుద్ధం కృపార్జునసమాగమే
ద్రష్టుమభ్యాగతా దేవాః స్వవిమానైః పృథక్ పృథక్
శతం శతసహస్రాణాం యత్ర స్థూణా హిరణ్మయీ
మణిరత్నమయీ చాన్యా ప్రాసాదం తదధారయత్
తతః కామగమం దివ్యం సర్వరత్నవిభూషితం
విమానం దేవరాజస్య శుశుభే ఖేచరం తదా.
తత్ర దేవాస్త్రయస్త్రింశత్ తిష్ఠంతి సహవాసవాః
గంధర్వా రాక్షసాః సర్పాః పితరశ్చ మహర్షిభిః.
తథా రాజా వసుమనా బలాక్షః సుప్రతర్దనః
అష్టకశ్చ శిబిశ్చైవ యయాతిర్నహుషో గయః.
మనుః పూరూ రఘుర్భానుః కృశాశ్వః సగరో నలః
విమానే దేవరాజస్య సమదృశ్యంత సుప్రభాః.
అగ్నేరీశస్య సోమస్య వరుణస్య ప్రజాపతేః
తథా ధాతుర్విధాతుశ్చ కుబేరస్య యమస్య చ.
అలంబుషోగ్రసేనానాం గంధర్వస్య చ తుంబురోః
యథామానం యథోద్దేశం విమానాని చకాశిరే
సర్వదేవనికాయాశ్చ సిద్ధాశ్చ పరమర్షయః
అర్జునస్య కురూణాంచ ద్రష్టుం యుద్ధముపాగతాః.
దివ్యానాం సర్వమాల్యానాం గంధః పుణ్యోఽథ సర్వశః
ప్రససార వసంతాగ్రే వనానామివ భారత.
తత్ర రత్నాని దేవానాం సమదృశ్యంత తిష్ఠతాం
ఆతపత్రాణి వాసాంసి స్రజశ్చ వ్యజనాని చ.
ఉపాశామ్యద్ రజో భౌమం సర్వం వ్యాప్తం మరీచిభిః
దివ్యగంధానుపాదాయ వాయుర్యోధానసేవత.
ప్రభాసితమివాకాశం చిత్రరూపమలంకృతం
సంపతద్భిః స్థితైశ్చాపి నానారత్నవిభాసితైః.
విమానైర్వివిధైశ్చిత్రైరుపానీతైః సురోత్తమైః
వజ్రభృచ్ఛుశుభే తత్ర విమానస్థైః సురైర్వృతః.
బిభ్రన్మాలాం మహాతేజాః పద్మోత్పలసమాయుతాం
విప్రేక్ష్యమాణో బహుభిర్నాతృప్యత్ సుమహాహవం.

---

రాజర్షులందరూ గోచరిస్తున్నారు. దిక్పాలకులూ గంధర్వులూ వేరువేరు విమానాలమీద విహరిస్తూంటె వసంత వికసిత సుమ సౌరభాలు వ్యాపిస్తున్నాయి.

భూమిమీద ధూళి సన్నగిల్లింది. వాయువు సుగంధాలను వీస్తోంది. దేవవిమానాలు చిత్రవిచిత్ర వర్ణాలతో ప్రకాశిస్తున్నాయి. మహాతేజశ్శాలి ఇంద్రుడు పద్మోత్పలమాలాలంకృతుడై భాసిస్తున్నాడు. అర్జునుడు సాగించే యుద్ధం ఎంతసేపు చూసినా ఇంద్రునికి తనివితీరటం లేదు.

## ఏబది ఏడవ అధ్యాయం

దృష్ట్వా వ్యూఢాన్యనీకాని కురూణాం కురునందన
తత్ర వైరాటిమామంత్ర్య పార్థో వచనమబ్రవీత్.
జాంబూనదమయీ వేదీ ధ్వజే యస్య ప్రదృశ్యతే
తస్య దక్షిణతో యాహి కృపః శారద్వతో యతః
ధనంజయవచః శ్రుత్వా వైరాటిస్త్వరితస్తతః
హయాన్ రజతసంకాశాన్
హేమభాండానచోదయత్.
ఆనుపూర్వ్యాత్ తు తత్ సర్వమాస్థాయ
జవముత్తమం
ప్రాహిణోచ్చంద్ర సంకాశాన్ కుపితానివ
తాన్ హయాన్.
స గత్వా కురుసేనాయాః సమీపం హయకోవిదః
పునరావర్తయామాస తాన్ హయాన్
వాతరంహసః.
ప్రదక్షిణముపావృత్య మండలం సవ్యమేవ చ
కురూన్ సమ్మోహయామాస మత్స్యో యానేన
తత్త్వవిత్.

కృపస్య రథమాస్థాయ వైరాటిరకుతోభయః
ప్రదక్షిణముపావృత్య తస్థౌ తస్యాగ్రతో బలీ.
తతో౽ర్జునః శంఖవరం దేవదత్తం మహారవం
ప్రదధ్మౌ బలమాస్థాయ నామ విశ్రావ్య చాత్మనః
తస్య శబ్దో మహానాసీద్ ధమ్యమానస్య జిష్ణునా
తథా వీర్యవతా సంఖ్యే పర్వతస్యేవ దీర్యతః.
పూజయాంచక్రిరే శంఖం కురవః సహసైనికాః
అర్జునేన తథా ధ్మాతః శతధా యన్న దీర్యతే.
దివమావృత్య శబ్దస్తు నివృత్తః శుశ్రువే పునః
సృష్టో మఘవతా వజ్రః ప్రపతన్నివ పర్వతే.
ఏతస్మిన్నంతరే వీరో బలవీర్యసమన్వితః
అర్జునం ప్రతి సంరబ్ధః కృపః పరమదుర్జయః.
అమృష్యమాణస్తం శబ్దం కృపః శారద్వతస్తదా
అర్జునం ప్రతి సంరబ్ధో యుద్ధార్థీ స మహారథః
మహోదధిజమాదాయ దధ్మౌ వేగేన వీర్యవాన్.
స తు శబ్దేన లోకాంస్త్రీనావృత్య రథినాం వరః
ధనురాదాయ సుమహజ్జ్యాశబ్దమకరోత్ తదా.

---

## ఏబది ఏడవ అధ్యాయం

ఉత్తరా – సువర్ణవేదికతో శోభించే పతాకం గల కృపాచార్యుని రథంవైపే మన రథం నడిపించు – అని అర్జును డనగా ఉత్తరుడు అలే నడిపిస్తున్నాడు. కురుసేనను సమీపించి ఒక్కసారిగా గుర్రాలను అదలించి సేనావ్యూహానికి ప్రదక్షిణం చేసి మండలవృత్తిలోని వామభాగంవైపు రథం సాగిస్తూంటే ప్రతిపక్షవీరులకు అది ఎవరివైపు వస్తోందో అవగాహన కాలేదు. ఉత్తరుని లక్ష్య ప్రకారం రథం కృపాచార్యుని సమీపించి నిలబడింది.

అర్జునుడు తన ప్రవర చెప్పి దేవదత్తం పూరించాడు. ఆ శంఖధ్వానానికి ప్రతిధ్వానం చేశారు కౌరవ వీరులు. బలపరాక్రమసంపన్నుడైన కృపాచార్యుడు అర్జున శంఖనాదం విని కుపితుడై ప్రతిగా తన శంఖం పూరించాడు. శరత్కాల మేఘాలవలె అర్జున కృపాచార్యు లుభయులూ

తౌ రథౌ సూర్యసంకాశౌ యోత్స్యమానౌ మహాబలౌ
శారదావివ జీమూతౌ వ్యరోచేతాం వ్యవస్థితౌ.
తతః శారద్వతస్తూర్ణం పార్థం దశభిరాశుగైః
వివ్యాధ పరవీరఘ్నం నిశితైర్మర్మభేదిభిః.
పార్థోఽపి విశ్రుతం లోకే గాండీవం పరమాయుధం
వికృష్య చిక్షేప బహూన్ నారాచాన్మర్మభేదినః
తాన్ ప్రాప్తాన్ఛితైర్బాణైర్నారాచాన్ రక్తభోజనాన్
కృపశ్చిచ్ఛేద పార్థస్య శతశోఽథ సహస్రశః.
తతః పార్థస్తు సంక్రుద్ధశ్చిత్రాన్ మార్గాన్ ప్రదర్శయన్
దిశః సంఛాదయన్ బాణైః ప్రదిశశ్చ మహారథః
ఏకచ్ఛాయమివాకాశమకరోత్ సర్వతః ప్రభుః.
ప్రాచ్ఛాదయదమేయాత్మా పార్థః శరశతైః కృపం
స శరైరర్దితః క్రుద్ధః శితైరగ్నిశిఖోపమైః.
తూర్ణం దశసహస్రేణ పార్థమప్రతిమౌజసం
అర్దయిత్వా మహాత్మానం ననర్ద సమరే కృపః.
తతః కనకపర్వాగ్ర్యైర్వీరః సంనతపర్వభిః
త్వరన్ గాండీవనిర్ముక్తైరర్జునస్తస్య వాజినః.
చతుర్భిశ్చతురస్తీక్ష్ణైరవిధ్యత్ పరమేషుభిః
తే హయా నిశితైర్బాణైర్జ్వలద్భిరివ పన్నగైః
ఉత్పేతుః సహసా సర్వే కృపః స్థానాదథాచ్యవత్
చ్యుతం తు గౌతమం స్థానాత్ సమీక్ష్య కురునందనః
నావిధ్యత్ పరవీరఘ్నో రక్షమాణోఽస్య గౌరవం
స తు లబ్ధ్వా పునః స్థానం గౌతమః సవ్యసాచినం
వివ్యాధ దశభిర్బాణైస్త్వరితః కంకపత్రిభిః.
తతః పార్థో ధనుస్తస్య భల్లేన నిశితేన హ
చిచ్ఛేదైకేన భూయశ్చ హస్తావాపమథాహరత్.
అథాస్య కవచం బాణైర్నిశితైర్మర్మభేదిభిః
వ్యధమన్న చ పార్థోఽస్య శరీరమవపీడయత్.
తస్య నిర్ముచ్యమానస్య కవచాత్ కాయ ఆబభౌ
సమయే ముచ్యమానస్య సర్పస్యేవ తనుర్యథా.
ఛిన్నే ధనుషి పార్థేన సోఽన్యదాదాయ కార్ముకం
చకార గౌతమః సజ్యం తదద్భుతమివాభవత్.

---

బాణవర్షం ప్రారంభించారు. అర్జునుడు విడిచే బాణాలను ఆచార్యుడు మార్గంలోనే ఖండిస్తున్నాడు. అర్జునుడు చిత్రవిచిత్రంగా బాణాలు విడుస్తున్నాడు. అవి ఆకాశాన్ని ఆవరించగా చీకట్లు కమ్ముకొన్నాయి. అగ్ని శిఖలవలె పీడించే కృపాచార్యునికి మరీ రోషం కలిగించాయి. అర్జునుడు నాలుగు వాడి బాణాలు విడిచి కృపుని గుర్రాలను నొప్పించాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక అవి గజిబిజి పడ్డాయి. కృపాచార్యుడు స్థానచలితుడయ్యాడు. అది గమనించి గురుగౌరవార్థం అర్జునుడు బాణాలను విడవకుండా నిలబడ్డాడు. కృపాచార్యుడు కొంత సేపటికి స్వస్థానం చేరుకుని అర్జునునిపై నిశితశరాలు విడువసాగాడు. అర్జునుడు మూడు భల్లాలతో ఆచార్యుని ధనుస్సు తుత్తునియలు చేశాడు. కవచం ఛేదించాడు. కుబుసం విడిచిన పాములా ఉన్న కృపాచార్యుడు ఉత్తరక్షణంలో మరో ధనుస్సు చేపట్టి యుద్ధోన్ముఖుడయ్యేసరికే అదికూడా పార్థబాణంతో ఛేదింపబడింది. ఈ విధంగా ఎన్నో ధనుస్సులు ఛిన్నాభిన్నమయ్యాయి. అయినా కృపుడు పట్టు వీడక మరొక ధనుస్సు చేపట్టి బల్లనామకాస్త్రాలు ప్రయోగిస్తూనే ఉన్నాడు. అర్జునుడు కుపితుడై

స తదప్యస్య కౌంతేయశ్ఛిచ్ఛేద నతపర్వణా
ఏవమన్యాని చాపాని బహూని కృతహస్తవత్
శారద్వతస్య చిచ్ఛేద పాండవః పరవీరహా.
సచ్ఛిన్నధనురాదాయ రథశక్తిం ప్రతాపవాన్
ప్రాహిణోత్ పాండుపుత్రాయ ప్రదీప్తామశనిమివ.
తామర్జునస్తదాఽఽయాంతీం శక్తిం
హేమవిభూషితాం
వియద్గతాం మహోల్కాభాం చిచ్ఛేద దశభిశ్శరైః.
సాపతద్ దశధా ఛిన్నా భూమౌ పార్థేనధీమతా
యుగపచ్చైవ భల్లైస్తు తతః సజ్యధనుః కృపః.
తమాశు నిశితైః పార్థం బిభేద దశభిః శరైః
తతః పార్థో మహాతేజా విశిఖానగ్ని తేజసః
చిక్షేప సమరే క్రుద్ధస్త్రయోదశ శిలాశితాన్.
అథాస్య యుగమేకేన చతుర్భిశ్చతురో హయాన్
షష్ఠేన చ శిరః కాయాచ్ఛరేణ రథసారథేః.

త్రిభిస్త్రివేణుం సమరే ద్వాభ్యామక్షం మహారథః
ద్వాదశేన తు భల్లేన చకర్తాస్య ధ్వజం తదా.
తతో వజ్రనికాశేన ఫాల్గునః ప్రహసన్నివ
త్రయోదశేనేంద్రసమః కృపం వక్షస్యవిధ్యత.
సచ్ఛిన్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః
గదాపాణిరవప్లుత్య తూర్ణం చిక్షేప తాం గదాం.
సా చ ముక్తా గదా గుర్వీ కృపేణ సుపరిష్కృతా
అర్జునేన శరైర్నున్నా ప్రతిమార్గమథాగమత్.
తం తు యోధాః పరీప్సంతః శారద్వతమమర్షణం
సర్వతః సమరే పార్థం శరవర్షైరవాకిరన్.
తతో విరాటస్య సుతః సవ్యమావృత్య వాజినః
యమకం మండలం కృత్వా తాన్ యోధాన్
ప్రత్యవారయత్.
తతః కృపముపాదాయ విరథం తే నరర్షభాః
అపజహ్రుర్మహావేగాః కుంతీపుత్రాద్ ధనంజయాత్

---

పదమూడు వాడి బాణాలు విడిచాడు. మరొక బాణంతో రథయుగ్యాలనూ మరొక నాలుగు బాణాలతో గుర్రాలనూ ఆరు బాణాలతో సారథిని చూర్ణంచేసి మూడు బాణాలతో వేణుదండాన్ని పన్నెండు భల్లాలతో ధ్వజాన్ని పదమూడు బాణాలతో కృపుని వక్షస్థలాన్ని ఛేదించి భేదించి వేధించి పార్థుడు నిలబడగా కృపాచార్యుడు అవిచలిత చిత్తంతో గదాధారియై అర్జునుని మీదికి రాసాగాడు. అర్జునుడు ఆ సువర్ణమయ గదాదండాన్నికూడా చూర్ణంచేశాడు. పరిస్థితి విషమించగా కౌరవ సైనికులందరూ సర్వతోముఖంగా అర్జునునిమీద సర్వవిధ ఆయుధాలూ విసువసాగారు. అది గమనించి ఉత్తరుడు మండలయమకరీతిలో రథం నడిపి సైనికుల దిగ్భ్రాంతులను చేసాడు. కౌరవ వీరులకు బాణాలు ఎటు వీద లాలో తెలియడంలేదు. రథాయుధహీనుడైన కృపాచార్యుడు రణభూమి విడిచిపెట్టాడు.

## ఏబది ఎనిమిదవ అధ్యాయం

కృపేఽపనీతే ద్రోణస్తు ప్రగృహ్య సశరం ధనుః
అభ్యద్రవదనాధృష్యః శోణాశ్వః శ్వేతవాహనం
సతు రుక్మరథం దృష్ట్వా గురుమాయాంతమంతికాత్
అర్జునో జయతాం శ్రేష్ఠ ఉత్తరం వాక్యమబ్రవీత్
యత్రైషా కాంచనీ వేదీ ధ్వజే యస్య ప్రకాశతే
ఉచ్ఛ్రితా ప్రవరే దండే పతాకాభిరలంకృతా
అత్ర మాం వహ భద్రం తే ద్రోణానీకాయ సారథే
అశ్వాః శోణాః ప్రకాశంతే
బృహంతశ్చారువాహినః
స్నిగ్ధవిద్రుమసంకాశాస్తామ్రాస్యాః ప్రియదర్శనాః
యుక్తా రథవరే యస్య సర్వశిక్షావిశారదాః.
దీర్ఘబాహుర్మహాతేజా బలరూపసమన్వితః
సర్వలోకేషు విక్రాంతో భారద్వాజః ప్రతాపవాన్
బుద్ధ్యా తుల్యో హ్యుశనసా బృహస్పతిసమో నయే
వేదాస్తథైవ చత్వారో బ్రహ్మచర్యం తథైవ చ.
ససంహారాణి సర్వాణి దివ్యాన్యస్త్రాణి మారిష
ధనుర్వేదశ్చ కార్త్స్న్యేన యస్మిన్ నిత్యం ప్రతిష్ఠితః.
క్షమా దమశ్చ సత్యం చ ఆనృశంస్యమథార్జవం
ఏతే చాన్యే చ బహవో యస్మిన్ నిత్యం ద్విజే గుణాః
తేనాహం యోద్ధుమిచ్ఛామి మహాభాగేన సంయుగే
తస్మాత్ తం ప్రాపయాచార్యం క్షిప్రముత్తర
వాహయ.

అర్జునేనైవముక్తస్తు వైరాటిర్హేమభూషణాన్
చోదయామాస తానశ్వాన్ భారద్వాజరథం ప్రతి.
తమాపతంతం వేగేన పాండవం రథినాం వరం
ద్రోణః ప్రత్యుద్యయౌ పార్థం మత్తో మత్తమివ ద్విపం.
తతః ప్రధ్మాపయచ్ఛంఖం భేరీశతనినాదినం
ప్రచుక్షుభే బలం సర్వముద్ధూయ ఇవ సాగరః.
అథ శోణాన్ సదశ్వాంస్తాన్ హంసవర్ణైర్మనోజవైః.
మిశ్రితాన్ సమరే దృష్ట్వా వ్యస్మయంత రణే నరాః.
తౌ రథౌ వీర్యసంపన్నౌ దృష్ట్వా సంగ్రామమూర్ధని
ఆచార్యశిష్యావజితౌ కృతవిద్యౌ మనస్వినౌ.
సమాశ్లిష్టౌ తదాన్యోన్యం ద్రోణపార్థౌ మహాబలౌ
దృష్ట్వా ప్రాకంపత ముహుర్భరతానాం మహద్బలం.

## ఏబది ఎనిమిదవ అధ్యాయం

అరుణవర్ణశోభితాశ్వసజ్జిత రథారూఢుడై విహరించే ద్రోణాచార్యులు రంగభూమిలో అడుగు పెట్టాడు. అదిచూసి అర్జునుడు ఉత్తరుని వైపు తిరిగి – సారథీ – నీకు సుభమగుగాక. ఆ హేమవేదికతో అలరారే పతాకంగల రథంవైపు పోనియ్యి. అక్కడే మహాతేజస్సంపన్నుడూ బల పరాక్రమోపేతుడూ శుక్రసమధీమంతుడూ బృహస్పతిసదృశ నీతిశాస్త్రజ్ఞుడూ వేదవేదాంగ విదుడూ విద్యాస్త్రసంపన్నుడూ ఐన ద్రోణాచార్యులు ఉన్నారు. ఆయన క్షమాశీలుడు. సరళ కోమల సత్యస్వభావుడు. జితేంద్రియుడు. పూజ్యుడైన గురుపాదునితో యుద్ధం చెయ్యాలని నాకు కుతూహలంగా ఉంది. మన రథం శీఘ్రంగా పోనియ్యి – అని ఆదేశించగా ఉత్తరుడు మరు క్షణంలో రథాన్ని ద్రోణసమక్షంలో నిలబెట్టాడు.

నూరు భేరీలు మ్రోగుతున్నట్లు ద్రోణుడు శంఖం పూరించాడు. అర్జున ద్రోణుల మధ్య పోరు ప్రారంభమైంది. కురువీరులందరూ ఆశ్చర్యచకితులై తిలకిస్తున్నారు. గురుశిష్యులుభయులూ భయానకసంగ్రామం సాగిస్తూంటే సైనికులు

హర్షయుక్తస్తతః పార్థః ప్రహసన్నివ వీర్యవాన్
రథం రథేన ద్రోణస్య సమాసాద్య మహారథః.
అభివాద్య మహాబాహుః సామపూర్వమిదం వచః
ఉవాచ శ్లక్ష్ణయా వాచా కౌంతేయః పరవీరహా.
ఉషితాః స్మో వనే వాసం ప్రతికర్మ చికీర్షవః
కోపం నార్హసి నః కర్తుం సదా సమరదుర్జయ.
అహంతు ప్రహృతే పూర్వం ప్రహరిష్యామి తేఽనఘ
ఇతి మే వర్తతే బుద్ధిస్తద్ భవాన్ కర్తుమర్హతి.
తతోఽస్మై ప్రాహిణోద్ ద్రోణఃశరానధికవింశతిం
అప్రాప్తాంశ్చైవ తాన్ పార్థశ్చిచ్ఛేద కృతహస్తవత్
తతః శరసహస్రేణ రథం పార్థస్య వీర్యవాన్
అవాకిరత్ తతో ద్రోణః శీఘ్రమస్త్రం విదర్శయన్
హయాంశ్చ రజతప్రఖ్యాన్ కంకపత్రైః శిలాశితైః
అవాకిరదమేయాత్మా పార్థం సంకోపయన్నివ.
ఏవం ప్రవవృతే యుద్ధం భారద్వాజకిరీటినోః
సమం విముంచతోః సంఖ్యే విశిఖాన్ దీప్తతేజసః.
తావుభౌ ఖ్యాతకర్మాణావుభౌ వాయుసమౌ జవే
ఉభౌ దివ్యాస్త్రవిదుషావుభావుత్తమతేజసౌ
క్షిపంతౌ శరజాలాని మోహయామాసతుర్నృపాన్.
వ్యస్మయంత తతో యోధా యే తత్రాసన్ సమాగతాః
శరాన్ విసృజతోస్తూర్ణం సాధు సాధ్విత్యపూజయన్
ద్రోణం హి సమరే కోఽన్యో యోద్ధుమర్హతి ఫాల్గునాత్
రౌద్రః క్షత్రియధర్మోఽయం గురుణా యదయుధ్యత
ఇత్యబ్రువన్ జనాస్తత్ర సంగ్రామశిరసి స్థితాః.
వీరౌ తావభిసంరబ్ధౌ సంనికృష్టౌ మహాభుజౌ
ఛాదయేతాం శరవ్రాతైరన్యోన్యమపరాజితౌ.
విస్ఫార్య సుమహచ్చాపం హేమపృష్ఠం దురాసదం
భారద్వాజోఽథ సంక్రుద్ధః ఫాల్గునం ప్రత్యయుధ్యత.
స సాయకమయైర్జాలైరర్జునస్య రథం ప్రతి
భానుమద్భిః శిలాధౌతైర్భానోరాచ్ఛాదయత్ ప్రభాం.
పార్థం చ సుమహాబాహుర్మహావేగైర్మహారథః
వివ్యాధ నిశితైర్బాణైర్మేఘో వృష్ట్యేవ పర్వతం.
తథైవ దివ్యం గాండీవం ధనురాదాయ పాండవః
శత్రుఘ్నం వేగవాన్ హృష్టో భారసాధనముత్తమం
విససర్జ శరాంశ్చిత్రాన్ సువర్ణవికృతాన్ బహూన్

---

భయభీత చిత్తులై నిలబడ్డారు. అర్జునుడు తన రథాన్ని ద్రోణునికి ప్రదక్షిణంగా త్రిప్పి నమస్కరించి శాంత వదనంతో – ఆచార్యా – రణ భూమిలో మిమ్ము జయించడం సామాన్యవిషయం గాదు. చిరకాలం వనవాసంచేసి ప్రతీకారదృష్టితో ఈనాడువచ్చాను. మీరు మాపై ఆగ్రహించడం ఉచితం కాదు. నేను మీపై బాణం విడవడానికి ముందు మీరు నాపై బాణం విడవాలి. అప్పుడుకాని నేను మిమ్మెదిరించను – అని మృదువుగా అన్నాడు.

ద్రోణుడు ఇరవై బాణాలు విడిచాడు. ధనుష్కళా పండితుడైన అర్జునుడు మార్గ మధ్యంలోనే వాటిని ఖండించగా ద్రోణుడు పుంఖానుపుంఖంగా బాణాలు వదలడం మొదలు పెట్టాడు. గురుశిష్యులిద్దరూ తేజోమయ బాణవర్షం కురిపిస్తున్నారు. ఆ దృశ్యాన్ని తిలకిస్తూ సైనికులందరూ అభినందనగీతా లాలాపింప సాగారు. ఈ క్షత్రియధర్మం ఎంత విచిత్రమైనది. గురుశిష్య బాంధవ్యాన్ని గూడా పరిగణింపనివ్వదుగదా – అని కొందరంటూంటే ద్రోణాచార్యునితో అర్జునుడువినా సంగ్రామరంగంలో నిలబడగలవాడెవ్వడు. అని కొందరు ప్రశంసిస్తున్నారు. ఆషాఢ

నాశయన్ శరవర్షాణి భారద్వాజస్య వీర్యవాన్
తూర్ణం చాపవినిర్ముక్తైస్తదద్భుతమివాభవత్.
స రథేన చరన్ పార్థః ప్రేక్షణీయో ధనంజయః
యుగపద్ దిక్షు సర్వాసు సర్వతోఽస్త్రాణ్య
దర్శయత్.
ఏకచ్ఛాయమివాకాశం బాణైశ్చక్రే సమంతతః
నాదృశ్యత తదా ద్రోణో నీహారేణేవ సంవృతః.
తస్యాభవత్ తదా రూపం సంవృతస్య శరోత్తమైః
జాజ్వల్యమానస్య తదా పర్వతస్యేవ సర్వతః.
దృష్ట్వా తు పార్థస్య రణే శరైః స్వరథమావృతం
స విస్ఫార్య ధనుః శ్రేష్ఠం మేఘస్తనితనిస్వనం
అగ్నిచక్రోపమం ఘోరం వ్యకర్షత్ పరమాయుధం
వ్యశాతయచ్ఛరాంస్తాంస్తు ద్రోణః సమితిశోభనః.
మహానభూత్ తతః శబ్దో వంశానామివ దహ్యతాం
జాంబూనదమయైః పుంఖైశ్చిత్రచాపవినిర్గతైః
ప్రాచ్ఛాదయదమేయాత్మా దిశః సూర్యస్య చ ప్రభాం
తతః కనకపుంఖానాం శరాణాం నతపర్వణాం
వియచ్చరాణాం వియతి దృశ్యంతే బహవో వ్రజాః
ద్రోణస్య పుంఖసక్తాశ్చ ప్రభవంతః శరాసనాత్
ఏకో దీర్ఘ ఇవాదృశ్యదాకాశే సంహతః శరః.
ఏవం తౌ స్వర్ణవికృతాన్ విముంచంతౌ మహాశరాన్
ఆకాశం సంవృతం వీరావుల్కాభిరివ చక్రతుః.
శరాస్తయోస్తు విబభుః కంకబర్హిణవాససః
పంక్త్యః శరదిస్వస్థానాం హంసానాంచరితామివ.
యుద్ధం సమభవత్ తత్ర సుసంరబ్ధం మహాత్మనోః
ద్రోణపాండవయోర్ఘోరం వృత్రవాసవయోరివ.
తే గజావివ చాసాద్య విషాణాగ్రైః పరస్పరం
శరైః పూర్ణాయతోత్సృష్టైరన్యోన్యమభిజఘ్నతుః
తౌ వ్యవాహరతాం యుద్ధే సంరబ్ధౌ రణశోభినౌ
ఉదీరయంతౌ సమరే దివ్యాన్యస్త్రాణి భాగశః.
అథ త్వాచార్యముఖ్యేన శరాన్ సృష్టాన్ శిలాశితాన్
న్యవారయచ్ఛితైర్బాణైరర్జునో జయతాం వరః.
దర్శయన్ వీక్షమాణానామస్త్రముగ్రపరాక్రమః
ఇషుభిస్తూర్ణమాకాశం బహుభిశ్చ సమావృణోత్

---

మేఘాలు పర్వత శిఖరాలపై వర్షించేటట్లు ద్రోణుని బాణాలు అర్జునుని రథంమీదకు ప్రవహిస్తున్నాయి. గాండీవి చిత్రాతిచిత్ర బాణాలతో ద్రోణుని శరవర్షాన్ని నిరోధిస్తున్నాడు. అర్జున బాణవర్షతుషారంలో ద్రోణుడదృశ్యుడయ్యాడు. అప్పుడు ద్రోణుని దేహం ప్రజ్వలిస్తూన్న పర్వతంలా ఉంది ద్రోణుడు మేఘ గర్జనలు చేసే అగ్ని చక్ర సదృశమైన భయంకరాయుధాన్ని విడిచాడు. మండుతూన్న వెదురు డొంకల భయంకర శబ్దాలతో అది బయలుదేరింది. ద్రోణుని బాణాలు ఆకాశాన్ని ప్రకాశవంతం చేస్తున్నాయి. అవన్నీ వినువీధిలో ఏక బాణంగా గోచరిస్తున్నాయి. గురుశిష్యులు విడిచే సువర్ణ భూషిత బాణాలు ఆకాశంలో చరిస్తూంటే ఉల్కలవలె గోచరిస్తున్నాయి శరత్కాలంలో విహరించే రాజహంసలవలె అవి కనపడుతున్నాయి. ఆచార్య ద్రోణుని ఆగ్రహం ఇనుమడించింది. వారి మధ్య యుద్ధం ఇంద్ర వృత్రాసుర యుద్ధం వలె భయంకర రూపం దాల్చింది. దివ్యాస్త్రాలు నడుస్తున్నాయి. ధర్మబద్ధంగా పోరు సాగుతోంది ఉభయులూ అస్త్రవిద్యా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. పరస్పర మారణోద్యుక్తులై గోచరిస్తూన్న అర్జునునిలో గురుభావమూ ద్రోణునిలో శిష్యవాత్సల్యమూ ఒకమూల మసలుతూనే ఉన్నాయి. క్రోధోద్రిక్తులై దేవదానవసంగ్రామం తలపుకు వచ్చేటట్లు పోరాడుతున్నారు. ద్రోణుడు

జఘానసంతం నరవ్యాఘ్రమర్జునం తిగ్మతేజసం
ఆచార్యముఖ్యః సమరే ద్రోణః శస్త్రభృతాంవరః
అర్జునేన సహాక్రీడచ్ఛరైః సంనతపర్వభిః.
దివ్యాన్యస్త్రాణి వర్షంతం తస్మిన్ వై తుములే రణే
అస్త్రైరస్త్రాణి సంవార్య ఫాల్గునం సమయోధయత్
తయోరాసీత్ సంప్రహారః
క్రుద్ధయోర్నరసింహయోః
అమర్షిణోస్తదాన్యోన్యం దేవదానవయోరివ.
ఐంద్రం వాయవ్యమాగ్నేయమస్త్రమస్త్రేణ
పాండవః
ద్రోణేన ముక్తమాత్రం తు గ్రసతి స్మ పునః పునః.
ఏవంశూరౌ మహేష్వాసౌ విసృజంతౌశితాన్ఛరాన్
ఏకచ్ఛాయం చక్రతుస్తావాకాశం శరవృష్టిభిః.
తత్రార్జునేన ముక్తానాం పతతాం వై శరీరిషు
పర్వతేష్వివ వజ్రాణాం శరాణాం శ్రూయతేస్వనః
తతో నాగా రథాశ్చైవ వాజినశ్చ విశాంపతే
శోణితాక్తా వ్యదృశ్యంత పుష్పితా ఇవ కింశుకాః.
బాహుభిశ్చ సకేయూరైర్విచిత్రైశ్చ మహారథైః
సువర్ణచిత్రైః కవచైర్ధ్వజైశ్చ వినిపాతితైః.
యోధైశ్చ నిహతైస్తత్ర పార్థబాణప్రపీడితైః.
బలమాసీత్ సముద్భ్రాంతం ద్రోణార్జునసమాగమే
విధున్వానౌ తు తౌ తత్ర ధనుషీ భారసాధనే
ఆచ్ఛాదయేతామన్యోన్యం తతక్షతురథేషుభిః.
తయోః సమభవద్ యుద్ధం తుములం భరతర్షభ
ద్రోణకౌంతేయయోస్తత్ర బలివాసవయోరివ.
అథ పూర్ణాయతోత్సృష్టైః శరైః సంనతపర్వభిః
వ్యదారయేతామన్యోన్యం ప్రాణద్యూతే ప్రవర్తితే
అథాంతరిక్షే నాదోఽభూద్ ద్రోణం తత్ర
ప్రశంసతాం
దుష్కరం కృతవాన్ ద్రోణో
యదర్జునమయోధయత్.
ప్రమాథినం మహావీర్యం దృఢముష్టిం దురాసదం
జేతారం దేవదైత్యానాం సర్వేషాంచమహారథం
అవిభ్రమంచ శిక్షాంచ లాఘవం దూరపాతితాం
పార్థస్య సమరేదృష్ట్వా ద్రోణస్యాభూచ్చవిస్మయః.
అథ గాండీవముద్యమ్య దివ్యం ధనురమర్షణః
విచకర్ష రణే పార్థో బాహుభ్యాం భరతర్షభ.

---

విడిచే ఇంద్ర, వాయవ్య, ఆగ్నేయాస్త్రాలను అర్జునుడు ప్రత్యస్త్రాలతో ఛేదిస్తున్నాడు. ఆకాశమంతా శరబంధురమైంది. పర్వతాలమీద వజ్రఘాతాలవలె కురుసైనికులమీద అర్జునుని బాణాలుపడి బాధిస్తున్నాయి. రథికులూ గజాశ్వబలాలవారూ ఆ బాణఘాతాలతో శరీరాలు తూట్లుపడగా వికసిత పలాశవృక్షాలవలె భాసిస్తున్నారు.

ఆ యుద్ధంలో అర్జునుని హస్తాలలో ఎందరో మహావీరులు నేల గూలారు. రథికులు భూమిమీద పడ్డారు. మరెందరో వేషభూషాలంకారశూన్యులయ్యారు. ద్రోణార్జునుల మధ్య పోరు తీవ్రంగా సాగుతూనే ఉంది. ఆకర్ణాంతం ఎక్కుపెట్టిన ధనుస్సులనుండి బాణాలు నిరంతరం వెలువడుతూనే ఉన్నాయి. గగనవీథుల్లో చరిస్తూ ఆ అద్భుతాన్ని తిలకించే అమర వీరులు ద్రోణాచార్యుని అభినందిస్తూ తమలో తామలాభాషించుకొంటున్నారు.

ఈ ద్రోణాచార్యుడు ఇంతవరకూ అర్జునునితో పోరాడుతూ నిలబడేఉన్నాడు. ఇది సామాన్య

తస్య బాణమయం వర్షం శలభానామివాయతిం
దృష్ట్వా తే విస్మితాః సర్వే సాధుసాధ్విత్యపూజయన్.
న చ బాణాంతరే వాయురస్య శక్నోతి సర్పితుం
అనిశం సందధానస్య శరానుత్సృజత స్తథా.
దదర్శ నాంతరం కశ్చిత్ పార్థస్యాదదతోఽపి చ
తథా శీఘ్రాస్త్రయుద్ధే తు వర్తమానే సుదారుణే
శీఘ్రం శీఘ్రతరం పార్థః శరానన్యానుదీరయత్.
తతః శతసహస్రాణి శరాణాం నతపర్వణాం
యుగపత్ ప్రాపతం స్తత్ర ద్రోణస్య రథమంతికాత్
కీర్యమాణే తదా ద్రోణే శరైర్గాండీవ ధన్వనా
హాహాకారో మహానాసీత్ సైన్యానాంభరతర్షభ.
పాండవస్య తు శీఘ్రాస్త్రం మఘవా ప్రత్యపూజయత్
గంధర్వాప్సరసశ్చైవ యే చ తత్ర సమాగతాః
తతో వృందేన మహతా రథానాం రథయూథపః
ఆచార్యపుత్రః సహసా పాండవం పర్యవారయత్
అశ్వత్థామా తు తత్ కర్మ హృదయేన మహాత్మనః
పూజయామాస పార్థస్య కోపం చాస్యాకరోద్ భృశం.
స మన్యువశమాపన్నః పార్థమభ్యద్రవద్ రణే
కిరన్ఛరసహస్రాణి పర్జన్య ఇవ వృష్టిమాన్.
ఆవృత్య తు మహాబాహుర్యతో ద్రౌణి స్తతో హయాన్
అంతరం ప్రదదౌ పార్థో ద్రోణస్య వ్యపసర్పితుం.
స తు లబ్ధ్వాంతరం తూర్ణమపాయాజ్జవనైర్హయైః
ఛిన్నవర్మధ్వజః శూరో నికృత్తః పరమేషుభిః.

---

విషయంగాదు. సర్వశత్రు సంహార సమర్థుడైన అర్జునుని పరాక్రమం చూస్తూంటే ఈ వీరు డొక్కడే దేవదానవులను హరించగలడేమో ననిపిస్తోంది.

ఆనాడు అస్త్రశస్త్రవిద్యాలాఘవంతో అర్జునుడు సాగించే సమరం ద్రోణునికే ఆశ్చర్యం కలిగించింది. కొంతసేపు ఏకహస్తుడై పోరాడి రెండు చేతులతోనూ బాణప్రయోగం చెయ్యసాగాడు. మిడతలదండులా గాండీవంనుండి బాణాలు వెడువడుతూంటే మహారథికులందరూ అర్జునుని హస్తలాఘవం ప్రశంసించసాగారు. నిర్విరామంగా విడిచే ఆ బాణాల సందులనుండి వాయువు కూడా ప్రవేశించలేకపోతోంది. ఒక్క క్షణంలో లక్ష బాణాలు ద్రోణరథంపైకి వచ్చాయి. కౌరవ సైనికు లందరూ హాహారవాలు చేశారు. ఆ సన్నివేశం ఇంద్రాదు లందరికీ సంతోషజనకమైంది.

అంతలో అశ్వత్థామ రథసేనా సమూహంతో అర్జునుని చుట్టుముట్టాడు. పరిపరివిధాల పార్థుని అభినందిస్తూ క్రోధవశీభూతుడై శ్రావణ మేఘాలవలె బాణవర్షం అర్జునునిపై కురిపించసాగాడు. ద్రోణునకి అవకాశమిస్తూ అర్జునుడు అశ్వత్థామవైపు తిరిగాడు. కవచధ్వజ రహితుడైన ద్రోణుడు ఆ అవకాశంలో రథం వెనుకకు మళ్ళించాడు.

## ఏబది తొమ్మిదవ అధ్యాయం

తతో ద్రోణిర్మహారాజ ప్రయయావర్జునం రణే
తం పార్థః ప్రతిజగ్రాహ వాయువేగమివోద్ధతం.
శరజాలేన మహతా వర్షమాణమివాంబుదం
తయోర్దేవాసురసమః సంనిపాతో మహానభూత్
కిరతోః శరజాలాని వృత్రవాసవయోరివ.
న స్మ సూర్యస్తదా భాతి న చ వాతి సమీరణః
శరజాలావృతే వ్యోమ్ని ఛాయాభూతే సమంతతః
మహాంశ్చటచటాశబ్దో యోధయోర్హన్యమానయోః
దహ్యతామివ వేణూనామాసీత్ పరపురంజయ.
హయానస్యార్జునః సర్వాన్ కృతవానల్పజీవితాన్
తే రాజన్ న ప్రజానంతదిశం కాంచనమోహితాః.
తతో ద్రోణిర్మహావీర్యః పార్థస్య విచరిష్యతః
వివరం సూక్ష్మమాలోక్య జ్యాం చిచ్ఛేద క్షురేణ హ
తదస్యాపూజయన్ దేవాః కర్మ దృష్ట్వాతిమానుషం.
ద్రోణో భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చైవ మహారథాః
సాధు సాధ్వితి భాషంతోఽపూజయన్ కర్మ తస్య తత్.
తతో ద్రోణిర్ధనుః శ్రేష్ఠమపకృష్య రథర్షభం
పునరేవాహనత్ పార్థం హృదయే కంకపత్రిభిః.
తతః పార్థో మహాబాహుః ప్రహస్య స్వనవత్ తదా
యోజయామాస నవయా మౌర్వ్యా గాండీవమోజసా.
తతోఽర్ధచంద్రమావృత్య తేన పార్థః సమాగమత్
వారణేనేవ మత్తేన మత్తో వారణయూథపః.

---

## ఏబది తొమ్మిదవ అధ్యాయం

రంగభూమిలో అశ్వత్థామ విహరిస్తూంటే అర్జునుడు ప్రవేశించి శరవర్షంతో సమాధానమిస్తున్నాడు. ఉభయులూ వర్షధారలవలె తీవ్రశరాలు విడుస్తున్నారు. దేవాసుర సంగ్రామ సదృశంగా వారు పోరుతున్నారు. ఇంద్ర వృత్రాసుర సంగ్రామోపమంగా వారి మధ్య పోరు సాగుతోంది. ఆ బాణాలతో గగనవీధి నిండిపోయి సూర్యకాంతికీ వాయు ప్రసారానికీ తావు లేకుండా పోయింది. వెదుళ్ళు బద్దలౌతూన్నట్లు చిటపట ధ్వనులు రేగుతున్నాయి. అశ్వత్థామయొక్క రథాశ్వాలను అర్జునుడు సమ్మోహింప చేయడంతో అవి దిక్కులు తోచక నిలబడిపోయాయి. మరొకవంక అర్జునుడు చూస్తూండగా అశ్వత్థామ క్షురనామకాస్త్రంతో అర్జునుని నారి ఛేదించాడు. ఆ అద్భుతకార్యం చూసి దేవతలు పరిపరి విధాల అభినందించారు. భీష్మ ద్రోణ కృప కర్ణాదులు కూడా అశ్వత్థామయొక్క కౌశలాన్ని ప్రశంసించారు. ఆ ఉత్సాహంతో అశ్వత్థామ అర్జునుని వక్షస్థలంమీదికి వాడి నారాచాలు విడువగా అర్జునుడు నవ్వుతూ గాండీవానికి మరొకనారిని సంధించి వాటిని మార్గంలో ఖండించాడు. బాణాలు ప్రయోగించడంలో ఆకర్ణాంతం ఆకర్షించడంవల్ల గాండీవం అర్ధచంద్రాకృతి పొందుతోంది. కౌరవ సైనికులు విస్మయ చకితులై చూస్తూనే ఉన్నారు. మత్తేభాలవలె ఘోర

తతః ప్రవవృతే యుద్ధం పృథివ్యామేకవీరయోః
రణమధ్యే ద్వయోరేవం సుమహల్లోమహర్షణం.
తౌ వీరౌ దదృశుః సర్వే కురవో విస్మయాన్వితాః
యుధ్యమానౌ మహావీర్యౌ యూథపావివ సంగతౌ.
తౌ సమాజఘ్నతుర్వీరావన్యోన్యం పురుషర్షభౌ
శరైరాశీవిషాకారైర్జ్వలద్భిరివ పన్నగైః.
అక్షయ్యావిషుధీ దివ్యౌ పాండవస్య మహాత్మనః
తేన పార్థో రణే శూరస్తస్థౌ గిరిరివాచలః.
అశ్వత్థామ్నః పునర్బాణాః క్షిప్రమభ్యస్యతో రణే
జగ్ముః పరిక్షయం శీఘ్రమభూత్ తేనాధికోఽర్జునః.
తతః కర్ణో మహచ్చాపం వికృష్యాభ్యధికం తదా
అవాక్షిపత్ తతః శబ్దో హాహాకారో మహానభూత్.
తతశ్చక్షుర్దధే పార్థో యత్ర విస్ఫార్యతే ధనుః
దదర్శ తత్ర రాధేయం తస్య కోపో వ్యవర్ధత
స రోషవశమాపన్నః కర్ణమేవ జిఘాంసయా
తమైక్షత వివృత్తాభ్యాం నేత్రాభ్యాం కురుపుంగవః.
తథా తు విముఖే పార్థే ద్రోణపుత్రస్య సాయకాన్
త్వరితాః పురుషా రాజన్నుపాజహ్రుః సహస్రశః
ఉత్సృజ్య చ మహాబాహుర్ద్రోణపుత్రం ధనంజయః
అభిదుద్రావ సహసా కర్ణమేవ సపత్నజిత్
తమభిద్రుత్య కౌంతేయః క్రోధసంరక్తలోచనః
కామయన్ ద్వైరథం తేన యుద్ధం వచనమబ్రవీత్.

---

## అరువదియవ అధ్యాయం

కర్ణ యత్ తే సభామధ్యే బహు వాచా వికత్థితం
న మే యుధి సమోఽస్తీతి తదిదం సముపస్థితం.
సోఽద్య కర్ణ మయా సార్ధం వ్యవహృత్య మహామృధే
జ్ఞాస్యస్యబలమాత్మానం న చాన్యానవమంస్యసే.
అవోచః పరుషా వాచో ధర్మముత్సృజ్య కేవలం
ఇదం తు దుష్కరం మన్యే యదిదం తే చికీర్షితం.
యత్ త్వయా కథితం పూర్వం మామనాసాద్య కించన
తదద్య కురు రాధేయ కురుమధ్యే మయా సహ.

---

నాగాలవలె అశ్వత్థామార్జునులు పోరు సాగిస్తూనే ఉన్నారు.

అర్జునుని బాణాసనంలో అక్షయతూణీర ద్వయం ఉండడంవల్ల అవిచలచిత్తుడై నిలబడ్డాడు. అశ్వత్థామ బాణాసనంలో శరాలు నిండుకున్నాయి ఆ సమయానికి కర్ణుడు ధనుష్టంకారం చేస్తూ వస్తున్నాడు ఆ శబ్దం వచ్చేవైపు దృష్టిసారించి అర్జునుడు కుపితుడై చూసి దృష్టి మరలించేసరికి అశ్వత్థామ రథంలో బాణసహస్రం చేరింది. అశ్వత్థామను అక్కడే విడిచి కౌంతేయుడు కర్ణునివైపే నడిచాడు కర్ణునివైపు వచ్చే సవ్యసాచి కళ్లలో విస్ఫులింగాలు మెరుస్తున్నాయి

---

## అరువదియవ అధ్యాయం

కర్ణార్జునులు:

కర్ణా - కురుసభాభవనంలో ఆనాడు నువ్వు ఆత్మప్రశంస చేసుకుంటూ సమరభూమిలో నీతో సమంగా పోరాడగల వీరుడు లేడన్నావే ? ఆ విషయం ఋజువు కావలసిన అవసరం ఇప్పుడు వచ్చింది. ఈసంగ్రామంలో నీ శక్తిదౌర్బల్యాన్ని గుర్తింపచేసి ఇక ముందెన్నడూ ఇటువంటి ప్రసంగాలకు అవకాశం లేకుండా చేస్తాను ధర్మ

యత్ సభాయాం స పాంచాలీం క్లిశ్యమానాం దురాత్మభిః
దృష్టవానసి తస్యాద్య ఫలమాప్నుహి కేవలం.

ధర్మపాశనిబద్ధేన యన్మయా మర్షితం పురా
తస్య రాధేయ కోపస్య విజయం పశ్య మే మృధే.

వనే ద్వాదశ వర్షాణి యాని సోఢాని దుర్మతే
తస్యాద్య ప్రతికోపస్య ఫలం ప్రాప్నుహి సంప్రతి.

ఏహి కర్ణ మయా సార్ధం ప్రతియుధ్యస్వ సంగరే
ప్రేక్షకాః కురవః సర్వే భవంతు తవ సైనికాః.

బ్రవీషి వాచా యత్ పార్థ కర్మణాతత్ సమాచర
అతిశేతే హి తే వాక్యం కర్మైతత్ ప్రథితంభువి.

యత్ త్వయా మర్షితంపూర్వంతదశక్తేనమర్షితం
ఇతో గృహ్ణీము హే పార్థ తవ దృష్ట్వాపరాక్రమం.

ధర్మపాశనిబద్ధేన యత్ త్వయా మర్షితం పురా
తథైవ బద్ధమాత్మానమబద్ధమివ మన్యసే

యది తావద్ వనే వాసో యథోక్తశ్చరిత స్త్వయా
తత్ త్వం ధర్మార్థవిత్ క్లిష్టః స మయా యోద్ధుమిచ్ఛసి.

యది శక్రః స్వయం పార్థ యుధ్యతే తవ కారణాత్
తథాపి న వ్యథా కాచిన్మ మస్యాద్ విక్రమిష్యతః.

అయం కౌంతేయ కామస్తే నచిరాత్ సముపస్థితః
యోత్స్యసే హి మయాసార్ధమద్యద్రక్ష్యసి మేబలం

ఇదానీమేవ తావత్ త్వమపయాతో రణాన్మమ
తేన జీవసి రాధేయ నిహత స్త్వనుజ స్తవ.

భ్రాతరం ఘాతయిత్వా క స్త్యక్త్వా రణశిరశ్చ కః
త్వదన్యఃకఃపుమాన్ సత్సు బ్రూయా దేవం వ్యవస్థితః

భంగం వాటిల్లే రీతిగా అనుచిత ప్రసంగాలు ఎన్నో చేశావు కాని ఆలా ప్రసంగించే అకార్యం నేను చెయ్యలేను నీ ప్రసంగాలు వాల్లుపోకుండా ఉండాలంటే ఈనాడు నాతో పోరి నీమాట నిలబెట్టుకో సభాభవనంలో పాంచాలరాజపుత్రిని అవమానిస్తూంటే చూస్తూ ఊరుకున్న దానికి ఫలాన్ని ఇప్పుడు అనుభవిస్తారు. ధర్మబద్ధులమై ఆనాడు వాటిని సహించవలసి వచ్చింది. నీ పాప ఫలం నా విజయ రూపంలో ప్రకటిస్తున్నాను. పన్నెండు సంవత్సరాల అరణ్యవాస క్లేశానికి ప్రతీకారం తీసుకునే అవకాశం చిక్కినప్పుడు నువ్వు నా ముందుకు వచ్చావు మన సంగ్రామాన్ని నీ సేనాసమూహంతోపాటు కురువీరులు కూడా తిలకిస్తారు - అని అర్జునుడు పరిహాసక్రోధ పూర్వకంగా పలకగా కర్ణుడు సమాధాన మిస్తున్నాడు.

కౌంతేయా-వ్యర్థ ప్రసంగాలవల్ల ప్రయోజనం లేదు. నీ శక్తిని ప్రదర్శించు సమయ మిది ఇది వరలో మీరు సహించిన క్లేశాలకు కారణం అసమర్థతగానే మేం భావించాము నువ్వు అన్నట్లు ధర్మపథ బంధితులై మీరు ఈ క్లేశాలను సహించినట్లైతే ఇప్పుడూ ఆలానే ఉండవలసింది. కాని నువ్వు ధర్మపాశ విముక్తుడవై వచ్చావు మీ నియమానుసారం మీరు వనవాసం పూర్తి చేశారు. ఇప్పుడు ఆ స్మృతికాలంలో నాతో యుద్ధానికి వస్తున్నావు ఇప్పుడు నీతో ఇంద్రుడు వచ్చినా నాముందు నిలబడలేడు. నేటివరకూ నా బల పరాక్రమాలను ప్రదర్శించే అవకాశం లభించలేదు. ఇప్పుడది ప్రత్యక్షంగా చూస్తావు కాని-అని కర్ణుడు సమాధానమివ్వగా - రాధేయా నువ్వు నా చేతులనుండి వెలువడే బాణాలకు తట్టుకోలేక వెనుదిరిగిపోయి కొన్ని క్షణాలుకూడా అవ

ఇతి కర్ణం బ్రువన్నేవ బీభత్సురపరాజితః
అభ్యయాద్ విసృజన్ బాణాన్ కాయావరణభేదినః
ప్రతిజగ్రాహ తం కర్ణః ప్రీయమాణో మహారథః
మహతా శరవర్షేణ వర్షమాణమివాంబుదం.
ఉత్పేతుః శరజాలాని ఘోరరూపాణి సర్వశః
అవిధ్యదశ్వాన్ బాహ్వోశ్చ హస్తావాపం
పృథక్ పృథక్.
సోఽమృష్యమాణః కర్ణస్య నిషంగస్యావలంబనం
చిచ్ఛేద నిశితాగ్రేణ శరేణ నతపర్వణా.
ఉపసంగాదుపాదాయ కర్ణో బాణానథాపరాన్
వివ్యాధ పాండవం హస్తే తస్య ముష్టిరశీర్యత.
తతః పార్థో మహాబాహుః కర్ణస్య ధనురచ్ఛినత్
స శక్తిం ప్రాహిణోత్ తస్మై తాం పార్థో వ్యధమచ్ఛరైః
తతోఽనుపేతుర్బహవో రాధేయస్య పదానుగాః
తాంశ్చ గాండీవనిర్ముక్తైః ప్రాహిణోద్ యమసాదనం
తతోఽస్యాశ్వాన్ శరైస్తీక్ష్ణైర్బీభత్సుర్భారసాధనైః
ఆకర్ణముక్తైరవధీత్ తే హతాః ప్రాపతన్ భువి.
అథాపరేణ బాణేన జ్వలితేన మహౌజసా
వివ్యాధ కర్ణం కౌంతేయస్తీక్ష్ణేనోరసి వీర్యవాన్.
తస్య భిత్త్వా తనుత్రాణం కాయమభ్యగమచ్ఛరః
తతః స తమసాఽఽవిష్టో న స్మ కించిత్ ప్రజజ్ఞివాన్
స గాఢవేదనో హిత్వా రణం ప్రాయాదుదఙ్ముఖః
తతోఽర్జున ఉదక్రోశదుత్తరశ్చ మహారథః.

---

లేదు. అలా తిరిగి వెళ్ళడం వల్లనే నువ్వు బ్రతికిపోయావు. నీ సోదరుడు మరణించిన విషయం జ్ఞాపకంలేదా? నీ సోదరుడు మరణిస్తూంటే రణాగ్రభూమిని విడిచిపోయి ఇప్పుడు వచ్చి ఈలా ప్రసంగించడం నీ కొక్కడికే తగును – అని అర్జునుడు అట్టహాసం చేశాడు.

ఇలా మాట్లాడుతూనే కర్ణుని కవచాన్ని ఛేదించే బాణాలను విడుస్తూ అర్జునుడు ముందుకు సాగాడు. కర్ణుడు దారిలోనే వాటిని ఖండించాడు. అంతలో కర్ణార్జునులమధ్య ఘోరయుద్ధం ప్రారంభమైంది. అర్జునుడు కర్ణుని రథాన్ని నిరోధించాడు. కర్ణుని అంగుళిత్రాణలను ఛేదించాడు. కర్ణుడు వాడి బాణాలను అర్జునుని చేతులమీదికి వదిలాడు. అర్జునుడు కర్ణుని ధనుస్సు ఖండించాడు. కర్ణుడు శక్తి విడిచాడు. దానినీ ఖండించాడు. అంతలో కర్ణుని సహాయార్థం ఎందరో సైనికులు వచ్చారు. వారందరూ ఉత్తరక్షణంలోనే గాండీవ వినుర్ముక్త శరాలతో యమపురికి చేరుకున్నారు.

తీవ్రక్రోధంతో అర్జునుడు నిశితశరాలు విడిచి కర్ణరథాశ్వాలను నేలకూల్చి ప్రజ్వలితాగ్ని సదృశబాణాలతో కర్ణుని కవచాన్ని ఛేదించి ఉరమును గాయపరచగా కర్ణుడు మూర్ఛితుడయాడు. కర్ణునిరథం వెనుదిరిగింది. ఉత్తరార్జునులు సింహనాదాలు చేశారు.

## అరువది ఒకటవ అధ్యాయం

తతో వైకర్తనం జిత్వా పార్థో వైరాటిమబ్రవీత్
ఏతన్మాం ప్రాపయానీకం యత్ర తాలో హిరణ్మయః
అత్ర శాంతనవో భీష్మో రథేఽస్మాకం పితామహః
కాంక్షమాణో మయా యుద్ధం తిష్ఠత్యమరదర్శనః
అథ సైన్యం మహద్దృష్ట్వా రథనాగహయాకులం
అబ్రవీదుత్తరః పార్థమపవిద్ధః శరైర్భృశం
నాహం శక్ష్యామి వీరేహ నియంతుం తే హయోత్తమాన్
విషీదంతి మమ ప్రాణా మనో విహ్వలతీవ మే.
అస్త్రాణామివ దివ్యానాం ప్రభావః సంప్రయుజ్యతాం
త్వయా చ కురుభిశ్చైవ ద్రవంతీవ దిశో దశ.
గంధేన మూర్ఛితశ్చాహం వసారుధిరమేదసాం
ద్వైధీభూతం మనో మేఽద్య తవ చైవ ప్రపశ్యతః.

అదృష్టపూర్వః శూరాణాం మయా సంఖ్యే సమాగమః
గదాపాతేన మహతా శంఖానాం నిస్వనేన చ.
సింహనాదైశ్చ శూరాణాం గజానాం బృంహితైస్తథా
గాండీవశబ్దేన భృశమశనిప్రతిమేన చ
శ్రుతిః స్మృతిశ్చ మే వీర ప్రణష్టా మూఢచేతసః
అలాతచక్రప్రతిమం మండలం సతతం త్వయా
వ్యాక్షిప్యమాణం సమరే గాండీవం చ ప్రకర్షతా
దృష్టిః ప్రచలితా వీర హృదయం దీర్యతీవ మే.
వపుశ్చోగ్రం తవ రణే క్రుద్ధస్యేవ పినాకినః
వ్యాయచ్ఛతస్తవ భుజం దృష్ట్వా భీర్మే భవత్యపి.
నాదదానం నసంధానం నముంచంతం శరోత్తమాన్
త్వామహం సంప్రపశ్యామి పశ్యన్నపి న చేతనః.

## అరువది ఒకటవ అధ్యాయం

దుశ్శాసన పరాభవం.

కర్ణుడు పరాజితుడై వెనుతిరగడంతో అర్జునుడు తన రథాన్ని కురుసేనానీకంవైపు నడపమని చెపుతూ తాళవృక్ష చిహ్నితమైన పతాకం కనిపించే దుర్యోధనుని రథంవైపు నా రథం పోనిమ్మన్నాడు. దానిమీద భీష్ముడున్నాడనీ ఆయన తనతో యుద్ధం చెయ్యాలనే కుతూహలంతో ఉన్నాడనీ అనగానే ఉత్తరుడు రథగజపదాతులతో సంకులమై ఉన్న రణభూమిని తిలకించి - అర్జునా - నీ ఉత్తమాశ్వాలను నడిపేశక్తి నాలో సన్నగిలింది. నా మనస్సు వికలమౌతోంది. కురుప్రముఖులూ నువ్వూ విడిచే దివ్యాస్త్రాలు దశదిశలనూ ద్రవింపచేస్తున్నాయి. అది చూస్తూంటే నా మనస్సు సమ్మోహితమౌతోంది. ఇంతటి యోధవరుని ఇదివర కెప్పుడూ చూడనేలేదు - భయంకర శంఖనాదాలు శ్రుతి కలుపుతున్నాయి. వారి భయంకర గదాఘాతాలూ మత్తేభబృంహితాలూ లయ కలుపుతూంటే నీ గాండీవ ధనుష్టంకారం నా శ్రవణాలను బధిరీభూతం చేస్తూ స్మరణశక్తిని హరిస్తోంది. నీ గాండీవం నిరంతరం ధ్వనిస్తూనే ఉంది. దాని నుండి వెలువడే బాణాలు మండలాకారంలో సాగుతూంటే నా కన్నులు మిరుమిట్లు గొల్పుతున్నాయి. గుండె నీరైపోతోంది. క్రోధోద్రిక్తుడైన రుద్రునివలె నీ శరీరం నన్ను భయపెడుతోంది. బాణాలు విడవడానికి నీ

అవసీదంతి మే ప్రాణా భూరియం చలతీవ చ
న చ ప్రతోదం రశ్మీంశ్చ సంయంతుం శక్తిరస్తిమే.
మాభైషీః స్తంభయాత్మానం త్వయాపి నరపుంగవ
అత్యద్భుతాని కర్మాణి కృతాని రణమూర్ధని.
రాజపుత్రోఽసి భద్రంతే కులేమాత్స్యస్య విశ్రుతే
జాత స్త్వం శత్రుదమనే నావసీదితుమర్హసి.
ధృతిం కృత్వా సువిపులాం రాజపుత్ర రథేమమ
యుధ్యమానస్య సమరే హయాన్ సంయచ్ఛ
శత్రుహన్.
ఏవముక్త్వా మహాబాహుర్వైరాటిం నరసత్తమః
అర్జునో రథినాం శ్రేష్ఠ ఉత్తరం వాక్యమబ్రవీత్.
సేనాగ్రమాశు భీష్మస్య ప్రాపయస్వైత దేవమాం
ఆచ్ఛేత్స్యామ్యహమేతస్య ధనుర్జ్యామపి చాహవే.
అస్యంతం దివ్యమస్త్రంమాం చిత్రమద్య నిశామయ
శతహ్రాదామివాయాంతీం స్తనయిత్నోరివాంబరే.
సువర్ణపృష్ఠం గాండీవం ద్రక్ష్యంతి కురవో మమ
దక్షిణేనాథ వామేన కతరేణ స్విదస్యతి.
ఇతి మాం సంగతాః సర్వే తర్కయిష్యంతి శత్రవః
శోణితోదాం రథావర్తాం నాగనక్రాందురత్యయాం
నదీం ప్రస్కందయిష్యామి పరలోకప్రవాహినీం.
పాణిపాదశిరః పృష్ఠబాహుశాఖానిరంతరం
వనం కురూణాం ఛేత్స్యామిశరైః సంనతపర్వభిః
జయతః కౌరవీం సేనామేకస్య మమ ధన్వినః
శతం మార్గా భవిష్యంతి పావకస్యేవ కాననే.
మయా చక్రమివావిద్ధం సైన్యం ద్రక్ష్యసి కేవలం
ఇష్వస్త్రే శిక్షితం చిత్రమహం దర్శయితాస్మి తే.
అసంభ్రాంతో రథే తిష్ఠ సమేషు విషమేషు చ
దివమావృత్య తిష్ఠంతం గిరింభింద్యాం స్మపత్రిభిః.
అహమింద్రస్యవచనాత్ సంగ్రామేఽభ్యహనంపురా
పౌలోమాన్ కాలఖంజాంశ్చ సహస్రాణి శతానిచ.

---

భుజాలు కదులుతూంటే నా శరీరం కంపించి పోతోంది. నువ్వు బాణం తియ్యడం సంధించడం విడిచిపెట్టడం నేను చూడలేనంత వేగంగా జరుగుతున్నాయి. ఈ భూమి కంపిస్తోందేమో ననే భయంగా ఉంది. మరణభీతితో ఉన్న నేను ఈ గుర్రాలను నడపలేను - అని ఉత్తరుడు జవాబివ్వగా - ఉత్తరా -ధైర్యం చిక్కపట్టుకో. నువ్వు రాజపుత్రుడవు. భీకరసంగ్రామంలో సేనాముఖంలో నిలబడి మహావీరుల పరాక్రమం దర్శించే భాగ్యం నీకు లభించింది. విశ్వవిఖ్యాతమైన మత్స్యవంశంలో జన్మించిన నువ్వు శాత్రవ వీర మారణ హోమం జరుగుతూంటే ఏమాత్రం భయపడకూడదు. సర్వశత్రుసంహారసమర్థుడవై నువ్వు స్థిర చిత్తంతో గుర్రాలను నడుపు. నీ కేమీ భయంలేదు - అని ఆశ్వాసిస్తూ ఉత్తరుని కింకా ధైర్యం చెప్పే ఊహతో అర్జునుడు మాట్లాడుతున్నాడు.

సారథీ - నువ్వు నిర్భయంగా మన రథాన్ని భీష్మాచార్యులవైపు పోనియ్యి. ఇప్పుడు ఆయన చేతిలో ఉన్న వింటి నారిని ఛేదిస్తాను చూడు నేను విడిచే దివ్యాస్త్రాలు మబ్బులలోనుండి మెరువడే మెరుపులవలె ఎలా బయలుదేరుతాయో వీక్షించు. ఈ కురువీరు లందరూ నే నే చేతితో బాణాలు విడుస్తున్నానో గుర్తుపట్టలేక విస్మితులై చూస్తారు. ఊర్ధ్వలోకాలవైపు పోయే ఈ సేనా వాహినిని ఎలా మథించి రక్తమయం చేస్తానో చూద్దువుగాని. ఆ రక్తప్రవాహంలో ఏనుగులే మొసళ్లుగా, రథాలే ఆవర్తలుగా కనపడతాయి. ఈ కౌరవారణ్యాన్ని ఎలా ఛేదిస్తానో పరికించు. దావానలం అరణ్యాలలో వ్యాపించేటట్లు నీ నీ

అహమింద్రాద్ దృఢాం ముష్టిం బ్రహ్మణః కృతహస్తతాం
ప్రగాఢే తుములం చిత్రమితి విద్ధి ప్రజాపతేః.
అహం పారే సముద్రస్య హిరణ్యపురవాసినాం
జిత్వా షష్టిం సహస్రాణి రథినాముగ్రధన్వినాం.
శీర్యమాణాని కూలాని ప్రవృద్ధేనేవ వారిణా
మయా కురూణాం వృందాని పాత్యమానాని పశ్య వై.
ధ్వజవృక్షం పత్తితృణం రథసింహగణాయుతం
వనమాదీపయిష్యామి కురూణామస్త్రతేజసా.
తానహం రథనీడేభ్యః శరైః సంనతపర్వభిః
యత్తాన్ సర్వానతిబలాన్ యోత్స్యమానానవస్థితాన్
ఏకః సంకాలయిష్యామి వజ్రపాణిరివాసురాన్.
రౌద్రం రుద్రాదహం హ్యస్త్రం వారుణం వరుణాదపి
అస్త్రమాగ్నేయమగ్నేశ్చ వాయవ్యం మాతరిశ్వనః
వజ్రాదీని తథాస్త్రాణి శక్రాదహమవాప్తవాన్.
ధార్తరాష్ట్రవనం ఘోరం నరసింహాభిరక్షితం
అహముత్పాటయిష్యామి వైరాటే వ్యేతు తే భయం
ఏవమాశ్వాసితస్తేన వైరాటిః సవ్యసాచినా
వ్యవాగాహద్ రథానీకం భీమం భీష్మాభిరక్షితం.
తమాయాంతం మహాబాహుం జిగీషంతం రణే కురూన్
అభ్యవారయదవ్యగ్రః క్రూరకర్మాఽఽపగాసుతః.
తస్య జిష్ణురుపావృత్య ధ్వజం మూలాదపాతయత్
వికృష్య కలధౌతాగ్రైః స విద్ధః ప్రాపతద్ భువి.
తం చిత్రమాల్యాభరణాః కృతవిద్యా మనస్వినః
ఆగచ్ఛన్ భీమధన్వానం చత్వారశ్చ మహాబలాః.
దుశ్శాసనో వికర్ణశ్చ దుస్సహోఽథ వివింశతిః
ఆగత్య భీమధన్వానం బీభత్సుం పర్యవారయన్.
దుశ్శాసనస్తు భల్లేన విద్ధ్వా వైరాటముత్తరం
ద్వితీయేనార్జునం వీరః ప్రత్యవిధ్యత్ స్తనాంతరే.

---

కౌరవవనంమీద విహరిస్తాను. ఈ సైనికులను వేధిస్తూంటే చక్రాకృతిలో నీ దృష్టిని ప్రసరించి చూద్దువుగాని. ధనుర్విద్యలో నాకు గల విచిత్ర కౌశలం నీ కిప్పుడు చూపిస్తాను. నువ్వు స్థిర చిత్తంతో నిశ్చల స్థితిలో కూర్చుని రథాన్ని నడుపు. ఇదివరలో ఇంద్రుని ఆజ్ఞానుసారం పౌలోమ, కాలఖంజాది రాక్షస సహస్రాలను సంహరించాను. నేను బాణం చేపట్టినప్పుడు నా పిడికిలి సమరభూమిలో ఉన్న ఇంద్రుని పిడికిలి వలెనూ, బాణచాలనం విధాత శరసంచాలనం వలెనూ నడుస్తుంది. ఇదివరలో సముద్రాంతర వాసులైన హిరణ్యపుర దానవులను అరవై వేల మందిని సంహరించాను. మహావేగంతో వచ్చేనది తీరభూములను కోసివారేసేటట్లు నేనీ కౌరవ వీరు లందరినీ సంహరిస్తాను.

పతాకాలే వృక్షాలుగా, పదాతులే తృణలతా గుల్మాలుగా, రథాలే సింహాలుగా ఉన్న ఈ కౌరవారణ్యాన్ని నా శస్త్రాస్త్ర దావానలంతో భస్మం చేస్తాను. వజ్రహస్తుడై ఇంద్రుడు రాక్షసానీకాన్ని సంహరించినట్లు నేనొక్కడనే ఈ శాత్రవసమూహాన్ని హరించగలను. నావద్ద రౌద్ర వారుణ ఆగ్నేయ వాయవ్యాది దివ్యాస్త్రాలున్నాయి. ఇంద్రుని వజ్రాస్త్రమూ ఉంది. ఇవన్నీ వారివద్దనే శిక్షణపొంది గ్రహించాను. నువ్వు నిర్భయంగా ఉండు – అని ధైర్యం పురికొల్పగా ఉత్తరుడు భీష్మునివైపు రథం పోనిచ్చాడు.

తస్య జిష్ణురుపావృత్య పృథుధారేణ కార్ముకం
చకర్త గార్ధ్రపత్రేణ జాతరూపపరిష్కృతం.
అథైనం పంచభిః పశ్చాత్ ప్రత్యవిధ్యత్ స్తనాంతరే
సోఽపయాతో రణం హిత్వా పార్థబాణప్రపీడితః.
తం వికర్ణః శరైస్తీక్ష్ణైర్గృధ్రపత్రైరజిహ్మగైః
వివ్యాధ పరవీరఘ్నమర్జునం ధృతరాష్ట్రజః.
తతస్తమపి కౌంతేయః శరేణానతపర్వణా
లలాటేఽభ్యహనత్ తూర్ణం సవిద్ధః ప్రాపతద్ రథాత్
తతః పార్థమభిద్రుత్య దుస్సహః సవివింశతిః
అవాకిరచ్ఛరైస్తీక్ష్ణైః పరీప్సుర్భ్రాతరం రణే.
తావుభౌ గార్ధ్రపత్రాభ్యాం నిశితాభ్యాం ధనంజయః
విద్ధ్వా యుగపదవ్యగ్రస్తయోర్వాహానసూదయత్
తౌ హతాశ్వౌ విభిన్నాంగౌ ధృతరాష్ట్రాత్మజావుభౌ
అభిపత్య రథైరన్యైరపనీతౌ పదానుగైః.
సర్వా దిశశ్చాభ్యపతద్ బీభత్సురపరాజితః
కిరీటమాలీ కౌంతేయో లబ్ధలక్షో మహాబలః.

## అరువది రెండవ అధ్యాయం

అథసంగమ్య సర్వే తే కౌరవాణాం మహారథాః
అర్జునంసహితాయత్తాః ప్రత్యయుధ్యంత భారత.
స సాయకమయైర్జాలైః సర్వాంస్తాన్ మహారథాన్
ప్రాచ్ఛాదయదమేయాత్మా నీహారేణేవ పర్వతాన్
నదద్భిశ్చ మహానాగైర్హేషమాణైశ్చ వాజిభిః
భేరీశంఖనినాదైశ్చ స శబ్దస్తుములోఽభవత్.
నరాశ్వకాయాన్ నిర్భిద్య లౌహాని కవచాని చ
పార్థస్య శరజాలాని వినిష్పేతుః సహస్రశః.

వెనువెంటనే అర్జునుడు భీష్మపతాకాన్ని పడగొట్టాడు. అంతలో దుశ్శాసన, దుస్సహ, వికర్ణ వివింశతి ప్రముఖులు అర్జునుని మీదికి వచ్చారు. దుశ్శాసనుడు నిశితభల్లంతో ఉత్తరుని వేధించి మరొకభల్లం అర్జునుని రొమ్ముమీదికి విసిరాడు. ఉత్తరక్షణంలో అర్జునుడు దుశ్శాసనుని సువర్ణమయధనుస్సును ఖండించి మరొక ఐదు బాణాలు వాని రొమ్మున నాటగా దుశ్శాసనుడు భీతుడై రణభూమి విడిచి పోయాడు.

వికర్ణుడు అర్జునుని ఎదుర్కొనగా, వాని లలాటం మీద కిరీటి వాడి బాణాలు విడవడంతో వికర్ణుడు రథంనుండి గిరగిర తిరిగి పడ్డాడు. వివింశతి, దుస్సహుడు పరమక్రోధంతో ఎదుర్కొనరాగా అర్జునుడు రెండు క్రూర నారాచాలు విడిచి వారి రథాశ్వాలను సంహరించగా సేవకులు మరొక రెండు రథాలమీద వారిని తరలించుకు పోయారు. అర్జునుడు వీరవిహారం చేస్తున్నాడు.

## అరువది రెండవ అధ్యాయం

కౌరవసేనలోని యోధులందరూ ఒకే చోట చేరి అర్జునుని ఎదిరించడానికి సన్నద్ధులయారు. ఆత్మబలసంపన్నుడైన అర్జునుడు సర్వతోముఖంగా వచ్చే బాణాలను ఖండిస్తూ తన బాణాలతో వారి నందరినీ ఆచ్ఛాదించాడు. ఏనుగులు ఘీంకరించాయి. హయాలు హేషించాయి. వీరులు శంఖనాదాలు చేసారు. రణభూమి కోలాహలంతో నిండిపోయింది. అర్జునుని నిశిత శరాలు లోహ

త్వరమాణః శరానస్యన్ పాండవః ప్రబభౌ రణే
మధ్యందినగతో౽ర్చిష్మాన్ శరదీవ దివాకరః.
ఉపప్లవంతి విత్రస్తా రథేభ్యో రథినస్తథా
సాదినశ్చాశ్వపృష్ఠేభ్యో భూమౌ చైవ పదాతయః
శరైః సంఛిద్యమానానాం కవచానాం మహాత్మనాం
తామ్రరాజతలౌహానాం ప్రాదురాసీన్మహాస్వనః.
ఛన్నమాయోధనం సర్వం శరీరైర్గతచేతసాం
గజాశ్వసాదినాం తత్ర శితబాణాత్తజీవితైః.
రథోపస్థాభిపతితైరాస్తృతా మానవైర్మహీ
ప్రనృత్యతీవ సంగ్రామే చాపహస్తో ధనంజయః.
శ్రుత్వా గాండీవనిర్ఘోషం విస్ఫూర్జితమివాశనేః
త్రస్తాని సర్వసైన్యాని వ్యపాగచ్ఛన్మహాహవాత్
కుండలోష్ణీషధారీణి జాతరూపస్రజస్తథా
పతితాని స్మ దృశ్యంతే శిరాంసి రణమూర్ధని.
విశిఖోన్మథితైర్గాత్రైర్బాహుభిశ్చ సకార్ముకైః
సహస్తాభరణైశ్చాన్యైః ప్రచ్ఛన్నా భాతి మేదినీ
శిరసాం పాత్యమానానామంతరా నిశితైః శరైః
అశ్మవృష్టిరివాకాశాదభవద్ భరతర్షభ.
దర్శయిత్వా తథా౽౽త్మానం రౌద్రం రుద్రపరాక్రమః
అవరుద్ధో౽చరత్ పార్థో వర్షాణి త్రిదశాని చ
క్రోధాగ్నిముత్సృజన్ వీరో ధార్తరాష్ట్రేషు పాండవః
తస్య తద్ దహతః సైన్యం దృష్ట్వా చైవ పరాక్రమం
సర్వే శాంతిపరా యోధా ధార్తరాష్ట్రస్య పశ్యతః.
విత్రాసయిత్వా తత్ సైన్యం ద్రావయిత్వా మహారథాన్
అర్జునో జయతాం శ్రేష్ఠః పర్యవర్తత భారత.
ప్రావర్తయన్నదీం ఘోరాం శోణితోదాం తరంగిణీం
అస్థిశైవాలసంబాధాం యుగాంతే కాలనిర్మితాం.
శరచాపప్లవాం ఘోరాం కేశశైవలశాద్వలాం
తనుత్రోష్ణీషసంబాధాం నాగకూర్మమహాద్విపాం
మేదోవసాసృక్ప్రవహాం మహాభయవివర్ధినీం
రౌద్రరూపాం మహాభీమాం శ్వాపదైరభినాదితాం
తీక్ష్ణశస్త్రమహాగ్రాహాం క్రవ్యాదగణసేవితాం
ముక్తాహారోర్మికలిలాం చిత్రాలంకారబుద్బుదాం.
శరసంఘమహావర్తాం నాగనక్రాం దురత్యయాం
మహారథమహాద్వీపాం శంఖదుందుభినిస్వనాం
చకార చ తదా పార్థో నదీం దుస్తరశోణితాం.
ఆదదానస్య హి శరాన్ సంధాయ చ విముంచతః
వికర్షతశ్చ గాండీవం న కశ్చిద్ దదృశే జనః.

---

కవచాలను ఛేదిస్తున్నాయి. అశ్వాలను హరిస్తున్నాయి. శరత్కాల మధ్యాహ్న ప్రచండ భానునివలె అర్జునుడు వెలుగుతూ బాణకిరణాలను ప్రసరింప చేయగా ఆ వేగానికి తట్టుకోలేక పదాతులు రథికులు నేల కూలుతున్నారు. నేల గూలిన చతురంగ బలాలతో రణభూమి నిండి పోయింది. శిలాఖండాలవలె శత్రువీరుల మస్తకాలు భూపతిత మౌతున్నాయి. ధార్తరాష్ట్రశిబిరంమీద పరాక్రమించే అర్జునుని చూసి భయపడి సైనికులందరూ గుట్టుగా దుర్యోధనుని వెనుకకు చల్లగా తప్పుకొన్నారు. రక్త తరంగాలతో ఎముకల నాచుతో రణభూమి నిండిపోయింది. ప్రళయమే ప్రత్యక్షంగా గోచరిస్తోంది. అర్జునుని ధనుర్బాణాలు భయంకరంగా గోచరిస్తున్నాయి. వాని శస్త్రాలు భయానకగ్రాహాలవలె ఉన్నాయి. శంఖ జ్యా నినాదమే సాగరఘోషగా ఉంది. తీవ్ర వేగంతో అర్జునుడు బాణాలు విడుస్తున్నాడు.

## అరువదిమూడవ అధ్యాయం

తతో దుర్యోధనః కర్ణో దుశ్శాసనవివింశతీ
ద్రోణశ్చ సహ పుత్రేణ కృపశ్చాపి మహారథః.
పునర్యయుశ్చ సంరబ్ధా ధనంజయజిఘాంసవః
విస్ఫారయంతశ్చాపాని బలవంతి దృఢాని చ.
తాన్ వికీర్ణపతాకేన రథేనాదిత్యవర్చసా
ప్రత్యుద్యయౌమహారాజ సమంతాద్ వానరధ్వజః
తతః కృపశ్చ కర్ణశ్చ ద్రోణశ్చ రథినాం వరః
తం మహాస్త్రైర్మహావీర్యం పరివార్య ధనంజయం.
శరౌఘాన్ సమ్యగస్యంతో జీమూతాఇవవార్షికాః
వవర్షుః శరవర్షాణి పాతయంతో ధనంజయం.
ఇషుభిర్బహుభిస్తూర్ణం సమరే లోమవాహిభిః
అదూరాత్ పర్యవస్థాప్య
పూరయామాసురాదృతాః.
తథా వైరవకీర్ణస్య దివ్యైరస్త్రైః సమంతతః
న తస్య ద్వ్యంగుళమపి వివృతం సంప్రదృశ్యతే.

తతః ప్రహస్య బీభత్సుర్దివ్యమైంద్రం మహారథః
అస్త్రమాదిత్యసంకాశం గాండీవే సమయోజయత్
శరరశ్మిరివాదిత్యః ప్రతస్థే సమరే బలీ
కిరీటమాలీ కౌంతేయః సర్వాన్ ప్రాచ్ఛాదయత్ కురూన్.
యథా బలాహకే విద్యుత్ పావకో వా శిలోచ్చయే
తథా గాండీవమభవదింద్రాయుధమివానతం.
యథా వర్షతి పర్జన్యే విద్యుద్ విభ్రాజతే దివి
ద్యోతయంతీ దిశః సర్వాః పృథివీం చ సమంతతః
తథా దశ దిశః సర్వాః పతద్గాండీవమావృణోత్
నాగాశ్చ రథినః సర్వే ముముహుస్తత్ర భారత.
సర్వే శాంతిపరా యోధాః స్వచిత్తాని న లేభిరే
సంగ్రామే విముఖాఃసర్వే యోధాస్తే హతచేతసః.
ఏవం సర్వాణి సైన్యాని భగ్నాని భరతర్షభ
వ్యద్రవంత దిశః సర్వా నిరాశాని స్వజీవితే.

---

## అరువదిమూడవ అధ్యాయం

దుర్యోధన దుశ్శాసన కర్ణ వివంశతి అశ్వత్థామ కృప ద్రోణాది మహారథికులందరూ అర్జున సంహారోద్యుక్తులై ముందుకు వచ్చారు. కపిధ్వజ శోభతో సూర్యసమ తేజస్వియై అర్జునుడు వారితో సమంగా పోరు సాగించడానికి ఉద్యుక్తుడు కాగా కృప కర్ణ ద్రోణులు తమ దృఢ ధనుస్సులు సారించారు. శ్రావణ మేఘాలవలె వారు బాణ వర్షం కురిపిస్తున్నారు. వారు విడిచే దివ్యాస్త్రాలు అర్జునుని దేహంమీద అంగుళాన్నికూడా విడిచి పెట్టకుండా వేధిస్తున్నాయి.

అర్జునుడు ఐంద్రాస్త్రం సంధించి వారి నందరనూ నిరోధించాడు. మేఘ మండలంలోని విద్యుల్లతవలె పర్వతంమీది ప్రజ్వలితాగ్నిశిఖవలె అర్జునుని చేతిలోని గాండీవం ప్రకాశించుతోంది. వానవేళ మెరుపులు భూమినీ దిగంతాలనూ ప్రకాశింపచేసేటట్లు బాణవర్ష వేళ అర్జునుని గాండీవం విశ్వాన్నంతనీ ఆచ్ఛాదించింది. ఆ సమయంలో రథికులు గజబలం పదాతులూ సమ్మోహితు లయ్యారు. యుద్ధవిముఖులైన యోధు లందరూ మూకీవహించి హతోత్సాహులై చెల్లా చెదరై పోయారు.

## అరువది నాలుగవ అధ్యాయం

తతః శాంతనవో భీష్మో భరతానాం పితామహః
వధ్యమానేషు యోధేషు ధనంజయముపాద్రవత్.
ప్రగృహ్య కార్ముకశ్రేష్ఠం జాతరూపపరిష్కృతం
శరానాదాయతీక్ష్ణాగ్రాన్ మర్మభేదాన్ ప్రమాథినః
పాండురేణాతపత్రేణ ధ్రియమాణేన మూర్ధని
శుశుభే స నరవ్యాఘ్రో గిరిః సూర్యోదయేయథా.
ప్రధ్మాయ శంఖం గాంగేయో ధార్తరాష్ట్రాన్ ప్రహర్షయన్
ప్రదక్షిణముపావృత్య బీభత్సుం సమవారయత్.
తముదీక్ష్య సమాయాంతం కౌంతేయః పరవీరహా
ప్రత్యగృహ్ణాత్ ప్రహృష్టాత్మా ధారాధరమివాచలః
తతో భీష్మః శరానష్టౌ ధ్వజే పార్థస్య వీర్యవాన్
సమార్పయన్మహావేగాన్ శ్వసమానానివోరగాన్.
తే ధ్వజం పాండుపుత్రస్య సమాసాద్య పతత్రిణః
జ్వలంతంకపిమాజఘ్నుర్ధ్వజాగ్రనిలయాంశ్చ తాన్
తతో భల్లేన మహతా పృథుధారేణ పాండవః
ఛత్రం చిచ్ఛేద భీష్మస్య తూర్ణం తదపతద్భువి.
ధ్వజంచైవాస్య కౌంతేయః శరైరభ్యహనద్ భృశం
శీఘ్రకృద్ రథవాహాంశ్చ తథోభౌ పార్ష్ణిసారథీ.
అమృష్యమాణస్తద్ భీష్మో జానన్నపి సపాండవం
దివ్యేనాస్త్రేణ మహతా ధనంజయమవాకిరత్.
తథైవ పాండవో భీష్మే దివ్యమస్త్రముదీరయన్
ప్రత్యగృహ్ణాదమేయాత్మా మహామేఘమివాచలః.
తయోస్తదభవద్ యుద్ధం తుములం లోమహర్షణం
భీష్మస్య సహ పార్థేన బలివాసవయోరివ.
ప్రైక్షంత కురవః సర్వే యోధాశ్చ సహసైనికాః
భల్లైర్భల్లాః సమాగమ్య భీష్మపాండవయోర్యుధి
అంతరిక్షే వ్యరాజంత ఖద్యోతాః ప్రావృషీవ హి
అగ్నిచక్రమివావిద్ధం సవ్యదక్షిణమస్యతః
గాండీవమభవద్ రాజన్ పార్థస్య సృజతః శరాన్.
తతః సంఛాదయామాస భీష్మం శరశతైః శితైః
పర్వతం వారిధారాభిశ్ఛాదయన్నివ తోయదః.
తాంస వేలామివోద్భూతాం శరవృష్టింసముత్థితాం
వ్యధమత్ సాయకైర్భీష్మః పాండవంసమవారయత్

## అరువది నాలుగవ అధ్యాయం

కురువీరులందరూ పరాభూతులు కావడంతో సైనికులు నిహతులవుతూ ఉండడంతో భీష్మాచార్యులు తీవ్రకుపితుడై ఉదయకాల సూర్యునివలె ప్రకాశిస్తూ శంఖనాదం చేసేసరికి ధార్తరాష్ట్రులందరికీ సంతోషం కలిగింది. తీవ్ర వేగంతో వచ్చే భీష్మాచార్యునిచూసి అర్జునుడు అవిచల చిత్తంతో ప్రసన్నవదనుడై నిలబడ్డాడు. భీష్మాచార్యుడు అర్జునుని ధ్వజాగ్రం మీదికి ఎనిమిది వాడిబాణాలు వదలగా అని ధ్వజంమీది వానరుని దాని నాశ్రయించి ఉన్న భూతగణాలనూ తీవ్రంగా వేధించాయి. అర్జునుడు విశాల భల్లాలు విడిచి భీష్ముని ఛత్రాన్నీ రథాశ్వాలనూ పార్శ్వరక్షకులనూ సారథినీ పడగొట్టి వేధించాడు. భీష్ముడు దివ్యాస్త్రాలు ప్రయోగిస్తూంటే అర్జునుడు ప్రత్యస్త్రాలు ప్రయోగిస్తూ ముందుకు పోతున్నాడు. కౌరవయోధులందరూ తాతామనుమల సంగ్రామం తిలకిస్తున్నారు. వారు విడిచే బాణాలు ఆకాశంలో మెరుపుల్లా మెరుస్తున్నాయి. అర్జు

తతస్తాని నికృత్తాని శరజాలాని భాగశః
సమరే చ వ్యశీర్యంత ఫాల్గుణస్య రథం ప్రతి.
తతః కనకపుంఖానాం శరవృష్టిం సముత్థితాం
పాండవస్య రథాత్ తూర్ణం శలభానామివాయతిం
వ్యధమత్ తాం పునస్తస్య భీష్మః శరశతైః శితైః
తతస్తే కురవః సర్వే సాధుసాధ్వితి చాబ్రువన్.
దుష్కరం కృతవాన్ భీష్మో యదర్జునమయోధయత్
బలవాంస్తరుణో దక్షః క్షిప్రకారీ ధనంజయః
కోఽన్యః సమర్థః పార్థస్య వేగంధారయితుం రణే
ఋతే శాంతనవాద్ భీష్మాత్ కృష్ణాద్వా దేవకీసుతాత్
ఆచార్యప్రవరాద్వాపి భారద్వాజాన్మహాబలాత్
అస్త్రైరస్త్రాణి సంవార్య క్రీడంతౌ భరతర్షభౌ
చక్షూంషి సర్వభూతానాం మోహయంతౌ మహాబలౌ.
ప్రాజాపత్యం తథైవైంద్రమాగ్నేయం రౌద్రదారుణం
కౌబేరం వారుణంచైవ యామ్యంవాయవ్యమేవచ
ప్రయుంజానౌ మహాత్మానౌ సమరే తౌ విచేరతుః.
విస్మితాన్యథ భూతాని తౌ దృష్ట్వా సంయుగేతదా
సాధుపార్థమహాబాహో సాధుభీష్మేతిచాబ్రువన్.
నాయం యుక్తో మనుష్యేషు యోఽయం సందృశ్యతే మహాన్
మహాస్త్రాణాం సంప్రయోగః సమరేభీష్మపార్థయోః
ఏవం సర్వాస్త్రవిదుషోరస్త్రయుద్ధమవర్తత
అస్త్రయుద్ధే తు నిర్వృత్తే శరయుద్ధమవర్తత.
అథ జిష్ణురుపావృత్య క్షురధారేణ కార్ముకం
చకర్త భీష్మస్య తదా జాతరూపపరిష్కృతం.
నిమేషాంతరమాత్రేణ భీష్మోఽన్యత్ కార్ముకంరణే
సమాదాయ మహాబాహుః సజ్యంచక్రేమహారథః
శరాంశ్చసుబహూన్ క్రుద్ధోముమోచాశుధనంజయే
అర్జునోఽపి శరాంస్తీక్ష్ణాన్ భీష్మాయ నిశితాన్ బహూన్
చిక్షేప సుమహాతేజాస్తథా భీష్మశ్చ పాండవే.
తయోర్దివ్యాస్త్రవిదుషోరస్యతోర్నిశితాన్ శరాన్
న విశేషస్తదా రాజన్లక్ష్యతే స్మ మహాత్మనోః.
అథావృణోద్ దశ దిశః శరైరతిరథస్తదా
కిరీటమాలీ కౌంతేయః శూరః శాంతనవస్తథా.
అతీవ పాండవో భీష్మం భీష్మశ్చాతీవ పాండవం
బభూవ తస్మిన్ సంగ్రామే రాజన్లోకే తదద్భుతం.

---

నుని గాండీవం అగ్నిచక్రంలా మెరుస్తోంది. దానినుండి వెలువడే బాణాలు భీష్ముని కదల నివ్వడంలేదు. భీష్ముడు వాటిని నిరోధించి అర్జున పరాక్రమాన్ని కుంఠితపరుస్తూంటే అర్జునుడు మరింత వేగంతో బాణాలు విడుస్తున్నాడు. భీష్ముని పరాక్రమాన్ని కౌరవయోధులు అభినందిస్తూ నిలబడ్డారు. బలయౌవ్వన సంపన్నుడైన అర్జునుని బాణధాటికి భీష్ముడో ద్రోణుడో కృష్ణుడో నిలబడాలేకాని ఇతరులకు సాధ్యంకాదు. భీష్మార్జునులు ప్రయోగించుకొంటూ విహరిస్తూంటే సర్వప్రాణికోటీ వారిని విస్మయ చకిత దృక్కులతో వీక్షిస్తోంది. భీష్మార్జునులు సాగించే సమరం మానవాతీతంగా నడుస్తోంది. కొంతసేపు దివ్యాస్త్రాలతో సాగించి బాణయుద్ధం ఆరంభించారు. అర్జునుడు అసిధారా సదృశమైన బాణం విడిచి భీష్మధనుస్సు ఖండించాడు. భీష్ముడు మరొక ధనుస్సు గ్రహించి అర్జునునిపై పుంఖానుపుంఖంగ బాణాలు విడుస్తున్నాడు. ఉభయులూ హస్తలాఘవం ప్రదర్శించగా వారిమధ్య బాణాలు నాట్యం చేస్తున్నాయి. అర్జునుడు విడిచేబాణాలు

పాండవేన హతాః శూరా భీష్మస్య రథరక్షిణః
శేరతే స్మ తదా రాజన్ కౌంతేయస్యాభితో రథం.
తతో గాండీవనిర్ముక్తా నిరమిత్రం చికీర్షవః
ఆగచ్ఛన్ పుంఖసంశ్లిష్టాః శ్వేతవాహనపత్రిణః.
నిష్పతంతో రథాత్ తస్య ధౌతా హైరణ్యవాససః
ఆకాశే సమదృశ్యంత హంసానామివ పంక్తయః.
తస్య తద్ దివ్యమస్త్రం హి విగాఢం చిత్రమస్యతః
ప్రేక్షంతే స్మాంతరిక్షస్థాః సర్వే దేవాః సవాసవాః
తం దృష్ట్వా పరమప్రీతో గంధర్వశ్చిత్రమద్భుతం
శశంస దేవరాజాయ చిత్రసేనః ప్రతాపవాన్.
పశ్యేమాన్ పార్థనిర్ముక్తాన్ సంసక్తానివ గచ్ఛతః
చిత్రరూపమిదం జిష్ణోర్దివ్యమస్త్రముదీర్యతః.
నేదం మనుష్యాః సందధ్యుర్నహీదం తేషువిద్యతే
పౌరాణానాం మహాస్త్రాణాం విచిత్రోఽయం సమాగమః.
ఆదదానస్య హి శరాన్ సంధాయ చ విముంచతః
వికర్షతశ్చ గాండీవం నాంతరం సమదృశ్యత.
మధ్యందినగతం సూర్యం ప్రతపంతమివాంబరే
నాశక్నువంత సైన్యాని పాండవం ప్రతి వీక్షితుం.
తథైవ భీష్మం గాంగేయం ద్రష్టుం నోత్సహతే జనః
ఉభౌ విశ్రుతకర్మాణావుభౌ తీవ్రపరాక్రమౌ
ఉభౌ సదృశకర్మాణావుభౌ యుధి సుదుర్జయౌ.
ఇత్యుక్తో దేవరాజస్తు పార్థభీష్మసమాగమం
పూజయామాస దివ్యేన పుష్పవర్షేణ భారత.
తతః శాంతనవో భీష్మో వామం పార్శ్వమతాడయత్
పశ్యతః ప్రతిసంధాయ విధ్యతః సవ్యసాచినః.
తతః ప్రహస్య బీభత్సుః పృథుధారేణ కార్ముకం
చిచ్ఛేద గార్ధ్రపత్రేణ భీష్మస్యాదిత్యతేజసః.
అథైనం దశభిర్బాణైః ప్రత్యవిధ్యత్ స్తనాంతరే
యతమానం పరాక్రాంతం కుంతీపుత్రో ధనంజయః.
స పీడితో మహాబాహుర్గృహీత్వా రథకూబరం
గాంగేయో యుద్ధదుర్ధర్షస్తస్థౌ దీర్ఘమివాంతరం.
తం విసంజ్ఞమపోవాహ సంయంతా రథవాజినాం
ఉపదేశమనుస్మృత్య రక్షమాణో మహారథం.

---

దశదిశలనూ ఆచ్ఛాదించాయి. అంతలో భీష్ముని రథచక్రరక్షకులు అర్జున బాణ నిహతులై నేల కూలారు. ఇంద్రాదులందరూ అర్జునుని అస్త్ర విద్యా పాటవాన్ని వేనోళ్ళ కొనియాడుతున్నారు గంధర్వాధీశుడైన చిత్రసేనుడు ధనుర్విద్యా నైపుణ్యాన్ని పరిపరివిధాల ప్రశంసిస్తున్నాడు. అన్యజనదుర్లభమైన విధానంలో నారి పోయి సాగిస్తున్నారు. అమ్ములపొదిలో నుండి బాణం తియ్యడం సంధించడం విడిచిపెట్టడం ఎవ్వరూ వీక్షించలేనంత వేగంగా జరుగుతున్నాయి. మాధ్యందినగ్రీష్మభానునివలె ప్రజ్వలించే అర్జునుని కురువీరులు కన్నెత్తి చూడలేకపోతున్నారు. భీష్మాచార్యులు కూడా తాదృశంగానే ప్రకాశిస్తూ పరాక్రమిస్తున్నాడు.

ఇంద్రుడు పూలవాన కురిపిస్తున్నాడు. చిత్రసేనుడు అభినందన గీతాలు ఆలాపిస్తూనే ఉన్నాడు. అంతలో భీష్ముడు అర్జునుని వామభాగాన్ని ఛేదించాడు. అర్జునుడు చిరునగవుతో భీష్ముని ధనుస్సును ఛేదించాడు. భీష్ముడు నిశ్చేష్టుడై నిలబడగా వాడిబాణంతో అతని రొమ్ముపై కొట్టాడు. అచేతనుడై భీష్ముడు రథంమీద వాలాడు. సారథి రథాన్ని ప్రక్కకు మరలించాడు.

## అరువది అయిదవ అధ్యాయం

భీష్మే తు సంగ్రామశిరో విహాయ
పలాయమానే ధృతరాష్ట్రపుత్రః
ఉత్సృజ్య కేతుం వినదన్ మహాత్మా
ధనుర్విగృహ్యార్జునమాససాద.
స భీమధన్వానముదగ్రవీర్యం
ధనంజయం శత్రుగణే చరంతం
ఆకర్ణపూర్ణాయతచోదితేన
వివ్యాధ భల్లేన లలాటమధ్యే.
స తేన బాణేన సమర్పితేన
జాంబూనదాగ్రేణ సుసంహితేన
రరాజ రాజన్ మహనీయకర్మా
యథైకపర్వా రుచిరైకశృంగః.
అథాస్య బాణేన విదారితస్య
ప్రాదుర్బభూవాసృగజస్రముష్ణం
స తస్య జాంబూనదపుంఖచిత్రో
భిత్త్వా లలాటం సువిరాజతే స్మ
దుర్యోధనశ్చాపి తముగ్రతేజాః
పార్థశ్చ దుర్యోధనమేకవీరః
అన్యోన్యమాజౌ పురుషప్రవీరౌ
సమౌ సమాజగ్మతురాజమీఢౌ.
తతః ప్రభిన్నేన మహాగజేన
మహీధరాభేన పునర్వికర్ణః
రథైశ్చతుర్భిర్గజపాదరక్షైః
కుంతీసుతం జిష్ణుమథాభ్యధావత్.
తమాపతంతం త్వరితం గజేంద్రం
ధనంజయః కుంభవిభాగమధ్యే
ఆకర్ణపూర్ణేన మహాయసేన
బాణేన వివ్యాధ మహాజవేన.
పార్థేన సృష్టః స తు గార్ధ్రపత్ర
ఆపుంఖదేశాత్ ప్రవివేశ నాగం
విదార్య శైలప్రవరం ప్రకాశం
యథాశనిః పర్వతమింద్రసృష్టః.

## అరువది అయిదవ అధ్యాయం

సంగ్రామరంగ ముఖంనుండి భీష్మరథం వెనుదిరగడంతో దుర్యోధనుడు తన రథాన్ని అర్జునుని వైపు నడిపించాడు. భయంకర పరాక్రమధీరుడైన అర్జునుడు వీరవిహారం చేస్తూంటే దుర్యోధనుడు ఆకర్ణాంతం బాణం లాగి అర్జునుని లలాటంమీద కొట్టాడు. రమణీయ శిఖరాగ్ర భాసితమైన పర్వతంవలె ఆ బాణంతో అర్జునుడు శోభిస్తున్నాడు. వాని వదనసీమనుండి వేడినెత్తురు ప్రవహిస్తోంది. దుర్యోధనార్జునుల మధ్య తీవ్రయుద్ధమారంభమైంది. ఒక మదమత్తేభంమీద వికర్ణుడు బయలుదేరి అర్జునుని ఎదుర్కొన్నాడు. వాని వెంట నలుగురు మహారథికులు కూడా ఉన్నారు. అది చూచి అర్జునుడు ఆకర్ణాంతం ధనుస్సులాగి లోహమయ బాణాలతో మత్తేభ కుంభస్థలం భేదించాడు. వజ్రఘాతం పొందిన పర్వతంవలె నేల కూలింది. వికర్ణుడు భయభీతుడై ఎనిమిది వందల అడుగుల దూరంలో ఉన్న వివింశతి రథంమీదకి వెళ్ళిపోయాడు. అర్జునుడు తీవ్ర క్రోధంతో దుర్యోధనుని వక్షస్థలంమీదికి వాడి బాణాలు విడిచి అక్కడకు చేరిన ప్రముఖ యోధు

శరప్రతప్తః స తు నాగరాజః
ప్రవేపితాంగో వ్యథితాంతరాత్మా
సంసీదమానో నిపపాత మహ్యాం
వజ్రాహతం శృంగమివాచలస్య.
నిపాతితే దంతివరే పృథివ్యాం
త్రాసాద్ వికర్ణః సహసావతీర్య
తూర్ణం పదాన్యష్టశతాని గత్వా
వివింశతేః స్యందనమారురోహ.
నిహత్య నాగం తు శరేణ తేన
వజ్రోపమేనాద్రివరాంబుదాభం
తథావిధేనైవ శరేణ పార్థో
దుర్యోధనం వక్షసి నిర్బిభేద.
తతో గజే రాజని చైవ భిన్నే
భగ్నే వికర్ణే చ సపాదరక్షే
గాండీవముక్తైర్విశిఖైః ప్రణున్నా
స్తే యోధముఖ్యాః సహసాపజగ్ముః.
దృష్ట్వైవ పార్థేన హతం చ నాగం
యోధాంశ్చ సర్వాన్ ద్రవతో నిశమ్య
రథం సమావృత్య కురుప్రవీరో
రణాత్ ప్రదుద్రావ యతో న పార్థః.

తం భీమరూపం త్వరితం ద్రవంతం
దుర్యోధనం శత్రుసహోఽభిషంగాత్
ప్రాస్ఫోటయద్ యోద్ధుమనాః కిరీటీ
బాణేన విద్ధం రుధిరం వమంతం.
విహాయ కీర్తిం విపులం యశశ్చ
యుద్ధాత్ పరావృత్య పలాయసే కిం
న తేఽద్య తూర్యాణి సమాహతాని
తథైవ రాజ్యాదవరోపితస్య.
యుధిష్ఠిరస్యాస్మి నిదేశకారీ
పార్థస్తృతీయో యుధి సంస్థితోఽస్మి
తదర్థమావృత్య ముఖం ప్రయచ్ఛ
నరేంద్రవృత్తం స్మర ధార్తరాష్ట్ర.
మోఘం తవేదం భువి నామధేయం
దుర్యోధనేతీహ కృతం పురస్తాత్
న హీహ దుర్యోధనతా తవాస్తి
పలాయమానస్య రణం విహాయ.
న తే పురస్తాదథ పృష్ఠతో వా
పశ్యామి దుర్యోధన రక్షితారం
అపేహి యుద్ధాత్ పురుషప్రవీర
ప్రాణాన్ ప్రియాన్ పాండవతోఽద్య రక్ష.

నందరినీ శరపరంపరలతో వేధించగా వారందరూ దుర్యోధన సహితులై అర్జునుని కంటికి కనిపించకుండా పారిపోయారు. దుర్యోధనుడు అర్జునబాణాఘాతాలకు తట్టుకోలేక రక్తం కక్కుకుంటూ పారిపోతూంటే అర్జునుడు పరమోత్సాహంతో వానిని తరుముతూ - ధార్తరాష్ట్రా! వెన్నుజూపి పారిపోతున్నావా. వంశప్రతిష్ఠను కళంకపరుస్తూ భీరుడవై పలాయనం చిత్తగిస్తున్నావా! ఈనాటి నీ అకృత్యాన్ని ఏ రాజశేఖరుడూ అభినందించలేడు. నిన్ను చూసి ఎవరూ తూర్యనాదాలు చెయ్యరు. నీవల్ల రాజ్యభ్రష్టుడైన ధర్మజుని ఆదేశానుసారం నేనిక్కడ యుద్ధానికి నిలబడి ఉన్నాను. మహారాజులయొక్క ఆచార వ్యవహారాలను నువ్వు విస్మరించి పరిస్థితి నీముఖం కూడా చూపలేక పలాయనం చిత్తగించడం చాలా శోచనీయము. నీ దుర్యోధన నామధేయం నీచేతతో వ్యర్థమైపోయింది. ఆ పేరు నీకింక తగదు, నీ ముందూ వెనుకల నిన్ను రక్షించేవారెవరూ లేరు. పారిపోయి ప్రాణరక్షణ చేసుకో - అన్నాడు.

## అరువది ఆఱవ అధ్యాయం

ఆహూయమానశ్చ స తేన సంఖ్యే
మహాత్మనా వై ధృతరాష్ట్రపుత్రః
నివర్తిత స్తస్య గిరాంకుశేన
మహాగజో మత్త ఇవాంకుశేన.
సోఽమృష్యమాణో వచసాభిమృష్టో
మహారథేనాతిరథ స్తరస్వీ
పర్యావవర్తాథ రథేన వీరో
భోగీ యథా పాదతలాభిమృష్టః.
తం ప్రేక్ష్య కర్ణః పరివర్తమానం
నివర్త్య సంస్తభ్య చ విద్ధగాత్రం
దుర్యోధనస్యోత్తరతోఽభ్యగచ్ఛత్
పార్థం నృవీరో యుధి హేమమాలీ.
భీష్మ స్తతః శాంతనవో వివృత్య
హిరణ్యకక్ష్య స్త్వరయాభిషంగీ
దుర్యోధనం పశ్చిమతోఽభ్యరక్షత్
పార్థాన్మహాబాహురధిజ్యధన్వా.
ద్రోణః కృపశ్చైవ వివింశతిశ్చ
దుశ్శాసనశ్చైవ వివృత్య శీఘ్రం
సర్వే పురస్తాద్ వితతోరుచాపా
దుర్యోధనార్థం త్వరితాఽభ్యుపేయుః.
స తాన్యనీకాని నివర్తమానా
న్యాలోక్య పూర్ణౌఘనిభాని పార్థః
హంసో యథా మేఘమివాపతంతం
ధనంజయః ప్రత్యపతత్ తరస్వీ.
తే సర్వతః సంపరివార్య పార్థ
మస్త్రాణి దివ్యాని సమాదదానాః
వవర్షురభ్యేత్య శరైః సమంతా
న్మేఘా యథా భూధరమంబువర్షైః.
తతోఽస్త్రమస్త్రేణ నివార్య తేషాం
గాండీవధన్వా కురుపుంగవానాం
సమ్మోహనం శత్రుసహోఽన్యదస్త్రం
ప్రాదుశ్చకారైంద్రిరపారణీయం.

---

## అరువది ఆఱవ అధ్యాయం

**మ**త్తేభాన్ని అంకుశం భేదించినట్లు దుర్యోధనుని అర్జునుని వాక్యాలు తీవ్రంగా వేధించసాగాయి. అర్జునుని తిరస్కార వాక్యాలు ఇంకా అగలేదు. మానధనుడైన దుర్యోధనుడు ఆ మాటల ములుకులు సహించలేక తన రథాన్ని మళ్లీ వెనకకు త్రిప్పాడు. అది చూసి కర్ణుడు కొంత కోలుకొని దుర్యోధనునికి సహకరించే సంకల్పంతో ఉత్తరదిక్కు నుండి వచ్చి అర్జునుని తాకాడు. భీష్మాచార్యుడు కూడా అంతలోనే తెలివి తెచ్చుకొని నారి సారించి పశ్చిమ ముఖంగా వచ్చి దుర్యోధనుని రక్షణకార్యక్రమంలో నిమగ్నుడయ్యాడు. అనంతరం ద్రోణ కృప వివింశతి దుశ్శాసనాదులు దృఢధనుర్ధరులై మరొక దిక్కు నుండి దుర్యోధన రక్షాదీక్షితులై వచ్చారు. మేఘాలను చెల్లాచెదరు చేసే సూర్యతేజంతో ధనంజయుడు తనపై విరుచుకుపడే కౌరవ యోధాంబుదాలను వేధించసాగాడు. నలుదిక్కుల నుండీ కౌరవవీరులు అర్జునపర్వతంపై బాణ వర్షం కురిపిస్తున్నారు. గాండీవి అస్త్రజాలం విడుస్తూ కౌరవ వ్యూహాన్ని ఛేదించి అన్యజన

తతో దిశశ్చానుదిశో వివృత్య
శరైః సుధారైర్నిశితైః సుపత్రైః
గాండీవఘోషేణ మనాంసి తేషాం
మహాబలః ప్రవ్యథయాంచకార.

తతః పునర్భీమవరం ప్రగృహ్య
దోర్భ్యాం మహాశంఖముదారఘోషం
వ్యనాదయత్ స ప్రదిశో దిశః ఖం
భువం చ పార్థో ద్విషతాం నిహంతా.

తే శంఖనాదేన కురుప్రవీరాః
సమ్మోహితాః పార్థసమీరితేన
ఉత్సృజ్య చాపాని దురాసదాని
సర్వే తదా శాంతిపరా బభూవుః.

తథా విసంజ్ఞేషు చ తేషు పార్థః
స్మృత్వా చ వాక్యాని తథోత్తరాయాః
నిర్యాహి మధ్యాదితి మత్స్యపుత్ర
మువాచ యావత్ కురవో విసంజ్ఞాః.

ఆచార్యశారద్వతయోః సుశుక్లే
కర్ణస్య పీతం రుచిరం చ వస్త్రం
ద్రౌణేశ్చ రాజ్ఞశ్చ తథైవ నీలే
వస్త్రే సమాదత్స్వ నరప్రవీర.

భీష్మస్య సంజ్ఞాం తు తథైవ మన్యే
జానాతి సోఽస్త్రప్రతిఘాతమేషః
ఏతస్య వాహాన్ కురు సవ్యతస్త్వ
మేవం హి యాతవ్యమమూఢసంజ్ఞైః.

రశ్మీన్ సముత్సృజ్య తతో మహాత్మా
రథాదవప్లుత్య విరాటపుత్రః
వస్త్రాణ్యుపాదాయ మహారథానాం
తూర్ణం పునః స్వం రథమారురోహ.

తతోఽన్వశాసచ్చతురః సదశ్వాన్
పుత్రో విరాటస్య హిరణ్యకక్ష్యాన్
తే తద్ వ్యతీయుర్ధ్వజినామనీకం
శ్వేతావహంతోఽర్జునమాజిమధ్యాత్.

తథానుయాంతం పురుషప్రవీరం
భీష్మః శరైరభ్యహనత్ తరస్వీ
స చాపి భీష్మస్య హయాన్ నిహత్య
వివ్యాధ పార్థో దశభిః పృషత్కైః.

దుస్సాధ్యమైన సమ్మోహనాస్త్రం ప్రయోగించాడు. ఉత్తరక్షణంలోనే నిశితబాణాలతో దశదిశలనూ ఆచ్ఛాదించి గాండీవధనుష్టంకారం చేసి కౌరవ యోధుల హృదయాలను దద్దరిల్లచేసాడు. కోసుదూరం వ్యాపించే శంఖధ్వానంతో దిశాంతాలనూ ప్రతిధ్వనింపచేస్తూ విహరిస్తూంటే కురుసేన సమూలంగా ఆయుధాలు విసర్జించి మూర్ఛాగతులయ్యారు కురువీరసేనావాహిని సమ్మూర్ఛితులు కావడంతో అర్జునునికి ఉత్తర కోరిక స్మృతికి వచ్చింది. తక్షణం ఉత్తరునివైపు తిరిగి ఇలా అన్నాడు.

రాజనందనా – వీరందరూ అచేతనులై పడి ఉన్నారు. చైతన్యం వీరికి వచ్చేలోగానే మనపని మనం పూర్తిచేసుకోవాలి. అదిగో ఆ శ్వేతవస్త్ర శోభితులైన ఆచార్యులే కృపద్రోణులు. పీతవస్త్రాలంకృతుడైనవాడే కర్ణుడు. నీలి వస్త్రాలతో శోభించే ఆ ఉభయులూ దుర్యోధనాశ్వత్థామలు. త్వరగా వెళ్ళి వారి శిరోలాంఛనాలను హరించు. భీష్మునివైపు మాత్రం పోకు. ఆ కురువృద్ధునికి ఈ సమ్మోహనాస్త్ర ఉపసంహారం తెలుసు. అందుచేత మనరథం ఆపి ఆయనకు వామభాగంగుండా పోనిచ్చి మన పని మనం పూర్తి చేసుకో

తతోఽర్జునో భీష్మమపాస్య యుద్ధే
విద్ధ్వాస్య యంతారమరిష్టధన్వా
తస్థౌ విముక్తో రథవృందమధ్యా
న్మేఘం విదార్యేవ సహస్రరశ్మిః.

లబ్ధ్వా హి సంజ్ఞాం తు కురుప్రవీరాః.
పార్థం నిరీక్ష్యాథ సురేంద్రకల్పం
రణే విముక్తం స్థితమేకమాజౌ
స ధార్తరాష్ట్రస్త్వరితం బభాషే.

అయం కథం స్వై భవతో విముక్త
స్తథా ప్రమథ్నీత యథా న ముచ్యేత్
తమబ్రవీచ్ఛాంతనవః ప్రహస్య
క్వ తే గతా బుద్ధిరభూత్ క్వ వీర్యం.

శాంతిం పరాం ప్రాప్య యదా స్థితోఽభూ
రుత్సృజ్య బాణాంశ్చ ధనుశ్చ చిత్రం
న త్వేష బీభత్సురలం నృశంసం
కర్తుం న పాపేఽస్య మనో విశిష్టం.

త్రైలోక్యహేతోర్న జహేత్ స్వధర్మం
సర్వే న తస్మాన్నిహతా రణేఽస్మిన్
క్షిప్రం కురూన్ యాహి కురుప్రవీర
విజిత్య గాశ్చ ప్రతియాతు పార్థః
మా తే స్వోఽర్థో నిపతేత మోహాత్
తత్ సంవిధాతవ్యమరిష్టబంధం.
దుర్యోధనస్తస్య తు తన్నిశమ్య
పితామహస్యాత్మహితం వచోఽథ
అతీతకామో యుధి సోఽత్యమర్షీ
రాజా వినిఃశ్వస్య బభూవ తూష్ణీం.
తద్ భీష్మవాక్యం హితమీక్ష్య సర్వే
ధనంజయాగ్నిం చ వివర్ధమానం
నివర్తనాయైవ మనో నిదధ్యు
ర్దుర్యోధనం తే పరిరక్షమాణాః.
తాన్ ప్రస్థితాన్ ప్రీతమనాః స పార్థో
ధనంజయః ప్రేక్ష్య కురుప్రవీరాన్
అభాషమాణోఽనునయం ముహూర్తం
వచోఽబ్రవీత్ సంపరిహృత్య భూయః.

---

వాలి – అన విని ఉత్తరుడు రథం దిగిపోయి వారి ఉష్ణీషాలను హరించి తెచ్చాడు. అర్జునుని రథం విరటనగరంవైపు బయలు దేరింది – భీష్ము డది గ్రహించి తీవ్రవేగంతో బాణాలు విడిచి అర్జునుని వేధించసాగాడు. అర్జునుడు భీష్ముని గుర్రాలను సంహరించి బాణదశకంతో భీష్మునిగూడా వేధించి సారథిని గాయపరచి ప్రకాశిస్తూ నిలబడ్డాడు. అంతలో కురువీరులందరూ చైతన్యం పొందారు.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముని సమీపించి – తాతా నీ నాస్త్రాలనుండి వీడు ఎలా తప్పించుకో గలిగాడు? అని ప్రశ్నించగా దుర్యోధనా – మీరందరూ ఆయుధాలు విసర్జించినప్పుడు మీ పరాక్రమమూ బుద్ధికుశలత ఏమయ్యాయి. అర్జునుడు దయారహితుడై పాపాచారపరాయణుడై ఎన్నడూ చరించలేదు. త్రైలోక్యాధిపత్యం వచ్చినా వాడు ధర్మచ్యుతుడు కాడు. కనుకనే మిమ్ము సంహరించకుండా విడిచిపెట్టాడు. వాడు గోవులను తరలించుకుపోతున్నాడు. నువ్వు త్వరగా హస్తిపురి చేరడం మంచిది. నామాట ప్రకారం నడిస్తే నీకు మేలు కలుగుతుంది – అని చెప్పగా దుర్యోధనుడు వేడి నిట్టూర్పులు విడుస్తూ యుద్ధ విముఖుడయ్యాడు – అక్కడి యోధులందరూ భీష్ముని హితవచనం శ్రేయస్కరంగా భావించారు. కురువీరు లందరూ వెనుదిరగడంతో

పితామహం శాంతనవం చ వృద్ధం
ద్రోణం గురుంచ ప్రణిపత్యమూర్ధ్నా
ద్రౌణిం కృపం చైవ కురూంశ్చ మాన్యా
న్శరైర్విచిత్రైరభివాద్య చైవ.
దుర్యోధనస్యోత్తమ రత్నచిత్రం
చిచ్ఛేద పార్థో ముకుటం శరేణ
ఆమంత్ర్య వీరాంశ్చ తథైవ మాన్యా
గాండీవ ఘోషేణ వినాద్య లోకాన్.
స దేవదత్తం సహసా వినాద్య
విదార్య వీరో ద్విషతాం మనాంసి

ధ్వజేన సర్వానభిభూయ శత్రూన్
స హేమమాలేన విరాజమానః
దృష్ట్వా ప్రయాతాంస్తు కురూన్ కిరీటీ
హృష్టోఽబ్రవీత్తత్ర స మత్స్యపుత్రం
ఆవర్తయాశ్వాన్ పశవో జితాస్తే
యాతాః పరే యాహి పురం ప్రహృష్టః.
దేవాస్తు దృష్ట్వా మహదద్భుతం తద్
యుద్ధం కురూణాం సహ ఫాల్గునేన
జగ్ముర్యథాస్వం భవనం ప్రతీతాః
పార్థస్య కర్మాణి విచింతయంతః.

## అరువది ఏడవ అధ్యాయం

తతో విజిత్య సంగ్రామే కురూన్ స వృషభేక్షణః
సమానయామాస తదా విరాటస్య ధనం మహత్.
గతేషు చ ప్రభగ్నేషు ధార్తరాష్ట్రేషు సర్వతః
వనాన్నిష్క్రమ్య గహనాద్ బహవః కురుసైనికాః.
భయాత్ సంత్రస్తమనసః సమాజగ్ముస్తతస్తతః
ముక్తకేశా వ్యదృశ్యంత స్థితాః ప్రాంజలయస్తదా.
క్షుత్పిపాసాపరిశ్రాంతా విదేశస్థా విచేతసః
ఊచుః ప్రణమ్య సంభ్రాంతాః పార్థ కిం కరవామ తే.

అర్జునుడు సంతోషచిత్తుడై రెండు ఘడియలు అనునయ వాక్యాలు పలికి భీష్మ ద్రోణులకు శిరః ప్రణామంచేసి వారితో కొంతసేపు భాషించి కృపాశ్వత్థామాదిప్రముఖులకు నమస్కార బాణాలు వదలి దుర్యోధనుని శిరస్సుమీది రత్న ఖచిత కిరీటాన్ని పడగొట్టి ధనుష్టంకారంచేసి దేవదత్తం పూరించి శత్రుహృదయాలను గజగజ లాడించి సువర్ణ మాలామండితపతాక శోభితమైన రథం మీద విజయశ్రీ సముపేతుడై శోభిస్తున్నాడు. కౌరవులు హస్తిపురివైపు తిరిగారు.

ఉత్తరా - మన రథం వెనక్కి త్రిప్పు. శత్రువులు పారిపోయారు. మన గోధనం మనకు చేకూరింది - సంతోషంతో నగరప్రవేశం చేద్దాము. అంతవరకూ ఆకాశంమీద విహరిస్తూన్న దేవతలు అర్జునుని హస్తలాఘవాన్నీ అస్త్ర శస్త్ర విద్యా కౌశలాన్నీ కొనియాడుతూ తమ తమ వాసాలకు పోయారు.

## అరువది ఏడవ అధ్యాయం

### విరాట నగర ప్రవేశం

కురు యోధులను ఓడించి గోగణాలను మరలించి అర్జునుడు విరాటనగరం వైపు వస్తున్నాడు. అంతకుముందు జరిగిన ఘోర సంగ్రామ సమయంలో అర్జునుని పరాక్రమానికి భయపడి పారిపోయిన సైనికులందరూ యుద్ధ విరామం గ్రహించి అర్జునుని సమీపించారు. అప్పటికీ వారి హృదయాలు భయంతో కంపిస్తూనే ఉన్నాయి.

ప్రాణానంతర్మనోయాతాన్ ప్రయాచిష్యామహే వయం
వయం చార్జున తే దాసా హ్యనురక్ష్యా హ్యనాయకాః.
అనాథాన్ దుఃఖితాన్ దీనాన్
కృశాన్ వృద్ధాన్ పరాజితాన్
న్యస్తశస్త్రాన్ నిరాశాంశ్చ
నాహం హన్మి కృతాంజలీన్.
స్వస్తి వ్రజత వో భద్రం న ఖేతవ్యం కథంచన
నాహమార్తాన్జిఘాంసామిభృశమాశ్వాసయామివః
తస్య తామభయాం వాచం శ్రుత్వా యోధాః సమాగతాః
ఆయుః కీర్తియశోదాభిస్తమాశీర్భిరనందయన్.
తతోఽర్జునం నగమివ ప్రభిన్న
ముత్సృజ్య శత్రూన్ వినివర్తమానం
విరాటరాష్ట్రాభిముఖం ప్రయాతం
నాశక్నువంస్తం కురవోఽభియాతుం.
తతః స తన్మేఘమివాపతంతం
విద్రావ్య పార్థః కురుసైన్యవృందం
మత్స్యస్య పుత్రం ద్విషతాం నిహంతా
వచోఽబ్రవీత్ సంపరిరభ్య భూయః.
పితుః సకాశే తవ తాత సర్వే
వసంతి పార్థా విదితం తవైవ
తాన్ మా ప్రశంసేర్నగరం ప్రవిశ్య
భీతః ప్రణశ్యేద్ధి స మత్స్యరాజః.
మయా జితా సా ధ్వజినీ కురూణాం
మయా చ గావో విజితా ద్విషద్భ్యః
పితుః సకాశం నగరం ప్రవిశ్య
త్వమాత్మనః కర్మ కృతం బ్రవీహి.

అవయవాలు విచలిస్తూ ఉన్నాయి. భయాందోళిత హృదయులై చేతులు జోడించి-కౌంతేయా-మమ్ము నీ సేవలో నియోగించుకొని మాకు అభయమియ్యి. అనాథులమైన మేము మిమ్ము సేవిస్తూ జీవిస్తాము - అని దీనంగా అర్థించారు.

సైనికులారా - దుఃఖార్తులూ దుర్బలులూ అనాథులూ వృద్ధులూ దీనులూ ఆయుధ రహితులూ నిరాశోపహతులూ శరణాగతులూ ఐన వారిని సంహరించే ఉద్దేశం నాకెప్పుడూ లేదు. మీకు నావల్ల ఏ భయమూ లేదు. నిర్భయంగా మీరందరూ మీ గృహాలకు వెళ్లండి మీ మీద నాకు అపారమైన విశ్వాస ముంది. మీకు మేలు కలుగుతుంది పొమ్మని అర్జునుడనగా వారిలోని ప్రముఖయోధు లందరూ అర్జునుని యశస్సునూ ఆయుర్వృద్ధినీ వాంఛిస్తూ వెళ్లిపోయారు.

మదధారాదలో పేతమైన మత్తేభంవలె అర్జునుడు విరటనగరంలో ప్రవేశం చేస్తూ ఉత్తరుని హృదయపూర్వకంగా ఆలింగనం చేసుకొని - పూజ్యుడా - నీ పితృగృహంలో పాండవ సోదరుల మందరమూ ఉంటూన్న విషయం ఇప్పటికి నీకొక్కడికే తెలుసు. అయితే రాజధాని చేరగానే ఈవిషయమై నువ్వు మీ తండ్రితో ప్రసంగించడం గాని పాండవులను ప్రశంసిస్తూ భాషించడంగాని చెయ్యకూడ దని మరిచిపోకు. నగరం ప్రవేశించగానే కురుయోధు లందరినీ నువ్వే ఓడించినట్లు ప్రకటించు. గోగణాలను నీ శక్తితోనే తరలించినట్లు వివరించి చెప్పు. అలా కాక మా విషయమై ఏమాత్రం నువ్వు ప్రసంగించినా మీ తండ్రి భయచిత్తుడై మరణిస్తాడు. అనగా ఉత్తరుడు - సవ్యసాచీ - నువ్వు ప్రదర్శించిన పరాక్రమం

యత్ తే కృతం కర్మ న పారణీయం
తత్కర్మ కర్తుం మమ నాస్తి శక్తిః
న త్వాం ప్రవక్ష్యామి పితుః సకాశే
యావన్న మాం వక్ష్యసి సవ్యసాచిన్.
స శత్రుసేనామవజిత్య జిష్ణు
రాచ్ఛిద్య సర్వం చ ధనం కురుభ్యః
శ్మశానమాగత్య పునః శమీం తా
మభ్యేత్య తస్థౌ శరవిక్షతాంగః.
తతః స వహ్నిప్రతిమో మహాకపిః
సహైవ భూతైర్దివముత్పపాత
తథైవ మాయా విహితా బభూవ
ధ్వజం చ సైహం యుయుజే రథేపునః
విధాయ తచ్చాయుధమాజివర్ధనం
కురూత్తమానామిషుధీః శరాంస్తథా
ప్రాయాత్ స మత్స్యో నగరం ప్రహృష్టః
కిరీటినా సారధినా మహాత్మనా.
పార్థస్తు కృత్వా పరమార్యకర్మ
నిహత్య శత్రూన్ ద్విషతాంనిహంతా
చకార వేణీం చ తథైవ భూయో
జగ్రాహ రశ్మీన్ పునరుత్తరస్య
వివేశ హృష్టో నగరం మహాత్మనా
బృహన్నలారూపముపేత్య సారథిః.
తతో నివృత్తాః కురవః ప్రభగ్నా వశమాస్థితాః.
హస్తినాపురముద్దిశ్య సర్వే దీనా యయుస్తదా.
పంథానముపసంగమ్య ఫాల్గునో వాక్యమబ్రవీత్
రాజపుత్ర ప్రత్యవేక్ష సమానీతాని సర్వశః
గోకులాని మహాబాహో వీర గోపాలకైః సహ.
తతోఽపరాహ్ణే యాస్యామో విరాటనగరం ప్రతి
ఆశ్వాస్య పాయయిత్వా చ పరిప్లావ్య చ వాజినః.
గచ్ఛంతు త్వరితాశ్చైవ గోపాలాః
ప్రేషితాస్త్వయా
నగరే ప్రియమాఖ్యాతుంఘోషయంతు చ తేజయం
అథోత్తరస్త్వరమాణః స దూతా
నాజ్ఞాపయద్ వచనాత్ ఫాల్గుణస్య
ఆచక్షధ్వం విజయం పార్థివస్య
భగ్నాః పరే విజితాశ్చాపి గావః.

---

అన్యజన దుర్లభమైంది నా జీవితంలో నెప్పుడూ అలా చరించలేను. ఐతే నువ్వు అజ్ఞాపించేవరకూ నేను నా తండ్రితో మీ విషయమై మాట్లాడను – అన్నాడు.

రథం శ్మశానభూమిలోని శమీవృక్షాన్ని చేరింది. అర్జునుని రథపతాకంమీద చరించే వానరుడూ అన్యభూతగణాలూ దానిని విడిచి వెళ్ళిపోయాయి. అప్పు డర్జునుడు రథం మీద సింహధ్వజం నిలబెట్టాడు. ఆయుధాలను యథా పూర్వం వలె శమీవృక్షంపై ఉంచి రథం నగరం వైపు పోనిచ్చాడు. దారిలో అర్జునుడు తిరిగి బృహన్నలవేషం ధరించి సారథి స్థానంలో కూర్చుని నగరం చేరుతూ – రాజనందనా – మన గోధనమంతా వచ్చేసింది. చూడు. మనం ఇప్పుడు ఈ గుర్రాలకు దప్పి తీర్చి స్నానం చేయించి సాయంకాలానికి నగరంలో ప్రవేశిద్దాము. మన గోగణాలు ముందుగా నగరం చేరి విజయవార్త ప్రకటిస్తాయి. మనం నగరంలో అడుగు పెట్టేవేళ నీ విజయ ధ్వానాలు విని పిస్తాయి – అన్నాడు.

బృహన్నల వాక్యానుసారం ఉత్తరుడు తన సేవకులకు అజ్ఞలిచ్చి దూతను పిలిచి మహారాజును విజయలక్ష్మి వరించిందనీ శత్రువులు పలాయితు

ఇత్యేవం తౌ భారతమత్స్యవీరౌ
సమ్మంత్ర్య సంగమ్య తతః శమీం తాం
అభ్యేత్య భూయో విజయేన తృప్తౌ
వుత్సృష్టమారోపయతాం స్వభాండం.

స శత్రుసేనామభిభూయ సర్వా
మాచ్ఛిద్య సర్వం చ ధనం కురుభ్యః
వైరాటిరాయాన్నగరం ప్రతీతో
బృహన్నలాసారథినా ప్రవీరః

## అరువది ఎనిమిదవ అధ్యాయం

ధనం చాపి విజిత్యాశు విరాటో వాహినీపతిః
వివేశ నగరం హృష్టశ్చతుర్భిః పాండవైః సహ.
జిత్వా త్రిగర్తాన్ సంగ్రామే గాశ్చైవాదాయసర్వశః
అశోభత మహారాజ సహపార్థః శ్రియా వృతః.
తమాసనగతం వీరం సుహృదాం హర్షవర్ధనం
ఉపాసాంచక్రిరే సర్వే సహ పార్థైః పరంతపాః.
ఉపతస్థుః ప్రకృతయః సమస్తా బ్రాహ్మణైః సహ
సభాజితః ససైన్యస్తు ప్రతినంద్యాథ మత్స్యరాట్.
విసర్జయామాస తదా ద్విజాంశ్చ ప్రకృతీస్తథా
తథాసరాజా మత్స్యానాం విరాటో వాహినీపతిః.
ఉత్తరం పరిపప్రచ్ఛ క్వ యాత ఇతి చాబ్రవీత్
ఆచఖ్యుస్తస్య తత్సర్వం స్త్రియః కన్యాశ్చ వేశ్మని.
అంతఃపురచరాశ్చైవ కురుభిర్గోధనం హృతం
విజేతుమభిసంరబ్ధ ఏక ఏవాతిసాహసాత్
బృహన్నలసహాయశ్చ నిర్గతః పృథివీం జయః
ఉపయాతానతిరథాన్ భీష్మం శాంతనవం కృపం
కర్ణం దుర్యోధనం ద్రోణం ద్రోణపుత్రం చ మద్రథాన్
రాజా విరాటోఽథ భృశాభితప్తః
శ్రుత్వా సుతం హ్యేకరథేన యాతం
బృహన్నలాసారథిమాజివర్ధనం
ప్రోవాచ సర్వానథ మంత్రిముఖ్యాన్.

---

లయారనీ రాజనందనుడు తిరిగి వస్తున్నాడనీ చెప్పమన్నాడు.

భరత మత్స్య వంశ వీరకుమారు లిద్దరూ విజయోల్లసిత హృదయాలతో నెమ్మదిగా రాజధాని వైపు సాగుతున్నారు - అని వైశంపాయనుడు నగరవ్యవహారాలు వినిపించడానికి ఉద్యుక్తుడయాడు.

## అరువది ఎనిమిదవ అధ్యాయం

జనమేజయ మహారాజా,

విరాటరాజు దక్షిణదిశగా వచ్చిన త్రిగర్తుని ఓడించి అటు తరలింపబడిన గోధనాలను మరలించుకొని వచ్చాడని విన్నావుగదా. విజయహర్షంతో పాండవసహితుడై వచ్చి సింహాసనాసీనుడై ఉండగా వీరులూ శూరులూ వానిసేవార్థం వచ్చి నిలబడ్డారు. విప్ర సహిత ప్రజానీకం తమ మహారాజును తనివితీర అభినందించి స్తుతించారు.

ప్రశంసా పరితృప్తుడై మహారాజు అంతఃపురం చేరి ఉత్తరరాకుమారుని విషయమై ప్రశ్నించగా వారు యావద్వృత్తాంతమూ నివేదించారు.

మహారథికులూ, వీర శ్రేష్ఠులూ ధనుర్వేద వేత్తలూ అయిన భీష్మ ద్రోణ కృప కర్ణ దుర్యోధనాది మహాశూరు లందరినీ ఎదిరించడానికి

సర్వథా కురవస్తే హి యే చాన్యే వసుధాధిపాః
త్రిగర్తాన్నిఃసృతాంచ్ఛ్రుత్వా నస్థాస్యంతికదాచన.
తస్మాద్ గచ్ఛంతు మే యోధా బలేన
మహతా వృతాః
ఉత్తరస్య పరీప్సార్థం యే త్రిగర్తైరవిక్షతాః.
హయాంశ్చ నాగాంశ్చ రథాంశ్చ శీఘ్రం
పదాతిసంఘాంశ్చ తతః ప్రవీరాన్
ప్రస్థాపయామాస సుతస్య హేతో
ర్విచిత్రశస్త్రాభరణోపపన్నాన్.
ఏవంస రాజా మత్స్యానాం విరాటో వాహినీపతిః
వ్యాదిదేశాథ తాం క్షిప్రం వాహినీం చతురంగిణీం.
కుమారమాశు జానీత యది జీవతి వా న వా
యస్యయంతా గతః షండో మన్యేఽహం సనజీవతి.
తమబ్రవీద్ ధర్మరాజో విహస్య
విరాటరాజం తు భృశాభితప్తం
బృహన్నలా సారథిశ్చేన్నరేంద్ర
పరే న నేష్యంతి తవాద్య గాస్తాః.

సర్వాన్ మహీపాల్ సహితాన్ కురూంశ్చ
తథైవ దేవాసురసిద్ధయక్షాన్
అలం విజేతుం సమరే సుతస్తే
స్వనుష్ఠితః సారథినా హి తేన.
అథోత్తరేణ ప్రహితా దూతాస్తే శీఘ్రగామినః
విరాటనగరం ప్రాప్య విజయం సమవేదయన్.
రాజ్ఞస్తత్సర్వమాచఖ్యౌ మంత్రీవిజయముత్తమం
పరాజయంకురూణాం చాప్యుపాయాంతంతథోత్తరం
సర్వా వినిర్జితా గావః కురవశ్చ పరాజితాః
ఉత్తరః సహ సూతేన కుశలీ చ పరంతపః.
దిష్ట్యా వినిర్జితా గావః కురవశ్చ పలాయితాః
నాద్భుతం త్వేవ మన్యేఽహం యత్ తే
పుత్రోఽజయత్ కురూన్.
ధ్రువ ఏవ జయస్తస్య యస్య యంతా బృహన్నలా
దేవేంద్రసారథిశ్చైవ మాతలిర్లఘువిక్రమః
కృష్ణస్య సారథిశ్చైవ న బృహన్నలయా సమః.
తతో విరాటో నృపతిః సంప్రహృష్టతనూరుహః
శ్రుత్వా స విజయం తస్య కుమారస్యామితౌజసః.

---

బృహన్నల సారథ్యంలో ఉత్తరుడు వెళ్లాడని వినే సరికి విరటుని వదనం వెలవెల బోయింది. మంత్రులవైపు తిరిగి తక్షణం మన సేనలను రాకుమారుని రక్షణార్థం పంపండి; వచ్చినవారు కౌరవులైనా మరెవరైనా సరే మన యోధు లందరూ వెళ్లవలసిందే- అని చతురంగ బలాలకూ ఆదేశాలు ఇవ్వమన్నాడు. విరటుడు తన కుమారుడింకా బ్రతికి ఉంటాడనే ఆశలో లేడు. నపుంసకుని సారథ్యంలో వెళ్ళిన రథికుడు కౌరవ వీరుల చేతులలోనుండి బయటపడలేడని నిశ్చయించుకొన్నాడు. విరటుని దుఃఖం గమనించి చిరునవ్వుతో ధర్మరాజు - భూపాలా! సారథిగా బృహన్నలే వెళ్ళిఉన్నట్లైతే నువ్వు నిర్భయంగా ఉండవచ్చు; శత్రువులు మన గోధనాలను హరించుకొని పోలేరు. ఉత్తరుని శ్రేయోభిలాషియైన సారథి వానికి మేలే కలుగచేస్తాడు. కౌరవులేకాదు నానా దేశాధీశులూ ఎదురు వచ్చినా దేవ దానవ యక్షగంధర్వులు అడ్డు నిలిచినా ఉత్తరునికి ఏ ప్రమాదమూ లేదు - అని పలుకుతూండగా ఉత్తరుడు పంపిన దూత వచ్చి విజయవార్త ప్రకటించాడు. మంత్రులు మహారాజుకు వార్త నివేదించారు. బృహన్నలాసహితుడై ఉత్తరుడు గోధనాలతో నగరం చేరుతున్నాడని వినిపించగానే ధర్మరాజు - మహారాజా! సంతోషప్రద

ఆచ్ఛాదయిత్వా దూతాంస్తాన్ మంత్రిణం
సోఽభ్యచోదయత్
రాజమార్గాః క్రియంతాం మే పతాకాభిరలంకృతాః
పుష్పోపహారైరర్చ్యంతాం దేవతాశ్చాపి సర్వశః
కుమారా యోధముఖ్యాశ్చ గణికాశ్చ
స్వలంకృతాః
వాదిత్రాణిచ సర్వాణి ప్రత్యుద్యాంతు సుతంమమ
ఘంటావాన్ మానవః శీఘ్రం మత్తమారుహ్య
వారణం
శృంగాటకేషు సర్వేషు ఆఖ్యాతు విజయం మమ
ఉత్తరా చ కుమారీభిర్బహ్వీభిః పరివారితా
శృంగారవేషాభరణా ప్రత్యుద్యాతు సుతం మమ.
శ్రుత్వా చేదం వచనం పార్థివస్య
సర్వం పురం స్వస్తికపాణిభూతం
భేర్యశ్చ తూర్యాణి చ వారిజాశ్చ
వేషైః పరార్ధ్యైః ప్రమదాః శుభాశ్చ.
తథైవ సూతైః సహ మాగధైశ్చ
నాందీవాద్యాః పణవాస్తూర్యవాద్యాః
పురాద్ విరాటస్య మహాబలస్య
ప్రత్యుద్యయుః పుత్రమనంతవీర్యం.
ప్రస్థాప్య సేనాం కన్యాశ్చ గణికాశ్చస్వలంకృతాః
మత్స్యరాజో మహాప్రాజ్ఞః ప్రహృష్ట ఇదమబ్రవీత్
అక్షానాహర సైరంధ్రి కంకద్యూతం ప్రవర్తతాం
తం తథావాదినం దృష్ట్వా పాండవః ప్రత్యభాషత
న దేవితవ్యం హృష్టేన కితవేనేతి నః శ్రుతం
తం త్వామద్య ముదా యుక్తం నాహం
దేవితుముత్సహే
ప్రియం తు తే చికీర్షామి వర్తతాం యది మన్యసే
స్త్రియో గావో హిరణ్యం చ యచ్చాన్యద్ వసు
కించన
న మే కించిత్ త్వయా రక్ష్యమంతరేణాపి దేవితుం.
కిం తే ద్యూతేన రాజేంద్ర బహుదోషేణమానద
దేవనే బహవో దోషా స్తస్మాత్ తత్ పరివర్జయేత్
శ్రుతస్తే యదివాదృష్టః పాండవేయో యుధిష్ఠిరః
స రాష్ట్రం సుమహత్ స్ఫీతం భ్రాతౄంశ్చ
త్రిదశోపమాన్.

---

మైన వార్త వినిపించింది. రాకుమారుడు కౌరవులను ఓడించి విజయంతో వస్తున్నాడు. బృహన్నల సారథ్యంలో అపజయం ఉండదు ఇంద్రసారథియైన మాతలికంటె కృష్ణరథచోదకుడైన దారుకునికంటె బృహన్నల ఘనుడు – అన్నాడు.

విజయవార్తను తెచ్చిన దూతకు విరటుడు రత్నభూషణాలంకారాలు బహూకరించి –మంత్రులారా – రాజవీధు లన్నీ విజయపతాకాలతో అలంకరించండి. దేవాయతనాలలో పూజలు జరిపించండి కుమారుని స్వాగతంకోసం సాలంకృత వేశ్యలనూ సాయుధ యోధులనూ వీరకుమారులనూ ఎదురు పంపండి. గజరాజుమీద ఘంటానినాదంతో నగరశృంగాటకాలలో విజయవార్త ప్రకటించండి. ఉత్తరా రాకుమారి సర్వాంగాలంకృత శోభనాంగులైన రాజకన్యలతో ఎదురు వెళ్లాలి – అని ఆజ్ఞాపించాడు.

విరటుని ఆజ్ఞానుసారం దివ్యభూషణ శోభితాంగులై కమనీయ కామినీమణులు యౌవనవసంత ప్రాదుర్భూతులైన కన్యకామణులూ వందిమాగధ సూతబృందాలవారూ పురవాసులూ మంగళవస్తు సంభారాలతో పణవ తూర్య భేరీ మృదంగ శంఖనాదాలతో ఉత్తరునికి ఎదురు వెళ్లారు. వారివెంట సైనికులూ వారి వెనుక వారాంగనలూ నడుస్తున్నారు.

రాజ్యం హారితవాన్ సర్వం తస్మాద్ ద్యూతం న రోచయే
నిఃసంశయం స కితవః పశ్చాత్ తప్యతి పాండవః
వివిధానాం చ రత్నానాం ధనానాంచ పరాజయే
అస్మిన్ క్షితివినాశశ్చ వాక్పారుష్యమనంతరం.
అవిశ్వాస్యం బుధైర్నిత్యమేకాహ్న ద్రవ్యనాశనం
అథవా మన్యసే రాజన్ దీవ్యామ యది రోచతే.
ప్రవర్తమానే ద్యూతే తు మత్స్యః పాండవమబ్రవీత్
పశ్య పుత్రేణ మే యుద్ధే తాదృశాః కురవో జితాః
తతోఽబ్రవీన్మహాత్మా స ఏనం రాజా యుధిష్ఠిరః
బృహన్నలా యస్య యంతా కథం స న జయేద్ యుధి
ఇత్యుక్తః కుపితో రాజా మత్స్యః పాండవమబ్రవీత్
సమం పుత్రేణ మే షండం బ్రహ్మబంధో ప్రశంససి
వాచ్యావాచ్యం న జానీషే నూనం మామవమన్యసే
భీష్మద్రోణముఖాన్ సర్వాన్ కస్మాన్న స విజేష్యతి

సైరంధ్రీ - పాచికలు తీసుకురా. కంకా - ద్యూతం ప్రారంభిద్దామా - అని విరటు డనగా, ధర్మరాజు - మహారాజా పరమ సంతోష చిత్తంతో ఉన్నవానితో ద్యూతక్రీడ సాగించ రాదని విన్నాను. ఇప్పుడు మీరు ఆనంద తరంగాలలో తేలియాడుతున్నారు. ఐనా మీకు మరీ కుతూహలంగా ఉంటే ఆట ప్రారంభించవచ్చు - అన్నాడు.

ఈ ద్యూతమే లేకపోతే నాకు ఈ స్త్రీ సువర్ణ గోధనాలు అనవసరం - అని విరటుడు సమాధాన మివ్వగా - మహారాజా ద్యూతం బహుదోషయుతమైనది. అందుచేతనే ఈ క్రీడ మంచిది గాదన్నారు. మీరు ఇంతః పూర్వం ధర్మరాజును చూసి ఉండకపోయినా వానిపేరు వినే ఉంటారు. ఆయన సస్యశ్యామలమైన రాజ్యాన్ని దేనపను

వయస్యత్వాత్ తు తే బ్రహ్మన్నపరాధమిమం క్షమే
నేదృశం తు పునర్వాచ్యం యది జీవితుమిచ్ఛసి.
యత్ర ద్రోణ స్తథా భీష్మో ద్రౌణిర్వైకర్తనః కృపః
దుర్యోధనశ్చ రాజేంద్ర స్తథాన్యే చ మహారథాః
మరుద్గణైః పరివృతః సాక్షాదపి మరుత్పతిః
కోఽన్యో బృహన్నలాయాస్తాన్ ప్రతియుధ్యేత సంగతాన్.
యస్య బాహుబలే తుల్యో న భూతో న భవిష్యతి
అతీవ సమరం దృష్ట్వా హర్షో యస్యోపజాయతే.
యోఽజయత్ సంగతాన్ సర్వాన్ ససురాసురమానవాన్
తాదృశేన సహాయేన కస్మాత్ స న విజేష్యతే
బహుశః ప్రతిషిద్ధోఽపి న చ వాచం నియచ్ఛసి
నియంతా చేన్న విద్యేత న కశ్చిద్ ధర్మమాచరేత్

తేజస్వులైన సోదరులనూ ద్యూతంలోనే ఓడి పోయాడు. అది విన్ననాటినుంచీ నాకు దీనిమీద వైముఖ్యం పుడుతోంది. సర్వ ధనరత్నాలూ కోల్పోయిన ధర్మరాజు నిజంగా ఇప్పుడు పశ్చాత్తాప పడుతూ ఉంటాడు. జూదరుల ప్రసంగాలలో ఉచితానుచితాలు ఉండవు. హిమవన్నగ సదృశ ధనరాశులు క్షణంలో పోతాయి. అందుచేతనే విద్వాంసులు జూదరులను విశ్వసించరు. ఐనా మీకిప్పుడు ద్యూత క్రీడయే వాంఛనీయమైతే నాకేమీ అభ్యంతరం లేదన్నాడు.

ఆట ప్రారంభమైంది. కొంత సాగాక విరటుడు సంతోషంతో - కంకా చూసావా. మా ఉత్తరుడు కౌరవ వీరులను జయించి వచ్చాడు - అని అనగా, భూపాలా బృహన్నల సారథ్యంలో ఏ రథికుడూ ఓటమి ఎరుగడు - అని ధర్మరాజు

తతః ప్రకుపితో రాజా తమక్షేణాహనద్ భృశం
ముఖే యుధిష్ఠిరం కోపాన్నైనమిత్యేవ భర్త్స్యయన్
బలవత్ ప్రతివిద్ధస్య నస్తః శోణితమావహత్
తదప్రాప్తంమహీంపార్థః పాణిభ్యాం ప్రత్యగృహ్ణాత
అవైక్షత స ధర్మాత్మా ద్రౌపదీం పార్శ్వతఃస్థితాం
సా జ్ఞాత్వా తమభిప్రాయం భర్తుశ్చిత్తవశానుగా.
పాత్రం గృహీత్వా సౌవర్ణం జలపూర్ణమనిందితా
తచ్ఛోణితం ప్రత్యగృహ్ణాద్ యత్ ప్రసుస్రావ నస్తతః,
అథోత్తరః శుభైర్గంధైర్మాల్యైశ్చ వివిధైస్తథా
అవకీర్యమాణః సంహృష్టో నగరం స్వైరమాగతః
సభాజ్యమానః పౌరైశ్చ స్త్రీభిర్జానపదైస్తథా
ఆసాద్య భవనద్వారం పిత్రే సంప్రత్యవేదయత్.
తతో ద్వాఃస్థః ప్రవిశ్యైవ విరాటమిదమబ్రవీత్
బృహన్నలాసహాయశ్చ పుత్రో ద్వార్యుత్తరఃస్థితః
తతో హృష్టో మత్స్యరాజః క్షత్తారమిదమబ్రవీత్
ప్రవేశ్యతాముభౌతూర్ణందర్శనేప్సురహంతయోః.
క్షత్తారం కురురాజస్తు శనైః కర్ణ ఉపాజపత్
ఉత్తరః ప్రవిశత్వేకో న ప్రవేశ్యా బృహన్నలా.
ఏతస్య హి మహాబాహో వ్రతమేతత్ సమాహితం
యో మమాంగే వ్రణం కుర్యాచ్ఛోణితం వాపి
దర్శయేత్.
అన్యత్రసంగ్రామగతాన్నసజీవేత్కథంచన[శోణితం
నమృష్యాద్భృశసంక్రుద్ధోమాందృష్ట్వాతుస
విరాటమిహ సామాత్యం హన్యాత్ సబలవాహనం
తతోరాజ్ఞః సుతో జ్యేష్ఠః ప్రావిశత్ పృథివీంజయః
సోఽభివాద్య పితుః పాదౌ కంకం చాప్యుపతిష్ఠత.
తతో రుధిరసంయుక్తమనేకాగ్రమనాగసం
భూమావాసీనమేకాంతేసైరంధ్ర్యాప్రత్యుపస్థితం.
తతః పప్రచ్ఛ పితరం త్వరమాణ ఇవోత్తరః
కేనాయంతాడితోరాజన్ కేనపాప మిదంకృతం.

---

సమాధానమిచ్చాడు. విరటునికి ఆగ్రహం కలిగి - బ్రాహ్మణాధమా - ఒక నపుంసకుని విరటరాజు పుత్రునితో సమంగా ప్రశంసించడానికి నీకు నోరెల్లా వచ్చింది. ఏం మాట్లాడాలో నీకు తెలియడం లేదు. మహారాజును అవమానించాలని భావిస్తున్నావు భీష్మ ద్రోణాది వీరులను నా కొడుకు జయించలేడా ? మనమైత్రి కారణంగా నిన్నిప్పుడు క్షమిస్తున్నాను. జీవితంమీద ఆశ ఉంటే ఇంకెప్పుడూ ఇటువంటి ప్రసంగ చెయ్యకు- అన్నాడు.

ఆచార్య ద్రోణుడూ అశ్వత్థామా కృపాచార్యుడూ దుర్యోధనుడూ గాంగేయుడూ యుద్ధ సన్నాహంచేసి వచ్చినప్పుడు దేవేంద్రుడు గూడా వారిముందు నిలబడలేడు. ఒక్క బృహన్నల మాత్రమే అందుకు సమర్థుడు. దేవాసుర సిద్ధ సంఘాలు ఒక్కసారి వచ్చిపడినా ఓడించగల బృహన్నల సారథ్యంలో ఉత్తరుడు విజయం సాధించడంలో ఆశ్చర్యం లేదు - అని ధర్మరాజు యథాపూర్వం ప్రసంగించగా - విరటుడు ఆగ్రహోదగ్రుడై - కంకా - ఎన్ని విధాల చెప్పినా నువ్వు నోరు ముయ్యడంలేదు. శాసించే ప్రభువు లేకపోతే ప్రజలు ధర్మమార్గాన నడవలేరు. అని అంటూ విరటుడు తన చేతిలోని పాచికలు ధర్మజుని ముఖంమీదికి విసిరి - ఇంక ఆ ప్రసంగం తేకు అన్నాడు.

ఆ పాచికలు గట్టిగా తగలడంవల్ల ధర్మజుని ముక్కునుండి రక్తం స్రవించబోతూంటే ప్రక్కనున్న ద్రౌపదివైపు చూడగా ఆమె తన స్వామి అభిప్రాయం గ్రహించి సువర్ణపాత్రతో జలం తెచ్చి ధర్మజుని ముక్కువద్ద ఉంచింది.

మయాయం తాడితో జిహ్మో నచాప్యేతావదర్హతి
ప్రశస్యమానే యచ్ఛూరే త్వయిషంఢం ప్రశంసతి.
అకార్యం తేకృతం రాజన్ క్షిప్రమేవప్రసాద్యతాం
మా త్వాం బ్రహ్మవిషం ఘోరం సమూలమిహ
నిర్దహేత్.
స పుత్రస్య వచః శ్రుత్వా విరాటో రాష్ట్రవర్ధనః
క్షమయామాసకౌంతేయం భస్మచ్ఛన్నమివానలం.
క్షమయంతం తు రాజానం పాండవః ప్రత్యభాషత
చిరం క్షాంతమిదం రాజన్ న మన్యుర్విద్యతేమమ.
యదిహ్యేతత్ పతేద్ భూమౌ రుధిరంమమనస్తతః
సరాష్ట్రస్త్వం మహారాజ వినశ్యేథా న సంశయః.
న దూషయామి తే రాజన్ యద్ వై
హన్యాదదూషకం
బలవంతం ప్రభుం రాజన్ క్షిప్రం దారుణ
మాప్నుయాత్.

శోణితే తు వ్యతిక్రాంతే ప్రవివేశ బృహన్నలా
అభివాద్య విరాటం తు కంకం చాప్యుపతిష్ఠత.
క్షామయిత్వా తు కౌరవ్యం రణాదుత్తరమాగతం
ప్రశశంస తతో మత్స్యః శృణ్వతః సవ్యసాచినః
త్వయా దాయాదవానస్మి కైకేయీనందివర్ధన
త్వయా మే సదృశః పుత్రో న భూతో న భవిష్యతి.
పదం పదసహస్రేణ యశ్చరన్నాపరాధ్నుయాత్
తేన కర్ణేన తే తాత కథమాసీత్ సమాగమః.
మనుష్యలోకే సకలే యస్య తుల్యో న విద్యతే
తేన భీష్మేణ తే తాత కథమాసీత్ సమాగమః.
ఆచార్యోవృష్ణివీరాణాం కౌరవాణాంచ యోద్విజః
సర్వక్షత్రస్య చాచార్యః సర్వశస్త్రభృతాం వరః
తేన ద్రోణేన తే తాత కథమాసీత్ సమాగమః.
ఆచార్యపుత్రో యః శూరః సర్వశస్త్రభృతామపి
అశ్వత్థామేతి విఖ్యాతస్తేనాసీత్ సంగరః కథం

---

అదే సమయానికి ఉత్తరుడు నగరంలో ప్రవేశించాడు. పూల జల్లులు కురుస్తున్నాయి. సుగంధ సౌరభాలు వీస్తున్నాయి. పౌరులూ సుందరీమణులూ స్వాగతమిచ్చి రాజద్వారం చేరగానే వాని రాకను మహారాజుకు నివేదించగా మత్స్య నరపాలుడు బృహన్నలనూ ఉత్తరునీ త్వరగా లోపల ప్రవేశపెట్టమని అంటూండగా ధర్మరాజు- ముందుగా ఉత్తరుని రప్పించ మన్నాడు. యుద్ధ భూమిలో వినా మరెక్కడైనా కంకుని శరీరంమీద దెబ్బ తగిలినా, రక్తం స్రవించినా బృహన్నల జీవించడు. కనుక బృహన్నలారహితంగానే ఉత్తరుని రప్పించమన్నాడు.

ఉత్తరుడు లోపలకు వచ్చి శిరస్సువంచి చేతులుజోడించి కంకునివైపు తిరిగి వానిస్థితిని గమనించి - మహారాజా వీనిపై ఈ అత్యాచారం జరిపిన పాపి ఎవరు? అని ప్రశ్నించగా - నేనే - వీడిందుకు అర్హుడే. నేను నీ శౌర్యాన్ని ప్రశంసిస్తూంటే వీడా నపుంసకుని కీర్తిస్తున్నాడు - అని సమాధాన మివ్వగా - ప్రభూ - చాలా అనుచితం చేశారు బ్రాహ్మణుని క్రోధవిషం జనచేతనాలను భస్మం చేస్తుందని మరిచిపోతున్నారు- అని ఉత్తరుడన విని విరటుడు కౌంతేయాగ్రజుని సమీపించి క్షమాభిక్ష నర్థించగా యుధిష్ఠిరుడు - మహారాజా - నేను క్షమామయ జీవితమే సాగిస్తున్నాను. నీమీద నాకేమీ కోపం లేదు. నా రక్తబిందువు భూమిమీద పడ్డట్లైతే నీ రాజ్యం భస్మమై పోతుంది ఇతరులకు హాని కలిగించకుండా ఉండడం ఎంతో మంచిది - అన్నాడు

ధర్మజుని ముక్కునుండి రక్తం స్రవించడం తగ్గింది. అప్పుడు బృహన్నల రాజసభలో

రణే యం ప్రేక్ష్య సీదంతి హృతస్వా వణిజో యథా
కృపేణ తేన తే తాత కథమాసీత్ సమాగమః.
పర్వతం యోఽభివిధ్యేత రాజపుత్రో మహేషుభిః
దుర్యోధనేన తే తాత కథమాసీత్ సమాగమః.
అవగాఢాద్విషంతో మే సుఖో వాతోఽభివాతి మాం
యస్త్వం ధనమథాజైషీః కురుభిర్గ్రస్తమాహవే.
తేషాం భయాభిపన్నానాం సర్వేషాం బలశాలినాం
నూనం ప్రకాల్య తాన్ సర్వాం స్త్వయా యుధి నరర్షభ
ఆచ్ఛిన్నం గోధనం సర్వం శార్దూలేనామిషం యథా.

---

## అయివది తొమ్మిదవ అధ్యాయం

న మయా నిర్జితా గావో న మయా నిర్జితాః పరే
కృతం తత్ సకలం తేన దేవపుత్రేణ కేనచిత్.
స హి భీతం ద్రవంతం మాం దేవపుత్రో న్యవర్తయత్
స చాతిష్ఠద్ రథోపస్థే వజ్రసంహననో యువా.
తేన తా నిర్జితా గావః కురవశ్చ పరాజితాః
తస్య తత్ కర్మవీరస్య న మయా తాత తత్ కృతం.
స హి శారద్వతం ద్రోణం ద్రోణపుత్రం చ మహారథాన్
సూతపుత్రం చ భీష్మం చ చకార విముఖాన్ శరైః.
దుర్యోధనం విశీర్ణం సనాగమివ యూథపం
ప్రభగ్నమబ్రవీద్ భీతం రాజపుత్రం మహాబలః.
న హాస్తినపురే త్రాణం తవ పశ్యామి కించన
వ్యాయామేన పరీప్సస్వ జీవితం కౌరవాత్మజ.
న మోక్ష్యసే పలాయంస్త్వం రాజన్ యుద్ధే మనః కురు
పృథివీం భోక్ష్యసే జిత్వా హతో వా స్వర్గమాప్స్యసి.
స నివృత్తో నరవ్యాఘ్రో ముంచన్ వజ్రనిభాన్ శరాన్
సచివైః సంవృతో రాజా రథే నాగ ఇవ శ్వసన్.

---

ప్రవేశించి విరటునికీ ధర్మరాజుకీ ప్రణామాలు అర్పించాడు. విరటుడు అర్జునుడు వినేటట్లుగా ఉత్తరుని ప్రశంసిస్తూ పరిపరివిధాల వాని లక్షణాలను శ్లాఘిస్తూ భీష్మ కర్ణాదులను ఏవిధంగా జయించావని రాజకుమారుని ఇలా ప్రశ్నించాడు.

ద్రోణాశ్వత్థామాది ఆచార్య శ్రేష్ఠులనూ కౌరవవీరు లందరినీ ఏవిధంగా యుద్ధంలో నిలబెట్టావు.

ఇప్పుడు నా కెంతో సంతోషంగా ఉంది. వారందరినీ ఓడించి గోగణాలను తరలించుకొని వచ్చావు - అని అభినందించాడు.

---

## అరువది తొమ్మిదవ అధ్యాయం

మహారాజా - శత్రువులను జయించి గోవులను మరలించినది నేనుకాదు. ఒక దేవకుమారుడు నాకు సహకరించి యుద్ధవిముఖతతోనున్న నన్ను ఉత్తేజపరిచి తానే రథికుడై వారందరినీ ఓడించాడు. భీష్మ ద్రోణ కృపాదులందరినీ ఆ దేవకుమారుడే వేధించి పారద్రోలాడు. వాడు దుర్యోధనునివైపు చూస్తూ - ధార్తరాష్ట్రా - నీ ప్రాణాలను రక్షించేవాడు హస్తినాపురంలో ఒక్కడూ లేడు. కనక దేశాంతరంపోయి ప్రాణరక్షణమార్గం చూసుకో. విజయభోగమో వీరమరణమో చూసుకో. ఆ మాటలు అనగా దుర్యోధనుడు వేడి నిట్టూర్పులు విడుస్తూ నా వెంటనున్న దివ్యపురుషునిపై బాణవర్షం కురిపించాడు నా రథికుడు సింహ సమ పరాక్రమంతో విక్రమించి వారిని

తం దృష్ట్వా గో మహార్ష్ణోఽభూ దూరుకంపశ్చ మారిష
స తత్ర సింహసంకాశమసీతం వ్యథమచ్ఛరైః

తత్ ప్రణుద్య రథానీకం సింహసంహననో యువా
కురూంస్తాన్ ప్రహసన్ రాజన్ సంస్థితాన్
హృతవాససః.

ఏకేన తేన వీరేణ షడ్రథాః పరినిర్జితాః
శార్దూలేనేవ మత్తేన యథా వనచరా మృగాః.

క్వ స వీరో మహాబాహుర్దేవపుత్రో మహాయశాః
యో మే ధనమథాజైషీత్ కురుభిర్గ్రస్తమాహవే.

ఇచ్ఛామి తమహం ద్రష్టుమర్చితుం చ మహాబలం
యేన మే త్వం చ గావశ్చ రక్షితా దేవసూనునా.

అంతర్ధానం గతస్తత్ర దేవపుత్రో మహాబలః
స తు శ్వో వా పరశ్వో వా మన్యే ప్రాదుర్భవిష్యతి.

ఏవమాఖ్యాయమానం తు ఛన్నం సత్రేణ పాండవం
వసంతం తత్ర నాజ్ఞాసీద్ విరాటో వాహినీపతిః.

తతః పార్థోఽభ్యనుజ్ఞాతో విరాటేన మహాత్మనా
ప్రదదౌ తాని వాసాంసి విరాటదుహితుః స్వయం.

ఉత్తరా తు మహార్హాణి వివిధాని నవాని చ
ప్రతిగృహ్యాభవత్ ప్రీతా తాని వాసాంసి భామినీ.

మంత్రయిత్వా తు కౌంతేయ ఉత్తరేణ మహాత్మనా
ఇతికర్తవ్యతాం సర్వాం రాజన్ పార్థే యుధిష్ఠిరే.

తతస్తథా తద్ వ్యదధాద్ యథావత్ పురుషర్షభ
సహపుత్రేణ మత్స్యస్య ప్రహృష్టా భరతర్షభాః

---

వేధించాడు. ఏకైక వీరుడుగానే పోరాడి వారందరినీ జయించాడు – అని ఉత్తరుడనగా విరటుడు– నాయనా– ఆ దివ్యపురుషుడేడీ? నిన్ను రక్షించిన ఆ మహాత్ముని సముచితంగా సత్కరించాలని కుతూహలపడుతున్నానని ఉత్సుకతతో లేచాడు. ఆయన అక్కడే అదృశ్యమయ్యాడనీ నేడో రేపో ఇక్కడ ప్రత్యక్షం కావచ్చుననీ భావిస్తున్నాననీ సమాధానమిచ్చాడు.

ఉత్తరుని సాంకేతిక ప్రసంగం విరటునికి ఏమీ అర్థంకాలేదు.

బృహన్నల ఉత్తరను సమీపించి తాను తెచ్చిన మహారథికుల ఉష్ణీషాలను బొమ్మ పొత్తికలుగా బహూకరించాడు. ఉత్తర పరమసంతోషంతో ఆ వస్త్రాలను తిలకించసాగింది. అనంతరం అర్జునుడు ఉత్తరుని వెంటబెట్టుకొని ధర్మరాజుని సమీపించి అనంతర కర్తవ్యం గురించి ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు.

## డబ్బదియవ అధ్యాయం

తత స్తృతీయే దివసే భ్రాతరః పంచ పాండవాః
స్నాతాః శుక్లాంబరధరాః సమయే చరితవ్రతాః
యుధిష్ఠిరం పురస్కృత్య సర్వాభరణభూషితాః
ద్వారిమత్తాయథానాగా భ్రాజమానామహారథాః
విరాటస్య సభాం గత్వా భూమిపాలాసనేష్వథ
నిషేదుః పావకప్రఖ్యాః సర్వేధిష్ణ్యేష్వివాగ్నయః.
తేషు తత్రోపవిష్టేషు విరాటః పృథివీపతిః
ఆజగామ సభాం కర్తుం రాజకార్యాణి సర్వశః.
శ్రీమతః పాండవాన్ దృష్ట్వా జ్వలతః పావకానివ
ముహూర్తమివ చ ధ్యాత్వా సరోషః పృథివీపతిః
అథ మత్స్యోఽబ్రవీత్ కంకం దేవరూపమివస్థితం
మరుద్గణైరుపాసీనం త్రిదశానామివేశ్వరం.
స కిలాక్షాతివాప స్త్వం సభాస్తారో మయా వృతః
అథ రాజాసనే కస్మాదుపవిష్ట స్త్వలంకృతః
పరిహాసేప్సయా వాక్యం విరాటస్య నిశమ్య తత్
స్మయమానోఽర్జునో రాజన్నిదం వచనమబ్రవీత్.
ఇంద్రస్యార్ధాసనం రాజన్నయమారోఢుమర్హతి
బ్రహ్మణ్యః శ్రుతవాంస్త్యాగీ యజ్ఞశీలో దృఢవ్రతః
ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః
ఏష బుద్ధ్యాధికో లోకే తపసాం చ పరాయణం.
ఏషోఽస్త్రం వివిధం వేత్తి త్రైలోక్యే సచరాచరే
న చైవాన్యః పుమాన్ వేత్తి న వేత్స్యతి కదాచన
న దేవా నాసురాః కేచిన్న మనుష్యా నరాక్షసాః
గంధర్వయక్షప్రవరాః సకిన్నరమహోరగాః.
దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపదప్రియః
పాండవానామతిరథో యజ్ఞధర్మపరో వశీ.

---

## డబ్బదియవ అధ్యాయం

ఉత్తరాపరిణయము

మూడు రోజులు గడిచాయి. నాలుగవరోజు ప్రాతఃకాలంలో లేచి పరిశుభ్రస్నాతులై రాజోచిత వేషభూషాలంకృతులై పాండవులు విరట రాజ సభాభవనంవైపు వస్తున్నారు. ఆ సమయంలో రాజసింహద్వారంలో ఉండే మత్తేభాల వలె ఉన్నారు. ధర్మరాజు ముందు నడుస్తూ ఉన్నాడు. మిగిలిన నలుగురూ అనుసరించి వచ్చి భూమీశులకొరకు నిర్దేశించబడ్డ ఆసనాలను అధిష్ఠించారు.

విరటుడు సభా భవనంలో అడుగుపెడుతూ ప్రజ్వలితాగ్నిశిఖా సదృశంగా మరుద్గణ సేవిత ఇంద్రోపమంగా వెలిగే కంకభట్టునుచూసి రెండు ఘడియలకాలం ఆలోచించి నిశ్చేష్టుడై నిలబడి - కంకా - నాతో ద్యూతక్రీడ సాగించడానికి ఈ సభలో పారిషదుడవైన నువ్వు మహారాజు అధిష్టించే సింహాసనంమీద కూర్చోవడంలో నీ ఆంతర్య మేమిటి ? అని ప్రశ్నించాడు.

అది విని అర్జునుడు చిరునవ్వు నవ్వుతూ - మహారాజా - బ్రాహ్మణభక్తుడూ శస్త్రాస్త్ర విదుడూ త్యాగశీలుడూ దృఢచిత్తుడూ నియమవ్రత పరాయణుడూ ఐన ఈ మహాపురుషుడు ఇంద్ర సింహాసనంలో అర్ధభాగం అధిష్టించడానికి అర్హుడు. అయినప్పుడు నీ సింహాసనం విషయం వేరే చెప్పాలా-ఈ పరాక్రమోపేతుడు మూర్తీభవించిన ధర్మమూర్తి. తపస్సునే ఆశ్రయంగా

మహర్షికల్పో రాజర్షిః సర్వలోకేషువిశ్రుతః
బలవాన్ ధృతిమాన్ దక్షః సత్యవాదీజితేంద్రియః
ధనైశ్చ సంచయైశ్చైవ శక్రవైశ్రణోపమః.
యథా మనుర్మహాతేజా లోకానాం పరిరక్షితా
ఏవమేష మహాతేజాః ప్రజానుగ్రహకారకః.
అయం కురూణామృషభో ధర్మరాజో యుధిష్ఠిరః
అస్యకీర్తిః స్థితా లోకే సూర్యస్యేవోద్యతః ప్రభా
పంసరంతి దిశః సర్వా యశసోఽస్య ఇవాంశవః
ఉదితస్యేవ సూర్యస్య తేజసోఽను గభస్తయః.
ఏనం దశసహస్రాణి కుంజరాణాం తరస్వినాం
అన్వయుః పృష్ఠతో రాజన్ యావదధ్యావసత్ కురూన్.
త్రింశదేనం సహస్రాణి రథాః కాంచనమాలినః
సదశ్వైరుపసంపన్నాః పృష్ఠతోఽనుయయుస్తదా
ఏనమష్టశతాః సూతాః సుమృష్టమణికుండలాః
అబ్రువన్ మాగధైః సార్ధం పురా శక్రమివర్షయః
ఏనం నిత్యముపాసంత కురవః కింకరా యథా
సర్వే చ రాజన్ రాజానో ధనేశ్వగమివామరాః.
ఏషసర్వాన్ మహీపాలాన్ కరదాన్సమకారయత్
వైశ్యానివ మహాభాగో వివశాన్ స్వవశానపి.
అష్టాశీతిసహస్రాణి స్నాతకానాం మహాత్మనాం
ఉపజీవంతి రాజానమేనం సుచరితవ్రతం.
ఏష వృద్ధాననాథాంశ్చ పంగూనంధాంశ్చ మానవాన్
పుత్రవత్ పాలయామాస ప్రజాధర్మేణ వై విభుః.

---

చేసుకొని జీవించేవారిలో పరమశ్రేష్ఠుడు. దివ్యాస్త్ర సంచాలనంలో ఈయనకు సాటివచ్చేవారే లేరు. దేవాసుర గంధర్వ యక్షరాక్షస కిన్నర నాగ గణాలలో కూడా ఈయనతో సమమైన అస్త్ర విద్యాజ్ఞానం కలవారు లేరు. ఈ మహాతేజస్సంపన్నుని దూరదృష్టి సర్వప్రజాదర పాత్రమైనది. యజ్ఞధర్మానుష్ఠానసంలగ్నమనస్కుడై ఇంద్రియ సంయమనంతో చరించే ఈ మహాపురుషుడే పాండవవీరులలో అతిరథుడు. మహర్షితుల్యుడు రాజర్షిశ్రేష్ఠుడు. విశ్వ విఖ్యాతుడు. బలిష్ఠుడు, ధీయుతుడు. సర్వకార్యచతురుడు. సత్యవ్రతపరాయణుడు. ధనసంగ్రహాలలో ఇంద్ర కుబేర సముడు ఈ చతుర్దశ భువనాలనూ మనువు రక్షించేటట్లు ఈ మహారాజు ప్రజానీకాన్ని రక్షిస్తూ ఉంటాడు. కురువంశ శ్రేష్ఠుడైన ధర్మరాజే ఈ మహాపురుషుడు. ఉదయారుణరోచులతోసూర్యభగవానుడు ప్రపంచాన్ని కాంతిమయం చేసేటట్లు ఈ మహారాజుకీర్తి లోకమంతా విస్తరించింది. ఈ మహీపాలుని యశశ్చంద్రికాధవళ శీతల కిరణాలు దశదిశలనూ చల్లపరుస్తున్నాయి.

మత్స్యదేశ మహీపాలా - ఈయన కురు దేశంలో ఉన్నప్పుడు వీరివెంట పదివేల ఏనుగులూ మూడువేల సువర్ణరథాలూ సాగేవి. దేవలోకంలో మహర్షిగణాలు ఇంద్రుని స్తుతించేటట్లు కురుదేశంలో మణికుండలాలంకృతశీర్షులైన ఎనిమిదివందలమంది వందిమాగధులు వీరి గుణగణాలను కీర్తించేవారు. దేవగణాలు ఆ కుబేరుని ఆస్థానంలో సేవాభావంతో నిలిచేటట్లు నానా దేశాధీశులూ కౌరవప్రభువులు వీరిఎదుట నిలబడేవారు. వారందరూ వినయభావంతో కప్పం కట్టేవారు. ఎనభైవేలమంది స్నాతకులు వీరి పోషణలోఉండేవారు. బధిర పంగ్వంధ వృద్ధులందరినీ కన్నబిడ్డలవలె చూసేవారు. కోప రహితుడై

ఏష ధర్మే దమే చైవ క్రోధే చాపి జితవ్రతః
మహాప్రసాదో బ్రహ్మణ్యః సత్యవాదీ చ పార్థివః
శీఘ్రం తాపేన చైతస్య తప్యతే స సుయోధనః
సగణః సహ కర్ణేన సౌబలేనాపి వా విభుః.

న శక్యం తే హ్యస్య గుణాః ప్రసంఖ్యాతుం నరేశ్వర
ఏష ధర్మపరో నిత్యమానృశంసశ్చ పాండవః.
ఏవం యుక్తో మహారాజః పాండవః పార్థివర్షభః
కథం నార్హతి రాజార్హ్మమాసనం పృథివీపతే.

డెబ్బది ఒకటవ అధ్యాయం

యద్యేష రాజా కౌరవ్యః కుంతీపుత్రో యుధిష్ఠిరః
కతమోఽస్యార్జునో భ్రాతా భీమశ్చ కతమో బలీ.
నకులో సహదేవో వా ద్రౌపదీ వా యశస్వినీ
యదాద్యూతజితాః పార్థాన ప్రాజ్ఞాయంత తేక్వచిత్
య ఏష బల్లవో బ్రూతే సూద స్తవ నరాధిప
ఏష భీమో మహారాజ భీమవేగపరాక్రమః.
ఏష క్రోధవశాన్ హత్వా పర్వతే గంధమాదనే
సౌగంధికాని దివ్యాని కృష్ణార్థే సముపాహరత్.
గంధర్వ ఏష వై హంతా కీచకానాందురాత్మనాం

వ్యాఘ్రాన్నృక్షాన్ వరాహాంశ్చ హతవాన్ స్త్రీపురేతవ
హిడింబం చ బకం చైవ కిర్మీరం చ జటాసురం
హత్వా నిష్కంటకం చక్రేఽరణ్యం సర్వతః సుఖం
యశ్చాసీదశ్వబంధ స్తే నకులోఽయం పరంపతః
గోసంఖ్యః సహదేవశ్చ మాద్రీపుత్రౌ మహారథౌ.
శృంగారవేషాభరణౌ రూపవంతౌ యశస్వినౌ
మహారథసహస్రాణాం సమర్థౌ భరతర్షభౌ.
ఏషా పద్మపలాశాక్షీ సుమధ్యా చారుహాసినీ
సైరంధ్రీ ద్రౌపదీ రాజన్ యస్యార్థే కీచకాహతాః.

దయార్ద్రహృదయుడై బ్రాహ్మణభక్తితో సత్యవ్రత నియమంతో ఉండేవాడు. ఈ మహారాజు కుపితుడైతే కర్ణశకునిసహితుడైన దుర్యోధనుడు సంతప్తుడై పోతాడు. ధర్మపరాయణుడూ రాజశిరోమణీ పాండవాగ్రజుడూ ఐన యుధిష్ఠిర మహారాజు రాజోచితాసనాన్ని అధిష్ఠించడానికి ఎందుచేత అర్హుడుకాదో ఆలోచించి చెప్పండి - అన్నాడు.

డెబ్బది ఒకటవ అధ్యాయం

కురు కుల శిరోభూషణమైన ధర్మరాజే ఈయన ఐనట్లైతే అర్జునుడేడి భీముడేడి నకుల సహదేవ ద్రౌపదులు ఏరి. కపటద్యూత పరాజితులైన నాటినుండి వారి జాడలే తెలియడంలేదు - అని విరటు డనగా మహారాజా - నీ పాకశాలలో వల్లవనామంతో సంచరిస్తూన్నవాడే భీముడు. అతడే గంధమాదనపర్వతంమీద క్రోధవశనామక రాక్షసగణాలను నిర్జించి సౌగంధిక కమలాలు తెచ్చి ద్రౌపది కిచ్చాడు. దురాత్ముడైన కీచకుని సంహరించిన గంధర్వుడు భీముడే. నీ అంతఃపురంలో వ్యాఘ్రభల్లూకాలతో ప్రత్యక్ష పోరాటం సాగించినవాడూ అతడే. హిడింబ,బక, కిమ్మీర, జటాసురాదులను సంహరించి మాకు సుఖశాంతులు కలిగించిన భీముడే వల్లవుడు. నీ అశ్వశాలలో అధ్యక్షుడుగా ఉన్నవాడు నకులుడు. గోగణాలను పాలించేవాడు సహదేవుడు. వారు

అర్జునోఽహం మహారాజ వ్యక్తం తే శ్రోత్రమాగతః
భీమాదవరజః పార్థో యమాభ్యాం చాపి పూర్వజః.
ఉషితాః స్మో మహారాజ సుఖం తవ నివేశనే
అజ్ఞాతవాసముషితా గర్భవాస ఇవ ప్రజాః.
యదార్జునేన తే వీరాః కథితాః పంచపాండవాః
తదార్జునస్య వైరాటిః కథయామాస విక్రమం.
పునరేవ చ తాన్ పార్థాన్ దర్శయామాస చోత్తరః.
య ఏష జాంబూనదశుద్ధగౌర
తనుర్మహాన్ సింహ ఇవ ప్రవృద్ధః
ప్రచండఘోణః పృథుదీర్ఘనేత్ర
స్తామ్రాయతాక్షః కురురాజ ఏషః.
అయం పునర్మత్తగజేంద్రగామీ
ప్రతప్తచామీకరశుద్ధగౌరః
పృథ్వాయతాంసో గురుదీర్ఘబాహు
ర్వృకోదరః పశ్యత పశ్యతైనం.
యస్త్వేవ పార్శ్వేఽస్య మహాధనుష్మాన్
శ్యామో యువా వారణయూథపోపమః
సింహోన్నతాంసో గజరాజగామీ
పద్మాయతాక్షోఽర్జున ఏష వీరః.
రాజ్ఞః సమీపే పురుషోత్తమౌ తు
యమావిమౌ విష్ణుమహేంద్రకల్పౌ
మనుష్యలోకే సకలే సమోఽస్తి
యయోర్న రూపే న బలే న శీలే.
ఆభ్యాం తు పార్శ్వే కనకోత్తమాంగీ
యైషా ప్రభా మూర్తిమతీవ గౌరీ
నీలోత్పలాభా సురదేవతేవ
కృష్ణా స్థితా మూర్తిమతీవ లక్ష్మీః.
ఏవం నివేద్య తాన్ పార్థాన్ పాండవాన్
పంచభూపతేః
తతోఽర్జునస్య వైరాటిః కథయామాస విక్రమం.
అయం స ద్విషతాం హంతా మృగాణామివ కేసరీ
అచరద్ రథవృందేషు నిఘ్నంస్తాంస్తాన్
వరాన్ రథాన్.

ఇరువురూ మహావీరులు. సుందరాకారులు. కీర్తిసంపన్నులు. యుద్ధభూమిలో రథికసహస్రాన్ని ఎదిరించి నిలబడగల ధీరులు. నవవికసిత కమలదళ విశాల లోచనాలతో తనుమధ్యంతో నిరంతర శుచిస్మితంతో అలరారే ఈ సైరంధ్రి ద్రౌపది. నేనే అర్జునుడను. భీమునికంటె చిన్నవాడనూ, నకుల సహదేవులకంటె పెద్దవాడనూ.

మహారాజా – గర్భస్థుడైన శిశువువలె నీ రాజ్యంలో మేము అజ్ఞాతవాసకాలం సుఖంగా పూర్తి చేసుకున్నాము – అని అర్జునుడు ముగించాడు. అప్పుడు ఉత్తరుడు లేచి – మహారాజా – నిర్మల జాంబూనదకాంతులతో గౌరవర్ణంతో అలరాలే దేహకాంతి గల ఆ విశాల తామ్రలోచనుడే యుధిష్ఠిరుడు. తప్తసువర్ణదీప్తితో గౌరవర్ణంతో మత్తేభంవలె వెలిగే ఆ విశాలభుజుడే భీమసేనుడు. శ్యామవర్ణంతో సింహస్కంధంతో పద్మదళనేత్రాలతో గజయూథపతివలె గోచరించే ఆ మహావీరుడే అర్జునుడు. ధర్మజుని సమీపంలో ఇంద్రోపేంద్రులవలె ప్రకాశించేవారే నకులసహదేవులు. కుల శీల బల సంపత్తులలో వారికి వారే సాటి. వారి పార్శ్వభాగాన ఉన్న ఆ తేజస్వినియే ద్రౌపది. విశుద్ధహేమకాంతితో ఆమె దేహం ఎలా అలరారుతోందో చూడండి. రూపు దాల్చిన లక్ష్మీదేవివలె మూర్తీభవించిన గౌరివలె ప్రకాశించే ఆమెయే పాండవ పట్టమహిషి.

అనేన విద్ధో మాతంగో మహానీకేషుణా హతః
సువర్ణకక్షః సంగ్రామే దంతాభ్యామగమన్మహీం.
అనేన విజితా గావో జితాశ్చ కురవో యుధి
అస్య శంఖప్రణాదేన కర్ణౌ మే బధిరీకృతౌ.
తస్య తద్వచనం శ్రుత్వా మత్స్యరాజః ప్రతాపవాన్
ఉత్తరం ప్రత్యువాచేదమభిపన్నో యుధిష్ఠిరే.
ప్రసాదనం పాండవస్య ప్రాప్తకాలం హి రోచతే
ఉత్తరాం చ ప్రయచ్ఛామి పార్థాయ యదిమన్యసే
ఆర్యాః పూజ్యాశ్చ మాన్యాశ్చ ప్రాప్తకాలం చ మే మతం
పూజ్యంతాం పూజనార్హాశ్చ మహాభాగాశ్చ పాండవాః.
అహం ఖల్వపి సంగ్రామే శత్రూణాం వశమాగతః
మోక్షితో భీమసేనేన గావశ్చాపి జితాస్తథా.
ఏతేషాం బాహువీర్యేణ అస్మాకం విజయో మృధే
ఏవం సర్వేసహామాత్యాః కుంతీపుత్రంయుధిష్ఠిరం
ప్రసాదయామోభద్రం తే సానుజంపాండవర్షభం.
యదస్మాభిరజానద్భిః కించిదుక్తో నరాధిపః
క్షంతుమర్హతి తత్ సర్వం ధర్మాత్మా హ్యేష పాండవః.
తతో విరాటః పరమాభితుష్టః
సమేత్య రాజా సమయం చకార
రాజ్యం చ సర్వం విససర్జ తస్మై
సదండకోశం సపురం మహాత్మా.
పాండవాంశ్చ తతః సర్వాన్ మత్స్యరాజః ప్రతాపవాన్
ధనంజయంపురస్కృత్య దిష్ట్యాదిష్ట్యేతి చాబ్రవీత్
సముపాఘ్రాయ మూర్ధానం సంశ్లిష్య చ పునః పునః
యుధిష్ఠిరం చ భీమం చ మాద్రీపుత్రౌ చ పాండవౌ
నాతృప్యద్ దర్శనే తేషాం విరాటో వాహినీపతిః
స ప్రీయమాణో రాజానం యుధిష్ఠిరమథాబ్రవీత్
దిష్ట్యా భవంతః సంప్రాప్తాః సర్వే కుశలినో వనాత్
దిష్ట్యాసంపాలితం కృచ్ఛ్రమజ్ఞాతంవై దురాత్మభిః

---

మహారాజా - వన్యమృగాలను సింహం సంహరించేటట్లు కౌరవసేనాసమూహాన్ని నిర్భయంగా చీల్చి చెండాడినవాడు ఈ మహావీరుడు. ఈ గాండీవి ధనుస్సునుండి వెలువడిన ఒక్క బాణం వికర్ణుని మహాగజాన్ని నేల కూల్చింది. వీని శంఖధ్వాన మా చెవులను బధిరీభూతం చేసింది - అని ఉత్తరుడు అర్జునపరాక్రమాన్ని కీర్తించగా విరాటుడు - నాయనా - ఇప్పుడు మనం పాండవులను ప్రసన్నులను చేసుకోవలసిన సమయం ఆసన్నమైంది. మన ఉత్తరను అర్జునున కిచ్చి వివాహం చెయ్యాలని నేను అనుకొంటున్నాను. అనగా ఉత్తరుడు పాండవులను సర్వవిధాలా పూజించడం తమకు యోగ్యమనీ అందుకు అర్హులనీ చెప్పగా విరాటుడు దక్షిణగ్రహణంనుండి తనను భీముడు రక్షించినందుకు తగిన విధంగా వారిని సత్కరించాలి. అజ్ఞానవశులమై మనం జరిపిన అనుచిత ప్రసంగాలను క్షమించవలసిందని ధర్మరాజును అర్థించాలి - అని పలికి కుమారసహితుడై ధర్మజుని సమీపించి - తన సర్వసంపదలనూ వానికి సమర్పిస్తూ వారి దర్శనం తమ అదృష్టంవల్లనే లభించిందనీ పరిపరివిధాల ప్రస్తుతిస్తూ అందరినీ గాఢాలింగనం చేసుకున్నాడు.

మహాపురుషా - పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసమూ ఒక సంవత్సరము అజ్ఞాతవాసమూ ఏ ప్రమాదమూ లేకుండా సాగించు కొన్నారు. నా రాజ్య సర్వస్వమూ ధర్మరాజుకు

ఇదం చ రాజ్యం పార్థాయ యచ్చాన్యదపికించన
ప్రతిగృహ్ణంతు తత్ సర్వం పాండవా అవిశంకయా
ఉత్తరాం ప్రతిగృహ్ణాతు సవ్యసాచీ ధనంజయః
అయం హ్యౌపయికో భర్తా తస్యాఃపురుషసత్తమః
ఏవముక్తో ధర్మరాజః పార్థమైక్షద్ ధనంజయం
ఈక్షితశ్చార్జునో భ్రాత్రా మత్స్యం వచనమబ్రవీత్
ప్రతిగృహ్ణామ్యహంరాజన్ స్నుషాందుహితరంతవ
యుక్తశ్చావాం హి సంబంధో
మత్స్యభారతయోరపి.

## డబ్బది రెండవ అధ్యాయం

కిమర్థం పాండవశ్రేష్ఠ భార్యాం దుహితరం మమ
ప్రతిగ్రహీతుం నేమాం త్వం మయా
దత్తామిహేచ్ఛసి.
అంతఃపురేఽహముషితః సదా పశ్యన్ సుతాంతవ
రహస్యం చ ప్రకాశం చ విశ్వస్తా పితృవన్మయి.
ప్రియో బహుతమశ్చాసం నర్తకో గీతకోవిదః
ఆచార్యవచ్చ మాం నిత్యం మన్యతేదుహితాతవ
వయఃస్థయా తయా రాజన్ సహ సంవత్సరోషితః
అతిశంకా భవేత్ స్థానే తవ లోకస్య వా విభో.
తస్మాన్నిమంత్రయేఽహం తే దుహితాంమనుజాధిప
శుద్ధో జితేంద్రియో దాంతస్తస్యాః శుద్ధిః కృతా
మయా.
స్నుషాయాందుహితుర్వాపి పుత్రేచాత్మనివాపునః
అత్ర శంకాం న పశ్యామి తేన శుద్ధిర్భవిష్యతి.
అభిశాపాదహం భీతో మిథ్యావాదాత్ పరంతప
స్నుషార్థముత్తరాంరాజన్ ప్రతిగృహ్ణామితేసుతాం.

సమర్పిస్తున్నాను. ధనంజయునికి నా కుమార్తె యైన ఉత్తరను వధువుగా ఇస్తున్నాను – అని విరాటు డనగా ధర్మజుని సంకేతానుసారం అర్జునుడు లేచి – మహారాజా తమ కుమార్తెను నేను మా ఇంటి కోడలుగా స్వీకరిస్తున్నాను. మత్స్య భరత వంశాలమధ్య ఈ విధమైన సంబంధ బాంధవ్యా లుండడం చాలా అవసరం–అన్నాడు.

## డబ్బది రెండవ అధ్యాయం

అర్జునుని మాటలువిని విరటుడు కొంతసేపు ఆలోచించి – అర్జునా – నేను నా కుమార్తెను నీకు భార్యగా ఇస్తానంటూంటే నువ్వు అభ్యంతరం ఎందుకు పలుకుతున్నావో నాకు అర్థం కావడం లేదు – అని చెప్పగా – మహారాజా – నేనింతకాలమూ మీ అంతఃపురంలో ఉంటూ అందరివలెనే ఆమెనుకూడా పుత్రికాభావంతో చూసేను. ఆమెకూడా నన్ను పితృస్థానంలోనే ఉంచి సేవించేది. నాకు నాట్యంతోపాటు గాన విద్యలోకూడా కౌశలం ఉండడంచేత ఆమెకు నామీద అధికమైన ఆదరం ఉండేది. ఆమె ఎప్పుడూ నన్ను గురువుగానే భావించి ఆరాధించేది. ఆమె యుక్తవయస్కురాలైన అనంతరం సంవత్సరంపాటు ఆమెకు నేను గురువుగా ఉండి ఈనాడు నేను వివాహానికి అంగీకరిస్తే లోకులు పరిపరివిధాల శంకించడంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఐతే నా కోడలుగా ఆమెను గ్రహించడంవల్ల నా సౌశీల్యాన్నీ జితేంద్రియత్వాన్నీ

స్వస్త్రీయో వాసుదేవస్య సాక్షాద్ దేవశిసుర్యథా
దయితశ్చక్రహస్తస్య సర్వాస్త్రేషు చ కోవిదః.
అభిమన్యుర్మహాబాహుః పుత్రో మమ విశాంపతే
జామాతా తవ యుక్తో వై భర్తా చ దుహితుస్తవ.
ఉపపన్నం కురుశ్రేష్ఠే కుంతీపుత్ర ధనంజయే
య ఏవం ధర్మనిత్యశ్చ జాతజ్ఞానశ్చ పాండవః.
యత్ కృత్యంమన్యసేపార్థ క్రియతాం తదనంతరం
సర్వే కామాః సమృద్ధా మే సంబంధీ యస్య మేఽర్జునః.
ఏవం బ్రువతి రాజేంద్రే కుంతీపుత్రో యుధిష్ఠిరః
అన్వశాసత్ స సంయోగం సమయే మత్స్యపార్థయోః,
తతో మిత్రేషు సర్వేషు వాసుదేవం చ భారత
ప్రేషయామాస కౌంతేయో విరాటశ్చమహీపతిః
తతస్త్రయోదశే వర్షే నివృత్తే పంచపాండవాః
ఉపప్లవ్యం విరాటస్య సమపద్యంత సర్వశః.
అభిమన్యుం చ బీభత్సురానినాయ జనార్దనం
ఆనర్తేభ్యోఽపి దాశార్హానానయామాసపాండవః.

కాశిరాజశ్చ శైబ్యశ్చ ప్రీయమాణౌ యుధిష్ఠిరే
అక్షౌహిణీభ్యాం సహితావాగతౌ పృథివీపతీ.
అక్షౌహిణ్యా చ సహితో యజ్ఞసేనో మహాబలః
ద్రౌపద్యాశ్చ సుతా వీరాః శిఖండీచాపరాజితః.
ధృష్టద్యుమ్నశ్చ దుర్ధర్షః సర్వశస్త్రభృతాం వరః
సమస్తాక్షౌహిణీపాలా యజ్వానో భూరిదక్షిణాః
వేదావభృథసంపన్నాః సర్వే శూరాస్తనుత్యజః.
తానాగతానభిప్రేక్ష్య మత్స్యోధర్మభృతాంవరః
పూజయామాస విధివత్ సభృత్యబలవాహనాన్.
ప్రీతోఽభవద్ దుహితరం దత్వా తామభిమన్యవే
తతః ప్రత్యుపయాతేషు పార్థివేషు తతస్తతః.
తత్రాగమద్ వాసుదేవో వనమాలీ హలాయుధః
కృతవర్మా చ హార్దిక్యో యుయుధానశ్చ సాత్యకిః.
అనాధృష్టిస్తథాక్రూరః సాంబో నిశఠ ఏవ చ
అభిమన్యుముపాదాయ సహ మాత్రా పరంతపాః.
ఇంద్రసేనాదయశ్చైవ రథైస్తైః సుసమాహితైః
ఆయయుః సహితాః సర్వే పరిసంవత్సరోషితాః.

---

లోకులు విశ్వసించగలరు. పుత్రవధువుకీ పుత్రికకూ విశేషభేదం లేదు. అలాకాక నేనే ఆమెను పత్నిగా గ్రహించినట్లైతే ఇతఃపూర్వమే మా ఉభయులమధ్య కలుషిత వ్యాపార మేదో సాగి ఉంటుందని లోకులు నిశ్చయించుకొంటారు. వాసుదేవుని మేనల్లుడైన నా కుమారుడుగూడా అస్త్రవిద్యా కుశలుడే. ఈ ఉత్తరకు వాడు అర్హుడు - అని అర్జునుడు చెప్పగా విరాటుడు పాండవుల ధర్మపరాయణతకు ప్రశంసిస్తూ - ధర్మజునితో సంప్రదించి వారివారి బంధుమిత్రులకు ఆహ్వానాలు పంపాడు.

పాండవులు ఉపప్లావ్యం చేరారు. అర్జునుడు దాశార్హవంశీయులకూ వాసుదేవునికీ అభిమన్యునికీ ప్రత్యేకంగా పిలుపులు పంపించాడు.

ధర్మజుని ఆహ్వానాలు అందగానే కాశీరాజు శైబ్యుడూ అక్షోహిణీసేనతో ఉపప్లావ్యంచేరారు. ద్రుపదమహారాజు కూడా ఒక అక్షోహిణీ సేనను వెంటబెట్టుకొని బయలుదేరాడు. ఆయన వెంట ఉపపాండవులు అయిదుగురూ శిఖండీ ధృష్టద్యుమ్నుడూ అనుసరించారు. వీరేగాక మరెందరో రాజులు అక్షోహిణీల సేనలతో పాండవులయందు ప్రీతి గౌరవాలు ప్రకటిస్తూ వచ్చారు. వచ్చిన వా రందరికీ విరాటుడు సముచిత సత్కారాలు జరుపుతున్నాడు. విరటుని మర్యాదలు పొంది

దశనాగసహస్రాణి హయానాం ద్విగుణం తథా
రథానామయుతంపూర్ణంనియుతం చ పదాతినాం.
వృష్ణ్యంధకాశ్చ బహవో భోజాశ్చ పరమౌజసః
అన్వయుర్వృష్టిశార్దూలంవాసుదేవంమహాద్యుతిం.
పారిబర్హందదౌకృష్ణః పాండవానాంమహాత్మనాం
స్త్రియో రత్నాని వాసాంసి పృథక్ పృథగనేకశః.
తతో వివాహో విధివద్ వవృధేమత్స్యపార్థయోః
తతః శంఖాశ్చ భేర్యశ్చ గోముఖాడంబరాస్తథా.
పార్థైః సంయుజ్యమానస్య నేదుర్మత్స్యస్య వేశ్మని
భక్ష్యాన్నభోజ్యపానాని ప్రభూతాన్యభ్యహారయన్.
గాయనాఖ్యానశీలాశ్చ నటవైతాళికాస్తథా
స్తువంతస్తానుపాతిష్ఠన్ సూతాశ్చ సహ మాగధైః.
సుదేష్ణాం చ పురస్కృత్య మత్స్యానాం చ వరస్త్రియః
ఆజగ్ముశ్చారుసర్వాంగ్యః సుమృష్టమణికుండలాః.
వర్ణోపపన్నాస్తా నార్యో రూపవత్యః స్వలంకృతాః
సర్వాశ్చాభ్యభవన్ కృష్ణారూపేణయశసాశ్రియా.
పరివార్యోత్తరాం తాస్తు రాజపుత్రీమలంకృతాం
సుతామివ మహేంద్రస్య పురస్కృత్యోపతస్థిరే.
తాం ప్రత్యగృహ్ణాత్ కౌంతేయః సుతస్యార్థే ధనంజయః
సౌభద్రస్యానవద్యాంగీం విరాటతనయాం తదా.
తత్రాతిష్ఠన్మహారాజో రూపమింద్రస్యధారయన్
స్నుషాం తాం ప్రతిజగ్రాహ కుంతీపుత్రో యుధిష్ఠిరః.
ప్రతిగృహ్యచ తాంపార్థః పురస్కృత్యజనార్దనం
వివాహం కారయామాస సౌభద్రస్య మహాత్మనః.
తస్మైసప్తసహస్రాణి హయానాం వాతరంహసాం
ద్వేచ నాగశతేముఖ్యే ప్రాదాద్ బహుధనంతదా.

---

రాజులందరూ విశ్రాంతి తీసుకొంటున్నారు. ఆ సమయంలో కృష్ణుడూ బలరాముడూ కృతవర్మ సాత్యకి అక్రూర, సాంబ, నిశఠప్రభృతి యాదవులందరూ సుభద్రాభిమన్యుల సహితులై విచ్చేశారు. అజ్ఞాతవాస వత్సరమంతా ద్వారకలో ఉన్న ఇంద్రసేనాది సారథులు రథాలను సర్వ సామగ్రులతో నింపి తెచ్చారు. శ్రీకృష్ణునివెంట పదివేల ఏనుగులూ ఇరవై వేల గుర్రాలూ పదివేల రథాలూ పదిలక్షల కాల్బలమూ వచ్చింది. వృష్ణి అంధక భోజవంశీయులందరూ అక్కడకు చేరారు. రత్న స్త్రీ సముదాయాలను కృష్ణుడు పాండవుల కివ్వడంతో వివాహ ప్రయత్నాలు ప్రారంభ మయ్యాయి. విరటుడు మంగళ వాయిద్యాలు మ్రోయింపించాడు. స్నానపానభోజనభాజనాలకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. గీత వాద్య నృత్య గోష్ఠులు సాగుతున్నాయి. వందిమాగధ సూతులు పాండవగుణగానం చేస్తున్నారు.

సుదేష్ణపురోగాములై విరటుని రాణివాసంవారందరూ మణిమయకుండలాలంకృతభూషణాలతో ద్రౌపదీ మందిరానికి వచ్చారు. ద్రౌపదీనిసర్గ సౌందర్యమూ యశఃకాంతీ వచ్చినవారి భూషణ ద్యుతులను పరిహాసిస్తున్నాయి.

ఆ శుభముహూర్తంలో దివ్యవస్త్ర భూషణాలంకృతయై ఉత్తరా రాకుమారి రాజపరివారంతో అక్కడకు విజయం చేసింది. మహేంద్ర పుత్రియైన జయంతివలె ప్రకాశించే ఉత్తరను పుత్ర వధువుగా అర్జునుడు పరిగ్రహించాడు. ధర్మరాజు తన ఆమోదాన్ని తెలిపాడు. కృష్ణుడు పాణిగ్రహణ మహోత్సవం జరిపించాడు. విరటుడు బ్రాహ్మణు

హుత్వా సమ్యక్ సమిద్ధాగ్నిమర్చయిత్వా ద్విజన్మనః
రాజ్యం బలం చ కోశం చ సర్వమాత్మానమేవ చ.
కృతే వివాహే తు తదా ధర్మపుత్రో యుధిష్ఠిరః
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం యదుపాహరదచ్యుతః.
గోసహస్రాణి రత్నాని వస్త్రాణి వివిధాని చ
భూషణాని చ ముఖ్యాని యానాని శయనాని చ.
భోజనాని చ హృద్యాని పానాని వివిధాని చ
తన్మహోత్సవసంకాశం హృష్టపుష్టజనాయుతం
నగరం మత్స్యరాజస్య శుశుభే భరతర్షభ.

లను అర్చించి ప్రజ్వలితాగ్నిలో విధ్యుక్త హోమ కర్మలు పూర్తి చేయించాడు.

విరటుడు ఏడువేల గుర్రాలనూ రెండువందల ఏనుగులనూ అమూల్యధనరాశులనూ వరునకు కానుకలుగా ఇచ్చాడు. తన సర్వస్వాన్నీ పాండవుల సేవకు అర్పించాడు. నిర్విఘ్నంగా వివాహం పరిసమాప్తమైంది. కృష్ణుడు తెచ్చిన ధనరాశులను ధర్మరాజు బ్రాహ్మణులకు దానం చేశాడు. వేలకొద్దీ గోవులూ రత్నాలూ వస్త్రాలూ భూషణాలూ వాహన శయ్యా భోజనసామగ్రులూ పాన పాత్రలూ కూడా అర్పించాడు. సహస్రాధిక సంఖ్యలలో నిండిన మానవుల మహోత్సాహ సంరంభాలతో ఉపప్లావ్యం సంతోషనగరంలా భాసిస్తోంది.

విరాటపర్వం సంపూర్ణం.

## శ్రవణ మహిమా

శ్రుత్వా తు చరితం పుణ్యం పాండవానాం మహాత్మనాం
నాధివ్యాధిభయం తేషాం జాయతే పుణ్యకర్మణాం.
దుర్గతే స్మరణే తేషామాయతం తరణం భవేత్
సుభిక్షం క్షేమమారోగ్యం పుణ్యవృద్ధిః ప్రజాయతే.
సర్వపాపాని నశ్యంతి జాయంతే సర్వసంపదః
ఏకాకీ విజయేచ్ఛత్రూన్ స్మృత్వా ఫాల్గుణకర్మ చ.
ఈతయః సంప్రణశ్యంతి న వియోగః ప్రియే జనే.
శ్రుత్వా వైరాటకం పర్వ వాసాంసి వివిధాని చ
హిరణ్యం ధాన్యం గావశ్చ దద్యాద్ విత్తానుసారతః.
ప్రీతయే దేవతానాం వై దద్యాద్ వై ద్విజముఖ్యకే
వాచకే తు సుసంతుష్టే తుష్టాః స్యుః సర్వదేవతాః.
బ్రాహ్మణాన్ భోజయేచ్ఛక్త్యా పాయసైః సర్పిషాసితైః
ఏవం శ్రుతే చ వైరాటే సమ్యక్ ఫలమవాప్నుయాత్

పుణ్యాత్ములైన పాండవుల ఈ పవిత్రచరిత్రను విన్నా పఠించినా ఆధి వ్యాధి భయాలూ క్లేశాలూ నశించిపోతాయి. అర్జునుని చరిత్ర స్మరించిన మాత్రాన సర్వపాపాలూ నశించి ఆయురారోగ్య భోగభాగ్యాలతో ప్రజలు సుభిక్షంగా ఉంటారు. ఈతిబాధలు నశిస్తాయి. భక్తియుతంగా విరాట పర్వం విని వస్త్రాభరణాదులు విప్రులకు దానమిచ్చి, షడ్రసోపేతమైన భోజనాలతో, సంతృప్తిపరచిన శ్రోతలకు ఉత్తమఫలం ప్రాప్తిస్తుంది.

ఓం తత్సత్

శ్రీకృష్ణార్పణమస్తు.